# గ్యాలీస్ మోటారు పాఠశాల.

## మోటరుబండ్లను శాస్త్రీయముగా నడుపు మార్గము యిదియే.



1910 సంవత్సరము మొదలు మేము మోటారుబండ్ల నడుపు డ్రైవర్లను తయారుచేయుచువున్నాము. అప్పుడు మాకు తెలిసిన స్నేహితులు మొదలైనవారు వారి వారి మనుష్యులను మావద్దకు మోటారు యంత్ర నిర్మాణములను గురించియు బండ్ల నడుపుటకును తరిఫీయదు చేయమని పంపుచుండిరి. ఇందుకుదాహరణము. The Hon. Rao Bahadur K. Suryanarayana-murthi Naidu Garu సుమారు 1910 సంవత్సరమున ఒక మనిషిని పంపి అతనిని మోటారు డ్రైవింగులో తరిఫీయదు చేయమనిరి. అట్లే అతనిని తరిఫీయదు చేయించి పంపితిమి. అతను అప్పటిమొదలు యిప్పటివరకు వారి యజమానులను తృప్తిపరచుచు ఏతప్పిదములేక కొలువుచేయుచున్నాడు. అతను అనేక గవర్నరులు, మహారాజులు, రాజులు ఆప్రదేశములలో వచ్చియున్నప్పుడు వారి బండ్లనడుపుచు వారికి సంతోషము కలుగచేసి వారివద్దనుండి సర్టిఫికెట్లను పొందియున్నాడు. ఇట్లనేకులుగలరు.

ఈ మోటారు డ్రైవర్లు ఎక్కువగా కావలసివచ్చుటచేత మేము 1914-సంవత్సరము జనవరినెలలో 'Galleys Motor Institute' స్థాపించి, తరగతులు ఏర్పరచి ఒక ఆంగ్లేయయింజనీరు యాజమాన్యముక్రింద (European Supervision) ఉపాధ్యాయులు (Instructors) ఉపన్యాసకులు (Lecturers) మొదలైనవారిని ఏర్పరచి శాస్త్రీయముగాను (Scientifically) సక్రమముగాను (Systematically) సోదాహరణపూర్వకముగాను (Practically) నేర్పుచున్నాము. ఇటువంటి పాఠశాల దక్షిణయిండియాలో (Southern India) ఇదియే మొదటిదియు, ప్రధానమైనదియు అని రూఢిగా చెప్పుటకు సందేహము లేదు. మావద్ద తరిఫీయదయినవారు గవర్నమెంటువారి పరీక్షలో 100 కి 95 కంతున Pass అవుచున్నారు. తరగతిలో మోటారుబండ్ల Parts విడివిడిగా విప్పి ప్రత్యేకముగా వుంచబడియున్నవి. తరగతిలో Complete Chassis Demonstration కు గాను ఉంచబడియున్నది. ఉపన్యసించు సమయమున ఉపాధ్యాయులు విద్యార్థులకు బోధపడునట్లు ఆయా భాగములను చూపించి అవి చేయు పనులున్ను అవి చెడిపోవు విధము సరిచేయుటయున్ను వారి వారి స్వభావములను నేర్పెదరు. ఇదియేకాక మా Workshop లో Cars, Bus లు రిపేరు చేయునప్పుడు విద్యార్థులను దగ్గర పెట్టి వారిచే సాధ్యమైనంతవరకు చేయించి సంగతివారికి చేయువిధమును మానెదము.

(Mechanism) యంత్ర నిర్మాణములను గురించి బాగుగా తెల్పబడిన పటము బంధింపబడియున్న నేర్పుచున్నాము. ఈవిద్య రెండుమూడు నెలలలో నేర్పి కడపటను వారికడకు డ్రైవింగు లైసెన్సుకు గాను Examination కు పంపి అందులో Pass అయినచో మా స్కూలు సర్టిఫికెట్టున్ను యిచ్చి పంపబడును.

మా Institute లో చదివి తరిఫీయదయి వెళ్లినవారు అనేకులు మహారాజులు, రాజులు, గొప్పవారివద్ద నౌకరీలో నున్నారు. రూ. 25 మొదలు 100 రూపాయలువరకు సంపాదించుచున్నారు.

మంచి చోట్లు కూడ పాడగుచున్నవి. జారవృత్తియందు ప్రవేశించిన వితంతువుల సహవాసముచేత పండువంటి కాపురములను చేయు స్త్రీలు కూడ పాడైపోవుచున్నారు. తాఁ బడ్డ గోఁతి కన మెల్లఁ బెణుచు నన్న లోకోక్తి యూరకపోవునా?

మనలో విద్యావంతు లగు కొందఱు సంఘసంస్కర్తలు ప్రతి పట్టణములోను పల్లెలలోను సంస్కరణసంఘముల నేర్పఱచి చేయుచున్నారు. ప్రతిసంవత్సరము జిల్లా సభలతో పాటు సంఘసంస్కరణసభలను జరుపుచునే యున్నారు. గంభీరోపన్యాసములను చదువుచునే యున్నారు. ఒక్కొక్కచోట్ల ఘోరతరముగా తీర్మానములను చేయుచునే యున్నారు. వాక్శూరత మెండు. కార్యశూరత స్వల్పము. తీర్మానములు హెచ్చు; ఆచరణకు తెచ్చుట అసలే శూన్యము. వాగ్దానములు కోటలు దాఁటును, నడిచెడ పన్న కాలు సాఁగదు. ధైర్యము చేసి నడువఁబోవువారికి కొంద ఱడ్డము వచ్చుచున్నారు. వీరికి ఒక కన్ను గ్రుడ్డి. ఒక చెవి వినుపింపదు. ఒక చెయ్యి పని చేయలేదు. ఒక కాలు నడువదు. ఆ గ్రుడ్డి కన్ను తాను చూడకపోయిన మానెఁగాని చూడఁగలిగినదానిని కూడ చూడనియ్యదు. ఆ వినలేని చెవి వినఁగలిగినదానిని విననియ్యదు. ఆ చేతఁగాని చెయ్యి చేతనైనదానిని చేయనియ్యదు. నడువలేని కాలు నడువఁగలదానిని నడువ నియ్యదు. ఇట్లు తనలోని సగము శరీరము ఎందునకును పనికిరాక పడియుండినచో పురుషశరీర మేమి చేయఁగల్గును? వీ రిట్టి స్థితిలో నున్నవారలు: అనఁగా వీరి స్త్రీలు అజ్ఞానరోగపీడితలై తమ పురుషులకు సహాయము చేయఁ బనికిరాక పడియుండుటయే కాక, వారి సత్ప్రయత్నముల కన్నింటికి నడ్డమై నిలుచుచున్నారు.

ఈ పురుషులను గని పెంచు తల్లులు మూఢురాండ్రు. వివాహమాడి తమ జీవితకాల మంతయు వారితోఁ గడపి వారి సుఖదుఃఖములను సమానముగా పొందు భార్యలు మూఢురాండ్రు. వార్థకము వచ్చి కాటికి కాళ్లు చాచుకొని యింట పడియున్న ముదుసలులు మూఢురాండ్రు. బిడ్డల కోమల హృదయమున జ్ఞానబీజాంకురము నాటఁదగిన ప్రథమశిక్షకురాలు తల్లి. అట్టి తల్లి తాను మూఢురాలగుటవలన తన మూఢాచారములను మూఢాభిప్రాయములను తన బిడ్డల హృదయమున నాటుచున్నది. దానిని బట్టి జ్ఞానమువలన ప్రజ్వలించు ధైర్యసాహసత్యాగాది సద్గుణములు తలయెత్తక పోవును. పురుషులు తమ శైశవావస్థయందు పొందిన మూఢాభిప్రాయములను తాము విద్య నేర్చునప్పుడు తొలఁగించుకొనఁ జూచుచుండఁగా, తల్లిదండ్రులు వారి పాలిటికి మృత్యుదేవతలై పిల్లలను తెచ్చి వివాహము పేర వారి మెడ కుఁ గట్టుదురు. ఆ భార్యలు మౌఢ్యమున పుట్టి మౌఢ్యమున పెరిఁగి యాకృతి చెందిన మౌఢ్యమో యన నుందురు. వారి సాంగత్యము తమ విద్య వృథచేయుచుండఁగ పురుషులకు లభించుటచే, తల్లులు వారి హృదయమున శైశవమున నాటిన మౌఢ్యాంకురములను ఆ భార్యలు నీరు పోసి యెదువ బెల్లి వానిని గొప్ప వృక్షములను చేయుదురు.

ఇరువుల కొక విద్యావ్యవస్థను మూలకంబు. గాఢాంధకారబంధురమగు పెద్ద యింటియందు నూనె లేని ప్రమిదలోని దీపపు కాంతి ఎంత వెలుతురు నిచ్చును! విద్యాశిక్షణలో మిణుఁగురుబూచివంటి దీపప్రకాశము పోరి పోరి తుద కంధకారమున నశించిపోవును. అయితే పురుషులు నేర్చిన విద్యకు అనుకూలమైన ప్రక్రియలను అన్నివైపులను తల్లి అక్కచెల్లెండ్రు భార్య మొదలగు వారి యజ్ఞానాంధకారము గ్రమ్మి దానిని మ్రింగఁగోరుచుండ, వీరి జ్ఞానప్రకాశము పోరి పోరి తుదకు దానితో నైక్యభావమును చెందును. అజ్ఞానముతో ధైర్యము ఉత్సాహము వ్యాయమము మొదలగు గుణములు మాయమై పిఱికితనము లజ్జ మొదలగు దుర్గుణము లేర్పడును. ఈ కారణమును బట్టియే మన విద్యావంతులు నిజ మని తెలిసినదానిని చెప్పుటకును చెప్పినదానిని చేసి చూపుటకును ధైర్యసాహసములు చాలక వెను దీయుచున్నారు. స్త్రీ లిట్టి మౌఢ్యములో మునింగియుండుటకు కారణము విద్య లేమియే. స్త్రీ లందఱు విద్య నభ్యసించిన నీ మౌఢ్యము త్వరలో మానిపోఁగలదు.

అజ్ఞాను లగు పురుషులు కొందఱు స్త్రీని వివాహమాడుట విషయసుఖకాంక్షలను దీర్చుకొనుటకు మాత్రమే యని తలఁచుచున్నారే గాని, ఈశ్వరశాసనము లగు మానవధర్మముల నెల్ల నెఱవేర్చుకొనుటకు కులసతియం దర్ధాంగిభావమును వహించి యామెను సహధర్మిణినిగా చేసికొని పరసౌఖ్యమును గూడ పొందవలయు నని భావించుట లేదు. ఇఁక స్త్రీ లన్ననో, తాము పురుషులను వివాహమగుట సమస్తభోగభాగ్యముల ననుభవించుటకే యని తలంచి యవి కొఱఁతయైనప్పుడు పతులను నిందించుచు విషణ్ణహృదయలై యుందురే కాని, పతియే యిహలోకదైవ మనియు లోకయాత్రయం దతనికి కలిగెడి కష్టసుఖములకు తానును సహభాగినియై వానిని సంతోషపూర్వకముగా ననుభవించుచు పతి యాజ్ఞకు లోఁబడి సమస్త స్త్రీధర్మములను నిర్వర్తించుకొనుచు ధర్మపత్ని యను పవిత్రనామమున కర్హురాలుగా నుండవలె నని భావించుట లేదు. ఇందునకు కారణము లేశ మైనను జ్ఞానము గలిగియుండని పసితనమందు చేయఁబడిన బాల్యవివాహ దురాచార పిశాచమే యని వేఱే నేను చెప్పవలయునా?

అతిబాల్యవివాహము మనలో నెన్ని చెడుగులకు మూలమై యున్నదో చూడుఁడు. అతిబాల్యవివాహమువలన మనలో శరీరబలము తగ్గినది. దానివలననే ధైర్యసాహసాది సద్గుణము లడుగంటినవి. మన స్త్రీలు మొదలగువా రందఱును మౌఢ్యములో పడియున్నారు. మనదేశ మెచ్చట చూచినను అంధకారబంధురమై యున్నది. ఈ మహాపిశాచము మనల బాధించుచున్నది. మన మీ పిశాచమును పాఱఁద్రోలవలయు నన్న, మనకు ధైర్యసాహసములు గలుగవలె నన్న, మనము దీర్ఘాయుష్మంతులము గావలయు ననిన, మనము సత్యశౌచాదిసద్గుణముల కాటపట్టు కావలయు ననిన, మనమొక దేశీయులము కావలయు ననిన, సకలదోషములకు మూలమైన అతిబాల్యవివాహమును ఇప్పు డిప్పు డనక మానవలయును. మన స్త్రీలకు విద్యాసంస్కారము నొసఁగవలయును. స్త్రీలు విద్యావతులైన మౌఢ్యము నిలుచుటకు నీడ దొరకదు. స్త్రీలు విద్యావతు లగుటవలన వారి సంతానము విద్యావంతమును గుణవంతమును నగును. అప్పుడు బాలవితంతువుల యేడ్పు లుండవు. అప్పు డెచ్చట చూచినను సంతోషసౌఖ్యములు రాజ్యము చేయుచుండును.

దేశకాలపాత్రముల ననుసరించి మాయభిప్రాయమున 25 సంవత్సరములకు పురుషునకును 16 సంవత్సరములకు స్త్రీకిని వివాహము చేయుట యుత్తమము. కొండెనగి 20 సంవత్సరములకు పురుషునకును 14 సంవత్సరములకు స్త్రీకిని వివాహము చేయుట మధ్యమము. మన దేశము క్రమక్రమముగా నెట్లు క్షీణించినదో అట్లే యభివృద్ధి నొందవలయును. ఒక్కొక్క పెట్టున నభివృద్ధి చెందవలయు ననిన, ఎవ్వరికిని సాధ్యము కాదు. ఇట్లు చేసికొనుచు పోయినయెడల క్రమముగా కొన్ని తరముల కుత్తమబ్రహ్మచర్యము చేయ శక్తి కల్గు ననుట స్పష్టము, నిజము, యథార్థము.

## ii. కోణకంచి లక్ష్మమ్మగారు

మన దేశమం దిప్పటికిని నాగరకతను తెలిసి నడచుకొనువారు నూటికి పదిమంది కూడ కనఁబడకున్నారు. జనులు పూర్వాచారపరాయణులై పూర్వపద్ధతులనే యనుసరించుచు, తమకు తెలిసిన కొన్ని కార్యములు చేయఁగూడనివై యున్నను వానిని వదలక యాచరించుచునే యున్నారు. సాధారణముగా వా రాచరించు కార్యము లన్నియు ముఖ్యముగా నాచరింపవలసినవే యయి యున్నవి గాని, ఒక్క కార్యము మాత్రము విడువక తమ కనుభవమై తమ కన్నుల యెదుట నెన్నియో పర్యాయములు జరిగి విఫలమైనను, దానిని వారు విడువక యాచరించుచున్నారు. ఆ కార్య మేమనఁగా "బాల్యవివాహము". బాలికలకు తమ్ము తాము తెలిసికొనునంతటి వయసు రాకమునుపే "అష్టవర్షా భవేత్ కన్యా" అని శాస్త్రప్రకారము ఎనిమిది సంవత్సరములలోపల వివాహ మొనరించిన కన్యాదానఫల మొందెద మని తలఁచి, వారికి వివాహము గావించెదరు. ఆబాలికలకు వైధవ్యము ప్రాప్తించెనేని, వారి తలిదండ్రులు వారిని తమ జీవితకాల మంతయు చూచి దుఃఖించుచుందురు. వారు దుఃఖపడుటయే కాక, తుదకు జనులచే పడరాని మాటలు పడి వానిని సహింపలేక పడరాని పాట్లుకూడ పడెదరు. విధవ యైన బాలికకు శాస్త్రరీతిగా చేయవలసిన కార్యములు చేయక తమయింట నుంచుకొన్నచో పురజనులు వారిని నిందించుటే కాక, వారికి కులహీనత కలిగిన దని వారిని బంధువులు తమయిండ్లకు రానీయరు. ఇది కాక, ఆ బాలిక తాను వరించిన పురుషునకు సరిపడక కష్టపడుచుండునప్పుడు తలిదండ్రుల దుఃఖమునకు మితి యుండదు. ఇఁక, 'బాలికకు యుక్తవయసు వచ్చి తన్ను తాను తెలిసికొని తనకు ప్రియ మగు వరుని తాను పెండ్లిచేసికొనుట యుక్తము. అట్టి సందర్భములలో తర్వాత కల్గిన కష్టములకు మన ముత్తరవాదులము గా' మని చెప్పినచో, కొందఱు 'మన పెద్దలు పిచ్చివారై యీ విధుల నేర్పఱచిరా?' యని యడిగెదరు. మన పెద్ద లెందుకై బాల్యవివాహాచారము ననుసరించిరో విచారింతము. మన పెద్దలు పూర్వము జపతపాదులు వేదాధ్యయనము చేసికొనుచు భరతఖండమున సుఖించుచుండినప్పుడు, మహమ్మదీయు లత్యక్రూరులై మన హిందూదేవాలయములను పాడుచేయుచు విగ్రహములను భిన్నము చేయుచు మన మతములను భ్రష్టీకరించుచు ప్రబలులై మెలఁగుచుండిరి. అట్టి సమయమున మన భారతీయులు వారి నెదుర్కొనుటకు శక్తి చాలమిచే; కాఁబట్టి వారికి భయపడవలసియుండెను. మహమ్మదీయులు భారతదేశమును పాడుచేయుటయే కాక, హిందూబాలికల నపహరించుచు వారిని తమ మతమునందు చేర్చుకొనుచుండిరి. మహమ్మదీయులు, వివాహము లైన బాలికల నపహరించినచో వారి భర్తలు తమ్మెదుర్కొందురేమో యని, వివాహము గాని బాలికలనే యపహరించుచుండిరి. వారి దాడికి వెఱచి వారి బాధ కోర్వలేక మన పెద్దలు చిన్నతనమునందే తమ బాలికలకు వివాహములు చేయుచుండిరి. వారు దైవికముగా పతివిహీన లైరేని, వారిని మూఁడు వేషములు వేయించి రావి వస్త్రములను ధరింపఁజేసి గృహములయం దూడిగములు చేయుటకు తగినవారినిగా చేయుచుండిరి. అట్టి బాలవితంతువులు సభలకు రాఁగూడమిచే తా మీ ప్రపంచమును దాఁటువఱకు దురదృష్టవతులై యుండి ప్రాపంచికాశ లన్నియు త్యజించి మరణమునకు వేచియుండెడివారు. కావున, ఆంధ్రయువకులారా, మీ రిఁకనైనను మన బాలికలు వలసినంత సౌఖ్యమును పొందఁగోరుటయం దిష్టులై పూర్వపద్ధతుల నవలంబింపక, అంతకంటె పూర్వపు పద్ధతుల ననుసరించి, మన బాలికలను మఱొక విధముగా వృద్ధిపఱచుట కాలోచింపుఁడు. వారికి యుక్తవయసు ప్రారంభింపఁగనే, అనఁగా చదువ శక్తి గలవా రగునప్పుడే, విద్యాభ్యాసము చేసి వారు పూర్తిగా విద్యయందు కృతార్థ లగువఱకు వారిని పాఠశాలలకు పంపుఁడు. వారికి చిన్నతనమునందే వివాహములు చేయక, వారు తమకు తామే తమ యిష్టపడువారిని వరించుటకు నట్లు వారి కోర్కె ప్రకారము వివాహములు గావింపవలెను. మన మీలాగు బాలికల యిష్టానుసారము చేసినను ఎందరో విధవ లై మన హిందూదేశములో దుఃఖించుట లేదా యని ఎవరైన చెప్పఁబోవుదు రేమో? దానికి సమాధాన మిదివఱకే సూచింపఁబడియున్నది. మనకు సాధ్య మగునంతవఱకు మంచి కార్యములు చేసి మనకు నిర్ణయింపఁబడిన ప్రకారము కొదువ లేక జరపిన తర్వాత కలిగెడి దుఃఖములకు మన మేమి చేయఁగల్గుదుము? మన శక్తి ననుసరించి యెంత దూరము చేయఁగలుగుదుమో అంతవఱకు చేసిన తర్వాత కలిగిన కష్టములకు వారి విధి యని చెప్పవలసినదే కాని, వానిని గుఱించి చింతించుట మిక్కిలి అవివేకము. విధిప్రకారము జరుగు కార్యములకు మనము కష్టపడినను నిష్ప్రయోజనమే కదా యని మీ మదియం దూహింతు రేమో? మనకు మీరరాని జరగెడి కార్యములకు మన ముత్తరవాదులము కామని తెలిసికొనుఁడు. ఆంధ్రయువకులారా, మీరు మన బాలికలయందు నిర్దయ చేయక వారికొఱకు నిర్మింపఁబడిన పాఠశాలలకు వారి నంపి వారిని బుద్ధిమతులనుగా చేయుటకై ప్రయత్నింతురు గాక! భగవంతుఁడు మా కీ కార్యమునకు తోడ్పడును గాక!

# హైందవ స్త్రీలు: దేశసేవ

ఎమ్. ఎన్. కమల గారు

ఇప్పుడు మన సోదరులు చేయు దేశీయాభివృద్ధి కారకము లగు ప్రయత్నములు ఫలోన్ముఖము లగుచున్నవా లేవా? లేకపోయినయెడల కారణము లేమి? —అని సాధారణముగా మన దేశాభివృద్ధిని గూర్చి యాలోచించు ప్రతిమనుజునకును తట్టకపోదు.

మనవారు చేయు ప్రయత్నము లన్నియు ఫలవంతము లగుట లేదు. ఒకప్పు డైనను, అవి యంత తృప్తికరముగా లేవు. దీనికి ముఖ్యకారణ మే మన, దేశీయ రాజకీయ సాంఘిక నైతిక విషయములలో చేయు యత్నములు స్త్రీసాహాయ్యము లేక సంపూర్ణ జయము నొందఁజాలవు. పురుషులు ప్రత్యేకించి చేయు దేశసేవ లాభకారి కాదు; అటులే, స్త్రీలు తమంతటఁ దాము చేయు పనులును జయప్రదములు కాఁజాలవు. ఏ దేశమున స్త్రీపురుషు లిరువురును సోదరసోదరీన్యాయముతో దేశసేవకై కంకణము కట్టుకొని నిశ్చలచిత్తముతో స్వార్థపరత్వచింత నవలఁ బెట్టి కష్టలముల కోర్చి పనిచేయుదురో, ఆ దేశము తప్పక ముందునకు వచ్చు ననుటకు సందేహము లేదు. కనుక దేశసేవకు స్త్రీపురుషవివక్ష యనవసరము.

ప్రస్తుతము జనసామాన్యములో స్త్రీలు దేశసేవకు అర్హులుగా పరిగణింపఁబడుట లేదు. వారి స్థితిగతులు చాల సంతోషదాయకముగాను తృప్తికరముగాను నున్న వని చాలమంది యభిప్రాయపడుచున్నారు. కాని, కొంచె మాలోచించి చూచినయెడల నిజస్థితి తెలియఁగలదు. దేశసేవకును గొప్ప కొన్ని కార్యములు స్త్రీలే కాని పురుషులు చేయనేరరు. సర్వేశ్వరుఁడు స్త్రీలను దేశీయధర్మనిర్వాతలనుగా చేసియున్నాఁడు. మాతృత్వవిధిని వనితలే నెఱవేర్పవలసియున్నారు. దీనితోఁ గూడు కష్టసుఖములను శ్రమలేక సంతోషముతో వా రనుభవించుచున్నారు. మంచి సంతానమును గని దేశసేవ కర్పించుట స్త్రీల విధి. ఇట్లు సద్గుణసంపన్ను లగు పురుషులను మాంధన లగు స్త్రీలకు హిందూమాతృపూజకై సమర్పించు మహాద్భాగ్యము స్త్రీల కబ్బినది. అయినను, ఇట్టి సేవ పెక్కుచిక్కులతోడను చాల కష్టములతోడను నిండియున్నది. స్త్రీరత్నములు చేయు నీ దేశసేవయందు ఎంతమంది తమ ప్రాణములను సైతము కోల్పోవుచున్నారు కారు? పదునైదు ముప్పది సంవత్సరముల వయసు మధ్యమున నున్న వారిలో 1000 మందికి, పురుషులకంటె స్త్రీలు 323 మంది యెక్కువగా చనిపోవుచున్నా రని తెలియుచున్నది. అక్కటా! ఎంత విచారకర మైన సంగతి? ఇట్టి నిశ్చలభావముతో స్వార్థత్యాగబుద్ధితో ప్రాణములపై లక్ష్యము లేక, ఇట్టి ఘనమగు దేశసేవను చేసి, తమ మనోధైర్యములను సహనమును ఇంకను నెన్నియో సద్గుణములను ప్రపంచమునకు చాటి కొంత గాని కీర్తి కర్హ లగు స్త్రీ లెంత గర్హ్యలుగా చూడఁబడుచున్నారు? ఏ విధ మైన డాంబికమును గాని గొప్పతనమును గాని గౌరవమును గాని పొందకయే వారు పాటుపడుచున్నారు. ఐరోపాఖండాంతరాళమున యుద్ధము చేయు సిపాయిలకంటె, తగు యుద్ధసామగ్రి చేయువారి నెత్తురులు గాల్చు యుద్ధభటులకంటె సేనానిరతియందు ఏ కొంచెము ప్రశంసనీయులు. వీరికి ఆయుధములా, తగు ప్రోత్సాహమా, సున్న; తగిన గౌరవమా, పూజ్యము. కటకటా! "దేవరాలికి నవరాత్రములు" అను మాట యిచ్చట ప్రత్యక్షముగా నుదాహరింపఁబడుచున్నది. యుద్ధభటులను సృష్టి నాశము చేయుచున్నారు; స్త్రీ లన్నను సృష్టిని వృద్ధిపొందించుచున్నారు. ఇంతకంటెను మహత్తరమైన కార్యములను చేయుటకు స్త్రీలే ముఖ్యులు. తమ సంతానమును నానావిధములఁ బోషించి

వారు దృఢశరీరులై దేహబలసంపన్నులైన తరువాత 'మాతృదేశసేవ చేసి మా జన్మములను పవిత్రతమములుగా చేసికొందు' మని మాతృదేవతతో వారిని పంపువారు నారీరత్నములే కదా? ఇట్టి ఘన మగు తమ సేవాస్వభావమును స్త్రీలే గుర్తెఱుంగకయున్నారు. ఇంక పురుషుల మాట చెప్ప నేల? ఈ రీతిగా పురుషులు దేశోన్నత్యమునకు చేయు ప్రయత్నములు స్త్రీలు దేశమున కొసంగు సంతానముచే సఫలీకృతములు చేయఁబడుచున్నవి.

కనుక, హిందూ దేశములో వివాహమును మాతృత్వమును ముఖ్యముగా గమనింపఁదగియున్నవి. ఇచ్చట 1000 మంది పురుషులకు, 954 మంది స్త్రీలున్నారు. ఇట్టి స్థితిలో, ఆరోగ్యము గల శిశువులు కలుగుటకు వివాహము మిక్కిలి తృప్తికరముగా నుండవలెను. ప్రకృతిశాస్త్రమును జనాభాలును 13, 17 సంవత్సరముల మధ్యముఁ గల్గు మాతృత్వము సత్సంతానము నీయఁజాలదని నొక్కి చెప్పుచున్నవి. బాల్యవివాహము లిఁక పనికిరావు. అవి మన దేశపు యువజనుల యింద్రియనిగ్రహమునకు కళంకముఁ దెచ్చుచున్నవి.

ఇంక స్త్రీల విద్యను గూర్చి యెంత తక్కువగా చెప్పిన నంత మంచిది. ఎక్కడనో వెతకి చూచినఁ గాని సరియైన విద్యాధిక లగు స్త్రీలు కానరారు. తక్కినవారినో మూర్ఖత విస్తారముగా నావరించుకొనియున్నది. ప్రపంచ విషయములు వారికి బొత్తిగా తెలియవు; రాజ్యాంగ విషయికజ్ఞాన మావంతయు లేదు. ఈ కారణములచే స్త్రీలు తమ సోదరులకు సహాయము చేయుటకు బదులు ఆటంకమును కలుగఁజేయుచున్నారు. ప్రపంచనాగరికసంస్కారములకును ప్రతి దేశోద్ధారణప్రయత్నమునకును స్త్రీలు మార్గనిరోధకులుగా నున్నారు. మన స్త్రీలకున్నతవిద్య అత్యంతావశ్యకము. వారు పురుషులతోఁ బాటు దేశసేవ చేయవలయునెడల, వారు స్వాతంత్ర్యజీవనము నడపవలయునెడల, వారిలోని మహాద్గుణములు దేశౌన్నత్యమునకు దారి చూపవలయునెడల, వారి కున్నతవిద్య నొసఁగి వారల యంతశ్శక్తులను ప్రకాశవంతములుగా చేయవలయును. ఆ రీతిగా చేసినయెడల, వారు పురుషుల కమితసహాయము నొసఁగఁగలరు.

ఒకసారి మన దేశస్త్రీల చరిత్రములను చూచిన యెడల, మనకీ సంగతి గోచరింపకపోదు. పతినే దైవముగను మానమే ధనముగను పరిగణించుకొనుటలో హిందూస్త్రీలకు వారే సాటి. చిన్ననాటినుండియు వ్రతనియమములలో పెరిగి, ఉపవాసవ్రతముల నాచరించి ఈ విధముగా నలవడిన జితేంద్రియత్వాది సుగుణములను అవసర మగునెడల ప్రపంచమునకగపఱచి, ఋజువు నొనర్చుటకు హిందుస్త్రీలే తగినవారు. శత్రువులు కోటల నాక్రమించినప్పుడు, తమ మగవారు ప్రాణములపై నాశవదలి పోరాడి వీరస్వర్గముఁ జూఱగొనునప్పుడు, తమ మానప్రాణములను శత్రువుల యధీనములో నుంచవలసిన సమయ మాసన్నమైనప్పుడు, రాజపుత్రస్త్రీలు చేసిన వీరకార్యములు వారు చేసిన యగ్నిసంస్కారములు ప్రపంచమంతయును గౌరవాస్పదజనకములుగానే యుండును. ఏ స్త్రీ బ్రతికియుండియు తన భర్తశవముతోఁ గూడ అగ్నియందుఁ గూలఁగలుగు? ఏ స్త్రీ దేశరక్షణార్థము శత్రువులతో కత్తిగట్టి పోరి జయలక్ష్మిని చూరగొనఁగలదు? ఏ స్త్రీ సకలసద్గుణములతోఁ గూడి దేశమునకు వన్నె దేఁగలదు? హైందవస్త్రీ తప్ప. ఇట్టి వనితల పేరులు చెప్పి యీ వ్యాసమును విపులము చేయుట యనవసరము. అవి యెల్లరకుఁ దెలిసినవే.

ఇప్పటి స్త్రీల విషయమై కొంచెము ఆలోచింతము. వారు తమ పూర్వుల కంత మాత్రమును తీసిపోరు. సమయము చిక్కినతోడనే వారు తమ సర్వస్వమును దేశమునకు ధారవోసి హిందూదేశమునకు పూర్వపు ఔన్నత్యము సంపాదించుటకు యత్నించుచున్నారు. వారిది యిక్కడి ప్రజాసేవయను; వారి సద్గుణములు వర్ణనీయములు. ఇప్పుడు బొంబాయి రాజ్యమునందలి స్త్రీలు ఎన్ని విధములనో పాటుపడి సంఘసేవ చేసి దేశసేవ చేసి తమ పురుషులకు సహాయము చేయుట మిక్కిలి ప్రశంసనీయము. లేడి శాంతో యని కీర్తి నొందిన స్త్రీల బలాతిశయములను లోకమునకు చాటుచు తారాభాయి హిందూలోకముయొక్క కృతజ్ఞతకు పాత్రురాలైనది.

వంగదేశము మొదలగు దేశముల స్త్రీలు మిగుల విద్యావతులయి, దేశసేవ సేయ సమకట్టుచున్నారు. ధీకౌశలమునఁ గూడ స్త్రీలు ప్రవీణ లని చెప్పక చెప్పుచు సరసకవిత్వమును మృదుమధుర వాక్కులతో వెలయింపఁ జేయుచు నాగరకప్రపంచ మంతటను విఖ్యాతి గాంచిన శ్రీమతి సరోజినీదేవి గారిని చూచి యే దేశము గర్వము నొందకుండును?

ఇఁక మన యాంధ్రస్త్రీలఁ గూర్చి కొంచెము యోచింతము. పూర్వచారిత్రములు కొంచెము చదివి చూచిన యెడల, ఆంధ్రస్త్రీలు ఏ విషయములోను తక్కిన హిందూదేశపు సోదరీమణులకుఁ దీసిపో రని తేటతెల్లము కాఁగలదు. ఆంధ్రదేశమున సద్గుణగరిష్ఠలై వన్నెకెక్కిన స్త్రీరత్నము లుండిరి; ధీకౌశలమును జాటు నారీమణు లుండిరి; శౌర్యాదిసద్గుణసంపన్న లైన చాన లుండిరి; సరసకవిత్వముతో సద్గ్రంథములు వ్రాసిన సతీతిలకము లుండిరి. వీరిని చూచి యిప్పటికిని ఆంధ్రమాత గర్వపడుచుండును. మొల్ల వెంగమాంబ మొదలగు వారు వ్రాసిన గ్రంథరాజములు చదివి మనసార సంతోషింపని మానవుఁ డెవ్వఁడు? పదలాలిత్యమునం దేమి కవితాచమత్కృతియం దేమి రసపోషణమునం దేమి, వేయేల, అన్ని విషయములలోను వారు ఆంధ్రభాషాసేవ చేసి చిరకీర్తిని సంపాదించిరి. మరి తమ పురుషులు రణరంగమునుండి శత్రువులకు వెన్నిచ్చి యింటికి పాఱి వచ్చినప్పుడు వారిలో ధైర్యము నెలకొల్పి, దేశసేవ కంటె ప్రాణము లెక్కడా యను బుద్ధిని వారికి కలుగఁ జేసినది ఆంధ్రవనితారత్నములే కదా!

"పగరకు వెన్నిచ్చినచో
నగరే నీ మగతనంబు? నలుగురిలోనన్
ముగు రాఁడువార మైతిమి,
నగ పేటికె జలకమాడ వచ్చిన చోటన్?"

అని బుద్ధిచెప్పిన వీరమాత లాంధ్రమాతృగర్భసంజాతయే కదా! ఇంకను బొబ్బిలికోటలు ప్రెంచివారి చేతులలో పడనున్న తఱి తమ పురుషులు ధైర్యస్థైర్యములతో పోరాడి వీరస్వర్గమును నిశ్చింతముగా చూఱగొనుటకు రాజస్త్రీలు తమ ప్రాణములను సంతోషపూర్వకముగా సమర్పింపలేదా? తమ పురుషుల యిష్టానుసారము వారిచేత తమ శిరచ్ఛేదము చేయించుకొనిరి గాదె? ఇంతే గాక, బొబ్బిలికోటలోని స్త్రీలు కొందఱు శత్రుసైన్యముతో పోరి పగరం దునుమాడి వన్నెకెక్కిరి. కాని, ఇప్పుడు ఆంధ్రదేశము పూర్వపు ఔన్నత్యమునుండి కొంచెము పడిపోయినది. అట్టి వీరమాతలు కానరారు. విద్య విరివిగా వ్యాపింపలేదు. విద్యావతు లగు స్త్రీలు చాల తక్కువ. అయినను, ఇప్పు డెల్లెడలను నూతనావేశ మతిశయిల్లుచున్నది. నూతనాదర్శములు జనుల మనముల నాకర్షించుచున్నవి. ఆంధ్రదేశము ప్రముఖము కాఁదగు సమయ మాసన్నమగుచున్నది. ముందుముందు, ఆంధ్రదేశము మహోత్తరమైన స్థాన మాక్రమింప నున్నది. కనుక సమయమునకుఁ దగిన సాధనములు తప్పక వచ్చు నని నమ్మకము కలుగుచున్నది. అట్టి యభివృద్ధి చిహ్నములు దేశమం దంతటను వ్యాపించి రాఁబోవు శుభమును సూచించుచున్నవి.

ఇట్టి శుభస్థితులు హిందూదేశమం దంతటను కానవచ్చుచున్నవి. స్త్రీల యౌన్నత్యముతో దేశాభ్యుదయము సమీపించుచున్నది. కనుక దేశభక్తు లెల్లరును స్త్రీజనుల కున్నతవిద్య గఱపి వారిని దేశసేవకు అర్హలనుగా చేసినయెడల, దేశౌన్నత్యము కరతలామలక మగును.

# నగలు

జి. ఏ. రామమూర్తి గారు

ప్రోడి వతులంగు మొగము పెర్చుకొని తిరుగ
నిజవిమోయాపములను నన్నియు నొసంగ
పట్టు మని నాల్గు నగలైనఁ బెట్టుకొనఁగ
లేవు గద! యంచు వగచె దేలే? లతాంగి! 4

సజ్జనంబులు మెచ్చ యశంబు హెచ్చ
విద్యయు వివేకసంపద వినయవృత్తి
సాధనము లౌను గాని తుచ్ఛంబు లైన
నగలు నాశంబులును సాధనంబు లగునె? 8

నగలు తలకెక్కు మీకు నీ నగలు చూడ
నగల తలకెక్కు ఋణము లీ నగలతోడ
అలికి సుఖంబె మగఁ డప్పులందుఁ బడిన?
ఎందు కీ పాడు నగలు పూర్ణేందువదన! 12

నాగరం బెన్నటికిని విన్నాణ మిడదు
దండకంకీలు గూడ సౌందర్య మిడవు
కట్టు కాసుల పేరైనఁ గాని యట్లె
ఎన్ని నగ లైన నవి యెల్ల నిట్లె సుమ్మ. 16

చోరులు హరింపఁజాలని సొగసు నగలు
ధనము లేకయె దొరకు ముద్దినుసు నగలు
నిరుపమానప్రభల నీను నీటు నగలు
కొనుము తెచ్చితి నివియె నీకొఱకు తరుణి! 20

కాంత! యీ భూషణముల బంగార మెల్ల
విద్య యను మాఱు పేరున వెలయుచుండు
చేతఁగాఁ డల్ల వాగ్భూషిత సుమ్ము
తాల్పవలయువారు కను ధన్యరసులు సుమ్ము 24

నాగరం బాడిగాఁ గల్గు నగలకన్న
వేయి మడుఁగులై యీ నగ వెలయుచుండు
శిరమున ధరింపవలయు నీ చిట్టినగను
సుదతి! యీ నగ నీ పతిభక్తి యండ్రు. 28

చెల్ల గోగుల ముద్దులు చిల్లఁబోవ
వినుదోయికి కమ్మని విందు గాఁగ
భువిని వెలుఁగొంద నీ కర్ణభూష గొనుము
సదుపదేశశ్రవణ మండ్రు చాన దీని! 32

ధగధగ వెలుంగు మంచి ముత్యాలవత్తు
తెల్ల పాడి ముక్కుపుడకయు తేజ మిడవు
నీదు నాసాగ్రమున దీని నిలుపుకొనుము
కోపరాహిత్య మీ నగ కుందరదన! 36

మంచి తాంబూలగంధంబు మసలు నందె
సత్యవాగ్గంధ మన్న ముజ్జగము లరుగు
కాన నీ నోర సత్యవాక్యముల కెపుడు
నెలవు సేయుము, దీన రాణింతు వబల! 40

కట్టుకాసుల పేర్కన్న కంటెకన్న
నానుకన్నను ముక్కాలి నాణె మయిన
దీ సువస్తువు నెల్లప్డు హృదయమునందుఁ
దాల్పుమీ దీనినే భూతదయ యటండ్రు. 44

దండవంకీలకన్న నందంబు నీకును
కంకణంబులకన్న చక్కఁదన మొసఁగుఁ
మురుగు లుంగరములకన్న మురిపె మొసఁగు
దాల్పు మీ హస్తభూషను దాన మిదియె. 48

పిడికిఁట నడంగు నీ చిన్ని నడుమునకును
అల్ల మువ్వలవడ్డాణ మంద మిడునె.
ఇంట పనిపాటలను నిర్వహించు పట్ల
నడుము వంచుటయే యంద మిడును గాని. 52

కాళ్ల కందెలు కడియముల్ గజ్జియలును
గొల్సులును పట్టె బరువు నే గూర్చుఁ గాని
న్యాయపథవర్తనం బను నగ వితాన
నీకు నందంబు నీ నగఁ దాయ కెపుడు. 56

నెలత! యొక్కొక్క నగనె కష్టింప నేల?
నీ కొసంగెద నొక మిదే నిలువుతొడుగు
తనివిదీరంగ నీ మేనఁ దాల్చు మింక
తెరవ! యీ నిల్వుతొడుగునే తృప్తి యండ్రు. 60

ఈ నగల నెల్లగుమ దాల్చెదవి జగువ!
సార్థకత్వంబు పొందు నీ జన్మ యువతి!
స్వర్గపద మాను నీ కీ ప్రపంచ మెల్ల!
నిహపరసుఖంబు లొసఁగు నీ కీర్త్యయంబు! 64

# స్త్రీవిద్యాసంస్కరణము

ద్రోణంరాజు వేంకటలక్ష్మాంబ గారు

విద్యార్థినులకు వలయు జ్ఞానము నొసంగు పఠనీయగ్రంథము లన్నియు సామాన్యముగా నాంగ్లభాషయందే యుండుటయు, వీరు మాతృభాషయందు పఠించు గ్రంథము లన్నియు అర్థజ్ఞానవంతములు కాక అక్షరజ్ఞానము మాత్రమే కలుగఁజేయునట్టి పిట్టకథలచే నొప్పుచుండుటయు కలుగుచున్నందున, మాతృభాష యథఃపాతాళమున కణఁగఁద్రొక్కఁబడుచున్నది. ఇవ్విధముగ మాతృభాష యణఁగఁద్రొక్కఁబడుచున్నది గనుకనే మన స్త్రీవిద్య హీనస్థితియందున్నది. స్త్రీవిద్య హైన్యస్థితిని పొందుట కిది యొక ముఖ్యకారణము. ప్రస్తుత మాంగ్లభాష మనకు సామాన్యభాషగా పరిగణింపఁబడుచున్నది. ఇది మనము కావలయు నని కోరి తెచ్చుకొనిన సామాన్యభాష గాకపోయినను, ప్రభుత్వమువా రాంగ్లేయు లైనందున నదియే మన హిందూదేశ మంతయు వ్యాపించి తుదకు సామాన్యభాషవలె వాడఁబడుచున్నది. కాని, ఇది పరదేశభాష యయినందున సామాన్యభాషగా నుండుట కంతగా వీ లుండదు. ప్రస్తుతము మనలో, స్త్రీలయం దేమి పురుషులయం దేమి, ఆంగ్లభాషాభ్యాస మొనర్చి జ్ఞానము నార్జింపవలె ననెడి యుత్సాహము లేకపోయినను పొట్ట పొడిచినను అక్షరము ముక్క లేకపోయినను ఏవో నాలు గింగ్లీషు ముక్కలు చదువుకొని మాటకు ముం దీ యింగ్లీషు పదముల నుపయోగించుటయు దేశభాషల నణఁగఁద్రొక్కుట యొకటి కలుగుచున్నందున, స్త్రీవిద్య యథఃస్థితిని పొందియున్నది. ఇఁక నింగ్లీషు నేర్చుకొనినవారో! ఇంటియందు సోదరులతోడను రోడ్లమీఁద స్నేహితులతోడను వేయేల, అవకాశ్తుగా నెచ్చట నైనను, తమ భార్య అక్కచెల్లెండ్రు మొదలగు వారు ఈ హూణభాషాభ్యాసముఁ గలవారే యైనచో ఇఁక నెచ్చటఁ జూచినను ఇంగ్లీషు భాషాప్రయోగమే! ఇందువలన ముఖ్యముగా మాతృభాష యడుగంటిపోవుచున్నది. ఉదాహరణముగా కాలేజీ విద్యార్థులు మొదలగు ఆంగ్లభాషాభిజ్ఞుల యుత్తరములు చూడుఁడు. అన్నియు నింగ్లీషుతోడనే యుండును. ఇది విద్యాభివృద్ధి కంతగా నుపయోగకారిణి గాదు సుఁడీ! ఇందువలన మాతృభాష పఠించి జ్ఞానము తగ్గుచున్నదే కాని, విద్యాభివృద్ధి కలుగుట లేదు. తల క్రిందులుగ వేయేండ్లు తప మొనరించినను, ఇంగ్లీషు భాష మనకు మాతృభాష కానేరదు. ఇట్టి యింగ్లీషు భాషకై ప్రాఁకులాడి దేశభాషల మఱచిపోవుటకన్న దేశభాషల నభివృద్ధిపఱచి యందుమూలకంబుగా విద్యోపార్జనము చేసినచో [illegible] జ్ఞానాభివృద్ధి కాఁగలదు. మాతృభాషయందలి జ్ఞానము నార్జించి పిదప పరభాషలయందలి జ్ఞానము నార్జింపవలయునే కాని ముందే పరభాషామూలకంబుగా జ్ఞానము సంపాదింపవలె నను టెంతయు హాస్యాస్పదము. కాన, హిందూదేశీయు లెల్లరకు మాతృభాషాభివృద్ధికై పలువిధముల ప్రయత్నించుచు స్త్రీవిద్యాభివృద్ధికిని దేశాభివృద్ధికిని తోడ్పడవలయుఁగాక!

'సామాన్యముగా మన స్త్రీలకుఁ గఱపు విద్యయందు జ్ఞానప్రబోధితము లగు గ్రంథము లెవ్వియు నంతగా నిర్ణయింపబడుటలే దనియు, అక్షరజ్ఞానము కలుగుటకు తగిన గ్రంథములు మాత్రమే నిర్ణయింపఁబడినవనియు వ్రాసితిని గదా? ఆపాఠశాలలయం దట్టి గ్రంథములను తీసివేయవలయును. వైదిక పౌరాణిక స్త్రీలగు గార్గి మైత్రేయి సీత దమయంతి చంద్రమతి ద్రౌపతి మొదలగు సతీశిరోమణుల పవిత్రచారిత్రములను సులభశైలియందు మాతృభాషలో చిన్నచిన్న కథలుగా రచియించి బాలికలకు చిన్న తరగతులయందే పఠనీయగ్రంథములుగా నిర్ణయించి బోధింపవలయును. అందువలన నది వారికి సులువుగా బోధపడుటయే గాక చిన్నతనమునుండియు జ్ఞాన మలవడఁగలదు. పిదప ఐతిహాసికకాలపు స్త్రీలగు అహల్యాబాయి రాణీ భవాని వీరమతి మొదలగు పతివ్రతాతిలకము లగు శూరనారీమణుల చరిత్రములును, డాక్టరు ఆనందీబాయిజోసీ రమాబాయి కేశోకర్, తోరూదత్తు మొదలగు విదుషీమణు లయిన పవిత్రనారీమణుల విఖ్యాతచారిత్రములును సుగమముగా తెలియునట్లు గ్రంథరూపమున బోధింపవలయును. అట్లు బోధించుటచేఁ గల్గు జ్ఞానము వలన [illegible]ఖ్యాతి లగు తన్నారీరత్నములవలెనే మనమును సంచరింప[illegible]లయు ననెడి సంకల్ప మీ బాలికల హృదయములయం దుద్భవించును. అప్పటినుండియు వారు సత్ప్రవర్తనము గలిగి విద్యాభిలాషిణు లై యశోవిరాజిత లగుటకు ప్రయత్నింతురు.

కాని, యంతటితో సంస్కరణము పూర్తి కాలేదు. జ్ఞానయుక్తము లగు గ్రంథము లంతగా మన యాంధ్రభాషయందు లేవు. సంస్కృతము మహారాష్ట్రము మొదలగు స్వదేశభాషలయందును ఇంగ్లీషు మొదలగు పరదేశభాషలయందును విస్తారముగాఁ గలవు. ఏకదేశ మగు నొక్క హిందూదేశమునందే స్వతంత్రవ్యక్తి గల 20 భాషలు గలవు. ఈ భాష లన్నియు పాఠశాలలయందు గఱపుటకు ప్రారంభించినచో ఒక్కొక్క భాషయం దారంభవిద్యను గ్రహించునప్పటికే వీరు పాఠశాలలయందు విద్య నభ్యసించుటకు తగిన వయస్సు మీఱిపోవును. ఇఁక వీరు ఉన్నతవిద్య నభ్యసించు టెప్పుడు? శాస్త్రవిద్యల నభ్యసించు టెప్పుడు? భాషాపరిజ్ఞానము గలిగి విదుషీమణులై వివిధగ్రంథములందలి జ్ఞానసారమును గ్రోలు టెప్పుడు? కావున అన్ని భాషలయందును విద్య నభ్యసించి జ్ఞానము నార్జించుద మన్న నది యాకాశపుష్పమువలె నత్యంతాభావమే కాని వేఱొండు గాదు. జన నిఁక నే యే భాషలు విద్యాశాలలయందు నిర్ణయింపఁబడ

న్నయియును? (1) మాతృభాష (2) సంస్కృతము (3) ఇంగ్లీషుభాష.

(1) మాతృభాష — ఏ రాష్ట్రములవా రా రాష్ట్రమునందలి వారి స్వభాషను, అనఁగా ఆంధ్రులకు ఆంధ్రభాషను మహారాష్ట్రులకు మహారాష్ట్రభాషను వంగదేశీయులకు వంగభాషను ఇట్లే తదితర రాష్ట్రములవారికి వారివారి మాతృభాషలను ప్రథమభాషగా నిర్ణయింపవలయును. సాధ్య మగు భాషేతరగ్రంథముల నీ మాతృభాషలోనికి భాషాంతరీకరింపవలయును. అట్లగుటవలన బాలికలకు విద్యాభ్యాసమునం దుత్సాహము కల్గి విద్యయందు మిక్కిలి శ్రద్ధాభావ ముదయించు ననుట కించుకయు సందియము లేదు. అందుచేత వారు త్వరితముగా జ్ఞానవతులు కాఁగలరు?

(2) సంస్కృతభాష — సామాన్యముగా మతగ్రంథములును పురాణగ్రంథములును జ్ఞానోపార్జనమునకు ముఖ్యసాధనము లగు ననేక గ్రంథజాలంబులును ఈ భాషయందే పూర్వమహాకవులచే విరచింపఁబడియున్నవి. ఈ గ్రంథము లన్నియు భాషాంతరీకరించుట దుర్లభము. ఈ భాషను రెండవ భాషగా నిర్ణయించినచో మన ప్రాచీనదేశభాష యగు సంస్కృతభాషయందలి విజ్ఞానమును గ్రహించుటయే కాక భాషాభివృద్ధి కూడ కాఁగలదు. ఇట్లు రెండవ భాషగా నిర్ణయించు టొక్క యాంధ్రదేశమునందలి విద్యాలయములయందు మాత్రమే కాక హిందూదేశమునందు స్వాతంత్ర్యము గల ప్రతిరాష్ట్రమువారికిని రెండవ భాషగా నిర్ణయింపవలయును. ఇట్లది ప్రతిదేశమునందును రెండవభాషగా నేర్పఁబడినందున మిక్కిలి యభివృద్ధినంది తుదకు సామాన్యభాషగా నిర్ణయింపఁబడును. అందువలన వేర్వేఱు భాషలు గలవారు తమ భాషలయందలి గ్రంథరాజంబుల నీ సామాన్యభాషలోనికి సుగమముగా భాషాంతరీకరింపవచ్చును. ఇప్పుడు సంస్కృతభాష నేర్చుకొనుట కష్టముగా కన్పించుచున్నది గాని, అదియే సామాన్యభాష యైనచో మిక్కిలి సులభముగా కన్పించును. తత్కారణమున నది హిందూదేశమునం దంతట సామాన్యభాషగాను అందలి గ్రంథజాలంబు లన్నియు సామాన్యగ్రంథములుగాను పరిగణింపఁబడఁగలవు. తద్ద్వారా మనవారు విజ్ఞానము నెక్కుడుగా పరిగ్రహింపఁగల రనుట యతిశయోక్తి కానేరదు. కావున, అది హిందూవిద్యాలయములయందు తప్పక రెండవ భాషగా నిర్ణయింపఁబడవలయును.

(3) హూణభాష — ఇది మన విద్యాశాలలందు మూఁడవ భాషగా నేర్పఁబడవలయును. ఇది కూడ మనకు అవసర మగు భాషయే! ఏల యన, విఖ్యాతవిదుషీమణులును రాజకార్యధురంధరులును అగు విదేశనారీమణుల చరిత్రంబులును జ్ఞానోపార్జనమునకు వలయు ముఖ్యసాధనము లనేకములును ఈ భాషయందు కలవు. ఇంతేకాక ఈ యమూల్యజ్ఞాన సంపత్తియూ నే బి. ఏ., ఎమ్. ఏ. పరీక్షలకో చదివిన విద్యానిధు లగు కొలఁదిమంది నారీమణుల సొమ్ము మాత్రమే యగుచున్నది. తదితర లగు హూణభాష మొగమే యెఱుఁగని స్త్రీసామాన్య మీ భాషయందలి జ్ఞానమును గ్రహింపఁగలుగు టెట్లు? మఱియును, ఈ భాషయం దొక యాంగ్లేయగ్రంథములు మాత్రమే కాక, ఫ్రెంచి అమెరికా రుష్యా మున్నగు పాశ్చాత్యదేశములందలి సుప్రసిద్ధు లగు మహాకవులు రచించిన యమూల్యగ్రంథము లనేకములు భాషాంతరీకరింపఁబడియున్నవి. అందువలన ఆ భాషల నన్నిటిని గ్రహింపఁజాలకపోయినను, అందలి యమూల్యగ్రంథరత్నంబులం బఠించి యందలి విజ్ఞానామృతము గ్రోలుటకు మన కవకాశము కలుగఁగలదు. అదియును గాక, ఈ యాంగ్లభాష ప్రస్తుతము దేశమునం దంతటను వ్యాపించి సామాన్యభాషగా పరిగణింపఁబడుచున్నది. అయిన నది యొక్క పురుషులయందే కాని స్త్రీలయందు కాదు. ఏల యన, 10–12 వత్సరములు వచ్చుటకే మనవారు ఆఁడుబిడ్డలను బడికి పంపుట మానివైచెదరు. ఇఁక వారు చదువుట కవకాశ మేదీ? పాఠశాలలయందు వీరు చదివినంత కాలము ఏ బీ సీ డీ లో తప్ప, ఇంగ్లీషు చదువే రాదు. ఇఁక వీరు చదువు టెట్లు? ఒకవేళ నే నాల్గు ముక్కలో చదివినను అది మాతృభాష నణఁగఁద్రొక్కుటకే ఉపయోగపడుచున్నది. కోఁతికి కొబ్బరికాయ దొరకినట్లు ఎక్కడనో రాకరాక ఒకరిద్దరు ఇంగ్లీషుభాష నించుక నేర్చుకొన్నచో, ఇఁక నెక్కడఁ జూచినను ఇంగ్లీషే. వంట చేయునప్పుడు నింగ్లీషే. మంచినీళ్లు తెచ్చుకొనునప్పు డింగ్లీషే. భోజనము చేయునప్పుడు నింగ్లీషే. ఈ సమయ మా సమయ మన నేల? ప్రతిమాటయు నింగ్లీషే. వీరి యింట నిఁక స్వభాషతో మాట్లాడువారే యుండరు. ఇఁక వీరి గృహ మింగ్లీషు గృహము. ఈ యింగ్లీషు భాష కొంచె మభ్యసించినందులకే మాతృభాషను మఱచిపోవుచున్నారు. హూణవిద్యాభ్యాస మిందులకా? భాషాభివృద్ధికిఁ జ్ఞానాభివృద్ధికిని గాని మాతృభాష నణఁగఁద్రొక్కుటకు కాదు. అందువలన దేశము హీనస్థితిని పొందునే కాని, అభివృద్ధి చెందదు. కావున, హూణభాషాభిజ్ఞు లగు నో దేశీయ సోదర సోదరీమణులారా! దేశాభివృద్ధియు విద్యాభివృద్ధియు కలుగఁజేయుటకు మాఱు మాతృభాషను మఱచిపోవుచున్నా రేల? హూణభాష దేశాభివృద్ధికిని విద్యాభివృద్ధికిని సహకారిణి కావలయునే కాని మాతృభాష నణఁగఁద్రొక్కఁగూడదు. ఇఁక నయినను హూణభాషాభ్యాసమువలన మాతృభాషను మఱచిపోయి దేశమాతను దేశీయులకును విచారంబును గౌరవహానిని తేకుందురుగాక!

ఇట్టి సంస్కార మొక్క స్త్రీపాఠశాలలకే కాక పురుషపాఠశాలలకుఁ గూడ ఆవశ్యకము. కాని, చివర కెట్లు పరిణమించిననూ జ్ఞానసంపాదనార్థము కాకపోయినను ఉదరపోషణార్థ మని తలఁచి, అయిదా ఱేండ్ల యీడు వచ్చినప్పటినుండియు మగపిల్లలకు మాత్రము మనవారు శ్రద్ధగా విద్యాభ్యాసము చేయించుట యాచార మిప్పటికిని మన దేశమునందుఁ గలదు కదా? అందువలన వా రట్లయినను కొంత కాకపోయిన కొంత యుఱుకను చదువఁగల రనియును తత్కారణమున వారు జ్ఞానవంతులై సంచరించినను సంచరింపకపోయినను వారికి జ్ఞానము నార్జించుటకుఁ దగిన సామర్థ్య మలవడఁగల దనియును చెప్పవచ్చును. అట్టి సంస్కారము పురుషుల పాఠశాలలయందే జరుపఁబడినచో నిఁక వేఱే స్త్రీవిద్యాసంస్కరణ మవశ్యమే కాకపోవచ్చును. కాని, అంతవఱకు మాత్రము ముఖ్య

ముగా నీ స్త్రీవిద్యావిధానమును మార్చి నూతన విధానము నేర్పఱచుట మిక్కిలి యావశ్యకము. విద్యావిషయముయొక్క యమూల్యతను గ్రహించుటకును జ్ఞానము నార్జించుటకును ముఖ్యసాధనము మాతృభాష. సామాన్యముగా బోధించెడి జ్ఞానమంతయు నీ భాషయందే బోధింపఁబడవలయును.

సామాన్యముగా ప్రతి పల్లెయందును బాలికాపాఠశాల లుండవలయును. అందు కొలఁది తరగతులను మాత్రమే నిర్ణయింపవలెను గాని యందు నిర్ణయించెడి పఠనీయగ్రంథములలోని యంశములు జ్ఞానప్రబోధకములై యుండవలెను. బస్తీలయందింకను పెద్ద పాఠశాలలను స్థాపింపవలయును. అవి యే డెనిమిది తరగతులు కలిగి యుండవలెను. విద్యాపద్ధతి కూడ ఆయా పాఠశాలల కనువగునట్లు నిర్ణయింపవలెను. పట్టణములయందున్నతవిద్యాభ్యాసమున కనువగు కళాశాల లుండవలయును. అనఁగా వైద్యశాస్త్రమును ప్రకృతిశాస్త్రములును దేశచరిత్రములును పఠనీయములుగా నిర్ణయించి బి. ఏ. ఏమ్. ఏ. మొదలగు పట్టపరీక్షలీ కళాశాలలయందు నిర్ణయింపవలయును. అందు కృతార్థ లగు సతీమణులను గొప్పపట్టములచే సముచితముగ గౌరవించి సత్కరింపవలయును. సాధ్య మగునంతవఱకు ఆయా పాఠశాలలయందిట్టి యువతీమణులనే యుపాధ్యాయినులుగా నిర్ణయించి పురుషులు వాని యభివృద్ధికి సర్వవిధముల తోడ్పడుచుండవలయును. అటులైనచో, ఎంత రాణివాసము గల గొప్ప యింటివారి యాఁడుపిల్లల నయినను ఈ పాఠశాలలకు పంపుట కే విధ మయిన యాటంకము నుండఁజాలదు. మఱియు, మనలో వైద్యశాస్త్రప్రవీణ లగు యువతులు మిక్కిలి తక్కువగా నున్నారను సంగతి జగద్విఖ్యాతమే. అందువలన మన స్త్రీల నాంగ్లయువతుల వైద్యశాలలకుఁ గాని మగవారి వైద్యశాలలకుఁ గాని కొనిపోవలసి వచ్చుచున్నది. కాని, యిట్టి వైద్యశాస్త్రమును మనవారే యభ్యసించి వీరే డాక్టరు పరీక్షయందుత్తీర్ణ లగుచో, డాక్టరు పదవి నంది వైద్యశాలల స్థాపించి మన దేశీయసోదరీమణుల కమితోపకారము చేయవచ్చును గదా? ఏదీ? ఇంతవఱకు అట్టి భాగ్యము మన కేదీ?

ఇంతటితో మన సంస్కరణము పూర్తి కాదు. ఏలయన, ఇదివఱకు విద్యయందంతగా నభిరుచి కలుగని మన దేశీయులు, అట్టి పాఠశాలలను నిర్ణయించినను, సాహసించి తమ బాలికలను పాఠశాలలకు పంపుట కింకను సంకోచించుచునే యుందురు. అందువలన ధనవ్యయము హెచ్చినను విద్యాభివృద్ధి హెచ్చదు. కావున, సుప్రసిద్ధు లగు బరోడా మహారాజు గా రవలంబించిన యత్యంతశ్లాఘనీయ మగు పద్ధతిని మన పాఠశాలలయందు ముఖ్యముగా నుంచితీరవలయును. అదేది యనిన, విద్యాభివృద్ధికి మూలసాధనము లగు నిర్బంధవిద్యయు ఉచితప్రాథమికవిద్యయు. ఈ రెండును మన విద్యాశాలలయందత్యంతావశ్యకములు.

ఉన్నతాభ్యాసమునాఁడే చదువు మాని యింటియందయినను పుస్తకము చదివిన నెఱుఁగుంచుకొను సోదరీమణిని గుఱించియు నభిలాష యున్నను తీరిక లేక చదువఁజాలని సోదరీతతిని గుఱించియు చిన్ననాఁడు తల్లిదండ్రు లసలే విద్య చెప్పింపనందున అక్షర మెట్టిదో యెఱుఁగని సోదరీతతిని గుఱించియు కొంత యాలోచింపవలసి యున్నది. విద్యావిహీన లగు నీ సతీమణులు జ్ఞాన మార్జించుట కేమయిన మార్గము లున్నవా? పట్టుదల గలిగిన స్త్రీవిద్యాభిమానులున్నచో మార్గముల కేమి కొదవ! అనేకములు గలవు. అందు ముఖ్యసాధనములు: (1) గ్రంథాలయములు (2) సంఘములు.

ఒక దిన మయినను విశ్రామము లేకుండ ఎంత తీరిక లేకపోయినను ఎట్లో యొక గంట కాలము తీరిక చేసికొని మన స్త్రీలు పెత్తనము లనిన చెవి గోసికొందురు. "యల్లమ్మగారింట గోంగూర వండినారు. పుల్లమ్మగారింట పులుసుకూర వండినారు"— అను రాజకార్యములకు మితియే యుండదు. వారమున కొక్క దిన మయినను విద్యావిషయికప్రసంగము చేయుచు జ్ఞానము నార్జించుటకు వీరికి బుద్ధి పుట్టదు. అట్టివారికి విద్యయందభిరుచి పుట్టించుటకే ముఖ్యముగా గ్రంథాగారములును సంఘములును కావలసియున్నవి. వారమున కొకమాఱయినను సమావేశ మగుచుండినచో నీ రీతిగా నయినను ఒక రార్జించిన జ్ఞాన మొకరికి చెప్పఁగలుగుటయే కాక విద్యాభివృద్ధియు హెచ్చును. విద్యాధిక లగు స్త్రీ లందఱును సద్విషయములను చర్చించుచుందురు; విద్యావిహీనలకు పఠనప్రసంగరూపముల బోధించుచుందురు. ఇట్టి రెండంశములును విద్యాభివృద్ధికిని దేశాభివృద్ధికిని మిక్కిలి సహకారిణులే. స్త్రీవిద్యాగ్రంథాగారములు సామాన్యముగా ప్రతి పల్లెయందును నుండవలయును. అట్లు స్థాపించుటకు వీలు లేని గ్రామములందు స్త్రీపురుషుల కొకటే గ్రంథాలయమును స్థాపించి యా గ్రంథాలయమువలని యుపయోగములను స్త్రీపురుషులు సమముగా పొందునట్టి యేర్పాటుండవలయును. తక్కిన గ్రంథాలయము లన్నియు పురుషులకువలెనే స్త్రీలకును తగినన్ని యుండవలయును. విద్యాలయములవలెనే గ్రంథాలయములు కూడ పల్లెలయందు చిన్నవిగను బస్తీలయందు పెద్దవిగను పట్టణములందు మరియు గొప్పవిగను నుండునట్లు నిర్ణయింపవలయును. గొప్ప గ్రంథాలయములకు కొలఁది గ్రంథాలయములు శాఖాగ్రంథాలయములుగా నుండవలయును. చిన్న గ్రంథాలయములయందు లభింపఁజాలని గ్రంథములు పెద్ద గ్రంథాలయములయందు లభించునట్టి యేర్పాటుండవలయును. ఇట్టి సంఘస్థాపన గ్రంథాలయోద్యమముల వలన స్త్రీవిద్యాభివృద్ధి త్వరితముగా హెచ్చఁగలదు.

పూర్వీకు లగు సీత దమయంతి ద్రౌపది మొదలగు పవిత్రసతీమణు లందఱును ఇప్పటి మన స్త్రీలవలె విద్యావిహీన లై జ్ఞానశూన్యలై యింటఁ గూర్చుండిరా? ఎందఱెందఱు విద్యాధురంధర లై యశేషశాస్త్రజ్ఞానము గల్గి తమ పతులతో రాజసభలకుఁ గూడ నరుదెంచుచు, తమ పతుల కనేకవిధముల సహాయ లగుచు, ఘనరాజకార్యముల నిర్వర్తింపలేదు? ఎందఱెందఱు మహావిపత్సమయములందు తమ పతులకు తోడునీడలై ప్రవర్తించుచు ధైర్యము విడువక కష్టములను సహించి విద్యాప్రభావముచే మహావిపత్సాగరముల నెన్నిటి నీఁదలేదు? అట్టి మహాపతివ్రతాతిలకములు గనుకనే వారు "కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ" యన్న వాక్యమును సార్థకపఱచిరి. కాని, యిప్పటి కాలమున నట్టి స్త్రీరత్నము లేరీ? ఉన్నను ఎక్కడనో? నూటికి కోటికి నొక్కరు కాని. దైవానుగ్రహమున్నచో మరల మన హిందూదేశము యథాగతి నున్నతస్థితికి రాకమానదు.

# జీవము—దేహము

చిట్టావూరి కామేశ్వరరావు గారు

మహితసౌందర్యలక్ష్మీకుమారి! వికసి
తారవిందాయతాక్షి! యనారతంబు
సొంతోరులఁ బాయక ముదంబు నొందినాము;
భేద మెఱుఁగక యుంటిమి; నీదు చెలిమి 4
వలనఁ బుట్టిన దాది నేఁ బడసినట్టి
సౌఖ్య మనుపమానము కదా? సరభసమున
కటకటా! మాల దైవంబు కఠినమతిని
నిటులు చేయు నటంచు నే నెన్న నైతి 8
నతనివారల మతని నే మనఁగఁగలము?
ఎంత దురపిల్లినను మార్గ మింత యైన
వెలుఁగు సూపదు; భారము తొలఁగిపోదు
దుఃఖ ముడుగదు, కన్నీరు తుడిచికొనుము 12
చారుశారదచంద్రికాసదృశ మైన
ప్రేమపాశంబు లాఁగ నిన్ విడువలేక
పోవుచున్నాను; దూరము పోవవలయు
తనులతా సెలవిచ్చి న న్ననుపు మమ్మ! 16

* * * *

"హా! ప్రవిమలాత్మ! రమ్యగుణాలవాల!
మెలఁగినారము సంతోషకలితుల మయి
మనకు నెనవచ్చువారము మనమె యంచు
మనమునందునఁ దలపోసి మనితి మెప్పుడు 20
వింత వృత్తాంత మేదేని వినెడు వేళ,
తియ్యనిది వస్తు వేదేని తినెడు వేళ,
అంచితస్థలములం విహరించు వేళ,
సత్సంగతులను సర్వసమయములకు 24
నీవు నే నను భేదము నెఱుఁగకుండ
ననుభవించినారము కద? యక్కటకటా!
నన్ను విడనాడి పోయిన నాకు దిక్కు
కలదె? యుండఁగలవె యొక క్షణము నీవు? 28
ప్రేమమూర్తివి! తగునె యీ విధము నీకు?
జీవమా! నన్ను విడనాడి పోవలదు!"

* * * *

"మనము పొందిన సౌఖ్యముల్ స్మరణ చేసి
యధికచింతాభరంబున నణఁగుటఁ గని 32
జాలి తలపోసి రక్షింపఁజాలఁ డెవఁడు!
చీమ దూఱని కానన సీమ నడుమ
కమ్మతెమ్మెర లీను సుమమ్ము కొన్ని
దినములు కదా వికాస మొందును మృగాక్షి! 36
కడవ కొలంది కన్నీరు గార్చవలదు!
నిటిబుగ్గ సంసార మి దేటి కమ్మ!
నన్ను మన్నింపుమమ్మ! యానన్న మయ్యె
కాల మది మీఱరానిది గాన వేగ 40
తనులతా! సెల విచ్చి న న్ననుపు మమ్మ!"

* * * *

"అల దినంబున రమ్యహర్మ్యాంతరమున
ముద్దుగుయ్యెలలందున మురియునపుడు
నీవు నన్నుఁ బాయు నటంచు నెన్నినాను 44
ప్రాణనాథుఁడు ప్రమదావనాంతరమున
ద్విగదతుండగుచుఁ దలపించు కరముతోడ
ప్రేమ పైకొన ననుఁ జేరి వివిధగతుల
కౌఁగిటను జేర్చి ముద్దాడఁగడఁగునంత 48
లేని కోపముఁ జూపి, యాశ్లేషసుఖముఁ
బాసి ప్రణయాధు కుమారి నెపు చూపెంత యైన
నీవు ననుఁ బాయుదు వటంచు నెన్న లేదు
మారసుకుమారుఁ డైన కుమారుఁ జేరి 52
కాతురోక్తుల నొప్పంగ హృత్కమలమందు
ముద్దుగొను వేళ నీవు నిర్మోహమునను
నన్ను విడనాడుదు వటంచు నెన్న లేదు!

అపుడు నాయందుఁ గలిగిన కృప కృశింప 56
నేల? నుత్ప్రార్థనము విన, నేమి సేతు?
జీవమా! నన్ను విడనాడి పోవవలదు!"

* * * *

"నీవు పేర్కొన్న సుఖములు నిష్ఫలములు
జలధి నూగాడు చంద్రాంశములు కదమ్మ! 60
కలిమి జవరాలు నివసించు గదులు గాంచి
విలువ యెఱుఁగని రత్నకంబళము లెంచి
పలుకు నని తోఁచు పలు చిత్రపటము లరసి
భాసురము లగు మెత్తని పాన్పు లెన్ని 64
కాంతులను జిమ్ము మణిదీపకళికలు గని
కార్పవలదమ్మ! కన్నీటి కణము లిట్లు
మించు మించులు గాని, సముంచితములు
గావు; వానికై యత్నంబు కాని వావి! 68
కాన, నేఁ బోదు తప్పదు గాన వేగ
తనులతా! సెల విచ్చి నన్ననుపు మమ్మ!"

* * * *

"పోయెదే? — పోయెదే? ననుఁ బాయ ననుచు
నమ్మియుంటిని! నిజముగా నన్ను విడిచి 72
పోయెదే? — పోయెదే? యోఁగి పోయి యుందు;
మధురమధురసామృతము సమ్మదయుతంబు
నీదు నామంబు మఱవంగరాదు నాకు
జీవమా? కరుణింపుము పోవకమ్మ" 76

* * * *

"ఎంత చెప్పిన వినవు నే నేమి సేతు?
పోవవలె నన్న పోవుట, పోవవలవ
దన్న పోవకుండుట మనయిచ్ఛ లేదు;
ఎచట కష్టంబు లనునవి యెఱుఁగరావొ? 80
ఎచట సంతోష మొందుమో యిష్టలీల?
ఎచట జరయు మృతియు బలహీన మగునో?
అట నివాసము సేయంగ నరుగుదాన
తనులతా! సెల విచ్చి నన్ననుపు మమ్మ!" 84

* * * *

"అయ్యయో! నా విలాపము లన్నియును భవ
దావహారణ్యరోదన మయ్యె; నేమి
సేయుదును?—జీవమా! నిలు....."

* * * *

"......పోయివత్తు!"

* * * *

"మఱల నినుఁ జూడఁగా నొక్క మాఱు..." 88

* * * *

"అకట!—
దుర్లభం బది కావున దుఃఖ ముడుగు!"

* * * *

"మరల నొక సారి కన్నుల కఱవు దీర
నిన్నుఁ గనుఁగొను భాగ్యము సున్నయేన?"

* * * *

"ఔను — తనులతా! సెల విమ్ము! వ్యవధి లేదు" 92

* * * *

"జీవమా! — జీవమా! నీవు పోవ — వలదు!"
"పోవవల దన్నఁ దప్పునే?—"

* * * *

"పోవ—వలదు—"

* * * *

"సెలవు! తనులతా! —"

* * * *

"జీవమా! వలదు! — వలదు!"

* * * *

"సెలవు! తనులతా!—"
"జీవమా!—"

* * *

"— సెలవు!—"

* *

"సెలవు" 96

*

# దేశభక్తి

ఎర్నేని సుబ్రహ్మణ్యము గారు

జాతీయ ప్రబోధలహరి యిప్పుడిప్పుడే సాగుచున్నది. దశదిశల విద్యాసంస్కారబీజము లంకురించుచున్నవి. ప్రతి వ్యక్తియు 'ఇది నా దేశము, ఇది నా సంఘము' మను వివయప్రబోధమున విరాజిల్లుచున్నది; "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" యను సూక్తిని కీర్తింపఁ బ్రయత్నపడుచున్నది. ఆ పవిత్రసంకీర్తనాలాపమే దేశీయుల కర్ణపుటభేదము గావించి నూత్నోత్సాహ తరంగమాలికలతో దేశాభ్యుదయ కార్యములకు పురికొల్పుచున్నది. ఎల్లరకు ముప్పదు పిల్లలు గలరు? నవమాసములు మోసి కష్టనష్టములం బొల్గొని యుగ్గుపాలనుండి హృదయకేదారమందు నీతిబీజములనే నాటు మాతృదేవి యొక తల్లి. శైశవమునుండి జాతీయధర్మములను సమున్నతాదర్శములను నుద్బోధించు స్వభాష మఱియొక తల్లి. జీవితోపాధి కన్నపానాదు లొసంగి సుఖసంతృప్తచిత్తునిఁగఁ జేయు మాతృభూమి వేఱొక జనని. మధ్యమాసియా ధ్రువసమీపవాస్తవ్యులు సైతము 'మా జనపదంబుల కీడు జానపదంబు లీ జగతిం గలవా?' యని మురియుచున్నారు. అట్టితఱి సస్యశ్యామలశోభితమై, సర్వసౌఖ్యసంధాయకమై భాగ్యభోగ్యములకు మునింగొను బంగారమై దైవారు నార్యావర్తదేశమందే యార్యుఁడు మాతృదేవతారాధన సల్పకుండును? పవిత్రభావములతో వినిర్మలపూజాపునస్కారములతో హృదయపుండరీకపుంజములతో మాతృదేవిని పూజించుటకంటె భారతీయునకు వేఱొక పవిత్రధర్మమేమున్నది? అంతకంటె ఈశ్వరశాసనమేమున్నది? ప్రకృతరాష్ట్రాందోళనములు రాజ్యాంగసమస్యలు సమితిసభలు ప్రజాందోళనములు మొదలగునవి యన్నియు స్వదేశాభిమానసంజనితములే కదా? ఒకప్పుడు దేశాభివృద్ధిపథమునకై దుర్భగవిపత్సాగరము నిర్గమించుటయ కాదు, ఏదేని ధర్మకార్యనిర్వహణాకాంక్ష సర్వస్వమును ధారవోయుట గాదు, దేశ[illegible]మాంగల్యమునకై ప్రతినిమేషము మాతృదేవి పాదకమలముల సమీపమున తన శక్తియుక్తుల సమర్పింప సంసిద్ధుఁడై యుండవలెను. అప్పుడే నిగూఢతేజశ్శక్తులు విజృంభింపఁగలవు. ప్రాచీన హైందవసామ్రాజ్యనిర్మాణకర్తలగు శివాజీ మొదలగు వీరశిఖామణు లేమి, జాతీయజీవనోద్ధారకురాండ్రగు దుర్గావతి రుద్రమదేవి మొదలగు హైందవకాంతామణు లేమి, నిత్యసంస్మరణీయులు గదా? ఒక వృద్ధమాత రుష్యా జపాను యుద్ధసమయమున లేకలేక కల్గిన తన ముద్దుకొమరుని యుద్ధోన్ముఖునిఁ గావింప, తత్సేనాని యసహాయురా లగు నతని తల్లి సెలవుఁగుటచే నాబాలుని ప్రార్థన త్రోసిపుచ్చెను. తన బిడ్డచే విద్యుత్ప్రాణాంతం బరసి యా వృద్ధమాత కట్టెమట నన్న కంపాలమున పొడుచుకొనుచు క్రింది విధమి విడెగా వ్రాసెను! "నీ స్వేచ్ఛాభంగము గావించిన యభాగ్యురాలను. ఇప్పుడా యిద్దు తీగినది. కావున, కవచమునకుం జని నీ స్వదేశ సంరక్షణకై నీ ధైర్యస్థైర్యములఁ బ్రకటించి ధన్యుఁడవు గమ్ము."

ఆహా! చూచితిరా? ఆమె తన యేక పుత్రునికంటె దేశమునే యెక్కువ ప్రేమించినది, ఆ ప్రేమావిశేషమును బోధించినది. అట్టి పవిత్ర మాతృగర్భసంభవులు దేశభక్తులు గాక స్వార్థపరులెట్లగుదురు? దేశభక్తిప్రేరితమగు నవశక్తియే భీరులను ధీరులనుగను ఉత్సాహరహితులను సోత్సాహసహితులనుగను లోభులను నుదారదాతృత్వపరులుగను చేసి, వారిని ప్రపంచాభివృద్ధి నాటకరంగమున పాత్రోచితముగ ప్రవర్తింపఁజేయుచున్నది. సాంఘిక రాజ్యాంగవిషయవిమర్శన బహుజనవ్యతిరేకమైనను కష్టనష్టాపాదకమైనను, దానిని నిరాఘాటముగ సధైర్యముగ సహేతుకముగ స్వీకరించుటయే పురుషలాంఛనము, నాయకచిహ్నము. ఇట్లు దేశీయనాయకులు నిష్పక్షపాతులై స్వలాభాపేక్షరహితులై ప్రజాప్రయోజనములను గనునించి సోదరసేవ సల్పుచున్నచో, ప్రజలు వారిని పూజించుట భూషించుట ప్రేమించుట నిక్కమము రథ్యయు సహజము. ప్రేమయుండనే ప్రేమ ప్రజ్వరిల్లును. విశ్వాసమునందే విశ్వాసము వికసించును. ఇట్టి ప్రేమతత్త్వము నేదేశమందే దేశవాసులు కాంక్షింతురో, ఆ దేశము ఆ జాతి క్షిప్రగమనమున నుచ్ఛదశం బడయఁగలదు; మోక్షసామ్రాజ్యమును బొందఁగలదు. ఏఁబది సంవత్సరముల క్రిందట అజ్ఞానాంధకారబంధురమై యున్న జపానుదేశమున ఈ యపూర్వ తేజోరేఖ మెఱసినది, మెఱయుచున్నది. దేశము జ్ఞానవంతమైనది. భాగ్యవంతమైనది. పరిశ్రమలకు పుట్టినిల్లయినది. లాతి దేశముల కాదర్శనీయమైనది. ఇంతియేల? దేశచరిత్ర పఠింతుమేని, నాఁటి స్వదేశాభిమానము స్వాతంత్ర్య సంరక్షణాపేక్ష తేటతెల్లమగును. కావున దేశభక్తియొక్క సంపూర్ణోజ్జ్వలతకు కారణసాధనముల తెలిసికొనుట యవశ్యము.

## విద్యాలయములు

మానవబుద్ధి సంస్కారమునకు విద్యాలయము లవశ్యములు, దేశాభివృద్ధికి ప్రధానసాధనములు. పాఠశాలలందు దేశభాషలకు ప్రాముఖ్యత నియ్యవలెను. అందలి యుపదేశాంశములు దేశభక్తిద్యోతకములై నీతిప్రదములై జ్ఞానోద్దీపకములై యుండుట శ్రేయస్కరంబు. దేశశుభాశుభములు విద్యార్థుల యధీనములు. విద్యార్థివికాసమే దేశాభ్యుదయమునకు మార్గదర్శకము. ఈ వికాసము సర్వతోముఖపరిజ్ఞానము గల్గి సకలసద్గుణాలంకారశోభితులగు నుపాధ్యాయులందే [illegible] యున్నది; వారి [illegible] బహిర్గతము కావలసియున్నది. చిన్ననాఁటి భావలేశములే భావిజీవితమున చిగిర్చి పుష్పఫలభరితములై విరాజిల్లుచుండును. వ్యక్త్యాత్మాభివృద్ధిసాధమునకు సుదృఢమగు పునాది యనఁ బరఁగు విద్యార్థిదశయందట్టి విషయములు గ్రహించుట విద్యార్థివికాసమునకును దేశసౌభాగ్యమునకును ముఖ్యతమము. ఈ తత్త్వము గ్రహించియే నాగరకాగ్రగణ్యములగు జర్మనీ ఫ్రాన్సు ఇంగ్లాండు మొదలగు దేశములు పాఠశాలలందు జాతీయ వికాసకారకము లగు పద్ధతుల నవలంబించి విద్యార్థులను భావ్యభివృద్ధి పురోగాములుగ నొనర్చుచున్నవి. కనుకనే ఆ దేశములును ఆ దేశీయులును మహోన్నత్యమున తులదూఁగుచుండు. మన దేశమందున్ననో, అట్టి కథా [illegible] పూజ్యము! శోచ్యము! దుర్భాగ్యము! ప్రభుత్వ పాఠశాలకము స్వల్పము. ప్రజా పాఠశాలలు సున్న. ఇతర దేశము లాగుననే యెట్లు? దేశీయుల హృదయసదనములంగు నిరుపమానమగు జ్ఞానజ్యోతి ప్రకాశింపవలెను. అప్పుడు ప్రజలు తమ కార్యములను స్థాపించుకొనఁగలరు. దేశము సనాతనోన్నత్యశిఖరం బలంకరింపఁగలదు. ఆ జ్ఞానజ్యోతిచే నిగూఢశక్తులు తేజరిల్లి శరీరపటుత్వ మానసిక క్రియాపరత్వ మూలమున పురుషస్వరూపమును ధరింపఁగలవు. విద్యలవిడి జాతీయ వికాసకారకములగు విద్యాలయములను ప్రతిపట్టణమందును ప్రతిగ్రామమునందును స్థాపించినం గాని, దేశమాతయొక్క శరీరదౌర్బల్యమునకు హేతుభూతములగు దుర్భిక్షలు మహామారులు మొదలగు సర్వానర్థకసాంప్రదాయములను గుర్తెఱింగి వర్తింపలేము. ఈ సద్భావముచేతనే

ఆంధ్రమహాజనుల కామితార్థసిద్ధి కవశ్యమైన యాంధ్రవిశ్వవిద్యాలయమునకై దేశీయులు ఏకభావముతో ఏకకార్యదీక్షతో తపోనిమగ్నులై యున్నారు. ఆ తప స్సెప్పుడు సిద్ధించునో, ఆ యానందమునకై ఆ సౌభాగ్యమునకై ఆ సౌఖ్యసంపదకై ఆంధ్రలోకము వేచియున్నది.

## స్వదేశవస్తుస్వీకరణము

ప్రాచీప్రతీచీసంయోగఫలితములు పైమెఱుంగులె కాని వినిర్మలాత్మాభివృద్ధిపథమునకు కంటకప్రాయము లగుచున్నవి. కొందఱు విద్యార్థులు గూడ మన జాతీయధర్మతత్త్వముల నెఱుంగక, ఆ పైమెఱుంగుల నభిలషించుట కడు సంతాపకరము. పైమెఱుంగులం గోరుట నీచలక్షణము. ఆత్మశుద్ధియే యుత్తమలక్షణము. ముకుళితమగు మల్లెమొగ్గ చిత్తవికాస మొనర్పఁజాలదు. అందలి సాంకేతిక సౌరభశక్తియే నాసికాపుటముల వికసింపఁజేసి భ్రమరకీటకాదులం గూడ నాకర్షింపఁగలుచున్నది. కాంతివిహీనమై రాతివలె నున్న రత్నము నజ్ఞాని గులకరాయిగ భావించుచున్నాఁడు. దానినే విజ్ఞుఁడు మణిగ నెఱింగి సంస్కరించి దానియం దప్రమత్తత వహించుచున్నాఁడు. ఇట్టి సారాసారవిచారణాదూరుల మగుటం జేసియే మన యాచారములందును మన సారస్వతమునందును నిరసనభావ మంకురించుట. ఈ భావమే స్వదేశవస్తువులందుఁ గూడఁ గన్పట్టుచున్నది. విదేశవస్తువస్త్రాద్యలంకరణము మెండైనది. కామధేనువు పెరటియందుండ, పరులపంచకు పాలకై యరుగుటకంటె నికృష్టమును జడత్వమును వేఱొండు గలదా? స్వదేశవస్తువులందు నిరాదరణ నిరసన హ్రస్వదృష్టి ప్రతిపాదింపఁబడినవి. ఈ మారణాస్త్ర మెప్పుడు ప్రయోగింపఁబడినదో మన కళలు నశించినవి. శిల్పము లడుగంటినవి. వృత్తు లంతరించినవి. వాణిజ్యవ్యాపారము వలసదేశముల కేఁగినది. మన ధనప్రవాహము జర్మనీ ఇంగ్లాండు అమెరికా ఆస్ట్రేలియా మొదలగు దేశములను ముంచివేయుచున్నది. దేశము నానాటికి క్షామములకు గుఱి యగుచున్నది. మహామారి ప్లేగు కలరా మున్నగు రోగదేవతలు పిలిచిన పలుకుచున్నవి. కాని, భారతజాతి నింతవఱకు సంపూర్ణముగ మాంచెస్టరు మల్లుబట్టలకును బెల్జియము చెక్కులకును కోలెం దున్నిబట్టలకును గుఱిగా నుండఁ జేసినవి మన భిన్నభిన్నమతములే భిన్నభిన్నాచారములే, భిన్నభిన్నరుచులే యని గట్టిగ నమ్ముఁడు. పరిశ్రమలకు పుట్టినిల్లగు దేశమే పరిశ్రమలను పరమావధిగ నెంచిన జాతియే మహాద్దశ ననుభవించుచుండును. "పిట్టపోరు పిట్టపోరు పిల్లి దీర్చిన" భంగిని జర్మనీ ఆస్ట్రియా ఇంగ్లాండు దేశములు యుద్ధమున పరిపూర్ణవిజయమునకై నిరీక్షించుచుండ, ఇదియే సందని తలంచి జపాను తన రాష్ట్రములందు నెలకొల్పిన పరిశ్రమలకు గట్టి పునాది వేయుటకై నిరంతరప్రయత్నమున మంచిచెడ్డల నరయక వస్తుసృష్టి చేసి మన దేశమును నింపుచు ధనమును కొల్లగొనుచున్నది. ఆహా! ఈ దాహలకు ఈ ప్రవాహములకు హిందూదేశ మెంత కాల మడ్డుపడఁగలదు? ఓ మహాజనులారా! ఓ దేశీయులారా! యార్తవిలాపము మీ శ్రవణపుటములఁ బ్రతిధ్వనించుట లేదా? మేల్కొనుఁడు, మేల్కొనుఁడు! ఇదియే మంచి తరుణము! లెండు, లెండు! మీకు స్వదేశవస్తువులందును వసనములందును చూపుచున్న నిరాదరణ హ్రస్వదృష్టి విదేశవస్తువులం బ్రయోగించినచో ఇంతవఱకే మన వృత్తులు మన పరిశ్రమలు ప్రతిష్ఠాపితములై వెలసెడివి. కాని, యీ భాగ్య మబ్బకుండుట చింతాకరము. విద్యార్థులారా! విదేశవస్తుప్రతిఘటనచే నీల్గిన వృత్తులను పునర్జీవింపఁజేయుఁడు. దేశాభివృద్ధికరము లగు నూతనపరిశ్రమలను సృజించి మీ కర్మశీలత్వమును దేశానురక్తిని మీ త్యాగమును వ్యక్తపఱుపుఁడు. దేశీయులారా! మీ శక్తికొలఁది వారికి తోడ్పడి స్వదేశవస్తువులను స్వీకరించి ప్రేమించి పూజించి ధరించి మీ దేశభక్తిని ప్రకటించి ఆ మాతృదేవి కృపాపారసదృష్టికి పాత్రులు గండు. అదియే స్వరాజ్యలబ్ధోపకరణ మని ముమ్మాటికి నమ్ముఁడు.

## జాతీయోత్సవములు

జాతీయనాయకోత్సవములు దేశభక్తప్రేరితములు, జాతీయవికాసభాసురములు, ఉత్సాహజనకములు. ఆయా యుగములందు ఆయా జాతుల నుద్ధరించుటకై వీరులు ధీరులు శూరులు కవికతంసులు మతప్రవర్తకులు సుజ్ఞానులు అవతరించి మానప్రాణముల నర్పించి మాన్యపురుషులైరి, యశోవంతులైరి. అట్టి యవతారపురుషుల యాదర్శములు సర్వోత్కృష్టములు, భావములు సువిశాలములు. అవి దీర్ఘదృష్టిప్రకటితములు. సంకల్పము లమోఘములు. కార్యనిరతి ఫలవంతము. ఆ యాదర్శములు ఆ భావములు ఆ సంకల్పములు ఆ కార్యదీక్షాఫలసిద్ధి జనసామాన్యమునకు రాచబాటలై మార్గదర్శకములై లోకకల్యాణమునకు తోడ్పడుటకు పండుగలు పరికల్పితములు. ఏ భీష్మైకాదశియో ఏ కృష్ణజయంతియో ఏ దీపావళియో ఏ సంక్రాంతి పండుగ దినమో వచ్చిన దన, అఖిలభారతజాతికిని నాఁటిదినము పురాణప్రసిద్ధదివసము. ప్రాచీనహైందవజీవవికాసము సువ్యక్తమగును. నాఁడా సేతుశీతనగస్థులగు నఖిలభారతవర్షీయులును నవ్యాంబరధారులై వ్రతనిష్ఠలతో ఉపవాసములతో దివ్యకథాప్రణాళికలతో ఆ పురాణపురుషుని కీర్తించుచుందురు. నాఁటి దినము భిన్నజాతు లేకభావవిలసితము లగుచున్నవి. నాఁడు భక్తి ప్రేమ కారుణ్యము వాత్సల్యము మున్నగు రసములు దేశీయుల హృద్దర్పణములందు పరిస్ఫుటములు కాఁగలవు. ఇట్టి మహాశక్తులు జాతీయోత్సవములం దంతర్గతమై ప్రజావబోధమునకు మూలము లగుచున్నవని గుర్తెఱింగితిమి గదా? యుగయుగములనుండి వచ్చుచున్న హిందూసంఘజీవవికాసము నేఁడు నగమునందు గర్భితమై యున్న ఖనులవలె పాషాణగర్భిత మగు రత్నప్రదీప్తివలె నివురు గప్పిన నిప్పువలె, మబ్బుల మాటున దాఁగి యున్నది. ఎప్పుడా గిరిని పగులఁగొట్టుదుమో అప్పుడే దాఁగియున్న ప్రవాహము పెల్లుబుకులై ప్రవహించును. ఎప్పుడా రాతిని సంస్కరింతుమో అప్పుడే నిగూఢతేజఃపుంజములు జాజ్వల్యమానములై ప్రకాశించును. కావున ప్రజానాయకులారా! దేశబాంధవులారా! గ్రామముల యభివృద్ధి దేశాభివృద్ధిగ నెంచి, నూతనోజ్జీవము కల్పించుట మీ నియమితధర్మమై యున్నదని గమనింపుఁడు. పండుగల వలనను విద్యాలయములవలనను జాతీయప్రబోధము గావించి పల్లెలను బాగుచేయ సమకట్టుఁడు. ప్రజోన్నతియే దేశౌన్నత్యముగ దలంపుఁడు. ప్రజాపరిజ్ఞానమే స్వరాజ్యసాధనవిధాన మని విశ్వసింపుఁడు. స్థలస్థలాంతరముల కేఁగి స్వప్రయోజనముకై కాంక్షించున్న సమానబుద్ధియు కార్యనిరతియు పట్టుదలయు దీర్ఘదృష్టియు ప్రజాహితైకజీవనమునకై స్వార్థత్యాగమునకై దేశారాధనకై వినియోగింపుఁడు. అట్టి స్వార్థత్యాగియే నిజమైన నాయకుఁడు. వాఁడే స్వాధికార సంరక్షకుఁడు. వాఁడే నిజమైన యీశ్వరపుత్రుఁడు. వాఁడే భారతజనని యనుంగు బిడ్డఁడు. వాఁడే సర్వజనసంస్తుతిపాత్రుఁడు. వాఁడే నిష్కళంక దేశాభిమాని. దేశాభిమానులు దేశబాంధవులు దేశనాయకులు కృతనిశ్చయులై జాతీయజీవనోద్ధారకులై తమ ప్రాణములను తమ శరీరములను తమ ధనములను తమ సంకల్పములను దేశమాతపాదారవిందములకతె పూజాపుష్పములుగను అభిషేకజలముగను ధారపోసి ఆచంద్రార్కముగ యశోవంతులై గ్రాలుదురుగాతే!

# ప్రకృతిశాస్త్రపరిశ్రమము

పి. పేరిశాస్త్రి గారు, బి. ఏ., ఎల్. టి.

క. "పలు సందియములఁ దొలఁచును, వెలయించు నగోచరార్థవిజ్ఞానము లో
కుల కక్షి శాస్త్ర; మయ్యది యలవడ దెవ్వనికి, వాఁడ యంధుఁడు జగతిన్."

## ప్రకృతిశాస్త్రపరిశ్రమ మెట్లు కలిగె?

కొన్ని శతాబ్దముల క్రింద దేశము లనాగరకతయందును అజ్ఞానాంధకారమునందును మునిఁగి యుండినపుడు మనుజులు ప్రకృతియందు కలిగెడు చిత్రములకును వానియందుఁ గలిగెడు మార్పులకును మిక్కిలి యాశ్చర్యము నొంది దీనికి కారణమేమై యుండు నని యాలోచన చేయుచువచ్చిరి. ఇట్టి యాలోచన సృష్ట్యాదియం దుండెడు మనుజులకును గలుగుచువచ్చెను. వారు తమ యనుభవమునే కారణముగాఁ గైకొనిరి. దైవమును మనుజునిఁగా నెంచి వానివలన నీ చిత్రము లన్నియు కలుగుచుండె నని తలఁచిరి.

రథము పోవునపు డొక ధ్వని పుట్టుటయును రథచక్రములు జాఁకయుండునట్లు చీలల నుంచుటయు వారల కనుభవమే. కావున, వర్షప్రదేవుఁ డగు నింద్రుని రథము పోవునపుడు గలుగు ధ్వని యురుమనియు రథమునకుఁ గల చీలలు పిడుగు లనియు తలంచుచుండిరి. కాని, నిజముగా నింద్రుఁ డున్నాఁడా? రథము లున్నవా?— అని విమర్శింపరైరి. అంతటితో సంతుష్టి చెందిరి. కాని, వారి వెనుక వచ్చినవా రట్లు సంతుష్టి చెందక శోధనపూర్వకము లగు రుజువులను కోరిరి. ఇట్లు శోధనపూర్వకముగా కార్యకారణ సంబంధములను తెలిసికొను నుత్సాహమే ప్రకృతిశాస్త్రపరిశ్రమకు మూలబీజము.

## కార్యకారణము లెట్లు కనుఁగొనఁబడును?

కాని, కార్యకారణములకు సంబంధ మెట్లు కనుఁగొనఁబడును?

1. ప్రయోగము—Experiment.
2. పరిశోధన—Observation.
3. (పరిశోధనలవలన కలిగెడి) అనుమానము—Influence.

గాలిలో కాల్చినపుడు గాని వెలిగించునపుడు గాని పదార్థములు మార్పులను చెందును. మరాబులీఁగ యని పిలువఁబడు 'మగ్నీసియం' పు ముక్కను వెలిఁగించినయెడల అది తెల్లని పొడిగా మాఱును.

ఇందుకు కారణ మేమి? లోహములను వేడిచేయునపుడు 'ఫ్లాజిస్టను' అను నొక పదార్థ మా లోహమునుండి గాలిలోనికి తప్పించుకొని పోవు నని పూర్వులు తలఁచిరి. అందుచేనా మార్పులు వచ్చె నని రెండు వందల యేండ్ల క్రిందటివఱకును నమ్ముచువచ్చిరి. కాని, దీనియం దుండెడు సంశయములను విముక్తి చేసికొనలేదు. అవేవన:

1. ఒక పదార్థము మరియొక పదార్థమునుండి పోవునపుడు తూకము తగ్గును. అలాగు తూకము తగ్గినదా?
2. తూకము తగ్గినయెడల మాఱిన పదార్థ మంతయు తూఁచినపుడున్నదా?

కొందఱు తూకము తగ్గలే దని తెలిసినను, ఫ్లాజిస్టనునకు తూకము లే దనియు, తగ్గుతూకము (Negative weight) దానికిఁ గల దనియు సమాధానము చేసికొనిరి.

3. పోయిన పదార్థమును పట్టి శోధన చేయరైరి.

కాని, 'లెవోజియ' రను నాతఁడు శోధనపూర్వకముగా పదార్థము మండునపుడు గాని కాలునపుడు గాని గాలియం దుండెడు 'ఆమ్లజని' యనఁబడు ప్రాణవాయు వా పదార్థముతోఁ గలియు ననియు, ఆ ప్రకారము కలిగిన 'ఆమ్లజనిదములు' (Oxides) రసాయనసంయోగమువలన నేర్పడును గాని విభేదమువలన నేర్పడుట లే దనియు, అందుచేతనే తూక మెక్కు డగు ననియు చూపియున్నాఁడు. అతఁడు చేసిన శోధనలకన్న సూక్ష్మము లగు శోధన లిప్పు డున్నవి. ఇట్టి తప్పు నమ్మకము లెన్నియేని లోకమునం దిప్పటికి నున్నవి. రాగిని బంగారము చేయవచ్చు నని యనేకుల కిప్పటికిని నమ్మకము గలదు. అనేకులు నాతో చెప్పిరి. వారి నట్లు నా యెదుట చేయు మని ప్రార్థన చేయఁగా కొందఱు 'ఇప్పుడు వీలు కాదు' అనియు, మరికొందఱు 'ఇంత సులభముగా నగునా?' యనియు సాకులు చెప్పిరే కాని, చేసినవారు కారు. బుద్ధిమంతులు వేదాంతార్థము నిచ్చిరి.

## ప్రకృతిశాస్త్రపరిశ్రమాభివృద్ధి కాటంకములు

(క) 1. ప్రయోగము చేయకపోవుట.

2. ప్రయోగము చేసినను పరిశోధనను జాగ్రత్తగా చేయకుండుట.

3. పరిశోధనను చేసినను తగిన యనుమానమును గ్రహింపకుండుట.

అరిస్టాటిలువంటివాఁడు సయితము మనుష్యునకు మాత్రమే గుండె కొట్టుకొను ననియు, పురుషులకు స్త్రీలకంటె పండ్లెక్కువ యనియు చెప్పియున్నాఁడు.

(ఖ) పట్టి పిచ్చినమ్మకము.

మనవారికే కాదు, లోకమునందు నివసించెడి జనులకందఱకును మతవిషయములయందును మతవిషయములను గురించి చెప్పెడు పుస్తకములయందును కట్టి పిచ్చినమ్మకము గలదు.

ఈ లోకమునందు మూలద్రవ్యములు నూటికంటె నెక్కువగా నున్నవనిన నమ్మరు. ఎందువలన ననఁగా, మన గ్రంథములలో పంచభూతము లనియే చెప్పఁబడియున్నది.

అగస్టయిను అను నాతఁడు భూగోళము గుండ్రముగా నున్న దని యొప్పుకొనెను గాని భూగోళమునకు మన మున్న వైపునఁ గాక రెండవ వైపున మనుష్యు లున్నటు లొప్పుకొనలేదు. ఎందువలన? "ఆదాముసంతతివా" రా వైపున లే రని వారి బయిబులులో చెప్పఁబడియున్న దఁట.

(గ) వైరాగ్యపునీతులు, వేదాంతపుమాటలు.

తాను చూచునది యెల్ల మిథ్య యనియు పరబ్రహ్మమే సత్య మనియు మన గ్రంథములు తెలుపును. పరబ్రహ్మము సత్యమే కాని, తాను చూచునది యెల్ల మిథ్యయా? తాను చూచునది మాఱుచుండును గాని మిథ్య కాదు.

శా. అంతా మిథ్య తలంచి చూచిన నరుం డట్లౌ టెఱింగిన్ సదా
కాంతల్ పుత్రులు నర్థమున్ తనువు నిక్కం బంచు మోహార్ణవ
భ్రాంతిం జెంది చరించుఁ గాని పరమార్థం బైన నీయందుఁ దాఁ
జింతాకంతయుఁ జింత నిల్పఁడు గదా శ్రీకాళహస్తీశ్వరా!

సీ. కమనీయభూమిభాగములు లేకున్న వే,
పడియుండుటకు దూదిపఱుపు లేల?
సహజంబు లగు కరాంజలులు లేకున్న వే,
భోజనభాజనపుంజ మేల?
వల్కలాజినకుశావళులు లేకున్న వే,
కట్టు దుకూలసంఘంబు లేల?
గొనకొని వసియింప గుహలు లేకున్న వే,
ప్రాసాదసౌధాదిపటల మేల?
ఫలరసాదులు గురియవే పాదపములు?
స్వాదుజలముల నుండవే సకలనదులు?
పొసఁగ భిక్షలు వెట్టరే పుణ్యసతులు?
ధనమదాంధుల కొలు వేల తాపసులకు?—భాగవతము.

ఆ. బ్రతుకు లెల్ల మాయ భవబంధములు మాయ
తెలివి మాయ నన్నుఁ దెలియుఁ బోవు
మాయఁ దెలియువాఁడు ముక్తుఁడౌ [illegible]
విశ్వదాభిరామ! వినుర వేమ!

చ. జలదములోని క్రొమ్మెఱుఁగు చాయలు భోగపరంపరల్, మహా
నిలపరిఘట్టితాబ్జదళనీరలవోపము జీవితంబు, చం
చలతరముల్ పయోధిమయసౌఖ్యము, లీగతి నాలకించి స
భ్యులు పరమాత్మయోగమున బుద్ధి ఘటింపుఁడు సర్వగంబుగన్.
—భర్తృహరి.

ఇట్టి వెన్ని యైనను చూపవచ్చును. ఇట్టినీతులు మనుజుని యైహికలోకసౌఖ్యాభివృద్ధి కాటంకములు. తనువు లస్థిరము లని సంపదలు జలముల లిఖించు వర్ణము లని సర్వమును త్యజించినయెడల, మనము ప్రస్తుత మనాగరకు లగు కోయలవలె నుండవలయును.

కాని,—'జరయు మృతియు లేని జనునట్లు ప్రాజ్ఞుండు ధనము విద్య గూర్పఁదలఁపవలయు.' కోరిక లేక యుత్సాహము పుట్టదు. ఉత్సాహము లేక పని చేయలేము. పని చేయకపోయిన మన మభివృద్ధి పొందలేము. మన శాస్త్రములలో సయితము కర్మమును బట్టియే యభివృద్ధి యున్న దని యున్నది.

(ఘ) భావాస్పష్టత, అభిప్రాయభేదములను సహింపకుండుట, పటాడంబరము తక్కిన కారణములు.

## విద్యలలో నుత్తమవిద్య ప్రకృతిశాస్త్రములు

మనుజుఁ డెంతవఱకు నన్ని విధముల నభివృద్ధి పొందఁగలఁడో యంతవఱకు నభివృద్ధి చేయునదియే విద్య. శరీరమును మనస్సును నభివృద్ధిచేసి ఏతీరున మన విధిని చేయఁగలుగుదుమో దానిని నేర్పునదియే విద్య. ఈ దినములందు ప్రకృతిశాస్త్రపరిశ్రమ లేనిదే జను లభివృద్ధి గాంచలే రని ప్రతివానికిని తెలియును.

హక్స్లే గారిట్లు వ్రాసినారు: "ప్రకృతిజ్ఞానము లోకమునందు మనకు సహాయకారి. ప్రకృతియొక్క పద్ధతుల ననుసరింపక తిరుగుటకు ప్రయత్నించువాఁ డీ లోకమునందు కొంచెము కాలమే నివసించును. ఆ కొంచెము కాలమునందు సయితము కష్టములకు లోనగు. ప్రకృతిపద్ధతులకును మనుష్యపద్ధతులకును భేదము కలదు. ప్రకృతి చట్టములు 'సమన్సు' లేకయే యమలులోనికి తేఁబడును. ప్రకృతి చట్టములకు లోఁబడని మనుష్యుఁ డొక యర్ధదిన మయినను జీవింపఁజాలఁడు. వేలకొలఁది జనులు చచ్చుచున్నారు లేక కష్టములను పొందుచు జీవించుచున్నారు. ఎందువలన ననఁగా, మనుజులు ప్రకృతియొక్క చట్టముల నుత్సాహముతో నేర్చుకొనుట లేదు." ప్రకృతిశాస్త్రములే మతమునకు దిక్కనియును మతము ప్రకృతిశాస్త్రము కవలబిడ్డ లనియును నొకదానినుండి మఱియొకదానిని విడఁదీసినయెడల రెండును నాశనము చెందు ననియును సెలవిచ్చియున్నారు.

సూక్ష్మజీవశాస్త్రమే రోగములను గెలిగించు నని సిద్ధాంతపఱిచి లోకమునకు మహోపకారము మొనర్చిన పేశ్చరు గారు కూడ నీరీతినే చెప్పియున్నారు.

ఇట్టి స్థాయి నెప్పుడు కలిగించినందున ప్రసిద్ధి హెర్బర్టు స్పెన్సరు గారిట్లు చెప్పియున్నారు: "ఆరోగ్యమును ప్రాణమును కాపాడుకొనుటకును మన జీవనోపాధికిని తలిదండ్రుల ధర్మములను నేర్పుతో చేయుటకును దేశీయులు దేశాభివృద్ధియొక్క తాత్పర్యమును తెలిసికొనుటకును అన్ని కళల యభివృద్ధికిని వానిని సుఖముగ ననుభవించుటకును మానసికశక్తి నభివృద్ధి చేయుటకును సన్మార్గమున నడచుటకు దారి చూపుటకును, మతము నభివృద్ధి చేయుటకును తగినవి ప్రకృతిశాస్త్రములే. ప్రకృతిశాస్త్రపద్ధతులు స్థిరములు, అచంచ

జగములో ప్రసిద్ధమైనది! అధికసువాసనగలది!!

## రత్రినా హేర్ ఆయిల్

లోకములో ప్రసిద్ధికెక్కిన, తలవెండ్రుకల కుపయోగించు తైలము. ఒక్కొక్క కుటుంబములోను స్త్రీలును, పురుషులును ఉపయోగపరచుచున్నారు. ఇది పరిశుద్ధమైన తైలదినుసులను జేర్చి తగుమైన సువాసనద్రవ్యములతో జేయబడినది. దీనికి సమానము వేరొక తైలములేదు. మీరు ఉపయోగము చేయనియెడల మీయొక్క వ్యాపారిని అడుగవలయును. లేక, సొంతవాళ్లు వి. కె. రత్నా బొంబాయి, నెం. 8 అని వ్రాసి తెప్పించుకోవలయును. వెల సీసా. ఒకటికి రు 1-0-0

35 తపాలుఖర్చు అణాలు 8.

VEGO RINE

## VIGORINE

## విగోరైన్

గ్లిసరో ఫాస్ఫేట్సు కాంపౌండు సిరప్

నిస్సత్తువ, రక్తహీనత, నిస్త్రాణ, యున్నగు రోగములచే బాధనొందువారలకు, ముఖ్యముగ రోగపడి స్వాస్థ్యము నొందువారలకు ఇయ్యదగిన అసాధారణమగు మందు. ప్రసవించిన పిమ్మటను, చండు జ్వరములనుండి విముక్తులయిన తరువాతను దేహబలము తగ్గియుండుతతి నీమందు మహోపకారము నొసర్చి అనేకులను కాపాడెను.

వెల సీసా 1-కి 1-0-0

విశేషములకు మాకు వ్రాయుడు.

హాఫ్కింజరు వరుక్సు కెమిస్టుస

33 బొంబాయి నెం. 2 రు.

VEGO RINE

## Good News for Sutterers

48/49 బాధపడువారికి, ఒక గొప్ప విముక్తి.

జాన్స్ యూనివర్సల్ హేర్ రిస్టోరర్ 2-0-0

బలహీనమువలనగాని, కాకికలనగాని, కురుపులు, చుండువలనగాని రాలిపోయిన వెండ్రుకలను మరల నెప్పటివలె పెరిగించి అందము నిచ్చును. నెరసిన వెండ్రుకలు క్రమేణ నల్లపడును.

మార్నింగ్ స్టార్ హేర్ డై

తెల్లని వెండ్రుకలు నల్లనగుటకు మిగుల మంచి మందు.

(Extra Stiong Quality "A")

నెరసిన తలవెండ్రుకలు, మీసములు, కనుబొమల వెండ్రుకలు, దీని పట్టించినచో నల్లగ అగును. ఎది చెప్పుయయిన యొకరికిని తెలియనే తెలియదు. మాయరంగుగ యగుపడదు. ఇది యిటుల పనిచేయక పోయినచో వారివారి సొమ్ము వారివారికి పంపివేయబడును.

ఒక సెట్టుధర రు. 1—0—0

జాన్. ఆర్. పాల్, కమిషన్ ఏజంటు,

1-23 నార్తుసువీధి, (మన్నడి సమీపమున) మద్రాస్.

27/15

## ఎప్పుడు సిద్ధముగ నుండును

లాంగ్క్లాతు, స్వచ్ఛమయిన ఖాన్పూరు ట్విల్ సాదావియు రంగులవియు అగు ఆక్సుఫర్డు క్లాత్, కేంబ్రిక్ చీట్లు, రంగుల చారల స్లానలు, జాలరు బట్టలు, గాజుప్లానలు, సిలోను ప్లానలు దీనితో తయారుచేసిన షర్టులును హాస్పిటల్ కోట్లును, పట్టు సాహులును, కళ్లికోట చెరుక్కోట్లు, హారోగా ఫ్లనలాంగ్ క్లాత్, కృల్టులు (నడుము, దూది పెట్టబడిన దుప్పట్లు) మంచి దూదితో నింపబడిన తలగడలు, నిద్ర కుపయోగించు పైసు, బోస్, కాలర్లు క్రిస్టిన్ నెట్టు క్యాపులు, స్టీలు, ట్రంకులు, చూచుట కింపుగనుండు మస్లినులు, మోహాయులు (శాల్వలు) తెనటిలాలు, పైనా, టస్సారు సిల్కులు, బకింగహాము, కర్నాటిక్ మిల్ చెరుకులు, సాదావియు ట్విలునగు, లాంగ్, పోలందలు, ముగలగువియు అన్ని రకముల బ్లాంకెట్టులు, రంగులు అనేకరకముల స్వదేశిబట్టలు ఇంగ్లీషు స్టీలు ట్రంకులు వెలుపలిగ్రామములనుండి వచ్చు ఆర్డరులు శ్రద్ధతో పంపబడును.

## కృష్ణా అండు కో.,

ఇంగ్లీషు బట్టల వ్యాపారులు, దర్జీపనివారు

243. చైనాబజారురోడ్డు జమేదారుఘాట్టు కెదుట మదరాసు.

## నరసిన వెంట్రుకలను పెట్టుకొని ముసలివారివలె యేల కనబడెదరు.



దర్బారు వెంట్రుకల రంగు ఒకసారి పూచిన 20 ప్రాయముగల వారివలె కనబడుదురు. ఈ రంగులు పూసుకొనిన యెడల వెంట్రుకలు అసలు నలుపువలెనే యుండును. ఇటుల కావలెననిన అల్పరీతిగల క్రింద తరగతి రంగుల తైలములు పూచిన రంగు మారకను అసహ్యాముగాను కనుపించును. మా దర్బారు వెంట్రుకల రంగు అటువంటిది కాక మిక్కిలి మేలైనది. ఒకసారికొని పరీక్షించిన మీరే సంతోషపడుదురు.

వెల బ్రష్ సహా 1-కి 1-0-0

తపాలు చార్జి 0-4-0

## బులాకు.



స్త్రీలు ముక్కున ధరించు తెల్ల యిమిటేషన్ వజ్రముల రాళ్లతో చేయబడినవియును, కెంపులతో చేయబడినవియును రెండు విధములుగ నుండును.

దీనివెల 1-కి రూ. 1-8-0

## క్రాపు కట్టర్ అను స్ప్రింగు కత్తిరి.



ఈ కాలమున హిందువులు, మహమ్మదీయులు తమ తలవెంట్రుకలను క్రాపు చేసికొనుటకు యీ యంత్రము చాల వుపయోగకరమైనది. దీనితో కత్తిరించిన వెండ్రుకలు ఒకే సమముగా నుండును.

దీనివెల 1-కి రూ. 3-0-0

దీనిలో చిన్నది రూ. 1-4-0

## 10 ఇమిటేషన్ వజ్రములతో తయారుచేయబడిన బంగారు వుంగరములు.



ఈ వుంగరములు చూచుటకు బహు సుందరముగా సొగసుగా ప్రకాశవంతమై యుండును. 10 యిమిటేషన్ వజ్రములతో కట్టియున్నది. ఇది కెమికల్ అను ఒకవిధమైన లోహముతో యంత్రములశక్తిచే 8 రూపాయలు వెలగల బంగారుతో చేయబడిన దానివలె ఇమిటేషన్ వజ్రము పొదగబడియున్నది. ఈ వుంగరమును చూచినవారు 200 రూప్యములు మదింపు వేయగలరు.

దీనివెల 1-కి రు. 0-8-0

## విచిత్ర పాకెట్ దీపము.



ఇది సూర్యకాంతివలె అంత ప్రకాశముగా నుండును. దీనిని వెలిగించుటకు నిప్పు, నూనె, అగ్గిపుల్ల యేమియు పనిలేదు. దీపము మధ్యమున వున్న గుండీని వ్రేలితో వొత్తిన యడల దీపము వెలుగును. ఇది చీకటి కాలమునకు చాల వుపయోగమైనది. జేబులో వుంచుకోవచ్చును. చూచువారికి చాల ఆశ్చర్యముగా నుండును.

వెల 1-కి రూ. 1-8-0

## ఉగాదిపండుగకు సొగసగు గజ్జెలు కట్టిన బంగారు గిల్టు లక్ష్మి వడ్డాణము.



ఇది బంగారు గిల్టులో ప్రఖ్యాతి చెందిన పనివాళ్లచే అతి సుందరముగా తయారు చేయబడినది. [illegible] వయిపుచిన్నది. పెద్దది చేసుకొనుటకు కుండీ అమర్చబడియున్నది. 100 గజ్జెలు గుచ్చియున్నది. చిన్న వాటికిని దీనికి వేరు వ్యత్యాసము లేదు. ఒకసారి తెప్పించి చూడుడు. బంగారు గిల్టు గజ్జెలు గలిగిన వడ్డాణము 1-కి రూ. 3-8-0.

**వైరం అండు కంపెని, 3 ఇరుళప్పన్ వీధి, మద్రాసు.**

2-3

# లోక ప్రసిద్ధమైన సాలామిసిరి మురబ్బా

## 1000 రూపాయలు బహుమాన మియ్యబడును.

ఈ మురబ్బాకు సాలామిసిరి కాదని ఋజువుపరచువారికి 1000 రూపాయలు బహుమానముగా యియ్యబడును. అట్లు నిరాకరించినచో కోర్టుమూలముగా పొందవచ్చును. దుర్భ్యాసమువల్ల బాల్యములోనే ధాతునష్టము కలిగినవారికి హృదయకోశము బలహీనమై మరణకాలమువరకు దుఃఖము ననుభవింతురు. ఈ సాలామిసిరిమురబ్బా సేవించిన యెడల అట్టి దుఃఖము తొలగి విశేష బల వీర్య సంపన్నులయి ప్రకాశించుచు చిరకాలము సుఖముగ జీవింతురు.

రిజిష్టర్డు



ఈ సాలామిసిరి మురబ్బావల్ల ధాతుపుష్టి కలుగును, స్వప్నస్ఖలితము మానును, ధాతువు మూత్రముతో కలిసిపోవుట మానును, నీరుచురుకు మానును, బహుమూత్రవ్యాధి మానును, విశేష బలము కలుగును. రక్తము వృద్ధియగును, ఆకలి యెక్కువయగును, చక్కగ మలవిసర్జన మగును. సాలామిసిరి అనునది ఒక జాతిపండు. ఇది కాబూల్, కాందహార్ దేశములలో పైరగుచున్నది. అక్కడి జనులు ఈపండును విశేషముగా తినుటవలన మనదేశపు 4 గురు మనుష్యుల బలము ఆ దేశమున ఒకమనిషికి గలదు. పై మురబ్బాను సేవించి మంచి బలముపొందుటకై గొప్ప మందులతో చేర్చి తయారుచేయబడియున్నది. 1 డబ్బాను 15 రోజులు ఉపయోగించిన దానివల్ల పూర్తిగ బలముకలుగును. 2-3 డబ్బాలు సేవించినచో జన్మాంతరము వరకు గుణమిచ్చును.

అనుపాన పత్రిక పార్శలుతో పంపబడును.

15 తులాలు డబ్బీవెల రూ. **2-0-0.** తపాలఖర్చు 1-3 డబ్బాలకు 6 అణాలు.

ఇనాంసామానులు 50 ! అనేక యోగ్యతాపత్రికలు పొందియున్నది. ఇనాంసామానులు 50 !!

(రిజిస్టర్డు)

## రాజా సుందరి రోజా




వెండ్రుకలు పెరుగు పరిమళతైలము 50 విధముల ఇనాము సామానులతోడ డబ్బి 1-కి రూ. 1-0-0 మాత్రమే. వెండ్రుకలు రాలుట మానును. ఈ లోకప్రసిద్ధమైన తైలమును కొంచెముగా చేతిలోపోసికొని బాగుగారాచి తల వెండ్రుకలకు చరుముకొనిన చుట్టుప్రక్కలనుండు యింటివాళ్లకు వాసన ఘుమాయించును. ఇది శరీరమునయుండు ఉష్ణమును తగ్గించి కంటికి చలువనిచ్చును. ముఖమునకు కాంతియు, దేహమున కారోగ్యము నిచ్చు తైల మిదితప్ప వేఱొకటిలేదు. ఇది అల్పకడు ఆయిలుతో తయారుచేయబడినది. పరీక్షించిన తెలియగలదు.

### ఇనాము సామానుల వివరము.

స్త్రీలుధరించు నగలు 7, జర్మనుసిల్వరు కుంకుమభరిణె 1, అద్దము 1, తాంబూలమాత్రలు 30, పట్టుతో ముద్రిక 1, సువాసనగల సెంటుబుడ్డి 1, చిత్రపటములు 6, సువాసనగల అత్తరుబిళ్ల 1, గంధపుబిళ్ల 1, స్త్రీల కాటుకభరిణె 1, మొత్తము సామానులు 50.

ఒకసారి 3 బుడ్లు కొనువారికి ఒక లవంగరుతైలపు బుడ్డియు 6 బుడ్లు ఒకసారి కొనువారికి యినాముసామానులు పంపక రాస్కోపుగడియారమును పంపుదుము.

## ధైర్యలక్ష్మీ అండు కంపెని, 3 ఇరుళప్పన్‌వీధి, మద్రాసు.




## 2 ప్రాణమిత్రులు.

అజీర్ణము, మలబద్ధకము, రక్తరాహిత్యము, నరముల సడలిక, స్వప్నస్ఖలితము, బహుమూత్రము, అకాల వార్ధిక్యము, నపుంసకత్వము, మొదలగు వ్యాధులను తీర్చి శాశ్వత యౌవనమును కలిగించి సంసార సుఖానుభవమందు అత్యానందము నిచ్చుటకు మాయొక్క సాటిలేని

## మదనమంజరి మాత్రలను వాడుడు.

40 మాత్రలుగల డబ్బి క్రయము రూ 1-0-0.

సకలవిధములైన నపుంసకత్వమును పోగొట్టుటకును చెడునడవడికవలన తెచ్చుకొన్న ఘోరమైన నపుంసకత్వమును పోగొట్టి సంతానవృద్ధి చేయుటకును మాయొక్క

నపుంసకత్వారిఘృతము ఉపయోగించుడు. 2 తులముల డబ్బి క్రయము రూ 2-0-0.

కోరినవారికి పెద్ద క్యాటలాగు ఉచితము.

## రాజవైద్య నారాయణజి కేశవజి, ఆయుర్వేదోదయౌషధాలయము.

18/6

20 చీనాబజారురోడ్, మద్రాసు.

## బాన్స్ స్టౌలు

కిరసనాయలు స్టౌలలో కెల్ల చాలమంచివి.

నిరపాయకరమయినవి.

చిక్కులేనివి. నిశ్శబ్దముగా మండునవి.

1-2-3-4-5 బర్నరులుగలవి వరుసగ రు. 40-65-90-115 140 రూపాయల ఖరీదు. ప్యాకింగు, ఫ్రయిటు ప్రత్యేకము.



అనేకవేలు అమ్మబడినవి. వివరము గోరువారు

సోలు ఏజంట్లగు:—**యల్. రాయ్. సంపత్.**

17/5

70 అపోలోవీధి, ఫోర్టు బొంబయికి వ్రాయవలెను.

బ్రాంచిలు, ఢిల్లి, కరాచి.

లములు. మనుజుం డీలోకమున నెంతవఱకు నుండునో యంతవఱకును ప్రకృతిసిద్ధాంతములు స్థిరగతు లగును."

మేృక్ అనునాతం డిట్లు వ్రాసియున్నాడు: "ప్రారంభగణిత శాస్త్రమును ప్రకృతిశాస్త్రపరిశ్రమయును లేని మనుజుండు తాను నివసించు ప్రపంచమునందు విదేశస్థుండుగా నుండుట గాని తా నుండు నాగరికతకు విముఖుం డగుట గాని తటస్థించు నని చెప్పిన నెవరును నా మాటకు విరుద్ధముగా చెప్పరు."

వారు వీరు చెప్పినా రన నేల? నా యనుభవమునందు ప్రకృతిశాస్త్రగ్రంథము లేనివారు తాము చూచు వస్తువులను గాని మార్పులను గాని ప్రకృతిశాస్త్రములను చదువువారివలె వర్ణన చేయంజాలరు. కార్యకారణ సంబంధములను కనుంగొను నభ్యాసము వారికి లేదు. తమ భోజనపానీయములయందును దుస్తులను ధరించుటయందును తెలివితేటలు లేక వర్తించెదరు. ఆరోగ్యశాస్త్రవిధులయందు నమ్మకమే లేదు.

## ప్రకృతిశాస్త్రపరిశ్రమ మెందులకు ?

(1) స్పెన్సరు గారు చెప్పినట్లు ప్రకృతిశాస్త్రములు మనుజునకెక్కుడుగా నుపయోగకరములు.

(2) పరిశోధన చేయుటయందు నైపుణ్యమును నేర్పును.

సాధారణముగా మనలో పరిశోధనశక్తి తక్కువ. ప్రతి పిల్లవాండును నీటిరంగే మని యడిగిన, తెల్లగా నుండు నని చెప్పును. నీటిని పాలను ప్రతిదినమును చూచుచు వాడుకొనుచు నుండునే కాని, నీటిరంగునకును పాలరంగునకును గల భేదమును గమనింపండు. రంగులయందలి భేదములే తెలియవు. పరిశోధనకు తగిన యవకాశములు ప్రకృతిశాస్త్రములం దెక్కుడు. ప్రకృతిశాస్త్రశాలలయందు (Laboratories) తాను చేసిన ప్రయోగములవలన కలుగు మార్పులను తప్పక శోధింపవలయును. మార్పులను గ్రహింపక తప్పదు. తన యెదుట జరగుచున్న మార్పులను చూచునప్పుడొక విధమైన సంతోషము కలుగును. అందుచే తప్పకయూ మార్పులను కనిపెట్టును.

ప్రకృతిశాస్త్రవిద్యార్థి యేదో యొకదానిని శోధించుచు స్పృశించుచు కోయుచు తూచుచు కొలచుచు వియోగము చేయుచునే యుండును. ఇట్టి సాధనములచే పరిశోధనాబలమును వివేకమును నెక్కు వగును. ప్రకృతిస్వరూపమును దానియందలి మార్పులను గ్రహించు గుణ మలవడును.

(3) పరిశోధనల నేర్పాటు చేయుటయందు నిపుణత్వ మేర్పడును. తాను చేయు పరిశోధనలను సంప్రతించి యనుమానము నేర్పఱచి, తరగతులుగా నేర్పాటు చేయును. మన జ్ఞానేంద్రియములవలన నేర్చుకొను జ్ఞానము నేర్పాటు చేసికొని తగిన సిద్ధాంతము చేయ నేర్పుచేతనే మనము జ్ఞానము నభివృద్ధి చేసికొనుచున్నాము. కావున, ఇట్టి శిక్షను కలుగు విద్య మనకు మిక్కిలి యుపయోగకరము. ఇట్టి శిక్ష భాషాగ్రంథములయందును దేశచరిత్రలయందును గలదు కాని, కొంత భేద మున్నది.

భాషాగ్రంథములయందును దేశచరిత్రలయందును మన మొక మనుజుని యధికారము నమ్మవలసివచ్చును. ప్రకృతిశాస్త్రములయం దట్టి యధికారము పనికిరాదు. పాణిని యీ ట్లొక పదము నుపయోగింపవలయు నని వ్రాసియున్నాం డన, వాని యధికార మట్లు చెల్లును గాని, ప్రకృతిశాస్త్రములలో డాల్టనటు చెప్పినాం డనం జెల్లదు. ప్రకృతిశాస్త్రములయందు శోధన చేసి చూపవచ్చును. కాని, యట్టి శోధనలను చేయుటకు దేశచరిత్రలయందు వీలు లేదు.

(4) భావనాశక్తి (Imagination) నభ్యాసము చేసి స్వాధీనపఱచుకొనుట!

ప్రతిపదార్థమును గురించియు మనకుం గలుగు వేఱువేఱు అనుభవములను చేర్చి ఆయా పదార్థముల జ్ఞానము సంపాదించుట మనస్సుయొక్క ధర్మము. ఈ జ్ఞానము సంపాదించుటలో మన యనుభవము ననేకవిధముల చేర్చియు విడందీసియు నేదో యొక భావనను చేయుదుము. ఇదియే బుద్ధికుశలతకు కారణము. కాని, యిట్టి భావన కవిత్వమునందును తదితరగ్రంథములయందును ఇచ్చవచ్చినట్లు పోవచ్చును. ప్రకృతిశాస్త్రములం దట్టి వీలు లేదు.

ప్రతిపదార్థమును మిగుల స్వల్పము లగు నణువులతోం గూడియున్నది. వాయువును నొక పదార్థమే. వాయువుయొక్క పరిమాణమును త్రొక్కుడుచే తగ్గింపవచ్చును. ఇట్టి పరిమాణము తగ్గుట రెండు విధములుగా నగును: (1) అణువు లాక్రమించు స్థలము తక్కువ కావలయును. కాని, యట్టి స్థలము తగ్గదు. (2) అణువుల మధ్యమున నుండు స్థలము తక్కువ గావలయును. ఇది చేయంగలము కావున, పదార్థపు టణువుల మధ్యమునను స్థలము గలదు.

(అ) ఇది నిజమైనయెడల నొక పదార్థమునందు మరియొక పదార్థము లీన మగునప్పుడు పరిమాణ మెచ్చంగూడదు — ఇది నిజమా? నిజమే. నీటియం దొక పదార్థమును లీనము చేసినయెడల నేర్పడు ద్రవపదార్థముయొక్క పరిమాణ మెక్కుడు గాదు. ఆ తీరుననే 'ఉదజని' యను వాయువు, ఇనుము నందును, బంగారమునందును ప్లాటినమునందును 'పల్లాడియము' అను లోహమునందును పరిమాణము నెక్కుడు చేయక లోనికి పీల్చుకొనంబడును.

(ఆ) మీంది యుదాహరణములను బట్టి చూడంగా, వాయువునందలి యణువులకు మధ్యమున స్థలము గల దని తోంచుచున్నది. కాని, తా మాక్రమించు స్థలము నంతటి నావరించియుండుటకు అణువులెప్పుడును చలనమునం దుండవలయును. ఇది నిజమయినయెడల గాలియందలి పదార్థపు టణువులు దూరదూరముగా పోవలయును. నడుమ రంధ్రము లుండుచో, ఏ యడ్డున్నను ఆ యణువు లా రీతిని దూరముగా పోవలయును. గాలియందలి యణువు లట్లు దూరముగా పోవు ననుటకు తగిన శోధన లున్నవి. గ్రంథబాహుళ్యమునకు వెఱచి వాని నిందు పొందుపఱచుట లేదు.

చూచితిరా? వాయువునందు అణువు లుండుటయు అవి దూరదూరముగ పోవుచు చలనములో నుండుటయు భావనయే. కాని, యీ భావన శోధనపూర్వకమై యుండుటచే మితి దాటకున్నది.

(5) వేఱు వేఱు జ్ఞానమును సంప్రతించి తగిన యనుమానమును

దానినుండి సిద్ధాంతమును తగిన రీతిని చేయు నైపుణ్య మలవడును.

(6) తగిన వర్ణనాసామర్థ్యమును భాషాశుద్ధతయు కలుగును.




మీఁద నున్న పటములో నున్నట్లు సామగ్రి నేర్పఱచి పరీక్ష చేయుచున్నచో, 'అ' అనెడు గొట్టముయొక్క చివర కుప్పెయుడుగునకు పోవు నని కాని 'ఇ' అను గొట్టముయొక్క చివర నీటిలో నున్న దని కాని చెప్పెడు పిల్లలు సాధారణముగా నుండరు. ప్రతి పిల్లవాఁడును గొట్టము నీటిక్రింద నున్న దనియే చెప్పును. కుప్పెకు బిరడాం తగిలించియున్న దనెడరే కాని, బిరడా బిగించియున్న దనరు. కాని, యిట్టి తప్పులు కొన్నాళ్లకు పోయి వర్ణనాచమత్కారమును భాషయందలి శుద్ధతయు చేకూరును.

## ప్రకృతిశాస్త్రపరిశ్రమ మన దేశమం దెట్లున్నది?

మన స్థితి, మన దొరతనమువారి దేశమునం దెట్లున్నదో, మన దేశమునం దంతకంటె హీనస్థితిలో నున్నది. 'యథా రాజా తథా ప్రజా' యన్నట్లు మన దేశమందు మనుగడైన నుండక మిక్కిలి హీనస్థితిలో నున్నాము. ఇదివఱకు సంవత్సరమునుండి వెలువడుచున్న యాంగ్లపత్రికల సంచికలను చూచినచో వారి స్థితి మనకు తెలియును.

(1) భాషాగ్రంథము లెక్కుడుగ నేర్పఁబడుచుండుటచేత వారమునకు రెండు మూఁడు ఘంటలు మాత్రమే ప్రకృతిశాస్త్రములు బడులలో నేర్పుచున్నారు. భాషాగ్రంథములు (లాటిను గ్రీకు భాషలు) ఎక్కుడు కాలము నాక్రమించుచున్నవి. పూర్వకాలమున భాషలయందు జ్ఞానము సంపాదింపవలసివచ్చెను. ఇటీవల ఆ స్థితి మాఱినను ఇప్పుడు కూడ ఆ గ్రంథములనే యెక్కుడుగా చదివించుచున్నారు.

(2) ప్రకృతిశాస్త్రజ్ఞానము కృషులయం దుపయోగించుట లేదు. అందువలననే కదా యిప్పు డింగ్లాండు దేశములో మందులు, రంగులు, కాగితములు, మందు గుండు సామానులు ప్రియమై పోయినవి. ఇప్పు డెంతయు వానికొఱకై ప్రయత్నములను చేయుచున్నారు.

## ఇట్టి దుస్థితికి కారణ మేమి?

1. సర్వాధికారు లగు మంత్రులును వారి యనుచరులును ప్రకృతిశాస్త్రపరిశ్రమ తెలినవా రగుటచేనే శాస్త్రపరిశ్రమయం దంత శ్రద్ధ తీసికొని విద్యయం దీ శాస్త్రములకు తగిన ప్రముఖత నిచ్చుట లేదు.

2. బడుల ముఖ్యోపాధ్యాయులు సాధారణముగా భాషా గ్రంథములను చదివినవారే యగుటచేత వారికి ప్రకృతిశాస్త్రాభిమానము తక్కువ.

3. ప్రజలకు శాస్త్రములయందలి యుపయోగము తెలియదు.

4. రసాయనవేత్తలకు గౌరవము లేకపోవుట. మందు లమ్ముకొనువానికి రసాయనవేత్త (Chemist) యని యీ దేశమునందు మాత్రమే పేరు.

ఈ రీతిగా నింగ్లాండు దేశమునందే యుండ, మన దేశమునం దట్లుండుట చిత్రమా? మీఁది కారణములకు మఱికొన్ని కారణములు మన దేశమునం దెక్కుడుగఁ గలవు.

5. మన దేశము–మిగుల బీద దేశము. బడులయం దీ శాస్త్రములను నేర్పుట కెక్కుడు ధనము కావలసియున్నది. తక్కిన శాస్త్రపరిశ్రమకు నల్లబల్ల సుద్దముక్క భూగోళపటములు (మ్యాపులు) చాలును. అందుచే తక్కిన   స్త్రముల నభిమానపరనీయములుగా చేసికొను విద్యార్థు లెక్కుడుగ నున్నారు. ప్రకృతిశాస్త్రశాలల (Laboratories) నేర్పఱచుటకు కొంత ధనము వేలకొలఁది మదుపు పెట్టవలయును. మరల నేఁటేఁటను మధ్యమవిద్యాలయమునకు నేయి రూపాయలను కళాశాలలకు నాలు గైదు వేల రూపాయలను వ్యయపఱుపవలయును. ఇంత సొమ్ము వృథా యని ముఖ్యోపాధ్యాయులయొక్కయు పాఠశాలాధికారులయొక్కయు జనులయొక్కయు నభిప్రాయము.

6. ప్రకృతిశాస్త్రపరిశ్రమ చేయువారు తమ జ్ఞానమును కృషులయం దుపయోగించి దానివలన లాభమును చూపకుండుట. ఇది వారి తప్పు గాదు. వారికి తగిన సదుపాయములు లేవు. దేశము బీదది యగుటచే కృషికర్మాగారములే లేవు. అందుచే దానిని నేర్పుటకు తగిన యుపాధ్యాయులును లేరు. మావంటివారము శోధన గొట్టము నందు మా జ్ఞానమును చూపఁగలుగుదుమే కాని, మా జ్ఞానము మాకు గాని మన దేశమునకుఁ గాని లాభము నీయఁజాలదు. మే మేమి చేయుదుము? మేము నేర్చుకొనినదే యంత. అంత కెక్కుడు నేర్చుకొనుటకు సదుపాయములు లేవు.

7. ఎందుచేతనో తెలియదు కాని, ప్రకృతిశాస్త్రపరిశ్రమము కష్టమని లోకములో వాడుక. మన పిల్లలకు పుస్తకము పట్టుకొని యింటియొద్దనే వల్లెవేయుటయే సులభముగా నగపడును గాని తమ జ్ఞానేంద్రియములచే పదార్థజ్ఞానమును సంపాదించు నలవాటు తక్కువ. ప్రకృతిశాస్త్రము లన్ననో, వానిని నేర్చుకొనుటకు కర్మాగారములలో పనిచేసి పాటుపడవలయును. అది మనవారికి కష్టముగా తోఁచును. తక్కిన శాస్త్రములను కండ్లు మూసికొని వల్లెవేయ వచ్చును. కొందఱు దీపములను గూడ నార్పివైచి చీఁకటి గదులలో

దుప్పటి ముసుఁగుపెట్టుకొని పద్యములను దేశచరిత్రలను గణితశాస్త్రములను వల్లనవేయుట వారు తెలియుదురు. గొప్పలైన ప్రకృతిశాస్త్రములు లభించవు.

కావున దేశమునం దెట్టి యభిప్రాయములును పద్ధతులును మాఱి ధనికులు కర్మాగారములను పెట్టించినం గాని ప్రకృతిశాస్త్రాభివృద్ధి గానేరదు. దేశము బాగుపడదు. దేశము నానాటికి బీద దగుటకు ప్రకృతిశాస్త్రపరిశ్రమ తగిన రీతిని లేకపోవుటయే కారణము.

ప్రకృతిశాస్త్రపరిశ్రమవలన నష్టము గల దని యాంగ్లేయుల కనేకులకు నమ్మకము గలదు. ఈ నడుమ మన యాంగ్లేయులు జర్మనుతోడి యుద్ధమునందు తమ కాలు కొంచెము వెనుకఁబడుటను గాంచి దానికి కారణము తమ దేశమునందు ప్రకృతిశాస్త్రపరిశ్రమ తక్కువగు యని తెలిసికొనిరి. కావున, నికముందు ప్రకృతిశాస్త్రపరిశ్రమాభివృద్ధి గావలయు నని రాజకీయాధికారు లగు మంత్రులు విద్యాధికులు ప్రకృతిశాస్త్రజ్ఞులు మొదలగువారు దొరతనమువారికి సహాయము లిచ్చియు నుపన్యాసము లిచ్చియు క్రొత్త ప్రకృతిశాస్త్రశాలలను గట్టించియు రసాయనసభల నేర్పఱచియు పాటుపడుచున్నారు. లార్డు హాలిడేను గారు ప్రకృతిశాస్త్రము లెక్కుడుగ బాలురకు చెప్పింపవలయు నని యొప్పుకొనిరి. ప్రధానమంత్రి ఆస్క్విత్ గారును లార్డు క్రూ గారును దీని విషయమై యాలోచన చేయుటకు సభ నేర్పఱచుట కొప్పుకొనిరి.

ఇట్లుండఁగా, లార్డు క్రోమరువంటివానికి ప్రకృతిశాస్త్రములు మనుష్యునకు దుర్గుణములను కలిగించు నని తోఁచినది. అందు నకు నిదర్శనముగా జర్మనీదేశము చూపఁబడినది. జర్మనీదేశములో పదునైదు సంవత్సరముల క్రిందటివఱకును ప్రకృతిశాస్త్రపరిశ్రమ విశేషముగా లే దనియు, ఇప్పుడు జర్మనీలో యుద్ధము చేయుచున్న ప్రముఖులు ప్రకృతిశాస్త్రాభివృద్ధి లేని కాలమునందు భాషాగ్రంథములు దేశచరిత్రలు మాత్రము చదివినవారే కాని, ప్రకృతిశాస్త్రములను చదివినవారు కా రనియు, కావున భాషాగ్రంథములు దేశచరిత్రలు మాత్రమే వీరి దుర్గుణములకు కారణ మనియు, తగిన రీతిని 'నేచరు' పత్రికాధికారులు సమాధాన మిచ్చియున్నారు.

## ప్రకృతిశాస్త్రము లెట్లు దేశాభివృద్ధికి కారణములు?

ప్రకృతిశాస్త్రములు దేశాభివృద్ధికిని ధనాభివృద్ధికిని నాగరికతాభివృద్ధికిని ఆరోగ్యాభివృద్ధికిని కారణము లని చూపుటకు రసాయనాభివృద్ధినుండి విస్ఫుటముగ చూపఁగలము:

(1) ఆహారనిద్రాభయంబులు మనుజులకు సైజము. నాగరికత లేని పురాతనజనులకు మొట్టమొదట క్రూరమృగంబుల బారినుండి తప్పించుకొనుటకును ఆహారమును సంపాదించు నిమిత్తము వ్యవసాయము చేసికొనుటకును మాంసమును సంపాదించుకొనుటకును నివాసముల నేర్పఱచుకొనుటకును సాధనములు కావలసివచ్చెను. రాతితోఁ గాని లోహములతోఁ గాని సాధనములను చేసికొనిరి. లోహములను గనులనుండి త్రవ్వి తయారుచేయుటకు రసాయనశాస్త్రకృషియే ముఖ్యము.

(2) ప్రస్తుతము కట్టడములయందలి నేర్పరితనమును ప్రయాణసాధనము లగు రైలుబండ్లను స్టీమర్లను వాయువిమానములను నేర్పఱచు సాధనము రసాయనశాస్త్రకృషియే.

(3) మనుజునకు చెప్ప నలవి కాని శక్తి ప్రేలెడు మందుగుండు సామానులవలననే కలిగినది. కొండలను బ్రద్దలుకొట్టి రైళ్లు వేయుటకును గనులనుండి ఖనిజములను త్రవ్వుటకును మందుగుండు సామగ్రి కావలసి యున్నది. మందుగుండుసామాను రసాయనశాస్త్రపరిశ్రమ యొక్క ఫలమే.

(4) చిత్తరువులకును మనల సుందరముగ గలవారినిగా చేయు దుస్తులకును కావలయు రంగులును, వ్రాయుటకును, జ్ఞానాభివృద్ధికి కారణము లగు పుస్తకములకును వలయు కాగితములు సిరా మూర్పులు మొదలగునవియు, మనల నంధకారమునుండి తొలఁగించి వెలుతురు నిచ్చు క్రొవ్వువత్తులును, లాంతరులును, అందలి చమురును, వాయుగ్యాసు దీపములకు వలయు మేంటిల్సును, గృహోపకరణములకు వలయు పాత్రలను చేయు లోహములును, మన శరీరములనుండి మాలిన్యమును తొలఁగించుటకు వలయు సబ్బులును, మన యారోగ్యమును నిలుపుటకును అభివృద్ధి చేయుటకును మరల నిచ్చుటకును వలయు మందులును, మన షోకులకు వలయు సువాసనలును, మరి చెప్ప నలవికాని వస్తువు లన్నియును, రసాయనశాస్త్ర పరిశ్రమమువలననే కదా లభ్యము లయినవి.

(5) మరియు, వ్యవసాయశాస్త్రాభివృద్ధియందు మన దేశమునకును ఐరోపాదేశములకును భేద మేమి? వారలు భూమిని అందు పండెడు పైరులను పరిశోధించి రసాయనవిభేదమువలన వాని నైజమును తెలిసికొని పంటలు బాగుగ పండుటకు వలయు యెరువులను రసాయనప్రక్రియలవలన చేయుచు భూములకు సత్తువ నిచ్చి ధనధాన్యభోగపరులై యున్నారు. మన దేశమునం దెట్టి యలవాటు లేక పోవుటచే భూములును అందలి జనులును బీద లగుచున్నారు.

(6) ఈ యుద్ధసమయమునందు జర్మనీదేశస్థులకు విదేశమునుండి యేమియు రాకుండునట్లు మిత్రమండలివారు భూమిమీఁదను సముద్రముమీఁదను వారిని ముట్టడించియున్నారు. కాని, వారలు రసాయనశాస్త్రమునం దారితేరినవా రగుటచే తమ దేశమును కాపాడుకొనుటకు వలయు మందుగుండు సామానునకును వ్యవసాయమునకును వలయు సురేకారమును నత్రికామ్లమును (Nitric Acid) నత్రితములను (Nitrates) అమ్మోనియాను వాయువునుండియే తీయుచున్నారట. ఆహారమునకు వలయు గోదుమలు మొదలగువానికి బదులుగా 'కాంపొజిటు' రొట్టెను, రాగికి బదులుగా మరికొన్ని మిశ్రమలోహములను వారు చేయఁగలిగియున్నారు. ఇది యేది యన నేల, వారికి కావలయు వస్తువుల ననేకములను విదేశాళ లేకయే ప్రతిసృష్టి చేయుచున్నారు. చూచితిరా రసాయనశాస్త్రపరిశ్రమమహిమ?

(7) అంతగా పోనేల? మన జీవనమే రసాయనసంయోగము చేతను వియోగముచేతను అభివృద్ధి చెందుచున్నది. మనము తినెడి యన్నము రసాయనపు మార్పులను చెంది శరీరమందలి రక్తముగ పరిణమించి శరీరమునకు పుష్టి గలిగించుచున్నది. మనము పీల్చు గాలియందుండెడు ఆమ్లజని యను ప్రాణవాయువు మాంసాదులయందలి కర్బనముతోను ఉదజని (Hydrogen) తోను రసాయనసంయోగమును చెంది బొగ్గుపులుసు గాలిగాను ఉదకముగాను మారి శరీరమునందు వేఁడిని గలిగించుచున్నది. కావున రసాయనపు మార్పులే మన జీవనమునకు కారణములు.

కావున, ఆంధ్రమహాజను లందఱును ప్రకృతిశాస్త్రముల మహిమను తెలిసికొని వాని యుపయోగమును కనుఁగొని దేశపు యోగక్షేమముల నరసి దేశాభివృద్ధికై పూనికతో ప్రకృతిశాస్త్రపరిశ్రమను చేయవలె నని ప్రార్థించుచు విరమించుచున్నాఁడను.

# నీటియొక్కయు ఆవిరియొక్కయు బలాబలములు

ఎమ్. విశ్వనాథము గారు

శక్తి యనఁగా పని చేయుటకు కావలసిన బలము. ఇది మానవబలము గుఱ్ఱపు బలము ఏనుఁగు బలము నీటి బలము ఆవిరి బలము వాయుబలము అని పెక్కు పేర్లం బరఁగుచున్నది. వీనిలో జీవబలముకన్న నిర్జీవబలము ఎక్కువ. జీవబలమునకు మితి గలదు కాని, నిర్జీవబలమునకు మితి లేదు. నిర్జీవబలము జీవబలమునకు సాధ్యమైన కార్యములనే కాక అసాధ్య మగు కార్యములను గూడ నిర్వర్తింపఁగలుగుచున్నది. మానవుఁడు ధరించు సమస్తవస్త్రములను నేయుటయే కాక, వానిని మలిన మైనపుడెల్ల శుభ్రపఱచుచున్నది. కర్షకులకు పొలమును బాగుచేసి దున్ని విత్తనములను చల్లి దానికి కావలసిన నీటిని తోడి కోఁతకు వచ్చినప్పుడు చేనును కోసి కుప్పలను నూర్చి పిదప బియ్యమును కూడ తయారుచేయుచున్నది. అగ్గిపెట్టె కాకితము కలము పెనసలు పాళీ గుండుసూది మొదలైన నానావిధము లగు వస్తువులను తయారుచేయు యంత్రశాలలను నడపుటకు మూలాధార మిదియే. ఇంతే కాక రైలుబండ్లను పడవలను విమానములను ట్రాముబండ్లను మోటారుబండ్లను నడపునదియు నిదియే. ఇది దేశములయొక్క భాగ్యమునకును నాగరికతకును పుట్టినిల్లు. దేశములను బాగుచేయుటకును పాడుచేయుటకును దీనియందుఁ గల ప్రజ్ఞ దేనియందును లే దని చెప్పవొప్పును. అట్టి నిర్జీవబలమునకు చెందిన బలాబలములను కొంచెము చర్చింపవలసియున్నది.

**1712**-వ సం. న న్యూకోమనుచే నిర్మింపఁబడిన ఆవిరి యింజను **1769**-వ సం. న వాట్టుచే నభివృద్ధిలోనికి కొనిరాఁబడినది. ఆ కాలమున అది గనులనుండి నీటిని తోడుటకు ఎక్కువగా నుపయోగింపఁబడుచుండెను. కాని, వెంటనే ఆ యావిరి యింజనులో మంచి మార్పులు రానందువల్ల ఆవిరి యంత్రముయొక్క సామర్థ్యము ఆ కాలపు జనులకు బాగుగా తెలియకపోవుటచేతను, దానిలో వేయు బొగ్గు ఎక్కువ ధర కలిగియుండుటచేతను, యంత్రశాస్త్రజ్ఞులు ఆవిరి యంత్రముకన్న తక్కువ ధనవ్యయముతో దొరకు శక్తిని కనుఁగొనుటకు ప్రయత్నించిరి. నదులలో నచ్చోచ్చట మెట్ట ప్రదేశమునుండి పల్లపు ప్రదేశమునకు పడుచున్న జలపతనముల నుపయోగములోనికి కొనివచ్చినచో లాభ ముండు నని కనిపెట్టిరి. ఇంజనీర్లా పతనములు వర్తకవ్యాపారముల కుపయోగపడు మార్గముల నాలోచించిరి. కాని, వారి మేధావిశేషము విశేషకారకము కనక పైనుండియు అడుగునుండియు త్రోయు జలచక్రములలో నాఁగిపోయెను. ఆ కాలమున ఐరోపా అమెరికా దేశములయందలి పిండి మరలు బియ్యపు మరలు మొదలగు చిన్న పరిశ్రమలను పైని చెప్పినట్టి చక్రములతోను గాలి చక్రములతోను నడపించుచుండిరి. ఈ విధముగా జలపతనము శక్తి రూపమును దాల్చి పరిశ్రమలకు మూలాధారములలో నొకటి యైనది.

## నీటి ఆవిరి శక్తులకుఁ గల పోటీ

ఆవిరి శక్తియు జలశక్తియు యంత్రములను త్రిప్పుటయందు ఒకదానిని మించి మఱియొకటి పనిచేయసాఁగెను. ఏది యెంత తక్కువ ధనవ్యయముతో పని చేయునో దాని యాధిక్యము హెచ్చుగుట స్వాభావికము. ఈ పోటీ ప్రథమమునుండియు ప్రస్తుతకాలము వఱకును వచ్చుచున్నది. ఆధిక్యము కొంత కాలము ఆవిరి బలమునకును కొంత కాలము జలశక్తికిని మాఱుచున్నను, జనులకు నీరు ధనవ్యయము లేక వచ్చుచుండుటచేత జలశక్తి లాభకర మనెడి యుద్దేశ మున్నప్పటికిని, ఇంజనీర్లకు మాత్రము అభిప్రాయభేద ముండెను. సంయుక్తరాష్ట్రములోను న్యూయింగ్లాండు ప్రాంతములయందలి నదులలోను జలపతనములు విశేషముగ నున్నందున అవి యచ్చటి పరిశ్రమలకు మూలాధారమై వ్యాపారమును అభివృద్ధిలోనికి కొనివచ్చినవి. ఆ కాలమందలి యావిరి యంత్రము న్యూయింగ్లాండు జలశక్తితో సరితూఁగఁజాలనందున ఆ దేశము చాల కాలమువఱకు పరిశ్రమలలో నున్నతస్థానము నాక్రమించెను. సాధారణ మైన యెత్తులో నున్న జలపతనములయొద్ద సయితము పెద్ద పట్టణములు నిర్మింపఁబడి వర్తకము వృద్ధిలోనికి కొనివచ్చెను.

కొంత కాలము గడచిన పిదప ఆవిరి బలమునకు మహాదశ పట్టినది. స్వల్పధనవ్యయముతో గనులనుండి రాక్షసి బొగ్గును తీయు సాధనము లేర్పడినవి. రైలు మార్గమున బొగ్గును విక్రయస్థానములకు కొనిపోవుటకు వీలు కలిగెను. రైలు మార్గమును కనిపెట్టిన జార్జి రాబర్టు స్టెఫెనుసనులకు అందఱును కృతజ్ఞులు. అహోరాత్రములు విరామము లేక కష్టపడు మనుజులయొక్కయు జంతువులయొక్కయు యమబాధ గట్టెక్కినది. క్షణములో బొగ్గుతో నింపిన బండి తిరిగి కనఁబడుట లేదు. దానిని చూడవలె నన్నచో కర్మాగారము దగ్గఱకు పోవలెను. ఇందువల్లను చౌకగా బొగ్గు కొనిపోఁబడుటచేతను క్రొత్త పరిశ్రమలను స్థాపించుటకు వీలు కలిగెను. ఇంతియే కాక, ఆవిరి యింజను గొప్ప మార్పును పొందెను. ఒక గుఱ్ఱపు బలమునకు ఒక గంటకు కావలసిన యుష్ణమానములు (Heat Units) క్రమముగా తగ్గుచుండుటచే దానికి కావలసిన రాక్షసి బొగ్గు కూడ తక్కువ కాఁజొచ్చెను. అనఁగా బొగ్గు ఖర్చు తగ్గిపోయెను.

| | |
|---|---|
| 1705-వ సం న్యూకోమను ఇంజనునకు గుఱ్ఱపుశక్తి ఒకటింటికి గంటకు కావలసియున్న రాక్షసి బొగ్గు | 30 పౌనులు |
| 1768-వ సం వాట్టు ఇంజనునకు | 8.8 పౌనులు |

| | | |
|---|---|---|
| 1804-వ సం | ఎవాన్సు ఇంజనునకు | ·67 పౌనులు |
| 1804-వ సం | వుల్ఫు ఇంజనునకు | 45 ,, |
| 1850-వ సం | ద్విప్యాకోచయంత్రమునకు (Compound Engine) | 2,25 ,, |
| 1880-వ సం | త్రివ్యాకోచయంత్రమునకు | 176 ,, |
| 1900-వ సం | చతుర్వ్యాకోచ యంత్రమునకు | 1.5 ,, |
| ,, ,, | డీసెలు ఇంజనునకు | 5 పౌనుల వఱకు |

పెన్సిల్వేనియాలోను ఓహియోలోను ఇంకను మెక్కు చోట్ల ఎప్పుడెచ్చట మంచి బొగ్గు చవుకగా దొరకుచున్నదో ఆయా చోట్ల నెల్ల పరిశ్రమలు చక్కగా వ్యాపింపసాగెను.

1875-వ సం. ప్రాంతమున ఆవిరి యింజనున కింకొక శక్తి సహాయము వచ్చినది. రాతిబొగ్గునుండి అంగారవాయువును తీసి దానివలన నడపఁబడు యంత్రములు కనిపెట్టబడినవి. కనిపెట్టఁబడిన తత్క్షణమే యెక్కువ మార్పులను పొందఁజాలకపోవుటచే అవి గొప్ప కర్మాగారములలో బాగుగ పని చేయఁజాలకపోయెను. కాని, చిన్న పనులకు మాత్ర ముపయోగింపఁబడుచుండెను. ఈ యింజనుయొక్క యుపయోగమువల్ల మంచి లాభము గలదు. రాతిబొగ్గు మాత్రమే కాక, ఏ యాకులను వేసి మంట పెట్టినను పని చేయును. వాయు యంత్రము ఆవిరి యింజను అభివృద్ధిలోనికి కొనిరాఁబడుచుండుటచే, జలశక్తి కొంత కాలమువఱకు తల యెత్తఁజాలకపోయెను.

పూర్వకాలము జలపతనప్రదేశమున నేర్పడిన పట్టణమునందలి కర్మాగారము లన్నియు మెట్ట ప్రదేశమునుండి పల్లపు ప్రదేశమునకు ఒకదానివెనుక నొకటి కట్టఁబడెను. తరువాత కర్మాగారాధిపతులు జలపతనమును పై కర్మాగారమునుండి క్రింది కర్మాగారమునకు పాఱునట్లు చేయుచు తమతమ జలచక్రములను త్రిప్పున ట్లేర్పఱచిరి. అన్ని చక్రములను త్రిప్పిన పిదప ఆనీటిని తిరిగి నదీప్రవాహము లోనికి విడుచుచుండిరి. నయాగరా పతనముల నుండి విద్యుచ్ఛక్తిని పుట్టించుటకు ముందు నీటిని కర్మాగారముల కెల్ల పంపునట్లును ఆ జల మాయాచోట్ల వినియోగపడిన పిదప నొక కాలువలోనికి విడుచునట్లును నిర్ణయించిరి. కర్మాగారయజమానులు తమకు కావలసిన నీటిని క్రయమునకు తీసికొనున ట్లేర్పఱచుకొనిరి.

జలశక్తి నుపయోగించుట కీ పద్ధతు లేవియు సంతృప్తికరముగా నుండకపోవుటయే కాక, ధనవ్యయము హెచ్చుగా నుండెను. జలపతనప్రదేశము కర్మాగారములతోను ఇనుపవాసములతోను నీటి గొట్టములతోను క్రిక్కిఱిసియుండెను. పెద్ద కర్మాగారములకు జలచక్రము కలిగించు శక్తికన్న నెక్కుడు శక్తి కావలసివచ్చెను. అందువలన కర్మాగారములయందు జలచక్రములతో పాటు ఆవిరి యింజనును గూడ నడపవలసియుండెను. ఆవిరి బలము సహాయమును సంపూర్ణముగ తీసివేయుటకు జలశక్తి సరిపోయినది గాదు. ఇదవఱకు స్థాపించిన కర్మాగారము లన్నియు జలశక్తితోఁ గూడ ఆవిరి యింజనును నడపుచుండెను.

## జలపాతమునుండి విద్యుచ్ఛక్తిని తీయుట

1892-వ సం. న జలశక్తియందు నూతనశతాబ్ద మంకురించినది. 300 గుఱ్ఱముల శక్తిని ప్రథమమున జర్మనీలో తయారుచేసి లాఫెను నుండి 100 మైళ్ల దూరములో నున్న ఫ్రాంకు ఫోర్టునకు 30,000 ల వోల్టుల (Volts) బలము గల శక్తిని పంపి అచ్చటి కర్మాగారమును నడపిరి. ఈ క్రొత్త పద్ధతి సులువుగాను చవుకగాను నుండునట్లు కనఁబడెను. శక్తి నొక స్థానమున పుట్టించుచు ఎంతదూరములో నున్న కర్మాగారమున కైనను విద్యుచ్ఛక్తి ప్రవాహము మార్పుల (Alternating Electric current) ద్వారా పంపవచ్చును. ఈ సమయమునసే విద్యుత్తు మోటారులలోఁ గూడ మంచి మార్పు కలిగినది. మామూలు బలముతో యంత్రముల నడపవలె నన్న మోటారునకు మునుపటికన్న తక్కువ విద్యుచ్ఛక్తి కావలసివచ్చెను.

ఈ క్రొత్త మార్పులవలన కర్మాగారము లన్నియు నొక చోట నే జలపతనములయొద్ద నుండవలె నను నిర్బంధము పోయెను. యంత్రశాల లెచ్చట నున్న నచ్చటికి తంతువుల ద్వారా విద్యుత్తును పంపి దానివలన మోటారును నడపి పరిశ్రమలను చేయుచుండిరి. పూర్వమువలె యంత్రశాలలను జలపతనములయొద్దకు కొనివచ్చుటకు బదులుగ శక్తినే యంత్రశాలలకు కొనిపోవుట కనుకూలముగ నుండెను.

గొప్ప పతనముల యొద్ద శక్త్యాలయములను గట్టి అచ్చటినుండి నలుపైపుల నెలకొనియున్న కర్మాగారములకు శక్తిని విద్యుత్తు మూలముగ పంపుటకు 1895-వ సం. న నైగరా పతనములయొద్ద ప్రారంభమైనది. ఫ్రాన్సు స్విట్జర్లాండు ఇటలీ నార్వే జర్మనీలలో గొప్ప శక్త్యాలయము (Power Stations)లను కట్టిరి. విద్యుచ్ఛక్తిని 10,000 వోల్టుల బలముతో 20 మైళ్ల దూరమువఱకును పంపుచుండిరి. ఇప్పుడు ఈ క్రొత్త పద్ధతిలో కొన్ని మార్పులను చేసి 150,000 వోల్టుల బలముతో 250 మైళ్ల దూరమునకుఁ గూడ విద్యుత్తును పంపుచున్నారు. ఈ పద్ధతి ననుసరించి యంత్రశాల లెంత దూరమున నున్నను పతనము లున్న చోట్లలో నెల్ల శక్త్యాలయములను స్థాపించుచుండిరి. జలపతనప్రదేశము పర్వతమయ మైనను పట్టణములు కట్టుటకు వీలు లేకపోయినను సులభముగా నొక జలశక్త్యాలయమును కట్టుటకు వీలుగ నున్నది. కర్మాగారములను సులభముగ స్థాపించి వాణిజ్యమును విస్తరింపఁజేయుటకు వర్తకులకు మంచి ప్రోత్సాహము నిచ్చుచున్నది.

కడచిన 15 సం. లలోను జలపతనశక్తి నుపయోగించుటవల్ల, ఆవిరి యింజనుల నుపయోగించినచో వచ్చు లాభముకన్న నెక్కువ లాభము వచ్చినది. అమెరికాలోని యావిరి యింజనుయొక్కయు జలశక్తియొక్కయు తారతమ్యాభివృద్ధి యీ క్రింది విధముగ నున్నది:

| సంవత్సరము. | ఆవిరియింజనుల గు. శ. | జలశక్తి గు. శ. |
|---|---|---|
| 1869 | 1,215,711 | 1,130,431 |
| 1879 | 2,185,458 | 1,225,379 |
| 1889 | 4,581,305 | 1,255,045 |
| 1899 | 8,139,579 | 1,454,112 |
| 1904 | 10,825,348 | 1,6641,949 |
| 1909 | 14,199,339 | 1,807,686 |

ఈ పైని చెప్పిన సంఖ్యలలో గొప్ప జలబాష్పశక్త్యాలయముల లోని గు. శ. ని చేర్పలేదు. వానిని కూడ చేర్చినచో, మొత్తపు జలశక్తి గు. శ. 6,000,000; ఆవిరి శక్తి గు. శ. 27,000,000.

నైగరా పతనములనుండి ప్రకృతము పుట్టించు శక్తికి పదిరెట్లుకన్న నెక్కుడు శక్తిని పుట్టించుటకు వీలు కలదు.

## ఆవిరి టర్బైను

ఆవిరి యింజనునకు మాఱుగా నుపయోగించుట కావిరి టర్బైను 1900-ల సం. న కనుగొనఁబడెను. జలపతనశక్తి నభివృద్ధిలోనికి కొనివచ్చుటకు విద్యుత్ప్రవాహ మెట్లు తోడ్పడెనో అట్లే ఆవిరి శక్తి నభివృద్ధిలోనికి కొనివచ్చుటకు ఆవిరి టర్బైను తోడ్ప

డెను. ఇదివఱకు ఆవిరి బలమువలన ముసలకము (Piston) నకు చలనము గలిగి దాని చివర ఇనుపయిరుసుమీఁద నున్న కర్మాగారము నంతటిని త్రిప్పఁగలుగు పెద్ద చక్రమును కదలించుచున్నది. ఇప్పు డున్నవో, ముసలకసహాయము లేకయే ఆవిరి పెద్ద చక్రమును త్రిప్పు చున్నది. అందువలన ఆవిరి శక్త్యాలయపు మూలవ్యయమును గు.శ. ఒకటింటికి 325 రూపాయలనుండి 130 రూపాయలకు కొనివచ్చెను. రాతిబొగ్గు ఖర్చులోఁ గూడ 110 గు.శ. ని 13 రూపాయలనుండి సుమారు 4 రూపాయిల 10 అణాలకు తగ్గించెను. ఈ టర్బైను యంత్రములో మలలు విశేషముగ లేవు. ఆవిరి యింజనుకన్న తక్కువ స్థానము నాక్రమించును. శక్త్యాలయపు దినవ్యయము గూడ తగ్గెను. ఇది వచ్చిన పిదప, జలపతనము క్రొత్త యావిరి శక్త్యాలయ ముకన్న చౌకగా, శక్తిని పుట్టింపఁగలదా యను సంశయము ప్రతి మనుజునకు కలుగఁజొచ్చెను. జలశక్త్యాలయములు కర్మాగారములకు దూరమున నుండుటచే దీర్ఘమగు తంతువుల ద్వారా శక్తిని పంప వలసియున్నది. అందుచేత ఎక్కువ ధనవ్యయము మాత్రమే కాక దారిలో నూటికి పదునేనువంతుల శక్తి ఖర్చగుచున్నది. కాని, ఆవిరి టర్బైనును యంత్రశాలలయొద్ద స్థాపించినచో శక్తిని సులభముగను చౌకగను కావలసియున్నపు డెల్ల నుపయోగించుకొనుట కనుకూల ముగ నున్నది. జలశక్త్యాలయమును స్థాపించుటకు సాధారణముగ గు. శ. ఒకటింటికి 488 రూపాయి లగుచున్నది. ఆవిరి టర్బైనును స్థాపించుటకు గు. శ. ఒకటింటికి 162 రూపాయిలు ఖర్చగుచున్నది. ఈ కారణములవలన ఆవిరిటర్బైనుల విలువ హెచ్చినది. జలశక్తి కా విలువ రావలె నన్నచో దినవ్యయమును తంత్రుల ఖర్చును చాలవఱకు తగ్గింపవలసి యున్నది. సంయుక్తరాష్ట్ర కెనడా దేశములలోని నైగరా మవనిగను పతనములయొద్ద జలపతనశక్తిని పుట్టించి ఆవిరి టర్బైనుల శక్తికన్న చాల తక్కువ వెల కమ్ముచున్నారు. అందువలన వర్తకు లకు లాభముండుటయే కాక, పరిశ్రమాభివృద్ధికి గొప్ప మార్గ మేర్పడినది.

సంవత్సరము పొడవునను దినమునకు 24 గంటలు పని చేయు టకు శక్తి యేకప్రవాహముగ కావలసి యున్నచో, ఆవిరి యింజను కన్న తక్కువ వెలకు సప్లయి చేయఁగలిగిన శక్త్యాలయములు మిగుల తక్కువగా నున్నవి. ఆవిరి యంత్రముల నిర్మాణమున కెంత వ్యయ మగునో అంత వ్యయముతో జలపతనాలయములను కట్టి, 35,000,000 గుఱ్ఱముల శక్తిని జనింపఁజేయు పతనములు సంయుక్తరాష్ట్రమున నింకను గలవు.

రాతిబొగ్గు గనులనుండి తీసినకొలఁది తఱిఁగిపోవుచున్నది. అందువలన ఆవిరి శక్తి ఖరీదు వృద్ధి యగు ననెడి యభిప్రాయము కొందఱికిఁ గలదు. ఈ సంగతి పూర్తిగ నమ్మఁదగినది గాదు. రాతిసి బొగ్గునుండి వేడి నంతటిని వినియోగపఱచుటకు క్రొత్త మార్గములను కనుఁగొనుచున్నారు. రాతిసిబొగ్గు ధర హెచ్చినను, బొగ్గు తీసిన కొలఁది తిఱుఁగుచున్నను, ఇంధనములలో దాని ఖర్చును తగ్గించుచుండుట లేదు. కాని, దినవ్యయము మునుపటికన్న తగ్గ దని చెప్పుటకును వీలు లేదు. ఏల నన, ప్రస్తుతము ఎంత మంచి శక్త్యాలయ మైనను బొగ్గులోని వేఁడిని నూటికి ఇరువదివంతులు మాత్రమే వినియోగ్యశక్తిలోనికి మార్చు చున్నది. మిగిలిన యెనుబది వంతుల వేడియు వృథా యగుచున్నది. ఈ వేఁడి నంతటిని వినియోగించుటకు సాధనము లేర్పడినచో, ఆవిరి శక్తి మిగుల చౌక యగుటకు సంశయము లేదు. కాని, జలశక్త్యాలయ ములు నూటికి తొంబది మూఁడు వంతులు బాగుగా పనిచేయుచున్నవి. జలశక్తి టర్బైనులు నూటికి తొంబది యెనిమిది వంతున బాగుగా పనిచేయుచున్నవి. ఆవిరి శక్తిని వృద్ధిలోనికి కొనివచ్చుటకు అవకాశ మున్నది గాని జలశక్తి కా యవకాశము లేదు.

ప్రథమమున కాలిఫోర్నియా మొదలగు దేశములలో బొగ్గు ఖరీదు హెచ్చుగ నున్నందున జలశక్తికి కొంత కాలము ప్రముఖత వచ్చి నది. కాని, కొంత కాలము చనిన పిదప విస్తారముగ చమురు గనులు దొరకు టచే ఆవిరి టర్బైనులను తక్కువ ఖర్చుతో నడపించుటకు వీలు కలిగెను. అయినను, కలిఫోర్నియాలోని జలపతనములనుండి తీయు గు. శ. 5,500,000, అన్ని పతనముల నుపయోగములోనికి తెచ్చినచో దీనికి 40 ర ట్లెక్కువ శక్తి దొరకుటకు జలపతనములు గలవు. దక్షిణామెరికా కెనడాలలో జలపతనములు వేనవేలుగ నున్నందున ఆయాదేశములలోని పరిశ్రమలకు మూలాధారము జలశక్తియైయున్నది.

శక్తి సప్లయిలో హెచ్చుతక్కువలు లేక సంవత్సరము పొడవు నను ఏకరీతిగ కావలసియున్నయెడల, జలపతనమే మూలాధారమై యున్నచోట నీటిని చెఱువులలో నింపి కాని, తక్కువ పతనకాల ములో బాష్పయంత్రసహాయమువలనఁ గాని, ఒక్కొక్కప్పుడు రెంటిని నుపయోగించి కాని శక్త్యాలయమును నడపవలసియుండును. కనుక సాధారణపతనము లున్న చోట జలశక్త్యాలయములను తగు మాత్రపు హెచ్చుతగ్గుల శక్తిని కలిగించుటకుఁ గాని, ఆవిరి సహా యమువలన హెచ్చుతగ్గులు లేక శక్తి నేకరీతిగ సప్లయి చేయుటకుఁ గాని నడపించుచుండవలెను. ఇంతకును యంత్రశాలలకు ఏ విధముగ శక్తి కావలసియుండనో ఆ విధముగ శక్త్యాలయములను నడపించుట ముఖ్యావశ్యకము.

మన హిందూదేశమునను జలపతనములు హిమాలయవింధ్య పర్వతములయందును, తూర్పుపడమటికనుమలందును పెక్కు లున్నవి. కాని, వాని ప్రముఖత యింతవఱకును మన దేశమున పెక్కుమందికి తెలిసియుండలేదు. బొంబాయి వాస్తవ్యుఁడును పారసీకమతస్థుఁడును బెంగళూరున శోధనపాఠశాలను స్థాపించి శక్చి లోహపు కంపెనీని కర్లా నేత యంత్రశాలలను విద్యార్థులను దూరదేశములకు విద్యా నిమిత్తము పంపుటకు నిధిని స్థాపించిన మహానుభావుఁడును నగు తాతాగారు పడమటి కనుమలలోని లోనవ్లాయొద్ద నున్న గొప్ప సరస్సులనుండి నీటిని క్రిందికి కొనివచ్చి జలశక్తి టర్బైనులను నడపి విద్యుచ్ఛక్తిని పుట్టించి, బొంబాయిలోని కర్మాగారములను నడపు చున్నారు. ఇట్లే మైసూరులోను కొన్ని పతనములనుండి విద్యు చ్ఛక్తిని పుట్టించి కర్మాగారములను నడపుటకు ఏర్పాటులు కావింపఁ బడుచున్నవి. ఇంకను ఆంధ్రలోయలలో నున్న పతనములనుండియు నాశికాత్ర్యంబకమునొద్ద నున్న పతనములనుండియు వేలకొలఁది గుఱ్ఱపు శక్తిని పుట్టించుటకు ప్రయత్నములను చేయుచున్నారు. శీఘ్రకాలములోనే పడమటికనుమ లెల్ల విద్యుచ్ఛక్తిమయమై పెక్కు పరిశ్రమల కాధారభూతము లగుటకు సంశయము లేదు.

తూర్పు కనుమలలోఁ గూడ ప్రయత్నములు జరిగినచో ఆంధ్ర దేశము త్వరలో నభివృద్ధికి రాఁగలదు. పతనములు లేనిచోట ఆవిరి టర్బైనులను స్థాపించి పరిశ్రమల నభివృద్ధిలోనికి కొనిరావలసిన సమ యము వచ్చినది. తరుణము దాఁటినచో లాభ ముండదు.

"ఆశతోడుత యంత్రశాలల
స్థాపనము కడు వేఁగఁ జేసియు
శాశ్వతంబుగ సుఖము నిచ్చెడి
స్వర్గతుల్య స్వరాజ్యమును గొన
వందే మాతర మనుఁడీ."

# కావ్యవిమర్శనము - సంగీతసుఖము

తణికెళ్ల వీరభద్రుఁడు గారు, ఎం. ఏ.

* ప్రబల మా మండు వేసవి ప్రకృతిఁ గాల్చి
చెండుచుండఁగ చల్లని చెట్టు నీడ
రమణి యొక్కతె తాంబూలరసముచేత
నరుణ మౌ పెదవులు నల్ల నైన మోము
నింత కుంకుమ బొట్టును ముంతకొప్పు
కలిగి యుడి నున్న తడికెలగంపమీఁద
దరువు వేయుచు పాడుచు తళుకుబెళుకు
చూపి నా మది నున్నట్టి సొదను బాపె.
సొదను బాపుటలోఁ గల చోద్య మేమి?
సుందరి యొకర్తె సంగీతసుఖసముద్ర
మందు చుక్కాని లేక యానందవాహ
మై, నదిని నీఁదుచుం బాడు నంచయట్టు
లమల మౌ ప్రణయరాగము నాలపింప
ప్రకృతి పరవశ గాదె? దైవమును వినఁడె?

ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున నూతనశకము ప్రారంభ మయిన దని యెల్లరకును తెలిసిన యంశమే. ఆంగ్లవిద్యా వ్యాప్తిచే నేమి, ప్రస్తుతాంధ్రదేశస్థితిగతులచే నేమి, ఒక నూతనశక్తి యాంధ్రుల నావహించి వారిని పూర్వపు టౌన్నత్యమును సంపాదింపు మని హెచ్చరించుచున్నది. ఈ నూతనావేశము ఆంధ్రరాష్ట్రమం దంతటను వ్యాపించి రాజకీయ సాంఘిక లోకములనే కాక కావ్య ప్రపంచమును గూడ మార్చినది. ఆంధ్రసారస్వతమం దొక నూతన వికాసము కలిగినది. ఈ నవీనోత్సాహము రెండు రూపములు దాల్చినది. జాతీయజ్ఞాన ముద్భవించుటచే మన ప్రాచీనకవీశ్వరుల యాదర్శములు పునరుద్ధారణ చేయఁబడుచున్నవి. ఆంగ్లవాఙ్మయపరిజ్ఞానము హెచ్చుటచే నాంగ్లకవుల పద్ధతులను ఆదర్శములకు ననుసరింపవలె నని కౌతూహలము జనించుచున్నది. ఈ రెండవ జాతికి సంబంధించిన కావ్యము లనేకములు తఱచుగా ప్రకటింపఁబడుచుండుటచే వానిలో నొక చిన్న కావ్యమును విమర్శన చేయవలె నను కుతూహలమే యీ వ్యాసమునకు కారణ మయ్యెను. * "సంగీతసుఖము" అను చిన్న గీతమును విమర్శనము చేయుటలో విమర్శ యన నేమిటో సూచించుటయే వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

సంగీతసుఖ మనునది యాధునికాంధ్రకవివరునిచే వ్రాయఁబడిన యొక చిన్న గీతము. ఒకానొక పురుషుఁడు మండు వేసఁగియందు ఒక చల్లని చెట్టునీడ నొక స్త్రీ మైమఱచి రాగ మాలాపన చేయుచు పాడుచున్న సమయమున తన హృదయ మె ట్లుండెనో వర్ణించి యున్నాఁడు. ఆ గానము తన కెట్టి యానందమును కలుగఁజేసినదో వర్ణించి సంగీత మెంత యాహ్లాదకరముగా నుండునో మనకు తెలియఁజేయుటయే గ్రంథకర్త యభిప్రాయము. ఈ గీతమందలి వర్ణనము స్వాభావికముగా నున్నది. వేసఁగియును చల్లని చెట్టు నీడయును మనకు మన స్వానుభవమును జ్ఞప్తికి తెచ్చుచున్నవి. ఈ పద్యము చక్కని పదములతో నిండియున్నది. ఈ చిన్న గీతము ఆంగ్లసారస్వతమందలి "లిరిక్సు"లను పోలియున్న దనుటకు సందియము లేదు. అది గాక, 19-వ శతాబ్దపు ఆంగ్లకవుల పరిచయమును చూపుచున్నది. "లిరిక్సు" అనునది యాంగ్లభాషయం దుత్సాహముతోఁ గాని విచారముతోఁ గాని యొక పురుషుఁడు నిండియున్నపుడు ఆ స్థితిని వర్ణించునది. శైలి సులభముగను చక్కఁగను ఉండును. ఒకానొక క్షణమున కవియం దెట్టి యభిప్రాయము కలుగునో ఎట్టి యావేశము జనించునో ఆ యుత్సాహమును మృదుమధురశైలిలో చిత్రించునదియే యాంగ్లసారస్వతమున 'లిరిక్సు' అని వాడఁబడుచున్నది. గ్రంథకర్త కా సమయమం దేమి తోఁచునో దానిని వర్ణించునే కాని పెక్కు రాత్రింబవళ్లాలోచించి కష్టపడి వ్రాయఁడు. రమ్య మగు పదములతోఁ గూడి మృదుమధురభావ గలిగిన దగుటచేతను కవి యొక్క యమితానందమును వర్ణించునది యగుటచేతను ఈ పద్యమును 'లిరిక్సు' అని వాడవచ్చును.

ఈ గీతమందలి ముఖ్యాంశ మెద్ది యని తోఁపవచ్చును. ఆ యువతియొక్క గాన మతిసౌఖ్యదాయకముగా నున్న దనియును అందుచే మనసునందలి బాధ లన్నియు ఆ గానామృతమును గ్రోలిన వెంటనే నశించిన వనియును కవి చెప్పియున్నాఁడు. "నా మది నున్నట్టి సొదను బాపె"నని వ్రాయుటలో తన సంగీతానుభవమును స్పష్టీకరించి యున్నాఁడు. ప్రతిమనుజునియందును కొన్ని సద్గుణములును కొన్ని దుర్గుణములును గుణిగూడియుండును దైవమందువలెనే సదుద్దేశములును మృగములందువలె దురుద్దేశములును కలసి మెలసియుండును. అది కాక ప్రతి మనుష్యునకును నేదో యొక మనఃక్లేశ ముండవచ్చును. చక్కని ప్రదర్శనము చూచినను మహాకావ్యము చదివినను మంచి గానమును వినినను మనము ప్రాపంచికవిషయములను మఱచిపోవుదుము. దృష్టి యంతయు నా పాటతో లయమయి యుండును గాన, మన మెక్కడ నున్నామో తెలియదు, సరి కదా, మనస్సునందలి కల్మష

* ఈ గీతము గతసంవత్సరపు సంచికయందు ప్రచురింపఁబడినది

మంతయు పాఁడ్రోలఁబడును. మంచి హరికీర్తనము విననపుడు విచారమంతయు మాయమయిపోయి మనయందొక యానందము జనించును. ఇది సాధారణముగా మన కెల్లరకును ననుభవమే. ఈ యనుభవమునే కవి యీ వాక్యము దిమిడ్చియున్నాఁడు. వ్యంజనయే కవిత్వమునకు పరమాత్మ మయినచో, ఈ వాక్యము కడు రమణీయముగా నున్న దనుట యతిశయోక్తి కాదు.

అట్టి గీతమును పాడునపుడు మనుష్యులేమి ప్రకృతి మాత్రము పరవశ కాదా? సంగీతసౌఖ్యము వర్ణించు టేరి తరము? మంచి సాంపయిన గానము పాడువాఁడును అనుభవించువాఁడును సంగీతసుఖ సముద్రమందు చుక్కాని లేక తిరుగు నావవలె నుందురు. మనము శారీరకతుచ్ఛసుఖములను మఱచి యానందసాగరమున మునిఁగి తేలుచుందుము. అందులో నొకానొక క్షణమందు ఆ రాగ మతిశ్రావ్యముగా నుండ, హృదయమంతయు మెత్తనగుటయే కాక నీరయి ప్రవహించును.

ఈ చిన్న గీతము కావ్య మనిపించుకొనునా లేదా యనునది వివాదాంశము. మంచి కావ్య మన నెద్ది యని మనము ప్రశ్నించుకొనవలయును. మంచి కవిత్వ మనఁగా పూర్వుల కట్టుబాట్ల ననుసరించిన గ్రంథమందుండు కవిత్వమే. ఇట్టి లిరికులు మన యాంధ్రభాషయందిదివఱలో నుండెనా లేనిచో మన కీ నూతనపద్ధతి యేల యని కొందఱు వాదింపవచ్చును. 'కావ్యము చిన్నది, పద్య మొక్కటియే కదా, ఇది యుద్గ్రంథ మెట్లగును?' అని కొందఱి వాదము. వర్ణించునది సాధారణాంశము కదా, దీనికి గ్రంథ మను పే రిచ్చుట యేమి యని కొందఱి వాదము. పదము లన్నియు సులభములును సామాన్యములును కదా, దీని శైలి మంచిదియా యని మఱికొందఱి ప్రశ్నము. మొట్టమొదట విమర్శ నన నేమి యని స్థిరపఱుపవలెను. విమర్శకారకుఁడు గ్రంథకర్త పూర్వపుపద్ధతుల నవలంబించెనా లేదా యను నంశము గుర్తింపవలె నని కొందఱి యభిప్రాయ మయియున్నది. గ్రంథము చిన్నది యయినను పెద్దది యయినను ఉన్నతభావము గలిగి లోకతత్త్వమును బోధించి మధురశైలి కలిగి మన కానందము నిచ్చెనా, అది యుద్గ్రంథముగా భావింపవలయునని మఱికొందఱి యభిప్రాయము. ఆనందము నిచ్చుట యనఁగా మన మనస్సును పవిత్రము చేసి యుత్సాహమును పుట్టించుట. మనకు మంచి నాటకము గాని కావ్యము గాని చదివిన తర్వాత మనస్సున నొక హాయి కలిగెనా, అదియే యానందము. మనము తిరిగి మఱియొక సారి యా గ్రంథమును చదువవలె నని కౌతూహలము జనించుచుండుటయే దీనికి నిదర్శనము. అట్టి సంతోషము చదువరియం దుద్భవించెనా, దీనికి కారణ మేమి యగు నని చూచుట విమర్శకారకుని తలంపు. ఈ గ్రంథమందు శైలి రమ్యముగా నుండెనా, అభిప్రాయము హృదయరంజకముగా నుండెనా, ఏ కారణముచేత నీ పుస్తకము గాని యీ పద్యము గాని మనకు సంతసము నిచ్చుచున్నది? అట్లయినచో నా యభిప్రాయ మెద్ది? అది యెట్లు నివేదింపఁబడినది? ఈ యంశములను మనము గమనించితిమా, "సంగీతసుఖము"ను నిరసించుటను మానివేతుము. ప్రప్రథమమున గీత మొక్కటి యనియు చిన్నది యనియు దీనికిని మామూలు గ్రంథములకును వ్యత్యాస మున్న దనియు మఱచిపోఁగూడదు. ఆ మాట య టుండనిచ్చి ఈ గీతమందు వర్ణింపఁబడిన విషయ మెద్ది దీని శైలి రమ్యముగా నున్నదా యని యడుగవలెను. భావమునకును పదములకును నత్యంతమైత్రి యుండుటయే శైలి. ఈ గీతమందలి పదములు సులభములును భావమున కనుకూలములును. పద్యము చదువుటకును వినుటకును సొంపుగా నుండుటకంటె శైలి మంచి దనుట వేఱు కాదే! మానవకోటి కేదయినను తత్త్వమును బోధించునా? ఉత్సాహమును జనింపఁజేయునా? సంగీత మమితసుఖము నిచ్చు ననియు మన మనము నిర్మలతను పొందు ననియు మంచి గానము వినుట యనఁగా నీశ్వరుని వాక్యమును వినుట యనియు చర్చింపఁబడినది. ఈ గీతమందు కవి యుత్సాహము వర్ణింపఁబడినది. మనకు సంతసము నిచ్చెనా యని ప్రశ్నించిన తిరిగి చదువవలె ననియు జ్ఞాపక ముంచుకొనవలె ననియు కలిగెడి కౌతూహల మేమి యని ప్రత్యుత్తర మియ్యవలెను. కావ్యము లన్నియు నానందము నిచ్చును గదా! ఉత్సాహపూరిత మయిన గీతము రసపూరిత మయిన దనుటకు సందియ మేమి?

వెనుకటి రెండు పుటలయందును శస్త్రగోళములను చేయువిధము రంగులపటములమూలమున ప్రదర్శింపబడెను. ఆ పటముల వివరము 1-8 క్రింద తెలుపబడినది.

1. గట్టి ఉక్కుతునుకలు కొలిమికి సిద్ధముగనున్నవి.
2. కొలిమినుండి సాగగొట్టుటకై తీసిన ఉక్కుతునుక.
3. జలయంత్రమునందు 12 అంగుళముల షెల్లుకై సాగదీయుట.
4. మూతిని సన్నముగ చేసి యంత్రమునుండి షెల్లును తీయుట.
5. షెల్లుయొక్క యంగమును ముఖమును చేయువిధము.
6. 12 అంగుళముల షెల్లుపీఠమును సమస్థితియందుంచుట.
7. షెల్లుయొక్క లోభాగమునను వార్నిషు చేయుట.
8. గాలి వాపునకు రాగిమూతిని బిగించుట.

ష్రాప్నెలు షెల్లులను గుల్లలను నిర్మించుట ప్రయాసముతో గూడినదియును ప్రమాదముతో గూడినదియును నైన పనియని ఇచట ముద్రించిన చిత్రపటములవలన తెలియుచున్నది. పనివాండ్రు అగ్నిముఖమున ఇనుప నిప్పురవ్వలు ఎగురుచుండగ పని జేయుచుందురు. కన్నులకును కంఠమునకును నపాయము గలుగకుండుటకై కంటి సోడులను ఊపిరి గొట్టములను వాడుదురు. ష్రాపునెలును 1784 సంవత్సరమునందు హెన్రీ ష్రాపునెలు పేరుగల బ్రిటీషు సైనికోద్యోగి నిర్మించెను. ష్రాపునెలు షెల్లులు సైనికుల గుంపులపై నుపయోగింపబడును. షెల్లునందు గుండ్లు విశేషముగనుండును. గురిపెట్టిన స్థలమునకు సామీప్యమునగాని పై భాగమునగాని పగులునట్లు లేర్పాటుచేయబడును. షెల్లులు ప్రేలి నలుదిశలను వ్యాపించి ప్రాణహాని చేయును. పదునెనిమిది పౌనులుగల బ్రిటీషు ష్రాపునెలునందు 375 గుండ్లుండును. షెల్లు 3500 గజముల దూరముపోయి పగిలినపుడు 250 గజముల పొడవును 30 గజముల వెడలుపును గలిగి 7500 చదరపు గజముల ప్రదేశము నాక్రమించుకొనును. ష్రాపునెలు ప్రేలినపుడు తలకు గాయములు తగులకుండుటకై ఫ్రెంచి సైన్యమునందు సైనికులు ఉక్కు టోపీలను దాల్చుచున్నారు. ఆకాశయానవినాశమునకై ఫిరంగులందు ష్రాపునెలు షెల్లులు వాడబడుచున్నవి.



అస్త్రాగారములను పరీక్షించుట

# రాజ్యాంగ పరిజ్ఞానము

దుగ్గిరాల వేంకటసుబ్బయ్య గారు

సీ. ఇలను గల చెమ్మ నెల్లను నినుఁడు పీల్చి
యవని కడు సారవంతమై యలరుకొఱకు
వర్ష ధారలఁ గురిసెడి పగిది నెపుడు
రాజు పన్నులు గొనవలె ప్రజలకడను. —అర్థికచరిత్ర

మానవదేహమునకు పెక్కు భిన్నాంగము లున్నట్లె, జాతీయజీవనశరీరమునకును బహువిధప్రతీకము లావశ్యకము. అందు సాంఘికరాజ్యాంగములు ప్రముఖము లైనవి. నైతిక రాజ్యాంగాదులు కొంత సంఘ మున్నప్పుడే ఆ సంఘప్రచారమునకే ఆ సంఘపురోభివృద్ధికే పరికల్పితములు. స్వోదరపోషణాదులతో నిమిడియున్న వ్యక్తిత్వమును దాఁటి భార్యాబిడ్డలు అను సాంఘిక సంబంధమును పాల్గొన్నప్పుడే, పెక్కు బాధ్యతలకు పెక్కాలోచనలకు పెక్కు కష్టములకు చిక్కవలసివచ్చును. ఈ సాంఘికత్వమునందలి మహత్తరధర్మములను గంభీరసాధనలను పోనుపోను, స్వీకరించి యాచరించుచున్న కొలఁది సౌఖ్యప్రపంచమున కేంద్రస్థానమలంకరింపఁగలము. ఇంత ప్రముఖ మగు సాంఘికమునకంటె రాజ్యాంగమే ముఖ్య మైనదిగను శ్రేష్ఠ మైనదిగను పొడకట్టుచున్నది. ఈ రెంటి తారతమ్యములను కొలఁదిగ విచారింతము. మానవనైసర్గికమును బట్టి సాంఘికశిక్ష సంభవింపవచ్చును, లేకపోవచ్చును. కొందఱా శిక్షను తృణీకరించి విజృంభింపవచ్చుచు. రాజకశిక్ష యట్లు గాక, దుర్గమముగను తీక్ష్ణముగను నుండును. సాంఘికశిక్ష కఠినము. ప్రభుశిక్ష అత్యంతకఠినము. ప్రాతఃకాలమున శయనమునుండి లేచిన దాది ప్రతివాఁడును సాంఘికసాంప్రదాయములందును నిబంధనలందును తగుల్కొని కొలఁదిగనో గొప్పగనో ప్రవేశము కల్గియుండును. రాజ్యాంగమం దట్లు గాక, నూటికి ముక్కాలువంతుకంటె నెక్కువ మంది దురవగాహులై దూరముగ తొలఁగియుండుటచే, చేఁజేతుల ముప్పు తెచ్చిపెట్టుకొనుచున్నారము! మన జీవితమునకు నూతనచైతన్యమును హృదయవాసులకు నూతనవికాసమును నొసంగున దేది? స్వేచ్ఛ. ఈ స్వేచ్ఛామూలముననే, నూతనోజ్జీవనసాధనవిధానములు సుఖసంతోషములు ప్రాప్తింపఁగలవు. ప్రతివాఁడును హృదయరాజ్యమునందు భూతలస్వర్గమును సందర్శించుచు ధన్యుఁ డగుచుండవచ్చును. సృష్టికర్త పుట్టువుతోడనే మర్త్యుల కేమి, పశుపక్షిపిపీలికాదుల కేమి; యమూల్య స్వేచ్ఛాధనమును దయచేసియున్నాఁడు. అల్పజంతువుల స్వేచ్ఛ అధికజంతువుల యధీన మైనట్లె, అజ్ఞానుల స్వేచ్ఛాస్వాతంత్ర్యములు జ్ఞానజ్యోతిచే ప్రజ్వరిల్లు నన్యవ్యక్తుల వశమగుట ప్రకృతిస్వభావము. స్వేచ్ఛ సాంఘికస్వేచ్ఛ రాజకస్వేచ్ఛ యని రెండు విధములు. సాంఘికస్వేచ్ఛ జననీజనకుల బోధవల్లను స్వవిమర్శనవల్లను అనుభవమువల్లను అలవడఁగలదు. రాజకస్వేచ్ఛ రాజకీయగ్రంథపఠనముచేతను ప్రపంచచరిత్రవిచారణచేతను కొంతవఱకు మాత్రమే యుదయించును. ఆ స్వేచ్ఛను కేవలము పరిజ్ఞానమనియే చెప్పవలసివచ్చును. "ప్రభువులతో పోరాటము కత్తులతో చెరలాట" మన్నట్లు మా హక్కులను మాకు దయచేయుఁడని మాటాడినచే కొన్ని చోట్ల మానమర్యాదలు మనఁజాలవు. స్వాతంత్ర్యసముపార్జనము విశేషకష్టసాధ్య మైనను మానవయంత్రమునకు విధి లేని సాధన మగుటచే తప్పదు. దేశీయులు రాజకచైతన్యమును సంపూర్ణముగ కల్గియున్నప్పుడే జనసామాన్యపు హృదయభూముల స్వాతంత్ర్యబీజములు బాగుగ నాటుకొన్నప్పుడే, మనుజునకు మూలసూత్రము లగు ప్రాతిపదికస్వామ్యములను నిక్కముగ ప్రతీక్షింపఁగలరు. తప్పక సాధించుకొనఁగలరు. విదేశీయులు ప్రభువు లైనపు డెంత న్యాయైకశీలు రైనను, కొంత భేదాభిప్రాయ ముండుట సహజము. ప్రభుత్వము వారిని కోఱవడిన తన సక్రమ మగు హక్కుల నడిగి కైకొనుటకు మొట్టమొదట ధైర్యసాహసములు లేకున్నను, రాజకీయజ్ఞానానుభవమైనకొలఁది, అన్యదేశరాజ్యప్రకృతులను పరిశీలించిన కొలఁది, ఆత్మవిశ్వాసము బలమైన కొలఁది, అధైర్యము సంకోచభావములు పటాపంచలై, న్యూనముగ నున్న స్వాతంత్ర్యేచ్ఛ విపులమై వెన్నుదన్నుచు, వాంఛాసాఫల్యతకు ప్రోత్సహింపఁగలదు. వ్యక్తివికాసము స్వాతంత్ర్యబలసంజనితము. స్వాతంత్ర్యబలోద్ధరణము వ్యక్తివికాససమాశ్రయము. మంచి తెలివితేటలు గలవాఁడే స్వాధికారములను గాంచఁగల్గును. తన కోరిక ప్రకార మాచరించుటకు స్వాతంత్ర్య మున్నప్పుడే బుద్ధి యభివృద్ధి పొందును. స్వాతంత్ర్యార్గళము నైసర్గికగుణౌన్నత్యప్రతిబంధకము. పంజరబద్ధ మగు శుకమునకు స్వేచ్ఛాసంకలితప్రవృత్తి యెక్కడిది? కారాగృహబద్ధుఁ డగు నిర్వక్రపరాక్రమక్రమాకలితచిత్తునకాత్మబలవ్యక్తీకరణశక్తి యెక్కడిది? కాని జీవకళావికాసమునకు నావకాశ మెక్కడిది? ఉన్నను లాభ మేమి! నివురు గప్పిన నిప్పుమాడ్కి బూదియం దడఁగిన బంగారుమాడ్కి నిష్ప్రయోజకము కాదే? విదేశములలో సాంఘికశక్తియే మిక్కుటము. కాని, మన దేశములో రాజ్యాంగమున కున్న ఖరతరప్రభావము మఱి దేనికిని లేదు. రాజకశాసనమూలమున స్వాతంత్ర్యము నిరుద్ధ మగునట్లు సాంఘికసంబంధమున సగభాగ మేని కానేరదు. దేశసంరక్షకశాసనమునో పత్రికాశాసనమునో ప్రయోగించి అచ్చట నుపన్యాస మొసంగరా దని కాని ఆ పత్రికను ప్రచురింపఁగూడ దని కాని యాజ్ఞాపించిన లోఁబడినట్లు, మనకు వ్యతిరేకముగ వ్రాయుచున్న మద్రాసు మెయిలుగు

తెప్పింపఁగూడ దనియు మద్యపాననిషేధ మొనర్పవలె ననియు కన్యావరశుల్కము నంగీకరింపఁగూడ దనియు దేశీయనాయకు లేమి దేశభాషావార్తాపత్రిక లేమి యొక్కపెట్టున గగ్గోలు పెట్టుచున్నను బహిష్కారపు తీర్మానములను అంత్యులను ప్రకటించుచున్నను లోఁబడుదురా? కారణ మేమి? మనస్సులు వేఱు, మతములు వేఱు, ఆచరణల వేఱు. అయినను అందఱు నొక్క రీతిగనే వర్తింతురా? అందు మన భారతీయులకు, వారిలో నాంధ్రులకు, కలసిమెలసి ఘనకార్యములఁ గావించెడి యలవాటు తప్పి చాల కాల మైనది. ప్రభుత్వాధికారు లందఱు శాసనమును తలఁ దాల్చి అమలులోఁ బెట్టవలసినదే. ప్రజ లందఱు శాసనము నామోదింపవలసినదే. రాజకీయ విజ్ఞాన మెఱుంగని సంఘములో జీవకళ సంపూర్ణముగ నున్నట్టు భావింపవలదు. కొంతవఱకేని వ్యావహారికజ్ఞానము ప్రతివాఁడును కల్గియున్నచో, కొంపలు మొదలంటఁ గూల్చెడి యీ దుర్వ్యాజము లగు వ్యాజ్యెములు పెచ్చుపెరుఁగునా? పొట్టకూటికై ఎలుకమీఁద పిల్లిని పిల్లిమీఁద నెలుకను ఎక్కించుచు మందభాగ్యు లగు రైతుల నోళ్లలో దుమ్ము గొట్టెడి యీ ప్రయివేటు ప్లీడర్లు కావలసివత్తురా? ఏ క్రయపత్రము వ్రాయించుకొనుటకో కరణము కొంపచుట్టు కాళ్లు విఱుగునట్లు తిరుగుచు చెప్పినట్లు చేయుచు పసుము కాక ముడుపు లప్పుడప్పుడు చెల్లఁగట్టుచు సగము చచ్చి తిరుగవలసివచ్చునా? క్రింది యుద్యోగు లొనర్చు దుండగములను పైయధికారులకు తెల్పుకొనుటకు ధైర్యము లేక ఏమి మాటలాడిన నేమి మూఁడునో యని మూలఁబడి యుండవలసివచ్చునా? ప్రతి సామాన్యోద్యోగస్థునకు నేదో యొక రీతిని ముడుపులు మూటగట్టుకొని వెళ్లి సమర్పింపవలసివచ్చునా? వారి యనుగ్రహమునకు నిరీక్షింపవలసివచ్చునా? ఈ ముడుపులు చెల్లించుట నాల్గు రూపాయల జీతము గల నాయకునకుఁ గూడ కళ్లు నెత్తికెక్కుట.—ఇవన్నియు రాజకీయజ్ఞానము లేనివారు నేర్పినవి కావే? ఇదంతయు ప్రజలయొక్క లోపమే; ప్రజల యవివేకమే. ఏ డిపార్టుమెంటున కే హక్కులు గలవో, ఏ యధికారి కే యధికారము లున్నవో, ఎట్లు ప్రవర్తింపవలయునో, ఆయా విధుల నెప్పటికప్పుడు దేశభాషల ద్వారా ప్రచురించుచు సౌలభ్య మొనగూర్చుచుండ, అధికారులయొక్క హక్కులను గాని తమ హక్కులను గాని కాసువీసమేని కనుఁగొనని లోపము ప్రజలదే కాదా? మన విద్యాధికులకు కూడ పారతంత్ర్యమం దున్న యాసక్తి భక్తి రక్తి స్వదేశ స్వాధికార స్వాభిమానములం దిసుమంతయు లేకున్నది. గ్రామపంచాయితీలు యూనియనులు మునిసిపాలిటీలు తాలూకా బోర్డులు డిస్ట్రిక్టు బోర్డులు మొదలగు స్థానికప్రతిష్ఠాపనల విషయమునందైన కొంత పరిజ్ఞానమును పరిచయమును గడింపవలసి యున్నది. రాష్ట్రీయశాసనసభ ఇండియా సామ్రాజ్యశాసనసభ లన నేమో ఎంతమంది మన ప్రతినిధు లున్నారో వారు మన కేమి సౌకర్యములను కల్పించుచున్నారో ప్రీవీ కౌన్సి లన నేమో ఈ మొదలగు సంగతులు సంగ్రహముగ నైనను పల్లెటూళ్ల విద్యావంతులకు కూడ తెలిసియుండవలెను. పాలితపాలకుల ప్రధానధర్మము లెవ్వియో అన్యోన్యసంబంధ మెంతవఱకుఁ గలదో పూర్వహైందవరాజుల పరిపాలనకును ప్రకృతాంగ్లేయపరిపాలనకును భేద మేమియో పాశ్చాత్యరాజ్యపద్ధతు లెట్లున్నవో క్లుప్తముగ నైనను గ్రహించియుండుట యత్యంతావశ్యకము.

## మన దేశమందలి ప్రాచీనరాజనీతి

మన పూర్వికుల వ్యావహారికప్రజ్ఞ యనుపమానము. ఆ తురుష్కుల దాడులకు ఆ గ్రీకు సంరంభములకు ఆ పరాసు విజృంభణములకు బీటవోయి వెఱఁగంది పడరాని బాములు పడిన మనవారు గ్రామ పంచాయితీ సభలను పరిత్యజించిరా? ప్రతి గ్రామమునను పెద్దమనుష్యులు వ్యవహారధర్మములం దాఱితేఱినవారు గ్రామములోని సర్వవ్యవహారములను న్యాయముగను నిష్పక్షపాతముగను స్వకీయానుభవరీత్యా చక్కఁగ తీర్చుచు, ఎవరియాస్తికిని హక్కులకును భంగము రాకుండ ఏ కలఁతలు ఏ చేతఁగాని దిల్లర చేష్టలు లేకుండ గ్రామస్థుల నందఱ నొక్క యడుగుమీఁద నడపలేదా? ఇప్పటివలె కోర్టులు ప్లయింటులు తప్పుడు సాక్ష్యములు మితిమీఱి యున్నవా? ఈ వ్యాజ్యెముల మూలమున నిల్లు గుల్లయై న్యాయము సున్నయై మానమర్యాదలు మాయమై పోవ, 'ఎందుకీ వ్యాజ్యెము వచ్చెరా? భగవంతుఁడా!' యని వందురువా రెందఱు లేరు? ఈ వ్యాజ్యెములవలన ధన మంతయు దుమ్ములో పోసికొన్నట్లగుచున్నది. ప్రతి గ్రామమున నొక్క పంచాయితీ సభను స్థాపించుట కా గ్రామప్రముఖు లుద్యమించి మాతృదేవతాపాదసన్నిధానమున తమ దేశాభిమానకార్యములను కానుకలను సమర్పించి దీవనలను పడయరాదా? మాతృస్వరూపిణిని సత్కార్యపుష్పమాలచే నలంకరించి భజింపరాదా? స్వరాజ్యసౌధారోహణమునకు ప్రథమసోపాన మగు పంచాయితీ సభలు ప్రతి పల్లెయందును బయల్వెడలునట్లు ప్రయత్నపడుట ఆధునిక దేశాభిమానుల ముఖ్యకర్తవ్యము. మొన్న మొన్ననే వెలువడిన యూనియను పంచాయితీ చట్ట మెంతవఱకుపకరించునో చూడవలసియున్నది.

## విదేశీయుల రాజకచైతన్యము

విదేశములలో రాజకీయజ్ఞానము కుగ్రామములందు సయితము నానాఁటికి పెచ్చుపెరుఁగుచున్నది. పాశ్చాత్యదేశములలో రాజకీయధర్మములు నిబంధనలు రానబాటలగుచున్నవి. ఆ దేశీయులకు ప్రభుత్వాందోళన మన్నను విమర్శన మన్నను పిఱికితనము సంకోచము లేనే లేవు. అట్టి యాందోళనావశ్యకత కల్గినప్పుడు పాకీవాఁ డేమి కూలివాఁ డేమి ధనికుఁ డేమి దరిద్రుఁ డేమి ప్రతివాఁడు నొకని కంటె నొకఁడు ముందంజ వేయుచు వెనుదీయక కొంతకొంత సంబంధమును పాల్గొందురు. గ్రీసు రోము ఇంగ్లాండు అమెరికా మొదలగు దేశములవారు తమ హక్కులకై స్వాతంత్ర్యమునకై పెక్కుసార్లు పోరాటము లొనర్చియున్నారు. అందు పూర్ణముగ నెగ్గియున్నారు. ఆ దేశీయులు సంపూర్ణ మగు హక్కులను గల్గియున్నారు. రాజ్యాంగయంత్రము ప్రజలకు వ్యతిరేకముగ నెప్పుడు తిరుగనేరదు. ప్రతి కూలివాఁడు సయితము పత్రికల ననుదినము తప్పక చదువుచుండును.

ఆ దేశములందలి పత్రికలకు పరిపూర్ణస్వాతంత్ర్యము కలదు. విద్యార్థుల కధికతరసౌలభ్యములు కలవు. బీదలకు తగు సాహాయ్య సంపత్తి కలదు. శిశుసంరక్షణకు ప్రబలప్రోత్సాహము కలదు. పారిశ్రామికులకు ధనాగారములు తక్కువ వడ్డీతో ధనసాహాయ్య మొనర్చును. వే యేల? ఆదేశముల రాజకీయపరిస్థితు లన్నియు దేశోన్నత్యమునకు పట్టుకొమ్మలై ప్రజాసౌకర్యములకు మార్గదర్శకములుగ నున్నవి. అమెరికాలో నధ్యక్షుని యెన్నికకు నాల్గు మాసములు ముందుగనే, ఆబాలగోపాలము ఉత్సవములు ఊరేగింపులు ఉపన్యాసములు మొదలగువానితో మునిగి తేలుచుందురఁట. కారణ మేమి? వారికి రాజకీయమం దున్న ప్రేమయే. వారికి రాజకీయ విద్య వెన్నతో పెట్టుచున్నట్టు కన్పట్టుచున్నది.

## హిందూదేశస్థితి — మన విధులు

ఆధునిక భారతీయ రాజ్యాంగపద్ధతులు మిగుల క్లిష్టముగ నున్నవి. మన పౌరుషశక్తులు విజృంభించుట కాయుధమును చేతఁ బట్టరాదు. విద్యయందా, వివిధదేశములకంటె వెనుకఁబడియున్నారము. పరిశ్రమలయందా, మూలఁబడియున్నారము. ఆర్థికమందా, వ్యర్థులముగ నున్నారము. అందుచే సమస్తనాగరిక దేశీయులచేతను హేయముగను చుల్కనగను చూడఁబడుచున్నారము. పౌరుష శక్తులు లేకనా? వక్తృత్వధర్మ మెఱుంగకనా? బుద్ధివైశద్యము లేకనా? ప్రాఙ్ఞ్యము లేకనా? కాదు, కాదు. మఱెందుచేత? సారవంత మగు దేశము లేకనా? కాదు. ఇంగ్లాండు జర్మనీ ఫ్రాన్సు మున్నగు దేశములలో నూటికి కఱువదియంది విద్యావంతు లుండ, సరస్వతీమహాదేవికి పుట్టినిల్లగు హిందూదేశమున పట్టిపట్టి వ్రాలు చేయువారిలో సయితము నూటి కెనమండుగురా? వత్సరమున కొక్కొక యాంగ్లేయునికి 750 రూప్యము లాదాయము వచ్చుట నటుంచి, అన్నిటియం దధమదశలో నున్న రష్యనునకు 150 రూప్యములు వచ్చుచుండ, సకల సస్యపరిశోభిత మగు భారత సామ్రాజ్యనివాసునకు 20 రూపాయలా యాదాయము? ఏ మిది! ఈ యిరువది రూపాయలతో సంవత్సరమువఱకు చాలియు చాలక ప్లేగు రెండు నెలలో నీ కాలము గడపవలసినదేనా? హా! భారతమాతా! నీ తనయుల కీ దశ యెట్లు తొలంగునో దయచేసి తెల్పెదవా?

కొన్ని విధుల నిట వివరించుచున్నాఁడ:—

1. స్వాతంత్ర్య సంరక్షణకు మూలసూత్ర మగు స్వరాజ్య సంపాదనమునకై సత్క్రమకార్యదీక్షను నిశ్చలభావములను కలిగియుండవలెను. హోము రూలు లీగులను స్థాపింపవలెను.

2. స్వరాజ్య మన నేమో మనవా రిప్పు డెట్టి స్వరాజ్యము నభిలషించుచున్నారో దేశీయమహాసభవారి విశాలభావము లెవ్వియో మనకు ప్రకృతము రాజకీయసంస్కరణము లెంతవఱ కావశ్యకమో గుర్తెఱుంగవలయును.

3. రాజకీయ పరిజ్ఞానమును సంపాదించుకొనుటకై జిల్లా గెజెట్ దినపత్రిక రాజ్యాంగతంత్రము మొదలగు రాజకగ్రంథములు తెప్పించుకొని యనుదినపఠన మొనర్పవలయును.

4. తమతమ గ్రామములలో గ్రామపంచాయితీ సభలను స్థాపింపఁ బ్రయత్న పడవలెను.

5. ఆత్మగౌరవమును కాపాడుకొనుచు దేశసేవకై పాటుపడుచుండవలయును.

ముఖ్యముగ పై విషయములందు పల్లెటూళ్లవారికి పరిచయము కలుగవలయును. ఇంకను రాజ్యాంగసంస్కరణములను గూర్చి సత్క్రమాందోళనము ప్రతి పల్లెలోను ప్రతి గ్రామములోను లెస్సగ వ్యాపించినచో, కొన్ని సౌకర్యములను ప్రభుత్వమువారు తప్పక దయచేయఁ గల రని నా విన్నపము.

తే. జనుల రక్షించి పోషించి సంస్కరించి
యెంతయును దయ నా ధరాకాంతుఁ డేలి
వాస్తవం బగు తండ్రిగా పరిణమింప
జన్మమునకును మాత్రమే జనకు లైరి. —ఆంధ్రరఘువంశము.

# అబలావిలాపము

బుడమగుంట శివరామయ్య గారు

అతివలు వ్యవహారచతురలే కానిచో
లెస్సగా రాజ్యంబు లేలు టెట్లు?
కాంతలు చదువులే కను చెడ్డ లే వైన
సభలలో వాదముల్ సలుపు టెట్లు?
హ్యాయముఖను మబలల కర్తమే కాకున్న
అరివర్గమును నుఱుమాడు టెట్లు?
చెలులకు పరిణయస్వేచ్ఛయే లేకున్న
వలచిన ప్రియులను బడయు టెట్లు?
బ్రహ్మచర్యాధికారమే భామలకును
అవని లేకున్న యోగిను లౌట యెట్లు
సంభవించెను తొల్లింటి సతుల కెల్ల?
ధర్మబుద్ధిని గనరె సధర్ములార!

పెండ్లాడఁగా వచ్చు వెలఁదిపై వెలఁదిని,
ధవుఁ డీల్గినను గోరఁదగదు ధవుని;
స్వేచ్ఛ యుండఁగవచ్చుఁ జెట్టవట్టియు పీడ,
చెట్టవట్టుట కైన స్వేచ్ఛ తగదు;
పరుగునఁ బోఁదచ్చు పగఘాములకు గూడ
సఖులఁ జూడఁగ నైనఁ జనుట తగదు;
అపహరింపఁగవచ్చు వ్యక్తిస్వతంత్రత
స్వీయస్వతంత్రత వేఁడఁజనదు;
ఇట్టి యన్యాయ మెందైన నిలను గలదె?
పొందరానట్టి యధికారములను పొంది
పేగులఁ జేయుచు లోకంబు పురుషు లుండ
తగిన యధికారములె పొందఁదగరె చెలులు?

# బ్రహ్మోపాసన

పాలపర్తి నరసింహము గారు

ఏనాఁడు మనుష్యుఁడు పుడమిపై జనన మొందెనో నాఁడే బ్రహ్మోపాసనకు మూలబీజ మేర్పడియెను. ఈశ్వరునిచే సృజింపఁబడి యీశ్వరునిచే సంరక్షింపఁబడుచున్నను, తరులతలును పశు పక్షి కీటకములును తమ జన్మదాతను తమ సంరక్షకుని గ్రహించి భజింపలేకయ్యెను. కాని మనుష్యుని స్థితి యట్టిది గాదు. మనుజుఁడు తన్ను పుట్టించి పోషించుచున్న భగవంతునిఁ దెలిసికొనఁగల బుద్ధిసంపదను బడసియున్నాఁడు. సృష్టి నంతయుఁ దన జ్ఞానసాధనముచేఁ బరిశీలించి సృష్టికర్త గలఁడని యతఁడు నిర్ధారణ చేసియున్నాఁడు. అంతటితో నూరకుండక తత్కర్తయొక్క గుణాతిశయముల గ్రహించి నుతించి యానందించుచున్నాఁడు. ఆహా! యేమి మానవుని సౌభాగ్యము! పరమేశ్వరుఁడు మనుష్యసంతానమున కొసంగిన వరానీకములలో నెల్ల నియ్యదియే యత్యంతశ్రేష్ఠ మైనది. ఈశ్వరుని గ్రహించి యుపాసించెడు నధికారమును పొందినవాఁ డగుటచేతనే మనుజుఁడు సృష్టికి శిరోభూషణమై వెలయుచున్నాఁడు.

## అవస్థాత్రయము

సకలేతరవిషయములందువలెనే బ్రహ్మతత్త్వనిర్ణయమునందును బ్రహ్మోపాసనయందును మనుష్యుఁడు క్రమవికాసమును గాంచుచున్నాఁడు. పృథ్విపై నుదయింపఁగనే మహాశక్తివంతము లగు భూతములు మనుష్యునికి నల్దెసలఁ గాన్పించెను. తన ప్రచండకిరణజాలముచే సమస్తపదార్థములను తపింపఁజేయుచు సూర్యుఁడు వెల్గుచుండెను. సకలజంతుప్రాణాధార మయ్యు నొకానొక సమయమున ఝంఝామారుత మై యచలముల నయితము చలింపఁ జేయునంతటి తీవ్రతతో వాయువు వీచుచుండెను. సమస్త సస్యాభివృద్ధికిని ముఖ్యావశ్యక మైన వయ్యు నొక్కొకప్పుడు దేశ మంతయు వఱదలతో నిండిపోవునట్లు మేఘజాలములు కుంభవృష్టిని గురియుచుండెను. మహాబలోపేతము లగు నీ భూతములను గాంచిన నేవాఁడు భయాకులచిత్తుఁడు గాకుండును? నతశిరస్కుఁడు గాకుండును? ఈ సూర్యాదులతో మైత్రిని సాధించినఁ గాని తన జీవనము గడపఁజాల దని యెంచినవాఁడై దేవతలనుగా భావించి మనుష్యుఁడు వానిని పూజింపఁ దొడంగెను. ఫలపుష్పాది ద్రవ్యములే గాక తాఁ బ్రీతితో భుజించెడు సాధుజంతువుల సయిత మతఁడు దేవతల కర్పించుచుండెను. ఈ చందమునఁ గానుకలచే దేవతల సంతోష పెట్టుచు తా సుఖముగా జీవింపఁగల్గునట్లు పాఁడిపంటల దయసేయుమని తద్దేవతల వేఁడికొనుచు మనుజుఁడు ధర్మజీవనముయొక్క ప్రథమావస్థను గడపెను. తమ శరీరసౌఖ్యమునకుఁ దోడ్పడు వరములనే కోరుచు పూజల సల్పెడు మనుష్యులు నేఁడును లేకపోలేదు. అయినను దేహసౌఖ్యమునకంటె నధికమైన సౌఖ్యము వేఱొండు గలదని గ్రహించి తత్సాధననిమిత్తమై భగవంతుని నారాధించెడు బుద్ధిమంతులు బయలుదేఱిరి.

మహాశక్తిసంపన్ను లగు సూర్యాదిదేవతల కెల్ల నధిష్ఠానదైవత మొక్కటి గల దను సంగతిని మనుష్యుఁడు కాలక్రమమునఁ దెలిసికొనెను. ఆ దైవతమే బ్రహ్మ మను పేర మన యుపనిషత్తుల యందుఁ బిలువఁబడుచున్నది.

“భయా దస్యాగ్ని స్తపతి భయా త్తపతి సూర్యః భయా దిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యు ర్ధావతి పఞ్చమః.”

తత్పరబ్రహ్మము సకలభూతముల శాసించువాఁ డనియే కాక జ్ఞానసంపన్నుఁ డనియు దయావంతుఁ డనియు న్యాయకారి యనియు పతితజనోద్ధారకుఁ డనియు మనుష్యుఁడు తన తపోమహిమచే గ్రహించెను. గ్రహించి మానవుఁ డెట్లు అప్పరమపురుషుని సమీపించి దర్శించి యాత్మోన్నతిని పొందఁ బ్రయత్నింపక యూరకుండఁగలఁడు? ఐహికసౌఖ్యములే పరమవాంఛనీయము లని తలంచుచుండిన కాలము దాఁటిపోయినది. ఆముష్మికసౌఖ్యములకొఱకుఁ బరితపించు కాలము వచ్చినది. ఎచ్చట లభించు నీ యాధ్యాత్మికసౌఖ్యము? పరమేశ్వరుఁడే దయాజ్ఞానానందములకు నిలయము. అందుచేతనే మనుష్యుఁడు పరబ్రహ్మమును “నన్ను పుణ్యాత్ముని చేయుము. నన్ను దయావంతుని చేయుము. నన్ను జ్ఞానవంతుని చేయుము” అని ప్రార్థింప నారంభించెను.

ఈ యవస్థను సయితము మించిన యుత్తమావస్థను మానవుఁడు గ్రహించెను. ఇచట నే విధమైన ప్రార్థనములకును చోటు లేదు. ధనముపైఁ గోరిక యుండదు. కీర్తిపై నాశ యుండదు. సత్యవంతుని చేయు మని దయావంతుని కావింపు మని ప్రార్థించుటకు అవకాశము కనిపింపదు. బ్రహ్మమే యీ యవస్థయందు వాంఛితార్థము. పరమేశ్వరునితోడి సాంగత్యమే పరమేశ్వరునితోడి సంభాషణమే సర్వకాలమును పరమేశ్వరునిలోని వాసమే భక్తుఁడు గోరుచుండును. ఇట్టి బ్రహ్మోపలబ్ధియే సకలభజనసాధనములయొక్కయుఁ బరమలక్ష్యము. ఇదియే ధ్రువ ప్రహ్లాదాది భక్తచారిత్రములచే మనకుఁ బురాణములు బోధించు మహోపదేశము. ఏ మానవుఁడు గాని యిట్టి యుత్తమదశను హఠాత్తుగాఁ బొందఁజాలఁడు. ఈశ్వరదర్శనలాభమును బొందిన భక్తవరేణ్యులయొక్క కాని ఋషిసత్తములయొక్క కాని చరిత్రలఁ బరిశీలించితిమేని పూర్వోక్తము లయిన త్రివిధావస్థలును నందుఁ గనఁబడును. సంఘములయొక్కయు జాతులయొక్కయు జీవనమునందే కాక సాధారణముగాఁ బ్రతిమనుష్యుని

యొక్క యాధ్యాత్మికజీవనమునందును నీ యవస్థాత్రయము కనిపించుచుండును. ధర్మజీవనముయొక్క యుషఃకాలమునందు మనుజుఁడు సామాన్యముగా భౌతికసౌఖ్యములచేతనే యీశ్వరుని వైపునకు ఆకర్షింపఁబడును. జ్ఞానచక్షువు వికాసము నొందినకొలఁది నైహికసౌఖ్యములమీఁది యిచ్ఛ తగ్గ నాముష్మికసౌఖ్యములమీఁది ప్రేమ హెచ్చును. ఆధ్యాత్మికసౌఖ్యానుభవ మతిశయించినకొలఁది పరమేశ్వరునితోడి నిరంతరసహవాసాభిలాష జనించును. తన యిచ్ఛ యేదియో యీశ్వరేచ్ఛ యేదియో తా నెవరో యీశ్వరుఁ డెవరో వేఱుపఱచుటకు సయితము వీలు గానంతగా బ్రహ్మైక్యము పొంద భక్తుఁడు వాంఛించును. ఈ యైక్యమునకు నేపాటి భంగము సంభవించినను అతఁడు పట్టరాని దుఃఖము ననుభవించును.

## త్రివిధభావములు

ధర్మజీవనముయొక్క పరమలక్ష్యమైన యీ బ్రహ్మోపలబ్ధియందు మువ్విధములైన భావములు గలవు. ఆత్మ మూఁడు ప్రకారములయిన వ్యాపారముల నలుపుచుండును. ఆత్మ చింతించును, భావించును, సంకల్పించును. ఒక్క యాత్మయే యీ కార్యముల నెల్లఁ జేయుచున్నను చేసెడు కార్యమును బట్టి యొకప్పుడు బుద్ధి యనియు, వేఱొకప్పుడు హృదయ మనియు, మఱియొకప్పుడు ఇచ్ఛ యనియు, నామములఁ దాల్చుచున్నది. సకలప్రకృతియందును ననంతమైన జ్ఞానమంతర్నిహితమై యున్నది. మనుష్యుఁడు తన బుద్ధిసాహాయ్యముచే నీ జ్ఞానధనమును బడయుటకై నిరంతరకృషి సలుపుచున్నాఁడు. అనఁగా జ్ఞానస్వరూపియై సృష్టియందు దాఁగియున్న యీశ్వరుని పొందఁ యత్నించుచున్నాఁడు. తన గర్భమున నఖండసత్స్వరూపునిఁ దాల్చియున్న కారణముచేతనే విశ్వ మింత శోభాయమానమై విరాజిల్లుచున్నది.

ఈ చందముననే మనుజుఁడు తన హృదయమూలమున నిజజననీజనకులను సోదరాదిబంధువర్గమును ప్రేమించుచున్నాఁడు. స్వదేశస్థులను వారి యెడను పరదేశస్థులయెడను ననురాగమును జూపఁగల్గుచున్నాఁడు. ప్రకృతిసౌందర్యమును గని యాశ్చర్యనిమగ్నుఁ డగుచున్నాఁడు. 'వసుధైవ కుటుంబక' మ్మను సూక్తికి సాక్షీభూతులై వెలుఁగు మహాత్ములు సయితము ప్రపంచమున లేకపోలేదు. ఇఁక నంతరాత్మోపదేశము నాలకించి కష్టసాధ్యము లగు ఘనకార్యముల నిర్వహించి యత్యంతతపోబలమును గనఁబఱచువారును గలరు. మనుష్యుఁడు తన యిచ్ఛాశక్తియొక్క సాహాయ్యముచే సృష్టియందుఁ గల శుభేచ్ఛను గ్రహించుచున్నాఁడు. ప్రతివిజ్ఞానశాస్త్రజ్ఞుఁడును తన్ను ప్రకృతి మోసపుచ్చ దనియెడు దృఢవిశ్వాసమును గల్గి వర్తించుచున్నాఁడు. సత్స్వరూపి యీశ్వరుఁ డని యెఱుంగక యెంత సత్యపరిజ్ఞానమును బడసినను శివస్వరూపి యీశ్వరుఁ డని యెఱుంగక యెన్ని సత్కార్యములఁ గావించినను ప్రేమస్వరూపి యీశ్వరుఁ డని యెఱుంగక యెంత ప్రేమను విస్తరింపఁ జేసినను మనుష్యుఁడు బ్రహ్మసాక్షాత్కారమును గాంచఁజాలఁడు. మతమునకును నీతికిని గల భేద మిచటనే యిమిడియున్నది. సత్యమే శివమే సౌందర్యమే బ్రహ్మస్వరూప మని గ్రహించిన యుత్తముఁడు సమస్తప్రపంచమును సకలవ్యాపారములను బ్రహ్మమయముగా నెఱుంగును. సమస్తవస్తుచయమునకును మూలమునం దున్న సత్పదార్థమే పరబ్రహ్మ మని గ్రహించుటయే, సర్వప్రకారానురాగములలోఁ దొలుకాడు ప్రేమభావమే పరబ్రహ్మ మని భక్తిశ్రద్ధలఁ జూపుటయే, నిఖిలసత్కార్యప్రేరకమై యొప్పారు మంగళేచ్ఛయే పరబ్రహ్మ మని యెఱింగి తదనుగుణముగాఁ బ్రవర్తించుటయే, యథార్థమైన యుపాసన. సర్వవ్యాపకుఁడై సర్వప్రదేశములందును సర్వకార్యములందును దృశ్యమానుఁడై వెలసిల్లెడు పరబ్రహ్మమును మనుష్యుఁ డొకానొక దారువునందో శిలయందో మానవమూర్తియందో బంధితునిఁ జేసి భక్తిజ్ఞానకర్మయోగముల పరమార్థమునకు భంగమును వాటిల్లఁ జేయుచున్నాఁడు. అందునకు హరిభట్టారకప్రణీతమైన మత్స్యపురాణమునందలి యీ క్రింది వాక్యములు సాక్ష్య మిచ్చుచున్నవి:

"మఱియుఁ గర్మయోగంబును భక్తియోగంబును జ్ఞానయోగంబును ధ్యానయోగంబు నను యోగవిశేషములు ముక్తిప్రాప్తికరములై నాల్గువిధములఁ బ్రవర్తించు; నందు, నాధాన పుంసవన సీమంత జాతకర్మ నామకరణాన్నప్రాశన చౌలోపనయన వేదవ్రత స్నాతక వివాహ పంచమహాయజ్ఞ హోమ వైశ్వదేవ మాసపైతృక నైమిత్తిక పైతృకాగ్నిహోత్ర దర్శపూర్ణమాసాగ్రయణ జ్యోతిష్టోమాది కర్మాచరణంబు కర్మయోగంబు, శిలా దారు లోహ మృ దాది కల్పితంబులైన ప్రతిమాభేదములయందుఁ బుండరీకాక్షు నావహించి యప్పరమపురుషునకు విధ్యుక్తప్రకారంబున నాస నార్ఘ్య పా ద్యాచమనీయ మధుపర్క స్నాన వస్త్ర యజ్ఞోపవీత దివ్యాభరణ గంధ పుష్ప ధూప దీప నైవేద్య తాంబూ లాద్యుపచారంబులు యథాసంభవంబుగ సమర్పించి స్తుతిపూర్వకంబుగఁ బ్రదక్షిణ నమస్కారంబు లాచరింప వలయు నిట్లు ప్రత్యహంబును నాచార్య పుండరీకాక్షు తద్భక్త కైంకర్య సమేతం బగు శ్రద్ధ భక్తియోగంబును, నిస్సారం బగు సంసారంబున శరీరమాత్రబాంధవు లైన సుతదారాదులయందుఁ బొడమిన దుర్మోహంబుఁ బరిత్యజించి వైరాగ్యంబు నొంద నగు జ్ఞానయోగంబు నగు."

నిర్గుణుఁడును నిష్క్రియుఁడు నగు పరబ్రహ్మయొక్క యుపాసన యెట్లు మనుష్యులను ప్రపంచవిముఖులనుగాఁ జేసెనో యట్లే దేశకాలబద్ధమై విగ్రహరూప మైన పూజయు భక్తియోగమునకు విపరీతార్థమును గల్పించి జీవనసంగ్రామమునందు మత ముపయోగపడనట్లు చేసెను.

## సాధనయొక్క యావశ్యకత

మతము జీవనమునుండి వేఱుచేయఁదగినది గాక జీవితముయొక్క సకలవ్యాపారములలోను ననుస్యూత మైన దగుటచేతనే నానావిధసాధనములయొక్క యావశ్యకత యేర్పడినది. కుటుంబకార్యముల నేమి, సాంఘిక వ్యాపారముల నేమి, తదితర లౌకికవ్యవహారముల నేమి, సలుపునప్పుడు మనము సాధారణముగా నీశ్వరచింతను మఱచి వర్తించెదము. అందుచే తగిన సాధనమార్గముల నవలంబించి ధర్మాగ్ని సర్వకాలసర్వావస్థలయందును మన మానసక్షేత్రముల

జ్వలించునట్లు చేయవలసియున్నది. చంద్రదర్శనముచే జలధి యుప్పొంగునట్లు ప్రతిదినమును నీశ్వరసందర్శనముచే మన హృదయము గూడ సంతోషపారవశ్యమున నుప్పొంగుటకై ప్రతిదినమునందును నీశ్వరోపాసనకై కొంతకాలమును నిర్ణయించి యుంచవలయును. పరబ్రహ్మముయొక్క నామమును తఱచు జపించుచుండుటయు మిగులఁ బ్రయోజనకరము. గృహమున జరగు సకలశుభాశుభకార్యసమయములందును పరమేశ్వరుని స్మరించుట లాభదాయకము. అప్పుడప్పుడు నిర్జనప్రదేశమున కరిగి యీశ్వరచింతనమునఁ గాలము గడపుటయు నత్యంతోపయోగకరము. ఈ సాధనచయములో నెల్ల పూర్ణాంగ బ్రహ్మోపాసన యగ్రగణ్యము.

## పూర్ణాంగోపాసన

పూర్ణాంగ బ్రహ్మోపాసనయందు నాల్గు ముఖ్యభాగములు గలవు: **1.** ఉద్బోధనము **2.** ఆరాధనము **3.** ధ్యానము **4.** ప్రార్థనము.

**1.** ఉద్బోధనము:—నియమితకాలమునందు మనము ఈశ్వరోపాసనకై యొకచోఁ జేరినను మనస్సు తఱచుగ భగవచ్చింతనమునకు సిద్ధమై యుండదు. అంతకుఁ బూర్వము చేయుచుండిన కార్యజాలమునందే తగిలియుండును. అందువలననే మన మనస్సును బ్రహ్మోన్ముఖము చేయవలసిన యావశ్యకత గలదు. చాంచల్యశీలమైన మన చిత్తము నీశ్వరాయత్తము చేయుటకై గావించు ప్రయత్నమునకే యుద్బోధనమని పేరు. ఇయ్యది శాస్త్రపాఠముచేఁ గాని సత్ప్రసంగముచేఁగాని భగవత్ప్రార్థనముచేఁ గాని పద్యపఠనముచేఁ గాని సంకీర్తనముచేఁ గాని నెఱవేర్పవచ్చును. సామాజికోపాసనాసమయములందు ఆచార్యుఁడు సామాన్యముగా నేదో యొక మహావాక్యము నాధారము చేసికొని చిన్నప్రసంగము గావించి యుపాసకుల నీశ్వరపరాయణులఁ జేయును.

**2.** ఆరాధనము:—పరబ్రహ్మముయొక్క స్వరూపావళియందలి యొక్కొక్క స్వరూపమును గూర్చి భక్తిసహితముగాఁ జింతించుటయే యారాధనము. బ్రహ్మస్వరూపనిర్ణయము చేయుటకై అనేక బ్రాహ్మసాధకులు విశేషముగాఁ గృషిచేసి యున్నారు. అమ్మహనీయుల తపఃప్రభావముచేతను భజనసాధనములచేతను అన్నిటికంటె మిన్నగా నీశ్వరానుగ్రహవిశేషముచేత నాత్మానందదాయకమగు బ్రహ్మస్వరూపనిర్ణయము చేయఁబడినది. తత్స్వరూపము లెల్ల నీ వాక్యమునం దిముడ్పఁబడినవి: "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ ఆనంద రూప మమృతం యద్విభాతి శాంతం శివ మద్వైతం శుద్ధ మపాప విద్ధమ్."

ఈ యారాధనామంత్రమునందు ప్రాచీన నవీన బ్రాహ్మసాధకుల సాధనసంపత్తి యంతయు నిమిడియున్నదని చెప్పవచ్చును. తమ యాత్మప్రదేశముల నుదయించిన ధర్మపిపాసను తీర్పఁగల వాక్యరత్నములను ప్రాచీన మహర్షులనుండి గ్రహించి వాని నెల్ల నీ మంత్రరూపమున నొక యమూల్యహారముగా నాధునికసాధకులు గూర్చియున్నారు. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' యను భాగము తైత్తిరీయోపనిషత్తునుండియు, 'ఆనందరూప మమృతం యద్విభాతి' యను భాగము ముండకోపనిషత్తునుండియు, 'శాంతం శివ మద్వైతమ్' అను భాగము మాండూక్యోపనిషత్తునుండియు 'శుద్ధ మపాపవిద్ధమ్' అనునది యీశోపనిషత్తునుండియుఁ గైకొనఁబడినవి. ఉపనిషత్తులనియెడు మహోపవనమునఁ బ్రవేశించి దేవేంద్రనాథాది సాధకభృంగము లీ యారాధన మంత్రామృతమును సంపాదించిరి. ఈ మహామంత్రమునందు బ్రహ్మస్వరూపము చక్కఁగా వర్ణింపఁబడినది. సకలచేతనాచేతన వస్తుసముదాయముయొక్క స్థితికి మూలాధారుఁడనియు, చిన్మయుం డనియు, ఆదిమధ్యాంతరహితుఁ డనియు, అనంతకళ్యాణగుణాకరుఁ డనియు, సకలవిశ్వక్షేమంకరుం డనియు, శాంతినిలయుఁ డనియు, అద్వయుం డనియు, పరమపవిత్రుఁ డనియు, ఆనందస్వరూపి యనియు బ్రహ్మమంత్రరాజమున నుతింపఁబడియున్నాఁడు. నిశ్చలచిత్తుఁడై, నిర్మలమనస్కుఁడై, వ్యాకులహృదయుఁడై యిట్టి యారాధనము సేయు నెవ్వాఁడు భక్తిమాధుర్యము నాస్వాదింపక యుండ నేర్చును?

## ధ్యానము

హృదయపూర్వకమైన యారాధనముచే బ్రహ్మసాక్షాత్కారమును పొందిన భక్తుఁడు తద్బ్రహ్మమువీఁదనే తన మనస్సును నిలిపియుంచుకొన నభిలషించుట యస్వాభావికము గాదు కదా! ఝుంకారనినాదముతో పద్మముపై వలయాకారమునఁ దిరుగుచు క్రమక్రమముగా తద్గర్భమునఁ జేరి మధువుఁ గ్రోలుచు నిశ్శబ్దమై యందే నిమగ్నమై యుండెడు మధుపము చందమున భక్తుఁడు బ్రహ్మస్వరూపచింతనక్రియాలోలుఁడై బాహ్యప్రపంచమును మఱచి తన్మయతను జెందియుండును. ఇదియే ధ్యానము.

## ప్రార్థనము

సకలసల్లక్షణసంపన్నుఁ డగు పరమేశ్వరుని సాంగత్యమాధుర్యము ననుభవించునపుడు భక్తుఁడు తన అయోగ్యతను అహంకారమును అపవిత్రతను గుర్తించును. కామాదిశత్రుగణము తన హృదయదుర్గమును వశము చేసికొన్న సంగతిని దెలిసికొనును. దుశ్చింతాదూరమై నా హృదయ మెన్నఁడు సచ్చింతాసంపూర్ణ మగునా యని యావేదనమును పొంద నారంభించును. వినయభావము కుదురును. దుఃఖాశ్రువులు కనులనుండి రాలఁదొడంగును. పశ్చాత్తాపతప్తహృదయముతో దీనవదనముతో వినయవినమితశిరస్సుతో ముకుళితహస్తములతో నతఁడప్రయత్నముగనే "అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ, మృత్యోర్మా౽మృతంగమయ, ఆవిరావీర్మ ఏధి రుద్ర యత్తే దక్షిణం ముఖం తేన మాం పాహి నిత్యమ్" అని ప్రార్థింప మొదలిడును.

"పరమేశ్వరా! అసద్వస్తువులనుండి నన్ను సద్వస్తువును పొందింపుము. అంధకారమునుండి నన్ను వెలుఁగును పొందింపుము. మృతావస్థనుండి నన్ను అమృతావస్థను పొందింపుము. ఓ స్వప్రకాశుఁడా! నీవు నా ముందర ప్రకాశింపుము. నీ ప్రసన్నముఖముచే నన్ను సర్వదా కాపాడుము."

ఆముష్మికచింతను మఱచి ఐహికసుఖసాధనాపరాయణులమై యుండెడు మన కిట్టి పూర్ణాంగోపాసన యమోఘలాభమును

చేయఁగల దనుటకు లేశమైనను సంశయము లేదు. ఉద్బోధనముచే హృదయము బ్రహ్మోన్ముఖ మగును. ఆరాధనధ్యానములచే విశ్వాసము బలపడును. బ్రహ్మానురాగ మతిశయించును. ప్రార్థనముచే నహంభావ మడంగును. ఆత్మసమర్పణబుద్ధి యుదయించును. బ్రహ్మవిశ్వాసమును బడసి బ్రహ్మానురాగమును సంపాదించి బ్రహ్మసేవయందుఁ బ్రవేశింపఁ గల్గితిమేని, ఇఁక మనకు వాంఛనీయ మేమి యుండఁ గలదు? ఇందే ధర్మజీవనముయొక్క సారసంగ్రహము ననుభవించి యున్న దని నుడువనగును.

### ద్వివిధోపాసన

జన్మసాఫల్యహేతుభూతము లగు ఈశ్వరవిశ్వాసము ఈశ్వరభక్తిని ఈశ్వరసేవాభిరతిని గలిగింపఁగల యీ యుపాసనను సకలజనులును ననుష్ఠింపవలయు నని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. స్త్రీలును పురుషులును నీ యుపాసనాలాభమును బడయవలసి యున్నది. ప్రతి మనుష్యుఁడును దా నొంటరిగా బ్రహ్మము నుపాసించుటయే కాక యితరులతోఁ గూడఁ గలసి యుపాసింపవలసి యున్నది. అందుచే బ్రహ్మోపాసన ద్వివిధము: 1. వ్యక్తిగతము 2. సామాజికము. వ్యక్తిగతోపాసనయొక్క ప్రయోజనమును వెల్లడించు మహాపురుషు లనేకుల మనము గాంచియున్నారము. అయినను నిట్టి యుపాసనయందు ప్రమాదములు లేకపోలేదు. ఈ లోపముఁ కెల్ల సామాజికోపాసన మహౌషధము. సామాజికోపాసనయందే కుటుంబోపాసన గూడ నిమిడి యున్నట్లు మనము తెలిసికొనవలయును. ఒంటిగా నుపాసించునపుడు మనుష్యుఁడు సహజముగా తనకును నీశ్వరునికిని గల సంబంధము నే చూచుకొనును. అందుచే స్వార్థపరుఁడై యుండును. స్వకుటుంబమువారితో నేమి స్వసాంఘికులతో నేమి కలసి యుపాసించునపుడు పెద్ద కుటుంబములో పెద్ద సంఘములోఁ దా నొక వ్యక్తి నను సంగతిని స్పష్టముగా నతఁడు గ్రహించును. కుటుంబముయొక్క క్షేమముతోడను సంఘముయొక్క క్షేమముతోడను తన క్షేమము గూడ నవిచ్ఛేద్యసంబంధము గల దన్న యంశమును గుర్తించును. స్వార్థబుద్ధి కీ యుపాసనయందు నవకాశము లేదు. తనవలె పాపపంకిలమునఁ బడి కొట్టాడుచున్న వారి జీవితములఁ గాంచుటచే నతఁడు నాశాపూరితహృదయుఁ డగును. సాధుపురుషుల సాంగత్యముచే ధర్మజీవనాభివృద్ధికి సాయపడు ననేకనూతనసాధనముల నెఱుంగుచుండును. సాధుసంగంబు సకలార్థసాధనం బగుట మోక్షప్రాప్తికి నదియు మహోపాయ మగుటకు సంశయ మేమి? ఉపాసనచే గృహము భూతలస్వర్గ మగును. సంఘము ప్రేమత్యాగాదులకు నిలయమై రాజిల్లును.

### ఉపసంహారము

బ్రహ్మోపాసన మనుష్యునికి స్వాభావికము. తనయునికి తల్లిపై ప్రేమ యెట్లు సహజమో, నదికి సముద్రగామి యగుట యెట్లు సహజమో, తీఁగకు తరువు నలమికొనుట యెట్లు సహజమో, ఆ చందములనే జీవాత్మకుఁ బరమాత్మునిఁ జేరుటయు సహజము. ఝంఝామారుతములవలె నెన్నియో నాస్తికవాదములు ప్రపంచమున బయలువెడలెను. కాని, యవి మానవప్రకృతికి సహజమైన యీశ్వరవిశ్వాసవృక్షమును జీవింపఁజేయఁజాల వయ్యెను. మానవుఁడు భగవంతుని విడిచి యుండఁజాలఁడు. లోకమున కష్టము లనేకములు. దుఃఖము లపరిమితములు. ప్రలోభనములు మెండు. ఆశాభంగము లనంతములు. రోగమరణములకు మితి లేదు. ఇట్టి నానావిధావస్థలకు నిలయమై యున్న ప్రపంచమున దయాసింధు వగు పరమేశ్వరుని యాశ్రయము లేక సుఖముగా నెవ్వఁడు జీవింపఁగల్గును? ఉత్తుంగతరంగసంక్షుభితమైన మహాసముద్రమునందుఁ బ్రయాణము సేయు నావికులు ద్వీపమును జేరి నిర్భయులై శాంతచిత్తులై యుండు విధమున శోకపరంపరగాఁ బైబడు బహువిధదుఃఖములకు గుఱియై తల్లడిల్లెడు మనుష్యుఁ డీశ్వరపాదారవిందముల నాశ్రయించి స్వస్థమనస్కుఁడై సౌఖ్యానందముల ననుభవించుచున్నాఁడు. తత్కారణముచే నుపాసన సలుపుట సకలజనులకును నవశ్యకర్తవ్యము. ఉపాసనాప్రభావముచే భయచిత్తుఁడు నిర్భయుఁ డగును; నిరుత్సాహి యుత్సాహపూరితుఁ డగును; దుఃఖాత్ముఁడు సంతుషితస్వాంతుఁ డగును. ఉపాసనాబలముచే గృహజీవనము పవిత్ర మగును. ఆనందపూరిత మగును. ఇఁక మన జాతీయజీవనమునం దీ యాధ్యాత్మికోపాసన ప్రవేశించెనేని మన జాతియొక్క మహాభాగ్య మే మని వర్ణింపఁగలము? సర్వశుభప్రదమైన యీ యుపాసనను వ్యక్తిజీవనమునందును కుటుంబజీవనమునందును జాతీయజీవనమునందును వ్యాపింపఁజేయుటయే బ్రాహ్మసమాజముయొక్క పరమోద్దేశము.

# ఎత్తిపోఁతల నీటిధారలు

విష్ణుభట్ల సూర్యనారాయణ గారు

ఈ ధారలు గుంటూరు జిల్లాలోని తుమ్మురుకోడునకు పడమటగా నున్నవి. నీటిధారల కాధార మగు చిన్నివాఁగు అచటి జనులచేత చంద్రవంక యని పిలువఁబడుచున్నది. ఈ ధారలను మాత్ర మెత్తిపోఁతల ధార లని యందురు. దీనినే 1797-వ సం. న "యడ్లపా" డని పిలుచుచున్నట్లు డాక్టరు హైనను నొక యాంగ్లేయుఁడు వ్రాసియున్నాఁడు ఎది యెట్లున్నను, ఎత్తిపోసినట్టుగా నీ ధారలు చూపఱకు కన్పట్టుటచేత వీనిని ఎత్తిపోఁతల ధార లని జనులు పిలుచుచున్నా రనుటయే సమంజసముగా నున్నది. వర్షాకాలమున నీ చుట్టుపట్టులకు, మిక్కిలి కష్టముమీఁద తప్ప, వచ్చుటకు వీలు లే దని తెలియవచ్చును. ఆ కాలమునం దీ నాల్గు ధారలు నొకటిగా కలసి సుమారు ఱువది డెబ్బది యడుగుల వెడల్పు గల్గియుండునఁట. ఈ చిత్రపటములు మాత్రము జ్యేష్ఠమాసాంతమున తీయఁబడినవి. వర్షాకాలములో నీధారలవలనఁ గల్గెడి ధ్వని మిక్కిలి గొప్పదై సముద్రపు హోరుతో సమానముగా నుండి. పెక్కు మైళ్లవఱకును వినఁబడఁగలదు. ఇచటి తుమ్మురుకోడునుండి పోయెడు త్రోవలో నెచట చూచినను అడవిపంది యాఁకలు మెండుగ దొరకును. సామాన్యముగా నిచటి జనులీ యాఁకెలను కలముఫల్లలుగా వాడుదురు. ఈ సెలయేటియొద్ద నెల్ల కాలములయందును తుమ్మెదలు ఝుంకారము చేయుచు, ఆ ధారయొద్దకు సామాన్యముగా జనులను రానియ్యవు. తుమ్మెదలచటఁ మెండుగా నుండుటకు కారణముగా నొక చిన్న గాథ కలదు. త్రిమూర్తులలో నొకఁడైన విష్ణుమూర్తి యచటి చెంచుస్త్రీ నొకతెను మోహించి యామెతో నచట కొన్ని రాత్రులు గడపె ననియు, ఆ సంగతి లక్ష్మికి తెలియరాఁగా ఆమె కసూయ పెరిఁగి తుమ్మెదల రూపమును ధరించి యచటి కెవరిని రానియ్యకుండె ననియు, అచటి జనులు వాడుకగా చెప్పికొందురు.



1. ధారలు, ఇయ్యవి నాలుగు, ఇందులో తూర్పున నున్నది సుమారు ఎనుబదియడుగుల యెత్తును పది యడుగుల వెడల్పును గలిగియున్నది.

ఈ ధారలను చక్కఁగా వర్ణింప నా తరము కాదు. వీనినే 1797-వ సంవత్సరమున దర్శింపఁబోయిన డాక్టరు హైను తన భాషలో బహురమ్యముగా వర్ణించియున్నాఁడు. ఆ వర్ణననే నేను చేతనయినట్లు తెనుఁగున నిచట పొందుపఱచుచున్నాను:

"తుమ్మురుకోడున కాఱు మైళ్ల దూరమున, దక్షిణముననుండి యుత్తరమున కున్న గుట్టలపైనుండి క్రిందికి పడెడు నీటిధార (సెలయేఱు) ఈ గుంటూరు జిల్లాలోని ప్రశస్తవిషయములలో నొకటియై చూపఱ నయనంబుల కాహ్లాదజనకంబై కన్నులకు పండువుగా నున్నది. ఈ స్థలమునకు నేను పులుల భయమువలన కాగడాలయొక్కయు డప్పులయొక్కయు సహాయముతో వెళ్లియుంటిని. కాని, దైవవశమున మాకు త్రోవలో నే విధమైన పులులును కనిపించి యుండలేదు...."

"ఇచటికి పోయెడు మార్గ మంతయు రాళ్లతో నిండియుండి యిరుప్రక్కలను ముళ్లకంపలు కలిగి యుండుటవలన అచటికి వెళ్ల నిశ్చయించెడి వారలకు నిరుత్సాహమును కలిగింపఁగలదు. ఈమార్గమున పోను పోను ఈ గుట్ట యొక్క శిఖరమున శిల్పచను కృత్రిమగా తోఁచెడి చిన్న నదియొడ్డొకటి కనఁబడును. ఈ యొడ్డున నున్న రాళ్లు చక్కఁగ నమర్పఁబడిన వానికంటెను చక్కఁగా నుండి తమ సహజసౌందర్యమును వెలిపుచ్చుచుండెను."

"ఈ నదిని సెలయేటిని ఇచటి జనులు 'యడ్లపా'డని పిలుతురు. ఈ నది దక్షిణమునుండి యుత్తరమునకు ప్రవహించుచున్నది. ఈ దక్కననే యీ నది గుట్టయొక్క శిఖరమునుండి క్రిందికి ధారగా పడుచున్నది. అచటినుండి పడమరగా ప్రవహించి ఆఱు మైళ్ల దూరమున కృష్ణానదిలో పడుచున్నది.

"ఈ స్థలముయొక్క సహజసౌందర్యమును తగినట్లు నేను వర్ణింపలేనని నాకు భయము వేయుచున్నది. చక్కని పెద్ద సెల

# జలాంతర్గాములు

## తేకుమళ్ల వెంకాజీ గారు

ఈ నవయుగమందు ప్రకృతిశాస్త్రజ్ఞాన మత్యద్భుతముగా వికాసము చెందియున్నది. అత్యంతోపయోగకరము లగు నానావిధచిత్రవిచిత్రయంత్రశతంబులు నిర్మింపఁబడియున్నవి. దేశకాలముల ధిక్కరించు నుపాయములు వేనవేలు నెలకొల్పఁబడినవి. మానవుఁడు తన యద్భుత మేధాశక్తిచే భూతముల నెల్ల జయించి నిరంకుశాధికారమును సలుపుచు వానిచే తన కిల్ల విధముల సేవను చేయించుకొనుచున్నాఁడు.

ప్రస్తుతము జరగుచున్న ఘోరసంగ్రామమం దీ మేధాశక్తి ప్రస్ఫుటితముగ కాంచనగును. పూర్వకాలమున యుద్ధములు కాలనిర్ణయమును బట్టి రాత్రియగుటతోడనే ఆఁపఁబడుచుండెడివి. ఆ ధర్మము పోయి రాత్రియుద్ధములు కూడ ప్రారంభింపఁబడినవి.

ఒక్కొక్క యుద్ధనౌకను నిర్మింప కోట్లకొలఁది ధనము కావలయును. అట్టి యమూల్యరత్నము లనఁబరఁగు యుద్ధనౌకలను ముంచుటకు రాత్రులు చాలక పగళ్లు కూడ ప్రయత్నము చేయవలె నని యూహించి ఏరికిని కనఁబడకుండ తుపాకులం దుపయోగింపఁబడు మందుగుండువలె నుండు టార్పడోలను పెద్ద యుద్ధనౌకలపై వదలుటకు సముద్రములో మునిఁగి ప్రయాణము చేయు నావలు గావలసివచ్చెను. ఇట్టి యవసరము అమెరికాయందు జరగిన యుద్ధము (Civil War of Independance) లో కలిగెను. అప్పుడు 1775-వ సం. న అమెరికాదేశస్థుఁడును ప్రకృతిశాస్త్రజ్ఞుఁడును నగు బుష్నెల్లనువాఁడు ఇట్టి నావను కనుపెట్టెను. వీనినే జలాంతర్గాములని యందురు. ప్రస్తుత ముపయోగములో నుండువానివలె అంత యందముగాను అంత యుపయోగకరముగాను లేకపోయినను ఇవి మార్గదర్శకము లైన వని చెప్పవచ్చును.

దీనియందు సౌకర్యము లేమియుఁ గానరావు. ఒక్క మనుష్యునికంటె నెక్కువమంది లోని కరుగుటకు వీలు లేదు. వాఁడయినను, అరగంటకంటె నెక్కువ కాల మందు జీవించియుండలేఁడు. ఆకారము తాఁబేటి చిప్పను బోలి యుండును. నడపుటకు మరలచే నమర్పఁబడిన తెడ్లు మాత్రము గలవు. ఇది యంతయు కఱ్ఱతో నిర్మింపఁబడినది. ఇంత కష్టపడి నిర్మించినను ఆ పరిశోధకుని దురదృష్టవశమున అది నిరుపయోగ మయ్యెను.

ఆశ్చర్యకరమైన చిత్రమో కాని, ప్రకృతిశాస్త్రజ్ఞులు ప్రతిఫలము గోరకయే పరిశోధనలయందు మిక్కిలి యుత్సాహమును గనఁబఱచుచు, తమ జీవితములను ధారపోయుదురు. యూరోపున కంతటికిని రాజనఁదగు నెపోలియను ప్రోత్సాహమున 1801-వ సం.లో ఫ్లొల్టను నను పరాసుదేశపు శాస్త్రజ్ఞుఁడీ జలాంతర్గామియందు కొన్ని మార్పులు చేసి యింకొకదానిని నిర్మించెను.

మొదటిదానికిని దీనికిని అంతగా భేదము గాన్పింపదు. అను గున తామ్రపు రేకులను వేయించెను. నీటిలోపల దీని నడకయు అంత వడిగా లేదు.

వీనిని చేతులతో నడపుటను మాని యంత్రసాహాయ్యముచే మొట్టమొదట 1863-వ సం. న చార్లెస్సు బగన్సు ఒక జలాంతర్గామిని నిర్మించి నడపించెను. పూర్వపువానికంటె నిది కొంచెము పొడుగుగను నడిమికొలత యెక్కువగను నుండెను.

ఈ తరుణముననే 'డేవి' డ్సను పేర చిన్న జలాంతర్గాములమెరికాయందు నిర్మింపఁబడి, రెండు మూడు పెద్ద యుద్ధనౌకలను ముంచుటయందు జయము గాంచెను. కాలము గడచిన కొలఁది ఈ జలాంతర్గాములందు మార్పులు హెచ్చెను. అమెరికావా రీ విషయములో నొక బహుమానపరీక్షను పెట్టుటవలన, నార్డెను ఫెల్టను శాస్త్రజ్ఞుఁడును హాలండను మహనీయుఁడును తమ బుద్ధికౌశల్యమును బట్టి రెండు జలాంతర్గాములను నిర్మించిరి. అందు హాలండు జలాంతర్గామియే మెప్పు వడసెను.




అ. ద్విఖండకవాటకము
ఆ. సమతలదర్పణములు
ఇ. సూక్ష్మదర్శిని (గాజు) భూతదర్పణము

ఈ హాలండు పద్ధతికన్న నెక్కుడుగ మార్పులను చెంది చాల సౌకర్యములను గలిగిన జలాంతర్గాము లిప్పు డుపయోగమం దున్నవి కాని, యుద్ధమందు మన రహస్యములు విరోధులకు తెలియఁగూడదు. కావున, మనవా రీ యుద్ధములో నుపయోగించుచున్న జలాంతర్గాముల నిర్మాణము నెవరికిని తెలియఁజేయరాదు. కాని, యీ జలాంతర్గాములను గూర్చి వివరింత మన్న, హాలండు జలాంతర్గామిని పరిశీలించినచో మన కంతయు విశద మగును.

పైకి చూచుట కిది యొక పెద్ద పలకల చుట్టవలె కాన్పించును. నడుమ పైభాగమున గోపురమువలె ఒక గొట్టము నుండును. జలాంతర్గామి నీటిలో మునిఁగియున్నప్పుడు ఈ గొట్టము మాత్రము మన కగపడును. నలు వైపులను ఏమేమి నావలు వచ్చుచున్నవో

ure) కావలసి యున్నది. ఇంకను ననేకోపయోగములకు వలయు వాయువును పీడనమువలన లోన దాచియుంచఁబడును. లోన నివసించువారి కే మాత్రమును కష్టము లేకుండునట్లు విద్యుచ్ఛక్తి విసనకఱ్ఱలును దీపములును లోనఁ గలవు. దుర్వాయువు ప్యాగ మొదలగు చెడు పదార్థము లన్నియు జలాంతర్గామి యడుగు భాగమునకు గొట్టము ద్వారా తీసికొనిపోఁబడి అచ్చట సముద్రములో విడిచిపెట్టఁబడును.

ఈ జలాంతర్గాములయొక్క నడక (Speed) తేలికశక్తి (Buoyancy) మున్నగువానిని తెలుపు యంత్రము లిందు కలవు. వీ రెచ్చట నుండినను స్థలమును నిర్ణయించు యంత్రములును నావికుల దిక్సూచికలును (Mariner's Compasses) ఇందుఁ గలవు. లోన నొండొరుల తోడి సంభాషణము టెలిఫోన్ ద్వారా జరగును. సగటున ఈ జలాంతర్గాములు గంటకు 22, 23 మైళ్ల చొప్పున నీటిలో పోవును.

ప్రకృతిశాస్త్రము నిమిషనిమిషము నభివృద్ధి పొందును. ఈ జలాంతర్గాములకు ముందు మైక్రోఫోను అను యంత్రము తగుల్పఁబడును. ఇది చుట్టుప్రక్కల నగు ధ్వని నంతటిని లోనికి వినఁబడునట్లు చేయును.

సూక్ష్మముగ జలాంతర్గాములు కట్టు పద్ధతిని వాని వర్ణనను తెలిసికొంటిమి. వివిధదేశములవారును ఎట్లు వీనియం దభివృద్ధి పొందిరో యీ పట్టికవలన కాననగును :

| దేశముపేరు | సంవత్సరము | బరువు టన్నులు | నడక మైళ్లు (గంటకు) | టార్పెడో గొట్టములు |
|---|---|---|---|---|
| బ్రిటను | 1902 (నెం 3 గు) | 122 | 25 మొ 28 వరకు | 1 |
| | 1909 (D 1 ) | 604 | 50–54 | 3 |
| ఫ్రెంచి | 1901 (ఫ్రాన్సిస్సు) | 139 | 36 | 3 |
| | 1910 (Q 74 ) | 810 | 45–50 | |
| రష్యా | 1904 (డాల్ఫిన్సు) | 200 | 25–28 | 4 |
| | 1909 (క్రైమను) | 500 | 45 | 4 |
| అమెరికా | 1898 (హాలండు) | 74 | 25 | 1 |
| | 1910 (సీలు) | 425 | 45 -50 | 6 |
| ఇటలి | 1894 (డెల్ఫిన్) | 107 | 28 | 1 |
| | 1908 (ఫోకా) | 230 | 50 | 2 |

ఈ ప్రకార మాయా సంవత్సరములలో నాయా దేశము లీ విషయములం దభివృద్ధి పొందినవఁట. ఈ యుద్ధసమయములో నభివృద్ధి యపారముగ జరగినది. మన రాజులు 1909-వ సం. న 604 టన్నుల బరువు గల జలాంతర్గామిని నిర్మించిరి. ప్రస్తుత మందఱును 2,000 టన్నుల జలాంతర్గాములను నిర్మించుచున్నారు.

ప్రకృతిశాస్త్రమున రాక్షసులం బోలు నీ జర్మనీవారు 5,000 టన్నుల బరువు గల జలాంతర్గామిని కూడ నిర్మింపఁగలిగిరఁట.

ఎన్నఁడీ యుద్ధము ముగిసి, మన యాంగ్లేయసామ్రాజ్య మతివైభవోన్నతిని చెంది ప్రపంచము దెసదెసలను శాంతిని ప్రజ్వరిల్లఁజేయునో కదా!

# నీతివిధులు

బొండాడ సూర్యనారాయణ గారు

సతతంబు నుడువుము సత్యంబు; వ్యర్థ వా
వ్వాగ్దానములు సేయవలదు సుమ్ము;
చెడుమాట లొరులపైఁ జెప్పకు; సజ్జన
సహవాసమే నీవు సలుపుట తగు;
నీ యొడంబడికలు నెఱవేర్పుమీ; యుదా
రుఁడ వయి మనఁగ నెప్పుడును గోరు;
గగనకుసుమంబులు గైకొనఁబూనకు;
మద్యపానాదులం మరుగవలదు;
నీదు రహస్యముల్ నీలోన నుంచుమీ
యొకవేళ నే మైన నున్న యెడల;
మంచి వర్తనమును మించిన వస్తువు
వేఱొండు గలదె యీ విశ్వమందు?
సాధ్య కావలయును జగతిలో నప్పుల
పాల్పడఁబోకు శుభంబు నొంద;
సౌఖ్య మపేక్షించు జనుఁడు నిత్యంబును
దుష్పథంబులనుండి తొలఁగి మెలఁగు;
వృద్ధి నొందెదునట్టి బుద్ధి నీ కున్నచో
ధనము గడించు తొందర వదలుము;
ఒకనితో భాషించుచుండెడి తఱి వాని
వదనంబు వీక్షించి పలుకుము మఱి;
పెండ్లియాడకు నీవు ప్రియురాలి నిలలోన
సాఁకఁగఁగల శక్తి లేకయున్న;
ఆయంబు మించని వ్యయము నొనర్పుము;
వార్ధకమున నీదు వ్యయముకొఱకు
తరుణవయస్సున ధనమును గడియించి
సెలవు సేయక కొంత నిలుపుకొనుము;
తలఁపంగఁ జెల్లింపఁగల శక్తి లేని బు
ణంబులు చేయఁ గష్టంబు లొదవు;
పాపపాశములోనఁ బడి చిక్కు లొందకు;
ధైర్యవంతుఁడ వయి దాని గెలువు;
సన్మార్గసిద్ధికి సజ్జనసహవాస
భాషణంబులు ప్రాపు వాస్తవముగ;
సన్మార్గవర్తికి స్వల్పలాభంబుతోఁ
దనయంత లభియించు ధనముకతన
సంతుష్టి గలుగును జగమందు నీ దగు
నడతకుఁ గీడు జనంబువలనఁ
గలుగ నేరదు సుమీ, తలపోసి చూడంగ
నీకతంబునఁ గల్గు నిశ్చయముగ;
మంచి నడత గలిగి మహిలోన మెలఁగుచో
నితరు లాడు నింద లేమి చేయు?
పవ్వళించు తఱిని ప్రతిదినచర్యల
నెన్నుకొనుము; దేవు నెన్నుకొనుము.

లోన కూర్చున్నవానికి తెలుపు యంత్రము పెరిస్కోపునం దమర్పఁబడినది. చుట్టు నున్న వస్తువులనుండి కిరణములు "అ" అను ద్వికుంభకటకముపై పడి లోనికి వక్రీభవనము (Refraction) వలన సంగమకిరణములుగా (Convergent Rays) మారి లోన సమాంతరముగా (Parallel) నమర్పఁబడిన సమతలదర్పణములవలన (Plane Mirrors) పరావృత్తమై (Reflected) 'ఇ' అను సూక్ష్మదర్శని (Microscope) యందు పెద్దవిగ కాన్పించును. ఇందుచే చుట్టు ప్రక్కలందలి యుద్ధనౌక లుండు స్థలముల నవలీలగ కనుఁగొనవచ్చును.

ఈ జలాంతర్గామియం దున్న యంత్రబలముచే లో నున్న టార్పెడోను కావలసిన వడిలో వదలుదురు. యుద్ధనౌక యీ టార్పెడోచే బ్రద్దలుకొట్టఁబడును. వైరుల యభీష్టము నెఱవేఱును.

జలాంతర్గామియొక్క లోపలి భాగములను పరిశీలింతము. ముందు భాగమున టార్పెడో యుంచు గొట్టము న్నది. ప్రథమమున ఒక టార్పెడో యుండినను ప్రస్తుతము 5, 6 టార్పెడోలను కూడ ఈ జలాంతర్గామిలో నాఁచియుంచవచ్చును. చివరను దీని నడపు యంత్రమున (Propeller) ప్రక్కను తెడ్లును కలవు.

Tanks) జలాంతర్గామి నీటిలో మునుఁగుటకును తేలుటకును నివి సహాయపడును.

మూఁడవవి "సహాయభూతము లగు తేలిక తొట్టెలు" (Auxiliary Ballast Tanks) జలాంతర్గామిలో నుండవలసినవా రెవ్వ రయినను లెక్కువయినయెడల నివి సహాయపడును.

నాల్గవవి "గ్యాసు తొట్టెలు" (Gasoline Tanks) వీని యందు జలాంతర్గామిలోని యంత్రము పనిచేయుటకు వలయు పరికరము లుండును.

ఇంతకు మించిన యంత్రము లేవియు నిందు లేవు. ఈ తొట్టె లన్నియు జలాంతర్గామిలోపలి భాగమున నైనను ప్రక్కలయందును నమర్పఁబడినవి.

అసలు పై భాగమున ఉక్కుగొట్టము కాక రెండు కన్నములు గలవు. వీని ద్వారమున వలయు సామానులను తెత్తురు. సాధారణముగా నివి మూయఁబడియుండును. చుట్టును చాల చిల్లులు గలవు. అవి గట్టి యద్దములతో చిత్రముగాను అనపాయకరముగాను నమర్పఁబడినవి. వీనిద్వారమున వనము సాధారణముగ చూడఁగలము.




1. గాలితిత్తి 2 టార్పెడో 3 టార్పెడోలు కొట్టుగొట్టము 4 గ్యాసుతొట్టి 5 విద్యుత్ ఘటమాల 6. ముఖ్యతేలిక తొట్టి 7 సహాయ్యతేలిక తొట్టి 8 కాంపెంసేటింగు తొట్టి 9 గ్యాసుయంత్రము 10 విద్యుత్ మోటారు 11 చుక్కాని 12 నడుపుయంత్రము 13. చుక్కాని 14. భూతదర్పణము 15 ఫిరంగియుంచుచోటు 16 లోపలి వెలపలికి గాలిపోవు గొట్టములు 17 లోనుండి వెలుపలకు మనుష్యులు వచ్చుద్వారము 18 లోపల మనుష్యులుండుచోటు 19 కప్తాను ఉండుచోటు 20. త్రాగుడునీటిట్యాంకులు 21. మందు గుండుసామాను ఆహారపదార్థము లుండుచోటు.

ఈ జలాంతర్గామి నడ్డముగా కోసిన ట్లనుకొనిన, ఈ ప్రక్క వివరింపఁబడిన పటమువలె కాన్పించును.

లోపలి భాగ మంతయు గుండ్రముగా నుండును. చుట్టును వేయఁబడిన రేకులు నడుమ $\frac{8}{20}$ అంగుళమును చివరలయందు $\frac{7}{20}$ అంగుళమును దళసరి కలిగియుండును. ఇది మొత్తమునకు 63 అడుగుల 4 అంగుళముల పొడవును, 11 అడుగుల 9 అంగుళముల నడిమి కొలతయు 122 టన్నుల బరువును కలిగియుండును. ఉదకపీడనము (Water Pressure)చే ప్రక్కలు బ్రద్దలు కాకుండుటకు పై రేకులు 18 అంగుళముల దూరమున తాపడము చేయఁబడినవి.

ఈ జలాంతర్గామియం దమర్పఁబడిన తొట్టెలను నాలుగు భాగములుగా విభజింపవచ్చును. మొదటివి "మొదలు చివర తొట్టెలు" (Forward and After end Tanks) జలాంతర్గామిని క్రమముగా నడుపుటకు వీనిని నింపవలెను.

రెండవవి "ముఖ్యమైన తేలిక తొట్టెలు" (Main Ballast

ఈ జలాంతర్గామిలో ముఖ్యముగా మూఁడు "విద్యుత్" మోటార్లు (Electric Motors) గలవు. వీనిలో మొదటి రెంటివలనను జలాంతర్గామి మునిఁగియున్నను తేలియున్నను నడపఁబడును. విద్యుత్ ఘటమాల (Storage Battery) లను తాఁకి, వానికి వలయు శక్తిని ప్రసాదించును. గ్యాసు తొట్టెలు పనిచేయునట్లు చేయును. ఇవి పనిచేయునప్పుడు అడుగు భాగము వీనికి తగులకుండునట్లు కడు శ్రద్ధ తీసికొనఁబడును.

ఈ రెండును గాక, ఒక చిన్న విద్యుత్ మోటారు కలదు. దీనివలన లోనికి నీరు రానిచ్చుట గాని వెలుపలికి పోనిచ్చుట గాని చేయఁబడును.

ప్రస్తుతము వాడుకలో నుండు జలాంతర్గాములం దొక చిత్రమే మనఁగా, గాలి రాకపోకలు గలిగియుండుట. లోన నివసించు మనుష్యులకు కొంత గాలి కావలెను. లోని నీటిని గాని టార్పెడోలను గాని బయటికి వెడలఁగొట్టుటకు కొంత వాయుపీడనము (Air Press-

# కావేరి దాటు – నీటి ద్వారా మెఱుపు

వేమూరి విశ్వనాథశర్మ గారు, ఎమ్. ఏ.

వాస్తుశాస్త్రము భౌతికశాస్త్రములలో నొకటి. వాస్తు శాస్త్రజ్ఞులను ఇంగ్లీషు భాషలో "ఇంజనీరు" లందురు. వీరి కృత్యములు కొన్ని అత్యద్భుతములు. నిశ్చయముగా సముద్రమునకు చెలియలికట్ట వేయఁదగిన వారు వీరే. నేల మట్టమున పారెడి కృష్ణా గోదావరుల నీరు వ్యర్థము గాకుండ ఆనకట్టలు గట్టి డెల్టా భూములను అమరకము చేయుటకు సాధ్యము చేసిరి. కాని, యన్ని నదులును నేలపారున ప్రవహింపవు. కొన్ని నదులు ప్రవాహమధ్యమున ఎత్తయిన కొండల మీఁదనుండి దుముకును. ఇట్టి నదులకు ఆనకట్టలు గట్టుట సులభము గాదు. రాతిభూముల గుండ ప్రవహించుటవలన పడవ లాడుటకును లాయకుగావు. ఇట్టి నదులయొక్క నీరు వ్యర్థముగ సముద్రమును చేరవలసినదేనా? మైసూరు చెన్నరాష్ట్రముల గుండ ప్రవహించెడి కావేరీనది మొట్టమొదట కొండలమీఁదుగ నుఱికి మనరాజధానిలో నేలపారుగ ప్రవహించుచున్నది. నేలమట్టమున ప్రవహించుటచేతనే మన రాజధానిలో కావేరికి ఆనకట్టలు గట్టి తంజావూరు తిరుచినాపల్లి డెల్టా భూములు ఫలవంతములు చేయఁబడినవి. అయితే మైసూరు రాష్ట్రపు ప్రజలు కావేరీఫలితము నెట్లు పొందుచున్నా రని యడుగవచ్చును. మైసూరు సంస్థానమునకు కావేరి యెట్లుపయోగించునదియు ఇంచుక వ్రాసెదను. ఎత్తయిన కొండలనుండి నిరంతరము ఏనుఁగుతొండముల వలె ప్రవహించు నదులయొక్క వైభవము వర్ణనీయము. సృష్టియం దిట్టి ప్రకృతిసౌందర్యముఁ జూచి యానందించుటకే లక్షలకొలఁది జను లచ్చటికి యాత్రలు సలుపుచుందురు. అమెరికాదేశములో "నయాగ్రా" యను నది యొక టిట్టిది గలదు. ఇది 1400 అడుగుల వెడల్పున 162 అడుగుల యెత్తుననుండి ప్రవహించును.* ఇట్టివి రెండు పాయలు గలవు. వీని సౌందర్యమును జూచుటకై సాలునకు 12 లక్షలమంది యాత్రికు లచ్చటికి వెళ్లుచుందురఁట!

కాని, మైసూరు దర్బారువారు యాత్రికుల సందర్శనముతో తృప్తిఁ జెందక ఏయే ప్రదేశముల నెట్టులా నీటి నుపయోగింపవలెనో తగిన యుపపత్తులను కల్పించిరి. కావేరీనది కూర్గు రాష్ట్రములోని పడమటి కనుమలలోఁ బుట్టి మైసూరు రాజ్యములోనికిఁ జొచ్చి 170 మైళ్లు ప్రవహించిన తరువాత రెండు పాయలుగా చీలుటవలన శివసముద్ర మను నొక చిన్న లంక యేర్పడినది. ఈ లంక దగ్గఱనే నది రెండు చోట్ల నెత్తయిన ప్రదేశములనుండి ప్రవహించుచున్నది. శివసముద్రము దాటిన తరువాత రెండు పాయలు తిరిగి యేకమై కనుమల మధ్యము గుండ సేలము జిల్లాలోనికి వచ్చి పడును. ఈ కనుమల మధ్యమున నదియొక్క వెడల్పు కొన్ని యడుగులు మాత్ర ముండును. అందుచేత నీ ప్రదేశమునకు "మేఁకదాటు" అను పేరు వచ్చినది. శివసముద్రమునకు పై భాగమున నదికి 12 ఆనకట్టలు గట్టియా నీటిని అమరకమున కుపయోగించుచున్నారు.

శివసముద్రము దగ్గఱ కావేరి రమారమి 400 అడుగుల యెత్తునుండి ప్రవహించును. అంత యెత్తునుండి ప్రవహించెడి నదికి అమితమైన శక్తి యుండును. ఈ శక్తిని ఉపయోగించి యేపని నైనను చేయవచ్చును. అంత యెత్తునుండి పడెడి నీటిక్రింద రాళ్లు బ్రద్దలగును; చెట్లు విఱిగి పడును. తెలివితేటలతో నుపయోగించిన యెడల ప్రజల కుపయోగకరము లగు పనులను చేయవచ్చును. ఇప్పుడు ప్రతివస్తువు యంత్రసహాయమువలన తయా రగుచున్నది. బియ్యము బట్టలు నూనె పప్పు పిండి మున్నగునవి యన్నియు మఱలలో తయా రగుట మన కనుభవమే. ఈ మఱ లనేకవిధములుగ పనిచేయుచున్నవి. కొన్ని చేతిమఱలు అనఁగా చేతులతో త్రిప్పి

నడుపునవి. ఆవిరివలన నడపఁబడునవి కొన్ని. కిరస నాయిలు మఱియు మఱికొన్ని. విద్యుచ్ఛక్తి నుపయోగించి నడుపునవి కొన్ని. ఈ మఱ లన్నియు నడుచుటకు ముఖ్యాధారము పనిచేయఁగల శక్తి యని తేటపడును.

ఇంజనులు బయలుదేఱక పూర్వము పాశ్చాత్యులు కష్ట మయిన కార్యము లన్నియు గుఱ్ఱములచే చేయించెడివారు. అందుచేత నే పని నైనను చేయుటకుఁ గావలసిన దార్ఢ్యమును గుఱ్ఱముయొక్క సామర్థ్యముతోఁ బోల్చెడివారు. ఒక్క నిమిషము కాలములో 33,000 పౌనుల బరువును అడుగెత్తు లేపుటకుఁ గావలసిన బలమునకు "అశ్వశక్తి" (Horse-power) యని పేరు. ఇప్పుడు ఇంజనుల సత్తువ కొలుచుటకుఁ గూడ అశ్వశక్తియే వాడఁబడుచున్నది. ఐదు అశ్వశక్తుల యింజను అనఁగా నొక నిముసములో 5 గుఱ్ఱములు చేయఁగల పనిని ఈ యింజను ఒక్కటియు నదేకాలములో చేయఁగల దని యర్థము. ఇట్లు వేలకొలఁది యశ్వశక్తులు గల యింజనులు కూడఁ గలవు.

కావేరినుండి దుమికెడి నీటిని మైసూరు దర్బారువారు "విద్యుచ్ఛక్తిని" ఉత్పత్తి చేయుటకై యుపయోగించుచున్నారు. విద్యుత్తును బుట్టించుటకు కొన్ని యింజనులు పనిచేయవలెను. ఎత్తయిన ప్రదేశమునుండి ప్రవహించెడి కావేరి నీరు పడుటవలన ఈ యింజనులు తిరుగును. ఇవి తిరిగిన కొలఁది విద్యుత్తు ఉత్పన్నమగును. ఇంజనులను త్రిప్పుటకు నదియొక్క నీటి నంతటి నుపయోగించుట యసంభవము, అసాధ్యము. అందుచేత నదికి ఎగుదల నొక యానకట్ట వేసి చిన్న చిన్న కాలువలు తీసి వానిలోనుండి వచ్చెడి నీటిని పెద్ద గొట్టముల గుండ ప్రవహింపఁజేయుదురు ఈ నీరు ఇంజనులమీఁద పడి వానిని త్రిప్పుచుండును. ఇవి తిరుగుట వలన విద్యుత్తు ఉత్పన్న మగును. ఇచ్చట నుత్పన్న మయిన విద్యుచ్ఛక్తిని తంతువుల ద్వారా కావలసిన చోట్లకుఁ దీసికొనిపోయి యుపయోగపఱచెదరు.

1894, 1898 సంవత్సరములలో మైసూరు దర్బారువారు విద్యుత్తును తయారు చేయవలె ననెడి యుద్దేశముతో ఇంజనీర్లను రావించి సంప్రతించిరి. కాని, యప్పట్లో వారి యుద్యమము సఫలము కాలేదు. అప్పుడు మైసూరు రాష్ట్రములోని పరిశ్రమ లన్నియు కోలారులోని బంగారు గనులును ఆవిరియంత్రములనే యాధారము చేసికొని నెఱవేర్పఁబడుచుండెను. ఇప్పటికిని మన రాజ్యములో మిల్లు లన్నియు రైళ్లవలె ఆవిరితోనే నడపఁబడుచున్నవి.

1899-వ సంవత్సరములో మైసూరు దివానుగా నున్న శేషాద్రి అయ్యరు గారు పట్టుపట్టి "కాంబెల్" "ఫోర్బ్సు" మొదలగు ఇంజనీర్లతో సంప్రతించి విద్యుత్తును తయారు చేయుటకు గట్టి ప్రయత్నము చేసిరి. కోలారులోని బంగారు గనులను కొలునకు తీసికొన్న మైలరు కంపెనీవారును మైసూరు రాష్ట్రమునం దితర పరిశ్రమలలో పనిచేయుచున్న యంత్రశాలాధికారులును ఆవిరి మానివేసి విద్యుత్తుతోనే తమ యింజనులను నడపెద మని వాగ్దానము చేసి శేషాద్రి అయ్యరు గారిని ప్రోత్సాహపఱచిరి. నదియొక్క ప్రవాహమును బట్టి 90,000 అశ్వశక్తులు గల విద్యుత్తు ఉత్పన్న మగు నని ఇంజనీర్లు రిపోర్టు చేయఁగా, 5,000 అశ్వశక్తులు మాత్రమే తయారుచేయుటకు శేషాద్రి అయ్యరు గారు ప్లాను వేసికొని యీ పని నెఱవేర్చుటకు 43 లక్షల రూపాయలను విదేశ కంపెనీలకు కంట్రాక్టుగా నిచ్చెను. కాని తయారగునప్పటికి నికరముగ 4,000 అశ్వముల శక్తి మాత్రమే నిలిచినది.

క్రమముగా నెక్కువ యింజనులను పెట్టి యెక్కువ శక్తిని తయారు చేయుట కారంభించిరి. మొదట ననుకొనినంతకంటె సర్కారునకు ఎక్కువ లాభము రా నారంభించెను. యంత్రశాలాధికారులు తమ యొడంబడిక ప్రకారము కావలసినంత విద్యుత్తు నియ్యవలసిన దని దర్బారువారి నొత్తిడి చేయసాగిరి. వారికి కావలసినంత శక్తి నియ్యఁజాలకపోవుటచేత దర్బారునకు వరుంబడి తగ్గసాగెను. వేసవిలో నీరు తగ్గుటవలన కావలసినంత విద్యుత్తును తయారు చేయుటకు వీలు లేకుండెను. అందుచేత విశ్వేశ్వరయ్య గారి హయాములో కన్నంబాడి

సూర్యునిఁ జూచి ముని యిచ్చిన మంత్రముచే నాతని నావాహనము చేయగా సూర్యుఁ డప్పటికివచ్చి యామెను నిరోధించి యొప్పించి సంగమించి పోవ, గర్భ మయ్యును వ్యక్తము గాకుండఁగ నుండఁ బదవ మాసమందు నొక్క నిశాసమయమునఁ గర్ణుఁ డుదయింప నప్పు డా శిశువును మంజుసలోఁ బెట్టి యొక సఖియుఁ దానును మోచికొని పోయి పురసమీపమున నున్న యశ్వనది ప్రవాహములో విడిచివచ్చినట్లును చెప్పఁబడియున్నది కదా! మన చరిత్రగ్రంథములలో నొక్క విషయమే యిట్లు పరస్పరవిరుద్ధమై యున్నప్పుడు దాని సంగతిసందర్భములకొఱకు విమర్శ మావశ్యకము కాదా?

విచారింతము: దుర్వాసముని కుంతి కాలోచించిన యాపద్ధర్మము ముం దామెకుఁ బాండురాజువలన సంతానము గారామియు, నప్పు డా మంత్రమహిమచే యమ వాయు ఇంద్రుల వలన నామె సంతాన మొందు ననియు భావిజ్ఞాని యగు మహర్షి యభిప్రాయము. కాని, యప్పుడే యామెకు సంతానము కలుగవలయు నని కాదు. ముని యామె కిట్లు అనుగ్రహించి యిచ్చినదే కాని యనర్థముకొఱకు కాదు. ఇఁకఁ గుంతి యభిప్రాయము: తనకు దుర్వాసుఁ డిచ్చిన మంత్రశక్తిచేఁ దాను కోరిన దేవత తనకు వశ మగునో కాదో చూడవలయు నని చాపల్యముచేత సూర్యు నావాహనముచేయుట, అతని యట్టి పుత్రుఁడు కావలయు నని కోరుట నన కుచితకాలమందే యని కాని యప్పుడే కాదు. కాకున్నను, సూర్యుఁడు తా నా మంత్రశక్తిచేఁ గుంతికి వశ్యుఁడై వచ్చుట కింద్రాదులు తన్ను నగుచుండుటచేత మఱలఁ దాను వ్యర్థముగఁ బోయినచో నది తనకుఁ బరాభవముగఁ దలంచి కుంతి నంతగా నిరోధించి యొప్పించెను. కుంతియును శక్యమైనంత సూర్యునిఁ బ్రార్థించి తప్పించుకొనఁ బ్రయత్నించి తప్పక యొప్పికొనినది. కాని, ముని కుంతి కిచ్చిన మంత్ర మాపద్ధర్మ మనఁగా నామెను పాండురాజు వివాహమై యామెయం దాతని కౌరసపుత్రులు కలుగుట కవకాశము లేనందున నప్పు డీ మంత్రముచే యమ వాయు ఇంద్రులవలన నియోగవిధిప్రకారము పాండురాజునకు క్షేత్రజపుత్రులను సంపాదించుట యాపద్ధర్మము. కాని, కన్యాత్వావస్థలోనే సంతాన మొందుట కాదు. ఇట్టి మహర్షి యభిప్రాయము నెఱిఁగియే యామెకు కన్యాత్వము చెడకుండఁగను వివాహయోగ్యత కలుగునట్లును సూర్యుఁడు వర మిచ్చెను. ఆ వరప్రభావముచేతనే కుంతికి ప్రసవించిన స్త్రీయొక్క చిహ్నములు లేక కన్యాచిహ్నములే కలిగియుండెను. అందుచేతనే మిత్రాదిబంధువుల కెవ్వరికిని తెలియకపోయెను. లోకనిందయు కలుగలేదు. కాని, "భావిజ్ఞాని యగు దుర్వాసముని ముం దెప్పుడో యామెకు తన భర్తవలన సంతానము లేని యాపత్తులో నుపచరించుట కిచ్చిన యీ మంత్ర మిప్పు డేట్లుపచరించెను? ఎందు కుపచరింపవలయును?" అను ప్రశ్నము మాత్ర ముదయింపవచ్చును. విచారింతము: మహర్షి యాపద్ధర్మమును విశేషింపక సామాన్యముగా నాపద్ధర్మ మని చెప్పి మంత్ర మిచ్చినవాఁడు కదా. కుంతిభోజునకుఁ బుత్రసంతానము లేదు కదా. అతని కీ కర్ణుఁడు కానీనపుత్రుఁడుగా నుపయోగించుటయే యాపద్ధర్మమైనపక్షమునఁ గుంతికి సూర్యునితో సమాగమము గర్భోదయము పుత్రజననము పిమ్మట వానిని నదిలో విడుచుట మొదలగు సనిష్టములు సంభవించుటయు నా రహస్యరక్షణక్లేశమును నుండకపోవును గదా? అ ట్లెందుకు వారు తలంపలేదు? దీనిని విచారింతము. కుంతిభోజునకుఁ బుత్రసంతానము లేకుండుట యాపత్తయినను కర్ణుఁ డాతనికి కానీనపుత్రుఁడు కానందున నది యాపద్ధర్మము కాలేదు. కుంతి కానీనునిఁ గని వివాహము లేక తండ్రియింట నట్లు యుండిపోయినచోఁ గర్ణుఁ డప్పుడు కుంతిభోజునకుఁ గానీనపుత్రుఁ డగును. అట్లు జరుగలేదు కావున వాఁడు కానీనపుత్రుఁడు గాఁడు. అది యాపద్ధర్మమును గాదు. ప్రమాణము: యాజ్ఞవల్క్యస్మృతి వ్యవహారకాండము—శ్లో. కానీనః కన్యకాజాతో మాతామహసుతో మతః. వ్యా. యద్యనూఢాసాభవే త్తథా పితృగృహ ఏవ సంస్థితా. కావునఁ గర్ణుఁడు కుంతిభోజునకుఁ గానీనపుత్రుఁడు గాఁడు. ఇఁక నాపద్ధర్మముగా మంత్ర మిచ్చిన మహర్షి వచనమున కన్యథాత్వము వచ్చునా? యనునది విచారణీయము. అన్యథాత్వము లేదు. ఎట్లన, ఈ కర్ణుఁడు కుంతిచే నదిలో విడువఁబడి యతిరథునకు దొరకి యతని కపవిద్ధపుత్రుఁ డయినందున మంత్ర మాపద్ధర్మముగానే చరితార్థ మయినది. కాని, మహర్షి యభిప్రాయ మట్లు కాదు గావున సూర్యుఁడును దాని నెఱిఁగియే కుంతికి కన్యాత్వభంగము లేకుండ వర మిచ్చి యా వృత్తాంత మంతయు గూఢ మగునట్లే యనుగ్రహించెను. ఇదియే భారతమందుఁ జెప్పిన దేవరహస్యము. ఈ రహస్య మిట్లు జరగకున్నచోఁ గుంతిని పాండురాజు వివాహము చేసికొనకపోయినను "కర్ణునితల భారతము" అను లోకోక్తి ప్రకారము కర్ణుఁడు లేనిచో భారతయుద్ధమే లేకపోవును. ఇది యిట్లుసంగతము కావచ్చును.

ఇంకొక్కటి విచారణీయము: కర్ణుని జననము ఆదిపర్వములో నదియొద్ద జరిగినట్లును అరణ్యపర్వములోఁ గుంతిభోజునింట జరిగినట్లును నున్నది. పరస్పరవిరుద్ధ మగు నిది యెట్లు సంగత మగును? దానిని విచారింతము: ఆదిపర్వములో నన్నయభట్టుఁడు "కుంతి మంత్రశక్తి నెఱుఁగఁగోరి యేకాంతముగఁ దాను గంగకుఁ బోయి స్నానము చేసి మంత్రమును స్మరించి యతనివంటి పుత్రునిఁ దనకి మ్మని సూర్యునిఁ బ్రార్థింప సూర్యు డప్పుడే గగనమునుండి వచ్చి నీవు కోరిన వర మీయవచ్చితి నని చెప్ప నామె లజ్జితయై మంత్రశక్తిఁ దెలియఁగోరి యిట్లుచేసితినే కాని యిప్పుడే నాకుఁ బుత్రు నిమ్మని కాదని విన్నవించినను సూర్యుఁడు తన రాక వ్యర్థము కారాదని చెప్పి యొప్పించి సంగమింపఁ బుత్రుఁ డప్పుడే యుదయింప నామె భయ మొందుచుండ భయపడకు మని చెప్పి యామెకుఁ గన్యాత్వభంగము లేకుండునట్లు వర మిచ్చి పోవఁగా నతని మహిమచేతనే యొక మంజుస ప్రవాహమునుండి రాఁగా దానిలో శిశువు నుంచి విడువవలయు నన్నట్లు సూర్యుని యభిప్రాయముగా తలఁచి యట్లే శిశువును కుంతి విడిచినట్లు చెప్పినాఁడు. ఇది యౌచిత్య మాలోచించి చెప్పినట్లు కానుపించుచున్నది. మూలభూతమగు సంస్కృతభారతము ఆదిపర్వము 111వ అధ్యాయములోఁ గుంతి గంగకు వెళ్లినట్లును సద్యోగర్భమున వచ్చ

టనే పుత్రుఁ డుదయించినట్లును గూడ లేదు. తనకుఁ బుత్రుఁ డుదయింపఁగా, "దృష్ట్వా కుమారం జాతం సా వార్ష్ణేయీ దీనమానసా- గూహమానాఽపచారం సా బంధుపక్షభయాత్తదా- ఉత్ససర్జ కుమారం సా జలే కుంతీ మహాబలం- తముత్సృష్టం జలే గర్భం రాధాభర్తా మహాయశాః" అని యున్నది. ఇట్లున్నను కుంతి పుత్రుని జలమందు విడువవలసినది కావున జలమునకు నదీసందర్భ ముండవలయును గావునఁ గుంతిభోజుని పురసమీపమున నున్న నది యశ్వనది యయ్యును అది చర్మణ్వతిలోఁ గలియఁ జర్మణ్వతి గంగలోఁ గలిసినది కావున శిశువు గంగలో నతిరథుఁ డనువానికి లభించెను కావున గుంతి గంగకే స్నానార్థము వెళ్లినట్లును నదియొద్ద జరగు పుత్రజన్మము సద్యోగర్భమున నని చెప్పుటయే యుచిత మని భావించి యట్లు చెప్పియుండును. అరణ్యపర్వములో నెఱ్ఱాప్రగడ "కుంతి తనకు మహర్షి యిచ్చినమంత్రము చంద మెట్టిదో తెలియఁగోరి యొకనాఁడు స్నానము చేసియుండి యుదయశైలముపై నుదయించుచున్న సూర్యునిఁ జూచి యాతనితో సమానరూపము గల పుత్రు నిమ్మని ప్రార్థించుచు మంత్రోచ్చారణము సేయఁగా సూర్యుఁడు ప్రత్యక్షముగా వచ్చి "నీకు వశ్యుఁడనై వచ్చితి నీ ప్రియ మెద్దియో చెప్పు" మనఁగాఁ గుంతి భయ మొంది "నా కేమియు నిప్పుడు నీవలనఁ గావలసిన కార్యము లేదు కావున మగల వెళ్లు" మని ప్రార్థనాపూర్వకముగఁ జెప్ప నప్పు డామె తన మనములోఁ గోరిన కవచకుండలాభిరాముఁ డగు పుత్రు నుగ్గడించి "నా సమాగమమున కొడంబడనిచో నీ తలిదండ్రులను నీకు మంత్ర మిచ్చిన మునినిఁ గూడ దహింతు" నని చెప్పఁ గుంతి తనకుఁ గన్యాత్వభంగ మగు నని భయముఁ దెలుప నామెకుఁ గన్యాత్వభంగము లేకుండ వర మిచ్చి యామె నొప్పించి యామెతో సంగమించి గర్భాధానము చేసి దివమునకుఁ బోయినట్లును సూర్యుని మహిమచే గర్భము వ్యక్త మయ్యును లోకమందుఁ దెలియకుండ నుండి పదవ మాసమందుఁ గర్ణుఁ డుదయింప నొక సఖియుఁ దానును శిశువును మంజసలోఁ బెట్టి తెప్ప యొకటి కట్టి కొనిపోయి యశ్వనదిలో విడిచివచ్చినట్లును చెప్పినాఁడు. ఇచ్చట సంస్కృతభారతములో అరణ్యపర్వము 302-వ అధ్యాయములో శ్లో. తతో గర్భ స్సమభవత్పృథాయాః పృథివీపతే-తతః కాలేన సా గర్భం సుషువే వరవర్ణినీ" అని యున్నది. ఇందు "గర్భస్సమభవత్" అనుచోట గర్భాధానమనియు, "కాలేన" అను చోటఁ బ్రసవోచితకాలము పదవ మాసము గావున నెఱ్ఱాప్రగ్గడ యట్లు చెప్పినాఁడు. మఱియు సంస్కృతమందు "జాతమాత్రంచ తం గర్భం ధాత్ర్యాసంమత్ర్యభామినీ మంజూషాయాం సమాధాయ స్వాస్తీర్ణాయాం సమంతతః। సముత్సృజన్తీ మంజూషా మశ్వనద్యాస్తదా జలే" అని యున్నది. ఇందులో ధాత్రికి బదులుగాఁ దెనుఁగులో "సఖి" యనియు సంస్కృతములోఁ దాను నదిలో మంజూషను విడిచిన ట్లున్నదానికి రాజపుత్రి యగు కుంతి యొక్క తెయే నిశీథమందు మంజసను మోచికొని నదియొద్దకు వెళ్లినట్లు చెప్పక యౌచిత్య మాలోచించియే యెఱ్ఱాప్రగ్గడయును "సఖియును దానును" అని చెప్పియుండును. మూలగ్రంథమునకు భాషాంతరీకరణకర్తలు విషయమును మాత్రము తప్పక యవాంతరాంశములను తమ యభిప్రాయముతోఁ గొన్ని మార్పులను గల్పించి చెప్పుట యాచారమే యైయున్నందున వీరట్లు చెప్పియుందురు. ఇచ్చట మూలభారతమునకు భాషాంతరీకరణకర్తలు వేఱువేఱైనందున వీరిలో వీరికి వచనవిరోధము లేదు. మూలభారతకర్త వేదవ్యాసమహర్షి యొక్కఁడే కావున నాతనికి వచనవిరోధము రారాదు. వానికి సామరస్య మెట్లనఁగా నాదిపర్వములో 111-వ అధ్యాయమందు "ప్రకాశకర్తాపవనస్సంబభూవ తయాసహ- తత్ర వీరస్సమభవత్సర్వశస్త్రభృతాంవరః- ఆముక్తకవచశ్శ్రీమాన్ దేవగర్భః శ్రియాన్వితః- అజాయత సుతః కర్ణః - సర్వలోకేషువిశ్రుతః" అని చెప్పి పిమ్మట "ప్రాదాచ్చ తస్యై కన్యాత్వం పున స్సపరమద్యుతిః - దత్వా చ తపతాం శ్రేష్ఠో దివమాచక్రమే తతః" అని యుండుటచేతం గుంతికి కర్ణుఁ డుదయించిన పిమ్మట సూర్యుఁ డామెకు వర మిచ్చి యంతరిక్షమునకు వెళ్లినట్లు కానఁబడును గాని యచ్చటఁ బదానుపూర్వ్యప్రకార మర్థము వివక్షితము గాదు. సూర్యుఁడు సంగమింపఁగానే తత్క్షణమే గర్భము సంభవించిన దనియు నప్పుడే వర మిచ్చి సూర్యుఁ డంతరిక్షమునకు వెళ్లిన పిమ్మటఁ గ్రమమున గర్భ మభివృద్ధి నొందియుండ నెవ్వరికిని తెలియకుండఁగఁ బదవ మాసమందే కర్ణుఁ డుదయించె ననియే మహర్షి యభిప్రాయము గావున విరోధము లేదు. ఇచ్చట నట్లు స్పష్టము కాలేదనియే మహర్షి యరణ్యపర్వములో స్పష్టపఱచి చెప్పియున్నాఁడు.

భారతమం దిట్టివి విచారణీయము లనేకములు గలవు. నాదు మహాభారతవిమర్శనం దవి విపులముగ విమర్శింపఁ బడియున్నవి. గ్రంథము ముద్రితము కావలసి యున్నది.

## జాతీయావబోధము

మహాకాళి వేంకటేశ్వరరావు గారు

వ్రాయుడీ యక్షరాల 'మన భారతమాతకు నెందు లోపముఁ
జేయ' మటంచు మీ హృదయ సీమల, వెంటనె భావభేదముల్
ద్రోయుఁడి వెన్క కంతటఁ గుతూహల మొప్పఁగ దేశసేవనే
సేయుఁడి మాతకున్ హితము సేకురు, మీకు యశస్సు చేకురున్

యమునందు సకలభేదములు సమసిపోవును. మహాసంగ్రామమువలన స్థిరవ్యవస్థ లస్థిరము లైనవి. రాజ్యాంగపరిజ్ఞాతల పృక్పథములు మాఱినవి. రాజ్యాంగనిర్మాణములు మాఱుచున్నవి. ద్రవ్యబలము తగ్గుచున్నది. వ్రాతబలము హెచ్చుచున్నది. కర్మకారులు నాయకులగుచున్నారు. స్త్రీలు స్వాతంత్ర్యమును పడయుచున్నారు. రుష్యాయందు ప్రజాసత్తాకపాలన మేర్పడినది. జర్మను రాజ్యాంగనిర్మాణమునందు మార్పులు కలుగనున్నవి. అమెరికా సంయుక్తరాష్ట్రములు ధర్మసంరక్షణార్థమై ఆంగ్లేయులతో పాటు రణరంగమునందు చేరినవి. ఇమ్మహాపరివర్తనమునకై మహావిలయ మవశ్య మైనది. ప్రబల మైన యూరపు రాజ్యముల లయము సుందోపసుందుల లయమువలె నన్యోన్యరాజ్యముల లయము మూలమున సంప్రాప్తమై ధర్మము స్థాపిత మగుట దైవ నిర్ణయము.

### సంగ్రామఫలము

మహాసంగ్రామము ముగిసి శాంతి స్థాపిత మైనపుడు యూరపు రాజ్యములకు పునర్జన్మము కలుగఁగలదు. ఆ జన్మమునందు శాంతిప్రద మైన లోకరాజ్యసామ్రాజ్యస్థాపనము సాధ్యము కాఁగలదు. మహాసంగ్రామము రాజ్యముల నగ్నితప్తము చేసినది. ప్రజలను కష్టతప్తులను చేసినది. కష్టతప్తు లైన ప్రజలు వివేకవంతులై భోగారాధనమును ధనారాధనమును విసర్జించి నూతనయుగనిర్మాతలు కాఁగలరు. ప్రత్యభిజ్ఞానము గల స్వల్పరాజ్యములకు స్వాతంత్ర్యస్థితి కలిగిన, వర్తమాన మహాసంగ్రామమునకు చేసిన యపార మైన వ్యయము ధారవోసిన ప్రాణములు వ్యర్థము గాక సార్థక మని స్థిరపడుచున్నది. అమెరికా సంయుక్తరాష్ట్రములు మిత్రమండలి పక్షమున రణరంగమునందు చేరుటవలన విజయాంచిత మైన శాంతి స్థాపితమై సకలరాజ్యములకు మిత్రత్వ మేర్పడి లోకసామ్రాజ్యసమితి యేర్పడు నని విశ్వాసము కలుగుచున్నది.

లోకమునం దంతటను ప్రజాస్వామ్యత్వపాలనములు స్థాపితము లైనపుడు రాజుల దురాశల కెడ ముండదు. రాజ్యతంత్రజ్ఞుల మంత్రాంగముల కవకాశము లుండవు. బలము గల జాతుల యన్యాయాక్రమణమునకు కారణము లుండవు. ప్రజలే ప్రజల యోగక్షేమమునకై ప్రజలను పాలించుటకు పూనుకొనినపుడు సంగ్రామరూపమున ప్రజానాశనము దుర్లభమగును. సకలరాజ్యములు పరాధీనములు గాక స్వాధీనస్థితిని కలిగి శాంతిమార్గమున వికసించుచు విశ్వపరిణామమునకు శుభాంగములై విరాజిలుచుండును. ఈ లోకసామ్రాజ్యనిర్మాణమునకై ప్రాణదానము చేసిన శూరులు వీరులు ధన్యులు. ధర్మనిర్వహణమునకు మహాత్యాగము మూలము. హైందవ యోధులు పాశ్చాత్యయోధులవలె రణరంగంబులందు ప్రాణత్యాగమును చేసి ధర్మసంరక్షణమును చేయుచున్నారు. రణరంగసంజనిత మైన ప్రాచీప్రతీచీసంయోగము వ్యక్తులందును సంఘములందును జాతులందును స్వార్థపరత్వమును దురభిమానమును నివారణ చేసి మానవసౌభ్రాతృత్వమును సమానత్వమును స్వాతంత్ర్యమును సుస్థిరముగ స్థాపించుటకు మూలకారణం బగునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాత!



### భరతఖండమునందు భావోదయము

ఇరువదవ శతాబ్దమునం దాసియాఖండప్రబోధ ముదయించినది. ప్రబోధస్థితికి యుద్ధయుగము తోడ్పడినది. రుష్యాజపానుయుద్ధము ప్రాక్ప్రపంచప్రబోధమునకుత్తేజమును కలిగించినది. జపాను సైన్యముల యప్రతిహత మైన విజయములు వారి ప్రత్యభిజ్ఞానమును బలపఱచినవి. జపానీయుల ప్రత్యభిజ్ఞాన మాసియాఖండవాసుల ప్రత్యభిజ్ఞానంబునకు కారణం బైనది. ప్రత్యభిజ్ఞానమువలన ప్రజలయందు ఆత్మగౌరవము ఆత్మవిశ్వాసము జనియించినవి. వర్తమానమహాసంగ్రామము ప్రజల హృదయంబులం దంకురించిన విశ్వాసాంకురంబులను పల్లవింపఁజేయుచున్నది. వర్తమానమహాసంగ్రామమువలన భారతమాతయొక్క బలసంపదలు లోకమునకు వ్యక్త మైనవి. ముప్పది కోట్ల ప్రజల బలము లోకమున కజేయము. 1800000 మైళ్ల విస్తీర్ణము గల దేశసంపదలు సామ్రాజ్యపోషణమున కపరిమితములు. భరతవర్షముయొక్క బలసంపదలు బ్రిటిషు ప్రజలకు వర్తమానమహాసంగ్రామమువలన గ్రాహ్యము లైనవి. బ్రిటీషు సామ్రాజ్యముయొక్క విషమదశయందు భారతీయులు చూపిన త్యాగము స్వామిభక్తి బ్రిటిషు ప్రజల హృదయంబుల నాకర్షించినవి. భారతీయుల మహిమాతిశయంబులు బ్రిటిషు సామ్రాజ్యవాసుల సంస్తుతులకు పాత్రము లయినవి. ఆంగ్లరాజనీతిజ్ఞులు సామ్రాజ్యమునందు భరతఖండమున కర్హస్థితిని కల్పించుట యవశ్యమని నిర్ణయించిరి. సామ్రాజ్యాంతర్భాగములకును

బ్రిటీషు ద్వీపములకును గల రాజ్యాంగనిర్ణయంబులందు పరివర్తనమవశ్యమని నిర్ణయింపఁబడినది. సామ్రాజ్యభారము నుచితరీతిని వహించిన భరతవర్షము సామ్రాజ్యలాభములను పడయుట ధర్మమని గ్రహింపఁబడినది. లండను నగరమునందు సామ్రాజ్యమహాసభ సామ్రాజ్యవ్యవహారంబులను నిర్ణయించుటకై సమావేశమైనది. సామ్రాజ్యసభయందు హైందవప్రతినిధులకు ప్రవేశము కలిగినది. సత్యేంద్ర ప్రసన్న సింహ బికనీరు మహారాజు సర్ జేమ్సు మెస్టను గారులు హైందవ ప్రతినిధులు. ఈ సందర్భములందు భారతీయులు భరతఖండమును పరాధీనస్థితినుండి తొలఁగించి సమాంశము గలదానిఁగ చేయుఁడని కోరుట ధర్మము గాని యధర్మము గాదు. గతసంవత్సరము హిందూదేశరాజ్యాంగాందోళనమునందు స్వరాజ్యాందోళనము ప్రముఖము.

## స్వరాజ్యము

లోకమునందు సకలరాజ్యములకును స్వరాజ్యము నైసర్గికము. పరాధీనపరిపాలన మస్వాభావికము. అస్వాభావికస్థితిని తొలఁగించి నైసర్గికస్థితిని ప్రసాదింపుఁడని భారతీయులు బ్రిటీషు పరిపాలకులను కోరుచున్నారు. భారతీయులు 3,000 వత్సరములుగ ప్రజాసభ్యత కలవాటుపడియున్నారు. నూరేండ్ల బ్రిటీషుపరిపాలనమున స్వపరిపాలనా విధానమునందు శిక్షణము పొందియున్నారు. భరతఖండపాలనమునకు స్వరాజ్యము గమ్యస్థానమని ఆంగ్లరాజనీతిజ్ఞులు సంబోధించియున్నారు. స్వయంవ్యక్తిత్వము ప్రత్యభిజ్ఞానము మానవకోటికి సహజస్వత్వములు. అధినివేశరాజ్యములందువలె భరతఖండమునందును స్వరాజ్యమును స్థాపించుట ధర్మమనియు పురోవృద్ధికి సాధనమనియు అవశ్యమనియు వర్తమాన మహాసంగ్రామమువలన ఆ యావశ్యకత ద్విగుణీకృతమైన దనియు భారతీయులు విన్నపము చేయుచున్నారు. స్వరాజ్యాందోళనము నతితీవ్రతగతిని దేశమునందు వ్యాపింపఁజేసిన అనిబిసెంటుగారు హైందవుల కృతజ్ఞతకు పాత్రురాలు. ఇపుడు చెన్నపురి రాష్ట్రమునందనేకమైన స్వరాజ్యసమితులు గలవు. స్వరాజ్య మచిరకాలమున స్థాపిత మగుటకై స్వరాజ్యసమితుల సంఖ్య దేశమునందంతటను మూలమూలలను హెచ్చింపఁబడుట యత్యంతావశ్యకము. ఆ యావశ్యకమును గ్రహించి దేశాభిమానులు స్వరాజ్యసిద్ధాంతమును ప్రజలకు బోధించి స్వధర్మము నసుష్ఠించెదరు గాత!

## సామ్రాజ్యశాసనసభ

గతసంవత్సరవృత్తాంతము హిందూదేశచరిత్రమునందు ప్రఖ్యాతిని పడయఁగలదు. ప్రజాతత్పరుఁడైన హార్డింజి ప్రభువు రాజ్యభారమును షమ్సుఫర్డు ప్రభువర్యుని వశము చేసెను. షమ్సుఫర్డు ప్రభువర్యుఁడు ఏప్రిలు 5-వ తేదిని అధికారభారమును స్వీకరించెను. క్రొత్త యెన్నికలు జరగినవి. సామ్రాజ్యశాసనసభ నూతనాకృతిని దాల్చినది. సభయందు 67 మంది సభ్యులు గలరు. అందు ప్రజానిర్వాచితులు 27 మంది. బి. నరసింహేశ్వరశర్మ గారు శ్రీనివాసశాస్త్రి గారు కె. రంగస్వామి అయ్యంగారు మీరు అసదల్లీఖాను గారు చెన్నపురిరాష్ట్రపు ప్రతినిధులు. శ్రీ షమ్సుఫర్డు ప్రభువర్యుని యాధిపత్యము క్రింద నూతనసభ సెప్టెంబరు 5-వ తేదిని కూడినది. ఆ సమావేశమునందు రాజప్రతినిధి యుద్ధనిర్వహణమునకై హిందూదేశము చేసిన యపారమైన సహాయమును శ్రుతపరిచెను. యుద్ధమారంభమైన తరువాత రెండు లక్షల మంది నూతనముగ సైన్యమునందు చేరిరి. 20,000 మంది యనుచరులు రణరంగములకు పోయిరి. 1,600 మంది డాక్టరులు సైన్యసహాయమునకై పోయియుండిరి. యుద్ధసహాయమునకును యుద్ధనిధికిని మహారాజులు రాజులు లక్షల కొలంది రూప్యములను దానము చేసిరి. అయినను, హిందూదేశము తగిన రీతిని యుద్ధనిర్వహణమునకై సహాయము చేయుట లేదని ఆంగ్లాధికారాభిమానపత్రికలు ఘోషించినవి. ఈ ఘోష యక్రమమని అధికారులందఱు నేకగ్రీవముగ ఖండించిరి. శ్రీ షమ్సుఫర్డు ప్రభువు భరతఖండము బ్రిటీషు సామ్రాజ్యమునకు నిక్షేపపుకుప్ప యని సామ్రాజ్యశాసనసభయందు తెలిపియుండెను. డిసెంబరు మాసమునందు ప్రజాప్రతినిధులు 19 మంది సభ్యులు యుద్ధానంతరరాజ్యాంగసంస్కరణముల విషయమై రాజప్రతినిధి కొరకు విన్నపమును సమర్పించిరి. ఆ విన్నపమును పురస్కరించుకొని యే లక్నోపురమునందుఁ గూడిన జాతీయమహాసభయు మహమ్మదీయ మహాసభయు స్వరాజ్యపుతీర్మానమును ప్రతిపాదించినవి. సామ్రాజ్య శాసనసభయందలి హైందవప్రతినిధుల మతము ప్రజామతము కానిచో ప్రజామత మెవరిదో తెలియకున్నది.

శాసనసభ తిరిగి సెప్టెంబరు 27-వ తేదిని సమావేశమైనది. ఆ సమయమునందు విద్యావిధా

సమును గురించి పాలకాభిప్రాయములను ప్రకటించిరి. సర్ శంకరన్ నాయరు గారు పాట్నవిశ్వవిద్యాలయశాసనము నుపపాదించెను. ఈ చిత్తు శాసనము విద్యాభివృద్ధికి ప్రతికూల మని తీవ్రఖండనము జరిగెను. శాసనసభ తిరిగి ఫిబ్రవరి 8-వ తేదిని గూడినది. ఆ సమావేశమునందు రాజప్రతినిధి హైందవస్వచ్ఛంద సైన్యనిర్మాణమును చేయుటకు పాలకులు తలపెట్టిన నిర్ణయమును తెలిపి భారతీయులకు పరమాహ్లాదమును కలిగించెను. చిరకాలమునుండి భారతీయు లభ్యర్థించుచున్న స్వచ్ఛందసేవావిధానము మహాసంగ్రామము వలన నైనను సంప్రాప్తమైనందులకు భారతీయులు రాజప్రతినిధికి కృతజ్ఞులు.

## దేశాదాయవ్యయములు

మార్చిమాసాదిని గూడిన సామ్రాజ్యశాసనసభయందు సర్ విలియము మేయరుగారు ఆయవ్యయపత్రమును సమర్పించిరి. మేయరుగారి కోశనిర్ణయంబులు ప్రజలకు సంతృప్తికరముగ నున్నవి. కోశాధ్యక్షుఁ డాయవ్యయముల నిర్ణయంబులను తెలుపుచు నీ క్రింది భావమును వ్యక్తీకరించెను:

"ఈ యేఁటి యాయవ్యయవ్యవస్థలందు విశేషముగ క్రొత్త పన్నులు వేయుట గోచరము. ఇయ్యది సామ్రాజ్యలాభమునకుఁ గాని మన దేశోపయోగమునకుఁ గాదు. జాతీయస్వాతంత్ర్యమును ప్రజాసభ్యతను సంరక్షించుటకై చక్రవర్తి యుద్ధమునకు పూనుకొనెను. ఆ మహాసంగ్రామనిర్వహణమునకై భరతఖండ మింతవఱకు చేసిన సహాయమున కనుబంధముగ తిరిగి సహాయమును చేయఁబూనుకొంటిమి. ఇయ్యది ఈ మహాసంరంభమునందు భరతవర్ష మునకుఁ గల పరమార్థమును తెలుపుచున్నది."

1916-17 నందు సామ్రాజ్యాదాయము రూ. 97,20,45,000; రాష్ట్రాదాయము రూ. 47,92,65,000. ఆదాయపు మొత్తము రూ. 145,13,10,000. సామ్రాజ్యవ్యయము రూ. 88,50,75,000; రాష్ట్రవ్యయము రూ. 45,58,50,000. వ్యయపు మొత్తము రూ. 134,8,25,000. వ్యయము పోను నిలువ రూ. 10,94,85,000. అధికాదాయమునకు ముఖ్యసాధనములు, రైలుబండ్లు 6,00,00,000; నల్లమందు 1,29,90,000; ఉప్పు 1,34,70,000; కస్టమ్సు 1,33,65,000; టంకసాల 82,80,000; పోస్టు టెలిగ్రాములు 45,00,000; వడ్డీ 50,70,000; ఆదాయపు పన్ను 52,95,000. నిరుడు వేసిన క్రొత్త పన్నులవలన రూ. 7,20,00,000 ల యధికాదాయము వచ్చినది. వ్యయమునం దధిక మైన మొత్తము వ్యయమైనది. అందు సైన్యాదులకై 6 కోట్ల రూప్యము లధికముగ వ్యయ మైనది. సైన్యాదులకై 1914-15 నందు రూ. 29,77,40,000, 1916-17 నందు 38,02,50.000 వ్యయ మయినది. యుద్ధమువలన సైన్యవ్యయము రూ.8,28,10,000 హెచ్చినది. ఈ వ్యయము పోను కేవలము సామ్రాజ్యాదాయమునందు రూ. 8,55,00,000 నిలువ తేలినది. రాష్ట్రాదాయమునుండి రు 2,25,00,000 నిలువ తేలినది. ఈ నిలువకు కారణము రాష్ట్రములందు వ్యయమును తగ్గించుట.

గతసంవత్సరము ఇంగ్లాండునందు హిందూదేశపు మంత్రి రూ 107,25,00,000 వాడుకొనుట సంభవించినది. ఇందు ముప్పది రెండు కోట్లు సామాన్యవ్యయమునకు పోను, శేషించిన ద్రవ్యమునుండి బాకీలను తీర్చుటకు 16 కోట్లు, 24 కోట్లు వెండి కొనుటకు, పేపరు కర్రెన్సి రిజర్వునకు 29 కోట్లు వినియోగింపఁబడినవి. ఈ యధిక మైన ద్రవ్యము ఈ క్రింది మార్గములవలన లభించినది. ట్రెజరీల నిలువనుండి 49 కోట్లు, నిలువనుండి 15 కోట్లు, వెండి నాణెములనుండియు పేపరు కర్రెన్సి రిజర్వునుండియు 47 కోట్లు (రూప్యములు) హిందూదేశపు మంత్రి వశము చేయఁబడినవి. ఇంత ద్రవ్యము హిందూదేశపు మంత్రి యధీనము చేయఁబడినను నాణెములు 62 కోట్ల మొత్తమునకు నిలువయున్నవి. హిందూదేశపు మంత్రి తావున నిలువయున్న ద్రవ్యమునుండి 69 కోట్ల రూప్యములు బ్రిటీషు అప్పుపత్రములను కొనుటకై వినియోగింపఁబడినవి.

## క్రొత్త అప్పు : పన్నులు

భరతఖండము బ్రిటీషు సామ్రాజ్యమునకు సహాయము చేసి స్వధర్మమును నిర్వహించుటకై హిందూదేశపాలకులు 150 కోట్ల రూప్యములను అప్పుచేసి బ్రిటీషుపాలకుల కిచ్చుటకు నిశ్చయించిరి. ఈ మొత్తమును తలఁచినపుడు గుండె జల్లు మనుట సహజము. భాగ్యవంతము గాని హిందూదేశమున కీ మొత్తము అధిక మని యనేకులకు తోఁచవచ్చును. ఈ మొత్తము ఒక సంవత్సరపు సామ్రాజ్యాదాయమునకు రెట్టింపు అని సర్ విలియము మేయరు గారు తెలిపియుండిరి. సహాయము చేయుటకు ప్రజాప్రతినిధు లంగీకరించిరి. రాజప్రతినిధి జనవరి మాసమునందు ఈ విషయమును హిందూదేశమంత్రికి తెలిపినపుడు ప్రజాప్రతినిధులతో సంప్రతించి తెలిపియుండుట యుక్తముగ నుండియుం

డును. యుద్ధమువలనను అప్పునకు వడ్డీవలనను ఇతరవ్యయములవలనను రాఁగల సంవత్సరము రూ. 148,23,00,000 వ్యయ మగునని మదింపు వేయఁబడినది. ఆదాయ సాధనములు గత సంవత్సరము గలవే యున్నచో వ్యయమునకు తగిన యాదాయము రాఁజాలదు. వ్యయమునకు తగిన రాబడి యుండుటకై రూ. 148,27,65,000 ఆదాయ మవశ్య మగుచున్నది. ఈ యాదాయమును పడయుటకై కోశాధ్యక్షుఁడు క్రొత్త పన్నులను వేయుటకు నిర్ణయించెను. ఆదాయపు పన్నును 4 పైసల నుండి 1 అణాకు హెచ్చించుటయు విశేషాదాయములపై ప్రత్యేక మైన పన్నును వేయుటయు అధికాదాయమున కొక సాధనముగ నిర్ణయింపఁబడినది. ఈ మార్గమునుండి రెండు కోట్ల రూప్యములు రాఁగలవని మదింపు వేయఁబడినది. జనపనార యెగుమతుల మీఁదను పీఁచుమీఁదను గల 2-4-0, 0-10-0 రెట్టింపు చేయఁబడినవి. అందువలన 75 లక్షల రూప్యములు రాఁగలవు. బట్టలమీఁద ఇదివఱకుఁ గల 3½ సుంకము 7½ కు హెచ్చింపఁబడినది. ఇందువలన 150 లక్షల రూప్యములు రాఁగలవు. రైలుబండ్లయందు ధరలు హెచ్చుచేయఁబడినవి. ఈ క్రొత్త పన్నులవలన నవశ్య మని పైని చూపఁబడిన రూ. 148,27,65,000 లభించు నని కోశాధ్యక్షుఁడు నిర్ణయించెను. క్రొత్త పన్నులను నిర్ణయించుటకై కోశాధ్యక్షుఁడు చేసిన యేర్పాటులు మిగులఁ సంతృప్తికరములుగ నున్నవి. ఇయ్యఁగల శ్రీమంతులు విశేషలాభమును పొందెడి జనపనార వర్తకులు ప్రత్యేకలాభములను పొందెడి లాంకాషైరు వర్తకులు పన్నుల నిచ్చుట సంభవించుచున్నది.

### శ్రీ షమ్సుఫర్డు ప్రభువు

సామ్రాజ్యశాసనసభయందు గతసంవత్సర మామోదితము లైన శాసనములలో దేశసంరక్షకబలశాసనము ప్రముఖము. శర్మగా రుపపాదించిన బాలభటప్రతిపాదనమును పాలకుల పక్షమున సర్ శంకరన్ నాయరుగారు ఆమోదించిరి. స్వచ్ఛందపౌరయోధులు బాలభటులు యథావిధిగ శిక్షితులై వృద్ధి పొందినచో, భారతజాతీయయోధవర్గనిర్మాణమునకు వారు కాలక్రమమున కారకులు కాఁగలరు. రాజప్రతినిధి రాజ్యాంగసంస్కారణముల విషయమై తెలిపిన యభిప్రాయములు నిరుత్సాహపూరితములై యున్నవి. వార్తాపత్రికాప్రతినిధుల విన్నపములకు రాజప్రతినిధి యొసంగిన సమాధానము అధికారాభిమానభరితమై అనాలోచితమై యొప్పుచున్నది. బంధకవ్రాతము నాఁపుటకై నారీమణులు సమర్పించిన విన్నపమునకు రాజప్రతినిధి చూపిన సానుభూతి సంస్తవనీయము. దేశసంరక్షకశాసనాధారమున విరామము పొందిన బంధకవ్రాతము తిరిగి ప్రచారమునకు రా దని షమ్సుఫర్డు ప్రభువు తెలిపిన సమాధానమునకు భారతీయులు కృతజ్ఞులు. యువతుల సాహచర్యమువలన దేశమునకు కలుగఁగల మహాప్రయోజనమున కీ యుదంతము నిదర్శనము.

### జాతీయోద్యమములు

గతసంవత్సరము లోకచరిత్రమందు జాతీయజీవనవికాసమునకు ప్రశస్తి పడయఁగలదు. యుద్ధమువలన సకలదేశములకును నూతనచైతన్యము కలిగినది. సకలజాతులందును వసంతోదయ మైనది. పురాణభావంబులు జీర్ణపర్ణంబుల రీతిని విడిపోవుచున్నవి. నూతనభావంబులు శోభాయమానంబులై పల్లవించుచున్నవి. ఈ నూతనవిలాసము ఒక జాతియందు కలదనియు ఒక జాతియందు లేదనియు నిర్ణయించుటకు వీలు లేదు. అన్ని జాతులను నవీనభావము లావరించినవి. నవీనభావముల ప్రభావము కాలక్రమమున తేజోవంతమై విరాజిల్లఁగలదు. సకలరాజ్యములందును స్వదేశాభిమానము స్వజాతీయాభిమానము పరిస్ఫుట మగుచున్నది. ఇతరరాజ్యములందు కలుగుచున్న భావపరివర్తనము హిందూదేశమునందును కలుగుచున్నది. గతసంవత్సరమునందు హిందూ మహమ్మదీయ సంఘములకు కలిగిన సంయోగము భారతజాతీయపాశబంధమును బలపఱచినది. కలకత్తాలోను లక్ష్మణపురములోను కూడిన సభలయం దుభయసంఘముల నాయకులును భేదభావము వదలి మాతృదేశారాధనము చేయుటకు నిశ్చయించిరి. మాతృదేశశుభస్థితియే యుభయసంఘముల శుభస్థితికిని సాధనం బని విదిత మైనది. ఆ వివేకోదయము సహస్రప్రభలతో లక్ష్మణపురంబునఁ గూడిన జాతీయమహాసభలో ప్రకాశించినది.

### జాతీయమహాసభ

లక్ష్మణపురమునందు డిసెంబరు మాసాంతమున జాతీయమహాసభ కూడినది. వేలకొలఁది దేశభక్తులు మాతృసేవచేయుటకై లక్ష్మణపురంబున కేఁగిరి. మాతృసేవాపరాయణు లైన భారతపుత్రులు మతభేదమును మఱచి జాతిభేదమును పరిత్యజించి భావభేదమును విడనాడి

పవిత్రహృదయములతో అమృతవాక్కులతో భక్తి భావములతో భారతమాతను సేవించి కృతార్థులైరి. స్త్రీలు పురుషులు వృద్ధులు యువజనులు హిందువులు మహమ్మదీయులు పండితులు పామరులు జాతీయవ్రతమును స్వీకరించిరి. భేదాభిప్రాయములు గల తిలకు పాలు గంధి బెజంటు బెనర్జి బాసు ఘోసు మాలవ్య సప్రు శర్మ శాస్త్రి సరోజిని గార్లు మొదలగువా రేకభావముతో దేశమాత నారాధించిరి. అంబికాచరణ ముజుందారు గారు బ్రహ్మత్వమును వహించిరి. ఆరాధకు లేకగ్రీవముగ స్వరాజ్యవరమును కోరిరి. వారు పరమ పవిత్ర హృదయములతో కోరిన స్వరాజ్యవర మిట్లు తెలుపఁబడినది:

## స్వపరిపాలన ప్రతిపాదనము

"భరతవర్షమునందలి మహాసంఘములు ప్రాచీనసభ్యతాలబ్ధము లగుటంజేసియు, ఆ సంఘములవారు పరిపాలనమునందును రాజ్యనీతియందును విశేష సామర్థ్యము కలిగియుండుటచేతను, నూరేండ్ల బ్రిటిషుపరిపాలనమునందు వారు విద్యయందును ప్రజాపరత్వమునందును వృద్ధిని పొందియుండుటవలనను, మఱియు ప్రస్తుతము గల పరిపాలనావిధానము ప్రజల యుచితాభీష్టములను నెఱవేర్పక ప్రస్తుతావసరములకును స్థితిగతులకును తగియుండకపోవుటచేతను, సత్వరముగ భరతవర్షమునకు స్వపరిపాలనము ప్రసాదించుటయే బ్రిటిషు పరిపాలనమునకు ఫలసంకల్పము లని తెలుపుచు, శాసనమును ప్రకటన చేయుటకై మహామహుఁడు రాజరాజేంద్రుఁడు కరుణించుటకు సమయ మాసన్నమైన దని జాతీయమహాసభ యభిప్రాయపడుచున్నది.

అఖిల భారతీయ మహమ్మదీయ సంఘమువా రేర్పఱచిన సంస్కరణోపసంఘమును యావద్భారత జాతీయ మహాసభోపసంఘమును చేరి సంప్రతించి నిర్ణయించిన వ్యవస్థలందుఁ గల సంస్కరణములను ప్రసాదించి స్వపరిపాలనమును స్థాపించుటకై నియతారంభమునకు పూనుకొనవలయు నని జాతీయసభ కోరుచున్నది.

సామ్రాజ్య నిర్మాణమునందు భరతవర్షమును పరాధీన స్థితి నుండి తొలఁగించి స్వాధీనాధినివేశములతో సామ్రాజ్యమునందు సమభాగమును కలిగి యుండునటు లుద్ధరింపవలయును."

స్వపరిపాలనవరమును కోరుటకుఁ గల కారణము వారి [illegible] గాని పాలకుల దయాదాక్షిణ్యములు గావు. మానవులకు స్వపరిపాలనము సహజస్వత్వము. పరాధీనత యస్వాభావికము, జాతీయవికాసమునకు ప్రతికూలము. భారతీయులు చిరకాలము ప్రజాసభ్యత ననుభవించిన వంశజులు. బ్రిటీషు పరిపాలనము క్రింద నూరేండ్లు శిక్ష పొందిరి. రణరంగంబులందు శౌర్యపరాక్రమములను త్యాగమును ప్రదర్శించి గౌరవవిశ్వాసంబులకు పాత్రులైరి. మహాసంగ్రామమువలన బ్రిటీషురాజ్యాంగపునర్నిర్మాణ మవశ్యమైనది. సామ్రాజ్యపునర్నిర్మాణమునందు భరతఖండమును పరాధీనస్థితినుండి తొలఁగించి సమభాగిఁగ చేయుట రాజనీతి, మానవధర్మము. జిన్నా గారి యధ్యక్షత క్రింద కూడిన మహమ్మదీయ మహాసభయందును స్వరాజ్యప్రతిపాదన మామోదింపఁబడెను. ప్రజలయందు కలిగిన భావైక్యము భారత జాతీయావబోధమునకు నిదర్శనము

## భారతపారిశ్రామికమహాసభ

లక్ష్మణపురమునందు డిసెంబరు 30-వ తేదిని 12-వ భారతపారిశ్రామికసభ కూడినది. రాయి సీతానాథ రాయి బహద్దరు గా రగ్రాసనాధిపత్యము వహించిరి. హిందూదేశము ప్రాచీనకాలమునుండియు ప్రశస్తమైన పరిశ్రమలకు ప్రసిద్ధి చెందినది. భారతమును శుక్రనీతిని చాణక్యుని యర్థశాస్త్రమును చదివిన, క్రీస్తుశకమునకు పూర్వము సయితము భరతఖండమునందు పరిశ్రమలు ప్రాశస్త్యము కలిగియుండుట విదితము కాఁగలదు. పదునేడవ శతాబ్దమున ప్రాగ్దేశవర్తకలాభమునకై యూరపుఖండమునందు ప్రాగ్వాణిజ్యసంఘములు స్థాపింపఁబడినవి. ప్రాగ్వాణిజ్యసంఘసంఘర్షణమువలన భారతపరిశ్రమలు క్రమక్రమముగ విలయము నొందినవి. వర్తమానమహాసంగ్రామము ప్రాగ్దేశముల పరిశ్రమాభ్యుదయమునకు కొంతవఱకు తోడ్పడుచున్నది. ఈ యవసరమును పరిగ్రహించి జపానుదేశీయులు లాభమును పొందుచున్నారు. భరతఖండమునందు ప్రజాపాలితులకుఁ గల భేదభావమువలన, సంప్రాప్తమైన యవసరమును వినియోగించుటకు భారతీయులకు శక్తి లేకున్నది. పరిశ్రమల స్థాపన కవశ్యమైన సాధనంబులను సభాధిపతి ఇట్లు నిర్ణయించెను:

1. సహజసంపదలు, 2. కర్మకారులు, 3. సాంకేతికశాస్త్రజ్ఞానము, 4 మూలధనము, 5. యంత్రాద్యుపకరణములు, 6. సంవిధానము, 7. విక్రయ ప్రదేశములు, 8. రాకపోకలకు సాధనములు, 9. రాజ్యసహాయము, 10. ఉద్యోగోత్సాహకాశలములు.

భరతఖండమునందు సహజసంపదలకు లోటు లేదు. బొగ్గుగనులు లోహపుగనులు వజ్రపుగనులు బంగారుగనులు గలవు. అటవీపదార్థములు గలవు. పాడిపంటలు గలవు. జలాశయములు గలవు. కాని, వాని వికాసము బాగుగ జరగుట లేదు. 1915-వ సంవత్సరమున 164 లక్షల టన్నుల బొగ్గు 2775 గ్యాలనుల కెరోసిను నూనె 12 లక్షల తులముల బంగార ముత్పన్న

మైనవి. మొత్తము 15 కోట్ల రూప్యముల విలువ గల ఖనిజము లుత్పన్నము లైనవి. రాజ్యసహాయ మున్న, ఈ యుత్పత్తి పెక్కు-రెట్లు పెరుగుట కవకాశము గలదు. టాటాకంపెని లోహపు యంత్రాలయముల వలన గతసంవత్సరము 77 లక్షుల రూప్యముల లాభము కలిగినది. దేశమునందలి సహజ సంపదలను వృద్ధి చేయుటవలన దీనికి పెక్కు రెట్ల లాభమును దేశము పొందుట కవకాశము గలదు. భరతఖండమునందలి కర్మకారులకు వంశానుగతం బైన నైపుణ్యము గలదు. కర్మకారులు సామాన్యముగ పాశ్చాత్యదేశములందు వలె భోగపరాయణులు గాక నిగ్రహగుణశీలురు. దేశ సంపదలను వికసింపఁజేయుట కవశ్యమైన జనసంఖ్య గలదు. జనులకు వంశానుగతం బైన కర్మకౌశలము గలదు. ప్రజలయందు ప్రతిష్ఠ మైన కర్మకౌశలమును దేశవికాసమునకు వినియోగపడునటులు పనిపూనుట పాలకులకు ధర్మము.

భరతఖండమునందు పరిశ్రమలు విరివిగ వ్యాపించుటకు రాజ్యాధికారుల సంపూర్ణ మైన సానుభూతి యవసరము. పాలకులు ప్రజలు చేరి, దేశమునందు పరిశ్రమలను స్థాపించినపుడు భరతఖండము సంపద్భరితమై ప్రజాపోషణయోగ్యమై ఫలప్రదమై విరాజిల్లఁగలదు. సభాధ్యక్షుని యుపన్యాసాంతమునందు తెలిపిన విధమున,

> "నా మనోవీథియందు మహాబలశాలి గాఢనిద్రనుండి మేల్కాంచినట్లు భారతజాతియు మేల్కాంచి పాశబంధములను ఛేదించుకొని త్రిదశయై మధ్యందినమార్తాండునివలె ననిమిష నేత్రములను ప్రజ్వలింపఁ జేయుచు చిరకాల స్తంభిత దృష్టిని దివ్యప్రకాశావలోకనమువలన వికసింపఁ జేయుచున్నట్లు గోచరించుచున్నది."

భారతజాతి తేజోవంతమై వర్ధిలఁగలదు. ఈ దివ్యరూప సందర్శనము బ్రిటిషు సామ్రాజ్యాంతర్గతమైన స్వరాజ్య దశయందే సాధ్యము.

### సంఘసంస్కరణమహాసభ

లక్ష్మణపురమునందు బాబు జ్యోతిస్వరూపు గారి యధ్యక్షత క్రింద సంఘసంస్కరణసభ కూడినది. లోకమునందు పురోవృద్ధి సర్వతోముఖముగ నుండును. సకలప్రయత్నములు సంఘవికాసమునకై చేయఁబడుచున్నవి. సంఘమునకు సాంఘికుల సంయోగసాహచర్యములు బలవికాసములను వియోగవిభేదములు దుర్బల విలయములను కలిగించుచుండును. భారతజాతీయబల వికాసములకు సంయోగసాహచర్యము లవశ్యము. ముప్పదికోట్ల భారతీయులకు సంయోగబలము కలిగినపుడు వారు లోకమున కజేయులు. హిందూదేశమందు నిమ్నజాతుల పతితస్థితి, వితంతువుల నిర్బంధవైధవ్యము, స్త్రీల దురవస్థ, కులదౌర్జన్యము, ప్రజాసౌఖ్యమునకును జాతీయబలమునకును ప్రతికూలముగ నున్నవి. రాజ్యాంగవ్యవస్థలందువలె సాంఘికవ్యవస్థలందును మానవులకు సహజ మైన స్వత్వములు గలవు. ఆ ధర్మమును గ్రహించినపుడు సంఘసంస్కరణము సులభసాధ్యము కాఁగలదు.

### ఇతరసభలు

మద్యపాననిషేధసభకు బి. నరసింహేశ్వరశర్మ గారు అధ్యక్షులు. సప్తవ్యసనంబులం దొక వ్యసనం బైన మద్యపానమును నిషేధింపవలయు నని కోరుట హిందూమహమ్మదీయ మతస్థులకు వింతగ నుండును. ఉభయమతములును మద్యపానమును నిషేధించుచున్నవి. కాని, పాశ్చాత్యనాగరకతా ప్రభావమువలన మద్యపానము దేశమందు పరిపాటియగుచున్నది. మద్యపానము గౌరవచిహ్న మని యానందించెడి మహానుభావులును గలరు. నీతిబాహ్య మైన మద్యపానవ్యాపనమును నిర్మూలము చేయుట భారతీయులకు పవిత్ర మైన మతధర్మము. బ్రహ్మజ్ఞానమహాసభకు ఆనిబెజంటు గారు, ఆస్తికమహాసభకు మహారాణి సునీతిదేవి గారు, క్రైస్తవ మహాసభకు దాసుగారు, విద్యార్థి మహాసభకు సర్ సుబ్రహ్మణ్యము అయ్యరు గారు, మహమ్మదీయవిద్యాసభకు మహమ్మదు షాఫీ గారు అధ్యక్షతను వహించిరి. అధ్యక్షోపన్యాసములును సభల తీర్మానములును సకల సంఘములందును సకలవ్యవస్థలందును అఖండ మైన పరివర్తనము కలుగుచున్న దని స్పష్టపఱచుచున్నవి. సంఘములకు పరివర్తనమే చైతన్యలక్షణము. చైతన్యము లేని సంఘములు నిరర్థకములై విలయము నొందును. జాతీయవికాసమునకు విద్య సంపద ... స్వాతంత్ర్యము సాధనములు. విశుద్ధ ... మతము పవిత్ర మైన సంఘము ప్రబల మైన రాజ్యాంగములు జాతీయశోభ కంగములు. భారతీయులు సమగ్రవికాసమును పడయుటకై భౌతికాధ్యాత్మికవికాసముకొఱకు సమభావముతో పాటుపడి పరమార్థమును సాధించెదరు గాత!

### చెన్నరాష్ట్రము

చెన్నరాష్ట్రవిస్తీర్ణము 1,41,075 చదరపుమైళ్లు,

జనసంఖ్య 4,14,02,000. ముఖ్యభాషలు అఱవము ఆంధ్రము మలయాళము కన్నడము ఉర్దు. ప్రతి 1,000 మంది జనులలోను 407 మంది అఱవమును, 377 మంది ఆంధ్రమును, 74 మంది మలయాళమును 37 మంది కన్నడమును, 23 మంది ఉర్దును వాడుదురు. ప్రజలకు వ్యవసాయము ప్రధానవృత్తి. 100-కి 68 మంది వ్యవసాయమువలన జీవించుచున్నారు.

### వ్యాపారవ్యవసాయపరిశ్రమలు

వ్యాపారపరిశ్రమల కవశ్యమైన సాధనసంపదలు విశేషముగ చెన్నరాష్ట్రమునందు లేవు. పరిశ్రమల కవశ్యమైన బొగ్గు దుర్లభము. కాని, జలబలమున పరిశ్రమలను స్థాపించుట కవకాశము గల దని పండితు లభిప్రాయపడుచున్నారు. చెన్నరాష్ట్రమందు, 1,231 కర్మాగారములు గలవు. అందు 170 కర్మాగారములు దూదిపరిశ్రమకు సంబంధించినవి. యుద్ధమువలన చెన్నరాష్ట్ర వ్యాపారము 100-కి 16 వంతున తగ్గినది. గత సంవత్సరమునందు 40 కోట్ల రూప్యముల వ్యాపారము జరిగినది. చెన్నరాష్ట్రమున వరి ధాన్యము 100, చోళ్లు 50, జొన్నలు 30, రాగులు 20, నూనెగింజలు 30, దూది 20 లక్షల యెకరములందు పండింపఁబడుచున్నవి.

### విద్యావ్యాపనము

గతసంవత్సరము విద్యకై రూ 2,06,50,000 వ్యయము చేయఁబడినది. అందు విద్యాశాఖాధికారి నిర్వహణము క్రింద నున్న విద్యాలయములకు 195, లేని విద్యాలయములకు 11, లక్షలు వ్యయము చేయఁబడినవి. చేసిన యధికవ్యయము రెండు లక్షలు. వ్యయాంశముల వివరము: రాష్ట్రాదాయమునుండి రు. 78,48,000, లోకలు బోర్డులు మ్యూనిసిపాలిటీల నుండి 21,68,000, జీతములు ఇతరాదాయముల నుండి 95,40,000.

గతసంవత్సరము విద్యాలయముల సంఖ్య 1250 గను విద్యార్థుల సంఖ్య 72,204 గను పెరిగినది. కాని, లోఁగడ సరముకంటె వృద్ధి తగ్గినది. రాష్ట్రాదాయమునుండి ప్రాథమికమాధ్యమికవిద్యాలయములకై రూ. 54,50,000 వ్యయము చేయఁబడినది. మధ్యమపాఠశాలలు 8 నూతనముగ స్థాపింపఁబడినవి. ప్రాథమిక పాఠశాలలందలి విద్యార్థుల సంఖ్య 11,43,995 నుండి 12,01,273 నకు పెరిగినది. అందు బాలికల సంఖ్య 16,500 హెచ్చినది. చెన్నరాష్ట్రమునందు సగటున విద్యకై తల 1-కి 0-7-11 వ్యయము చేయఁబడినది. ఈ వ్యయము 0-7-6 నుండి 0-7-11 కు పెరిగినది. మహమ్మదీయ విద్యాలయములు 886 నుండి 906 నకు హెచ్చినవి. పంచమవిద్యార్థుల సంఖ్యయు 100-కి 9 వంతున పెరిగినది.

### రాష్ట్రీయశాసనసభ

గతసంవత్సరము క్రొత్త యెన్నికలు జరగినందున నూతనశాసనసభ నిర్మిత మైనది. ఆ సభయందు ప్రజాసేవాపరాయణుఁ డైన కేశవపిళ్లె గారికి ప్రవేశము కలుగకుండుట విచారకరము. నూతనశాసనసభానిర్మాణ వివరణము: ఫిబ్రవరి మాసాంతమున సర్ శివస్వామయ్యరు గారికి బదులు దివాన్ బహద్దరు రాజగోపాలాచార్యులు గారు కార్యనిర్వాహకసభ్యులుగ నియమింపఁబడిరి. శాసనసభయందు మూడు తరగతుల సభ్యులుందురు: అధికారులు, అధికారనిర్వాచితులు; ప్రజాప్రతినిధులు. శాసనసభయందుఁ గల 46 మంది సభ్యులలోను 21 మంది ప్రజాప్రతినిధులు; 25 గురు అధికారులు, అధికారనిర్వాచితులు.

సభాధిపతి: శ్రీ పెంట్లండు ప్రభువు. కార్యనిర్వాహకసభ్యులు: సర్ అలెగ్జాండరు కార్డ్యూ గారు, ఎచ్. ఎఫ్. డబ్ల్యూ. గిల్మను గారు; దివాను బహద్దరు పి. రాజగోపాలాచార్యులు గారు.

### ప్రజానిర్వాచితులు

1. తిరువేంగడ రంగాచారి గారు, 2. రివరెండు జార్జి పిటెన్డ్రిగు గారు, 3. ఆకెళ్ల సూర్యనారాయణరావు పంతులు గారు, 4. రావు బహద్దరు మోచెర్ల రామచంద్రరావు పంతులు గారు, 5. ఆమంచర్ల సుబ్బకృష్ణారావు పంతులు గారు, 6. ఫులమాటి శీనరావు గారు, 7. దివాన్ బహదూరు అగరం సుబ్బరాయలురెడ్డి గారు, 8. భవాని వేంకటగిరి అయ్యరు నరసింహ అయ్యరు గారు, 9. కస్గ్రాడ్ సదాశివభట్ గారు, 10. రావు బహదూర్ వలుట్టూరు కృష్ణఅయ్యంగారు రామానుజాచారియార్ గారు, 11. కృష్ణస్వామి రామయ్యంగారు, 12. కొప్పర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావు పంతులు గారు, 13. రామనాథపురము రాజా బి. రాజరాజేశ్వర సేతుపతి గారు, 14. భూపతిరాజు వేంకటపతిరాజు గారు, 15. కృష్ణస్వామి చిదంబరనాథ మొదలియారు గారు, 16. కారెకాట్ కుమారత్ కవలప్పరముప్పిల్ నాయర్ గారు, 17. యాకూబ్ హాసన్ సాహెబు బహద్దూరు గారు, 18. ఖాన్ బహదూరు అహమద్ తంబి గులాం ముహిద్దీన్ అహమద్ తంబిమరక్కయార్ సాహెబు బహదూర్ గారు, 19. గార్డెన్ ఫ్రేజర్ గారు, 20. జాన్ ఓక్షాట్ రాబిన్సన్ గారు, 21. ఎడ్వార్డు ఫెయిర్లెస్ బార్బర్ గారు.

## ప్రభుత్వ నియోజితులు

1. సర్జన్ జనరల్ విలియం బర్నే బానర్మాన్ గారు, ఐ. ఎం. ఎస్., ఎం. డి., డి. ఎస్. సి., సి. ఎస్. ఐ., 2. జేమ్సు పన్సు బెడ్ ఫర్డుగారు, 3. నార్మన్ సోమర్విల్ బ్రాడీ గారు, 4. లెవెలిన్ అడిసన్ బక్లే గారు, 5. రాబర్టు వెయిలీ క్లగ్ గారు, 6. లయొనెల్ డేవిడ్ సన్ గారు, సి. ఎస్. ఐ., 7. కర్నల్ విలియం మాంటేగ్ ఎల్లిస్ గారు, ఆర్. యి., సి. ఐ. యి., 8. అజిడ్డీను సాహేబు గారు, 9. న్యూయార్టు బిన్నీ మక్రే గారు, 10. టి. రామచంద్రరావు గారు, 11. అడ్వొకేటు జనరల్ శేషాద్రి శ్రీనివాస అయ్యంగారు గారు, 12. జాన్ హెన్రీ స్టోను గారు, 13. చార్లెసు జార్జి టాడ్హంటరు గారు, 14. సర్ గులాం మహమ్మదలీ సాహెబు బహదూర్ గారు, 15. రివరెండు జాన్ ఏలెన్ గారు, డి. డి., 16. రావు బహదూరు సాతప్పచెట్టి రామనాథన్ చెట్టియార్ ముత్తయ్యచెట్టి అన్నామలె చెట్టియార్ గారు, 17. థామస్ రిచ్ మండ్ గారు, 18. సర్ ఫ్రాన్సిస్ జోసెఫ్ ఎడ్వర్డు స్ప్రింగ్ గారు, కె. సి. ఐ. యి., 19. రావు బహదూర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడు గారు, 20. సేరుగడా జమీందారు ఎ. శోభచంద్ర సింగు దేవ గారు, 21. బట్టరువర్తు గారు, ఐ. సి. ఎస్., 22. బొబ్బిలి రాజా శ్రీ రావువేంకటకుమార కృష్ణరంగారావు బహదూరు గారు, 23. ఎ. ఆర్. నాప్ గారు, 24. ఆర్. ఎ. గ్రాహమ్ గారు, 25. ఇ. థూచ్ మన్ గారు.

## రాష్ట్రాదాయము

గతసంవత్సరము చెన్నరాష్ట్రాదాయము రూ. 7,90,34,000; వ్యయము రూ. 759,49,000; నిలువ 1,40,85,000. నిలువకు కారణము యుద్ధమువలన వ్యయాంశమును తగ్గించుట, కొన్ని శాఖలం దధికాదాయము కలుగుట. హిందూదేశపు మంత్రి యుత్తరువువలన దేశాభ్యుదయమున కవశ్యమైన పనుల నాంపుట సంభవించిన దని సర్ అలెగ్జాండరు కార్డ్యు గారు తెలిపియుండిరి. వ్యయమునందు రూ. 13, 65, 000 తగ్గింపఁబడినది. రాబడియందు రూ. 20,17,000 హెచ్చినది. న్యూనాధికములకు వివరము ; ఆదాయమునందు మద్యము 6,82,000, అడవులు 5,50,000, ఆదాయపు పన్ను 2,85,000, ఇతరశాఖలు 5,02,000 అధికముగ నాదాయమును కలుగఁజేసినవి. గతసంవత్సరము భూమిసిస్తునందు మదింపువేసిన మొత్తముకంటె 2,51,000 తగ్గినది. కారణము కృష్ణవరదలు, కడలూరు ప్రాంతమునందలి గాలి వానలు. ఆ కారణములవలన కృష్ణాజల్లాయందు 2,50,000, కర్నూలు గూడలూరు ప్రాంతములందు 77,000, మొత్తము 3,27,000 రివిమిషనుగ నియ్యవలసినటుల తీర్మానముచేయఁబడినది.

### గత సంవత్సరపు ఆయ వ్యయములు

1916—17 నికరాదాయము

| | ల. వే. | | ల. వే. |
|---|---|---|---|
| భూమి నీటి శిస్తు | 347.69 | రిజిస్ట్రేషను | 25.00 |
| స్టాంపులు | 78.00 | చిల్లర | 15.89 |
| మద్యము | 181.50 | ఇతరశాఖలు | 49.17 |
| ఆదాయపు పన్ను | 28.95 | అడవి | 45.00 |
| | | మొత్తము. | 774.20 |

1916—17 నికరవ్యయము

| | ల. వే. | | ల. వే. |
|---|---|---|---|
| పోలీసు | 114.69 | రిజిస్ట్రేషను | 13.16 |
| విద్య | 83.45 | పాలనము | 15.49 |
| వైద్యము | 18.56 | కోర్టులు | 55 65 |
| పారిశుద్ధ్యము | 18.69 | జెయిలులు | 15.98 |
| వ్యవసాయము | 12.29 | నీటివసతి | 10 00 |
| ఇతరశాఖలు | 13.50 | చిల్లర పనులు | 6.25 |
| పెన్షనులు | 33.41 | చిల్లర పనులు | 29.00 |
| అప్పును తగ్గించుట | 14.60 | సివిలు పనులు | 20.04 |
| ముద్రణము | 2.50 | సివిలు పనులు | 59.[illegible] |
| భూమి శిస్తు | 123 49 | ఇతర శీర్షికలు | 41.54 |
| అడవి | 27.70 | మొత్తము. | 759.49 |

అధిక వ్యయమునందు విద్యకై 11,34,000, వైద్యసహాయమునకై 4,33,000 వినియోగింపఁబడును. గతసంవత్సరము పాలకులు విద్యకై రూ. 83,45,000 వినియోగించిరి. రాఁగల సంవత్సరము విద్యకై 94,79,000వినియోగించుటకు నిర్ణయించిరి. అధికవ్యయము11,35,000. ఇందు ప్రారంభపాఠశాలలకై 4,19,000, ప్రారంభవిద్యకై 5,50,000 వినియోగింపఁబడును. ఇతర శాఖలయందు వ్యయము తగ్గించినను విద్యావ్యాపనకై వ్యయమును హెచ్చించుట సంతృప్తికరము. సర్ అలెగ్జాండరు కార్డ్యూ గారు ప్రదర్శించిన గతసంవత్సరపు [illegible]నందలి ఆదాయవ్యయాంశములు సంతృప్తికరముగ నున్నవి. రాఁగల సంవత్సరపు ఆదాయము 7,88,36,000, వ్యయము 7,94,61,000 అని మదింపు వేయఁబడినది. కోశాధిపతులకు వ్యయము నధికముగ చూపుటయును ఆదాయమును తక్కువగ చూపుటయును ఆచారము. గతసంవత్సరమువలె రాఁగల సంవత్సరమునందును లెక్కలయందు వ్యత్యాసము కలుగుట సహజము.

# ఘంటా న్యాయము

(చరిత్రాత్మకచిత్రగీతమాలిక)

తాపీ ధర్మారావు గారు, బి. ఏ.

భారతవర్షంబునం దున్న పురమతల్లి
ఎన్నియో రాజ్యముల కెన్నఁ గన్నతల్లి
రాణ నొప్పారు సౌందర్యరంగవల్లి
నగరరాజంబు ఢిల్లి నెఱుఁగుదురు గద ! 4
ఆ పుర మ్మింక తురకల కాఁపురమ్ము
గాక పూర్వమె, దేశానఁ గలుగు సొమ్ము
లెల్ల నితరుల చేతుల కేఁగకుండ
దేశభాషలకొఱకును దేశవృత్తు 8
లకును నుపయోగమై చాల లగ్గొనర్చు
కాలమందున పాలించె ఘనుఁ డొకండు.
పే రనంగపాలుఁడు; ప్రజఁ బిల్లలట్ల
చూచి కాపాడుచుండుటఁ జూచి పరులు 12
కూడ మెచ్చుచుండిరి. సిరితోడ జనులు
పలువితమ్ముల జ్ఞానంబు గలిగి మనిరి.
కలవు వాని గుణము లనేకములు: గొప్ప
రాజ దా నని మదిని గర్వంబు లేదు; 16
రా జగుట పెద్ద కార్యభారంబు దలను
దాల్చుటే గాని, రాజ్యంపు ధనము నెల్ల
వ్యయము సేయుచుఁ బ్రజలకు వంత నొసఁగ
గద్దెమీఁదను గూర్చుంట కా దటంచు 20
మదిని మఱవఁడు; తా నెంత మాన్యుఁ డైనఁ
బ్రజకు సేవ సేయంగ దైవంబు పనిచె
నంచుఁ జింతించు; దేశంబునందు భక్తి
గలిగి ప్రజ లెల్ల దేశీయగౌరవంబు 24
నిల్పికొనునట్టి బోధల సల్పుచుండు;
ఇంతియే కాదు, న్యాయమం దెంత పేద
యయిన ధనికునితో సముఁ డంచు నెంచు;
అట్టి రా జుండఁ బ్రజకు లేనట్టి దేది ? 28
ఐనఁ దన క్రింద నుద్యోగు లైనవారి
కెట్టి సుగుణంబు లుండుట యెందు నరుదు
గాదె! అటనట పెనుముండ్లకంపలట్ల
రాజు చుట్టును నుద్యోగిరాజి యుండు 32
నే గదా! అటువంటివా రితని క్రింద
నుంటఁ గనుపెట్టె తా నెంత యుత్తముండో!
అంతలు గని హా యటంచు ననంగపాలుఁ
"డకట! చింతసేయ నధిపుఁ డుద్యోగి 36
గణమె కాదె చెవియుఁ గన్ను నంద్రు;
అవును, రెండు కనులు చెవులు రెండును గల్గి
యొరునిఁ బోలు నొక్క ధరణిపతికి
వారి తోడు లేక వశమె కోటిజనంబు 40
గల తెఱం గెఱింగి వలనుసేయ ?
వీరె న్యాయమునకు దూరులై వర్తింప
జనుల కీడు లెన్న శక్య మగునె?
దోస మున్న చోట దూషణం బుండదు; 44
నిరపరాధి కగును పరమబాధ.
అర్థవిద్య బ్రదుక యాచనకే పూను,
నలఁతి చదువు లెక్క నందలంబు.
సోమరుల్ ధనికులు సేమాన నుందురు; 48
పంటకాఁపు చింతపాలఁ బడును.
పేదవారు మరియుఁ బేదలై వర్తింత్రు;
ధనికు నింటి ధనము గుణిత మందు.
పలుకు లిన్ని యేల? పాపంబు ప్రబలును; 52
మంచి యెల్ల కలియు మంటిలోన.
అయ్యో! నాదు పాప మది యెట్టిదో కాని,
చెవులు గనులు గల్గి యవియె లేవు.
ఇంక నాదు ప్రజల కెక్కడి న్యాయంబు! 56
దేవుఁ డొసఁగు విధిని దీర్చు టెట్లు?
దైవదండన మిఁకఁ దప్పదు కాఁబోలు!
శ్రీహరీ! యి దేమి యూహ!— భయము."
అంచుఁ జింతించి పలు గతు లాత్మ నెంచి 60
శిల్పి రావించి తన యూహఁ జెప్పి పంచి
పది దినమ్ములు నొక వెట్టివలెఁ జరించె.
శిల్పికారులు నింతలో సల్పినట్టి
కార్యమును గూర్చి యొక్కింత కలదు నుడువ, 64
అల బహిర్ద్వారమున కింక వెలుపలి దెస
నంద మగు నొక్క పీఠంబుఁ బొందుపఱచి
దానిపై రెండు సింగముల్ పూనినట్లు
కంచుతో పెద్దగంట నిర్మించినారు. 68
కంచు కే రీతి పదను గల్పించినారొ!
గంట మ్రోఁగిన నూ రెల్ల ఖంగు మనుచు
నంతిపురమును బురమును నటకుఁ దెచ్చు;
ఇంక సింగంబు లంటిమా? యెట్టి వాగ్ర 72

లైనఁ దొలి చూపులో విగ్రహము లటంచు
నెన్నఁజాలక, భయమున మిన్నకుందు;
రంత సహజంబుగాఁ దోఁచు ననిన మీర
లతిశయోక్తి యన్ భ్రమ నంద ననవసరము. 76
అక్కటా! నిజం బతిశయంబటులు దోఁచె!
ఆ దినంబుల మన శిల్పు లందినట్టి
నేర్పు నేఁడైనఁ బెరవారు నేర్వఁగలరె?
సంశయం బున్న 'నెలొరా' 'యజంతము' లను* 80
కొండ తొలువంగ నేర్పడ్డ గోపురములఁ
జూచియేనియు మనవారి సూక్ష్మబుద్ధి
నిపుణతయుఁ గాంచఁగావచ్చు నిపుడుఁ గూడ.
అట్టి నైపుణి యంతయు నడుగువట్టె; 84
ఒరులు పొనరించు చిప్పల కొఱఁగవలసెఁ
దేశశిల్పులఁ బోషించు దిక్కులేక;
ఏ మనఁగవచ్చు మనహైన్య? మింకఁ గథకు.
పీఠమందు నొక్క పెద్ద పటికఱాతి 88
పలక నుంచి దానిపైని వ్రాసి
రింపు గులుకునట్టి కెంపురవ్వలతోడ
దూరమునకుఁ గూడ తోఁచునట్లు:
"ప్రభువు న్యాయ మందవలసినవా రెల్ల 92
గంట మ్రోఁగ జేయఁ గాంతు రద్ది."
ఈ గతి ననంగపాలుఁ డుద్యోగుల పని
చక్కఁజేసి దురాచార ముక్కడంచి
న్యాయ మందఱ కొకరీతి నందఁజేసె. 96
అంత నొక్కనాఁ డెండ యత్యధిక మగుచు
పిట్టలును గాలు వెల్పలఁ బెట్టకుండ
మండుచుండంగ, నొక కాకి యండనుండి
సింగములు పూను నెఱ్ఱని రంగు గంటఁ 100
గాంచి, పఱతెంచి ముక్కునఁ గల బలమునఁ
బొడిచి పై కెగసి, మరలఁ బొడువవచ్చి
తుఱ్ఱునను బొఱు లోపల దూరు వెడలు.
కొన్ని నిముసంబు లీ రీతిఁ జన్నపిదప, 104
ఖంగుఖం గని మ్రోఁగె నా గంట యొకటఁ;
గాని, బెదరక నిలిచెను గాక మటనె.
మట్టమధ్యాహ్న మిది యేమి పుట్టెనో యని
యూరివారును నగరిలోవారు గూడ 108
వచ్చి; రంతలోన ననంగపాలుఁ డచటి
కేఁగి "గంట మ్రోఁగించినా రెవ్వ" రనిన
యంతఁ, గాక మొగిఱపోయి యవలి కేఁగె.
"ఓసి! పాడు కాకి యూరకే యిందఱ 112
నిచటి కీడ్చి తెచ్చె; నెంత చేసె
నాడు నిద్ర పోయె; నాడు కార్యము పోయె;
నే నిచటికి వచ్చు టేల చెపుమ?
యెంగిలి తిని క్రొవ్వి యేమి చేయఁగలేక 116
బాగు చేసెనమ్మ పాడు కాకి"
అనుచు నంద ఱిటుల యాకాకిఁ దిట్టుచు
నుండ, రాజు సూచి "యుండుఁ" డనుచుఁ
జింత చేసె: "గంట యెంతొ కాలమునుండి 120
యిచట నుండ, నేఁ డి టేల యగుట?
సింహములు నిజంపు సింహములను బోలి
లోకమునె భ్రమింప కాకి ఘనమె?
కాన, సింహము లని కాకంబు దలపోసి, 124
సింగములు తినంగఁ జెదరిపడిన
ముక్క లేమి యైనఁ జిక్కవా యను నాశఁ
జేరి చూడవచ్చె నెంత; కంతి
నెండ తీక్ష్ణతమెయి నెఱ్ఱగా నుండిన 128
గంట నెంచె మాంసఖండ మనుచు.
సింగ మున్న చోటఁ జేరుచు గాకంబు
సహజ" మంచుఁ బల్కె జనులు వినఁగ:
"దోస మయ్యె నాది; మోసంబుఁ జేసితి; 132
కాకి దోస మున్న ఘనము గాదు.
వాది కాకి యయ్యెఁ బ్రతివాది నే నైతిఁ;
దప్పు నాదె యంచు నొప్పికొంటి.
ఇంకమీఁద నిటుల యే జీవి యైనఁ దా 136
నాస వచ్చి మోస మందకుండ
నిచట దినదినంబు నీ సింగముల నోట
మాంస ముంచుచుండు మఱుఁగు మఱుఁగు.
న్యాయ మనిన నొక్క నరులకొఱకె కాదు 140
చిన్న జీవులకును జెందవలయు."
అనుచు నా రీతి చేయించె ననఘమూర్తి;
దైవభీతికి దాక్షిణ్యభావమునకుఁ
దొలి యనంగుని నెన్నంగవలయుఁగాదె? 144
పులుఁగులకుఁ గూడ న్యాయంబు పొందఁజేయఁ
గలుగు నెయ్యది? యీ సింహఘంట తప్ప! 146

"సృష్టి నల్పజంతు వెయ్యది యైనను, నరుని తుల్య మనెడి నరుఁడె నరుఁడు
అట్టి వర్తనంబె ప్రార్థనీయం బగు, వాఁడె ప్రియుఁడు జగతి పరమునకును."

* ఎల్లోరా అజంటా మహాబలేశ్వరము మొదలగు చోటుల శిల్పిచాతుర్య మిప్పటికిని ఆశ్చర్యకరముగా నుండును.

# చిత్తశుద్ధి — సంస్కారవాసనలు

ముక్తినూతలపాటి గోపాలకృష్ణయ్యా గారు

"చిత్తస్య శుద్ధయే కర్మ నతు వస్తూపలబ్ధయే." "హృదిస్వేచ్ఛాతు ముక్తిదా." —— శంకరాచార్యులు

లోకంబున మానవుం డెట్టి యుత్తమకార్య మొనర్పవలసి యున్నను పరమపురుషార్థము పడయందలంచినను చిత్తశుద్ధి యావశ్యకము. చిత్తశుద్ధి లేక యెట్టి కార్యమును సిద్ధింపనేరదు. దయామయుండగు పరమేశ్వరుం డొసంగిన భాగ్యంబులలో చైతన్యశక్తి యొకటి. ఈ శక్తిచేతనే యెల్ల వ్యాపారంబులు నిర్వర్తింపంబడుచున్నవి. చిత్తమును శుద్ధిగావించుటకు మున్ను చిత్తస్వరూప మెట్టిది యని విచారించుట యావశ్యకము. మన మే కార్య మొనరింపవలసినను సాధనము కావలయును. దీనినే కరణ మందుము. కరణకళేబరము లగు మన శరీరములయందు బాహ్యసాధన మగు కరణము ఇంద్రియ వర్గంబును, అంతస్సాధనం బగు నంతఃకరణంబును అని రెండు సాధనములు గలవు. అందు బాహ్యసాధన మగు నింద్రియవర్గము శ్రోత్ర త్వ క్చక్షు జిహ్వా ఘ్రాణ రూపం బగు జ్ఞానేంద్రియ పంచకంబుగను, వా క్పాణి పాద పా యూపస్థా రూపం బగు కర్మేంద్రియపంచకంబుగను, అంతస్సాధనం బగు నంతఃకరణము మనస్సు బుద్ధి అహంకారము చిత్తము అని నాలుగు విధంబులుగను ఒప్పారుచుండును. అందు సంకల్ప వికల్పాత్మకము మనస్సును, నిశ్చయాత్మికంబు బుద్ధియు, కర్తృత్వాభిమానం బహంకారంబును, ధ్యానయోగ్య చైతన్యాత్మకంబు చిత్తంబు నై వెలయుచుండును.

ఈ యంతఃకరణ చతుష్టయంబును అంతరింద్రియం బని యంతఃకరణం బని పిలుతుము. ఈ యంతఃకరణము జీవునికి వలయు నెల్ల వ్యాపారముల నొనగూర్చుచు నుత్తమసాధనమై సులోచనమును పోలియున్నది. సులోచనము తనపైం బడు మాలిన్యముచే నెఱుపును తెలుపును పొంది, వెలుపలి పదార్థములు స్వచ్ఛంబు లయినను తన గుణమున కనురూపముగ నెఱ్ఱవిగను తెల్లవిగను చూపించు చందంబున, ఈ యంతఃకరణంబును రజస్తమోగుణాధిక్యంబున సహజస్వచ్ఛతను గోల్పోయి బాహ్యపదార్థములను విపరీతముగ గ్రహించును. ఒక యద్దముపై ధూళి చేరి మలినం బైన ప్రతిబింబములు ప్రతిఫలింపని చందంబున స్వచ్ఛం బగు నీ యంతఃకరణమ్మును రజస్తమోవృతం బగునెడ ప్రతిబింబములు ఫలింపనేరవు. సరస్సులోని జలంబులు స్వచ్ఛం బగునేని అడుగున నున్న పదార్థంబు లన్నియు స్పష్టముగ కన్పించును గాని మలినంబు లగునెడ కన్పట్టవు. ఆ విధంబుననే జలతుల్య ప్రకృతిరూపాంతఃకరణంబులును మాలిన్యము చెందెనేని, సత్యపదార్థములు కనిపింపకపోవుటయే కాక, బింబములును ప్రతిఫలమును చెందవు. సులోచనముపై దుమ్మును దర్పణముపై ధూళిని సరోవరజలంబులలోని మాలిన్యమును పోంగొట్టందలంచిన పగిదిని చిత్తములోని మాలిన్యమును తొలంగించి శుద్ధి గావింపవలయు. చిత్తశుద్ధి గలుగు విధం బెద్ది యనం "చిత్తస్య శుద్ధయే కర్మ" అను శ్రీశంకర భగవత్పాదాచార్య సూక్తిచే సత్కర్మానుష్ఠానమువలనం జిత్తశుద్ధి కలుగుచున్నది. సత్కర్మాచరణమువలన మలినము లగు పాపవాసనలు నశించి సద్వాసన యగు పుణ్య మతిశయించి నిర్మల మగుటం జేసి ధ్యేయవిషయంబులు చక్కంగం బ్రతిఫలనముం జెందును.

శ్లో. కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽత్మశుద్ధయే.

కర్మయోగులు ఫలాసక్తిని వదలి శరీరము మనస్సు బుద్ధి ఇంద్రియములచేత ఆత్మశుద్ధి (చిత్తశుద్ధి) కొఱకు సత్కర్ముల నాచరించుచున్నా రని శ్రీకృష్ణభగవానులు గీతాశాస్త్రమందు వ్రాక్రుచ్చిరి. దురభిమానాహంకారమును వదలి లోకముకొఱకును దేశాభ్యుదయముకొఱకును నిఖిలభూతహితమునకును విధివిహితసత్కర్మముల నాచరించినం జిత్తశుద్ధి కలుగు నని భావము. ఈ చిత్తశుద్ధివలన జ్ఞానప్రాప్తియు దానివలన సర్వకర్మసన్న్యాసరూపజ్ఞాననిష్ఠయు దానివలన శాశ్వతానందమోక్షంబును జ్ఞానులు పొందుచున్నా రని శ్రీ శాంకరగీతాభాష్యమునందుం గలదు.

స్వచ్ఛ మగు దుకూలాంబరము మాసెనేని చవిటిమన్ను సబ్బు మొదలగువానిచే మురికిని పోంగొట్టి కాంకవేసి చలువ చేసినచో అది యచ్ఛముగం బ్రకాశించు చందంబున, పాపదుర్వాసనలచే మాలిన్యము చెందిన చిత్తమును మైత్రి కరుణ ముదిత ఉపేక్ష యను సద్వాసనాభావనలచే మాలిన్యమును పోంగొట్టి నిర్మలము గావింపవలయు నని శ్రీ పతంజలిమహర్షి "మైత్రీకరుణాముదితోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యాపుణ్యవిషయాణాం భావనా తశ్చిత్తప్రసాదనమ్." అను సూత్రముచే యోగశాస్త్రమందు విశదీకరించిరి. చిత్తశుద్ధికి సాధనము లగు మైత్ర్యాదివాసనలను విచారించుటకు మున్ను వాసనాస్వరూపమును తెలిసికొనుట యావశ్యకము గనుక దానిని సర్వశాస్త్రములయం దేమి చెప్పంబడినదియు పరిశీలింతము.

బహువిధము లగు విత్తనములు భూమియందు సూక్ష్మంబు రూపములుగ కన్పింపకయుండి వర్షము కురియంగనే మొలకలెత్తి చిగిర్చి పూచి కాయు చందంబున పుణ్యపాపరూపము లగు వాసనలును హృదయక్షేత్రమందు బీజరూపములుగ నుండి విషయేంద్రియ సన్నికర్ష సంయోగమువలన నంకురించి పల్లవించి కుసుమించి క్రియా

రూపముగ ఫలించును. భూమియందు నాటఁబడిన విత్తనములు వాని వాని కనుగుణంబు లగు నణువుల నాకర్షించుకొను విధం బీ క్రింది దృష్టాంతమువలన స్పష్ట మగుచున్నది. వేఁపవిత్తనమును మామిడి విత్తనమును పనసవిత్తనమును సుక్షేత్రమందు నాటి మంచినీరు పోసి తిమేని అందు వేఁపవిత్తనము తన కనుగుణంబు లగు తిక్తాణువులను మామిడివిత్తనము మధురాణువులను పనసవిత్తనము స్వాద్వణువులను ఆకర్షించుకొనును. వేఁపమొలకకు మంచినీరు పోసినను అది యందలి తిక్తాణువులనే గ్రహించుటయు మామిడిమొలకకు క్షారోదకము పోసినను అది యందలి మధురాణువులనే గ్రహించుటయు చూడ ప్రకృతిలో ననేకవిధాణువులు గల వనియు అది యాయా పదార్థముల కనుగుణంబు లగు నణువుల నొసంగు ననియు విదిత మగుచున్నది. దీనికి దృష్టాంతము సముద్రోదకమును కాఁచి మంచి నీరుగ మార్చుటయు మధురం బగు వర్షోదకము ఉప్పునేలమీఁదఁ బడి క్షారోదక మగుటయు ప్రత్యక్షముగఁ జూచుచున్నారము. నై విధంబుగనే అనేకజన్మార్జితపుణ్యపాపరూపవాసనలు హృదయ క్షేత్రంబున నిగూఢంబుగ నుండి సంకల్పముచే నంకురించి భావనచే పల్లవించి తమ కనుగుణంబు లగు విషయంబులను ప్రకృతిలోనుండి యాకర్షించుకొనును. సద్వాసనలు గలవాఁడు సజ్జనసాంగత్యమును దుర్వాసనలు గలవాఁడు దుర్జనసాంగత్యమును నపేక్షించి వారితోఁ గలసి మెలసి తమ కనుగుణంబు లగు నణువుల నాకర్షించుకొను చుండు విధము' గొప్ప సంఘసమావేశములందును విందులయందును జూచుచున్నారము. గీతాసక్తులు గాయకులతోడను చరిత్రశాస్త్రాభిలాషులు ఐతిహాసికులతోడను ప్రకృతిశాస్త్రజ్ఞులు భౌతిక రాసాయనిక శాస్త్రవేత్తలతోడను తత్త్వజిజ్ఞాసువులు తత్త్వజ్ఞులతోడను జారులు విటులతోడను చోరులు తస్కరులతోడను మద్యపాయులు మద్యపులతోడను నటులు నటవిదూషకులతోడను తమతమ వాసనానుగుణ్యసంకల్పములతో చేరుచున్నారు. ఎవని హృదయమందు దుర్వాసనలు కొలఁదిగను సద్వాసన లధికముగను నుండునో వాఁడు తొలుత దుర్జనసాంగత్యము కలవాఁ డయ్యు పిమ్మట కాలవిశేషంబునను సద్వాసనాధిక్యంబునను సజ్జనసాంగత్యమును పొంది దుర్వాసనల నశింపఁజేసికొనును. అటులే సద్వాసన లల్పముగను మలినవాసన లధికంబుగను నుండెనేని మొదట సత్సాంగత్యంబున యోగ్యుఁడై పిమ్మట మలినవాసనాధిక్యంబున దుష్టసాంగత్యమునకు లోఁబడి సద్వాసనల పాడుచేయును.

పూర్వకర్మప్రవాహానుగతంబుగ వాసన లెవ్విధంబున లాగునో అటులఁ బోవు నీ మానవునకు స్వాతంత్ర్యము లే దనియు కర్మబద్ధుఁడై పాపవాసనలు ప్రేరేపించినట్లు చేయుటయం దీతనిదోషము లే దనియు చెప్పుట యుక్తియుక్తంబును శాస్త్రసమ్మతంబును గాదు. అటులైన వైద్యాదిశాస్త్రంబులు వ్యర్థంబు లగును. ఒకఁడు వ్యాధిచే బాధితుఁ డగుచుండ వాని పాపకర్మఫలితమును మనము తొలఁగింపఁ జేయఁగలుగుదుమా యని చికిత్స చేయకుంటిమా? దీనికిని ప్రతీకారము గలదు. దయామయుం డగు పరమేశ్వరుండు మన కొసంగిన బుద్ధిశక్తులచేత మలినవాసనాజన్యదోషపుంజంబును తొలఁగింపఁజేసికొని సద్వాసనాజన్యపుణ్యనిచయంబు నభివృద్ధి గావించు యుక్తమార్గమని వడయవచ్చును. అటు గాక పురుషప్రయత్నము నుపేక్షించితిమేని పాపవాసన లభివృద్ధి నొంది "బీజాంకుర న్యాయంబున" నెన్నఁటికి నశింపక పురుషుని నరకకూపంబున పడఁద్రోయును. కావున పురుషుండు ధైర్య మవలంబించి యుద్యమవిశేషంబున మలినవాసనల నశింపఁజేయఁ గడంగవలయును. ఉద్యమాతిశయంబునను ఇచ్ఛాశక్తివలనను ఎట్టి కార్యంబు లయినఁ గొనసాగు నని యనుభవపరు లగు నీతివేదులు నుడువుదురు. ఉత్సాహంబును ఉద్యమంబును ధైర్యంబును లేనివాఁడు మానవశబ్దవాచ్యుఁ డగుట కనర్హుఁడు. శ్రీ రామచంద్రుఁడు కర్మవాసనాప్రాబల్యముం గాంచి పురుషుం డస్వతంత్రుఁడును కర్మబద్ధుఁడు నని తలంచి కార్యంబుల నొనరింప నుపేక్షించు తఱి, వసిష్ఠమహర్షి కర్మవాసనలను జయించు శక్తి పురుషప్రయత్నమునకు కల దనియు, ఉత్సాహోద్యమంబులవలన చైతన్యశక్తి యభివృద్ధి గాంచి యెట్టి కార్యంబు నయినఁ గొనసాగించు ననియు యోగవాసిష్ఠతత్త్వగ్రంథమునందు నొక్కి వక్కాణించియున్నవాఁడు. సావిత్రి సత్యవంతునిఁ బడయుట భగీరథుండు గంగాతరంగిణిని గొనివచ్చుట దేవాసురులు క్షీరసాగరంబును ద్రచ్చి యమృతంబును పొందుట లోనగునవి యుద్యమాతిశయంబుననే కదా? దీనిని నిదర్శనము చేసికొని ఆంధ్రోద్యమపరులును స్వరాజ్యపాలనాభిలాషులును గడంగినచో కార్యము నెఱవేఱకుండునా? అటు గాక, స్వగౌరవంబును స్వాతిశయంబును మనంబున నిడికొని కార్యములు సలుపుచు నేదేని కారణాంతరంబున మనస్పర్థలు పొడమ నుద్దిష్టకార్యంబునకు హాని కలుగఁజేయు స్వార్థపరు లగు మహాశయులు కొందఱు బయలువెడలిరేని ఇంకఁ జెప్పవలసిన దేమి? కావున, సదుద్యమమునకు భంగకరము లగు పలుకులు పలుకక కర్జము లొనరింపక పలుగురి సుఖమునకై తన సుఖంబు నయిన కొంత విడిచి ప్రోత్సాహపఱచు మహానుభావుఁడు దేశాభిమానియు సంఘాభిమానియు నీతివేదియు ననఁబడును. కావున, పురుషప్రయత్నాతిశయమున కార్యములు నెఱవేఱినట్లు దుష్టము లగు మలినవాసనలను సయితము నశింపఁజేయవచ్చును. దుర్వాసనలు నశింపఁజేయు విధమును శ్రీశంకరభగవత్పాదాచార్యులు వివేకచూడామణిగ్రంథమునం దీ క్రిందఁ బొందుపఱచిన విధంబున నుడివియున్నాఁడు.

శ్లో. కార్యప్రవర్ధనా ద్బీజప్రవృద్ధిః పరిదృశ్యతే
కార్యనాశా ద్బీజనాశ స్తస్మా త్కార్యం నిరోధయేత్
వాసనావృద్ధితః కార్యం కార్యవృద్ధ్యా చ వాసనా
వర్ధతే సర్వథా పుంస స్సంసారో ననివర్తతే.

కార్యము చేయుటవలన వాసనారూపబీజ మభివృద్ధి యగును. బీజము తరల కార్యరూపవృక్షము నుత్పత్తి గావించును. కావున వృక్షరూప మగు కార్యమునకు కారణభూతంబగు వాసనాబీజంబును నశింపఁజేసిన కార్య ముత్పత్తి కాఁజాలదు. ప్రారబ్ధేచ్ఛను

ముగ దుష్టకార్య మొనరింపవలయు నని సంకల్పము గలిగినంత, [?]ంచినను ఆమోదించినను భావనాదార్ఢ్యముచే క్రియారూప పరిణమించి ఫలరూపానుభవము వాసనలై హృదయమందు బీజరూపముగ నుండి మరల కార్య మొనరింపఁ గారణమై యుండును. అటు గాక దుర్వాసనాబీజము సంకల్పరూపముగ నంకురింపఁగనే త్రుంచివేయ నభివృద్ధి గాఁజాలక నశించును. దానంజేసి తిరిగి కార్యమును కలుగఁజేయు బీజ ముత్పత్తి కానేర దని తాత్పర్యము. జాజి సంపెంగ చల్లె మొల్ల మున్నగు పువ్వుజాతులు గల తోఁటలో పాగ ఉల్లి మొదలగు దుర్వాసన గల మొలకలు పడి మొలిచె నేని నూడఁ బెఱికి వేయవలయును. లేనిచో నవి వృద్ధి పొంది తమ దుర్గంధాణువుల నంతట వ్యాపింపఁజేసి యందలి పరిమళమును చెడఁగొట్టును. వరి పొలములో పడి మొలచిన చెను మొలకలను కలుపు తీయు విధంబున హృదయక్షేత్రంబున చేరియుండిన దుర్వాసనాబీజములు మొలకలెత్తఁగనే వానిని విరుద్ధభావనలచే వృద్ధి కానీయక నశింపఁజేయవలయును. అనఁగా దొంగతనము చేయవలె నను సంకల్ప మంకురింపఁగనే దొంగతనమువలనఁ గలిగెడు రాజదండనము అవమానము కష్టములు లోనగునవి భావించినచో, ఆ సంకల్ప మడఁగిపోవును. ఇట్టులే జారత్వము త్రాగుబోతుతనము లోనగు దుష్టసంకల్పము లంకురించినంత విరుద్ధభావనలు దృఢముగ చేసి ఆసంకల్పములను నశింపఁజేయవలయును. విరుద్ధభావనాదార్ఢ్యముచే దుర్వాసనాబీజమును నాశము గావింపకపోతిమేని సంకల్పముచే నంకురించి యాసక్తిచే పల్లవించి ఉద్దీపనవిభావనలచే పుష్టి చెంది యనుభవముచే ఫలించి మరల వృక్షోత్పత్తికి కారణ మగు బీజ మేర్పడును. ఇట్లు బీజమువలన వృక్షమును వృక్షమువలన బీజమును అన్యోన్యాశ్రయముగ నేర్పడి యవిచ్ఛిన్నముగ నుండునపుడు పురుషప్రయత్నవిశేషముచే దుర్వాసనాబీజముల నంకురింపనియట్లు నాశము గావింపవలయును. మలినవాసనలను నశింపఁజేసి సద్వాసనల నభివృద్ధి గావించు నుపాయంబును మనస్స్వరూపంబును హరిభక్తిరసాయనగ్రంథమునందు శ్రీమధుసూదనసరస్వతీస్వాములవారీక్రింద పొందుపఱచిన విధంబున విశదీకరించినవారు:

"మనస్సు అనునది అనేకజన్మార్జితపుణ్యపాపరూపవాసనారేణువులచే ఘనీభూత మయిన తైజసపదార్థము. అయ్యది హృదుమధురానందాశ్చర్యజనకవాక్యములచేతను శ్రావ్యగీతరాగాదులచేతను కరఁగుచున్నది (ద్రవించుచున్నది) చిత్తమునకు ద్రవించు స్వభావము కలిగియున్నట్లు శాస్త్రములయందు కనఁబడుచున్నది.

౧ శ్లో. చిత్తద్రవ్యం హి జతువత్స్వభావాత్ కఠినాత్మకం
తాపకైర్విషయైర్యోగే ద్రవత్వం ప్రతిపద్యతే.

లక్కవలె చిత్త మను పదార్థము స్వాభావికముగ కఠినమయి తాపజనకము లగు కామాదివిషయసంయోగముచే ద్రవత్వమును పొందుచున్నది.

'సౌరాలోకాదిసంయోగేతు శిథిలీభావమాత్రం నద్రుతి రితి సిద్ధం, ఏవం చిత్తస్యాపి వక్ష్యమాణ కామాదివిషయాత్మకతాపకసంయోగం వినా నద్రవీభావః; విషయమాత్రసంయోగేన ద్రవేతు శిథిలీభావమాత్రం తాపకపదోపాదానేన సూచితం'



లక్కను ఎండలో నుంచుటవలన అది మెత్తఁబడును గాని కరఁగదు. అట్లుగనే చిత్తము విషయసన్నికర్షమువలన మెత్తఁబడును గాని కరఁగదు. తాపజనకము లగు కామక్రోధరాగద్వేషాది విషయసంయోగమువలన చిత్తము ద్రవించి యా కాలమందు స్వీకరించు విషయము లా చిత్తమునందు వాసనారూపముగ స్థితిని చెందును.'

శ్లో. కామక్రోధభయస్నేహహర్షశోకభయాదయః
తాపకాశ్చిత్తజతున స్తచ్ఛాంతౌ కఠినంతు తత్.

కొలిమిలో కాల్పఁబడిన యినుపకడ్డీలను తాఁకించుటచే లక్క కరఁగినట్టులు చిత్తద్రవ్యంమును కామక్రోధభయస్నేహహర్షశోకాదులవలన కరఁగును. ఈ విషయసంయోగంబున చిత్తము ద్రవించి అవి తిరోధానము చెందినంత కఠినత్వము పొందును.

చిత్తము ద్రవించు ననుట కనేకనిదర్శనములు కలవు. కామినీకటాక్షవీక్షణము లను కామాగ్నిసంతప్తబాణములచే ధీరుని హృదయము కరఁగి ప్రేమప్రవాహమై యింద్రియరంధ్రముల ద్వారమున మందస్మితవదనారవింద యగు సర్వాంగసుందరిపై ప్రవహించుచుండును. దీనానాథరక్షణకళ్యాణగుణోపేతుఁ డగు భగవంతుని నామ కీర్తన శ్రవణ స్మరణాదులచే భక్తుల హృదయంబులు కరఁగినట్టులు బాష్పంబులచేతను రోమాంచితముచేతను తెలియఁబడుచున్నది. వే యేల? నాటకప్రదర్శనమందు ధీరోదాత్తు లగు శ్రీరామ హరిశ్చంద్ర నలాదుల కష్టస్థితులను గాంచు సరసుల హృదయంబులు కరఁగినటులు గద్గదిక రోమాంచి తాశ్రుపత నాదులవలనఁ జూపట్టుచున్నది. చంద్రకిరణ సంస్పర్శమువలన చంద్రకాంతమణి ద్రవించినట్లు శ్రావ్యగీతరాగాదులచే శ్రోత లగు రసికుల హృదయంబులును ద్రవించును. ధీరాగ్రేసరుండును భాగవతోత్తముండును నగు విప్రనారాయణుం డైహికభోగంబులను విడిచి విషయవిముఖతచే వజ్రహృదయుండై యుండ, మధురవాణి యను వారవిలాసినియొక్క సన్నికర్ష సాహచర్య సంయోగాదులచే అతని చిత్తము కరఁగినట్లు వైజయంతీవిలాసంబునఁ గలదు.

శా. ఆ విప్రోత్తము వజ్రపంజరనిభం బై నిశ్చలం బైన స
ద్భావం బంగన సాహచర్యగుణసంపర్కంబునన్ లోహ మై
గ్రావం బై దృఢదారు వై లయణువృక్షం బై ఫలప్రాయ మై
పూ వై అమ్మకరంద మై కరఁగఁగాఁ బోఁబోఁ బిల్లం బల్చ నై

మారక్రూరశరాళికంబు లనంబరగు నా వారకామినీ కటాక్షవీక్షణంబులచే ధీరోత్తముం డగు నాతని హృదయము మొదట వజ్రపంజరముతో సమముగ నుండి క్రమముగ ఇనుము రాయి కొయ్య లేఁత చెట్టు పండు పూవు పూఁదేనె పల్చని నీళ్లుగా మారి కరఁగిన దని తాత్పర్యము. దీనివలన కామక్రోధాదులచే చిత్తము కరఁగునట్లు స్పష్టమగుచున్నది.

ఇట్లు కరఁగిన చిత్తమువలన కలుగు ప్రయోజనం బే మన: మెత్తఁబడని లక్కయం దే వస్తువును సంయోగము చెందక కరఁగిన లక్క

యందే చక్కఁగఁ గూడుకొనియుండి వీడిపోనియట్లు ద్రవించిన చిత్తమునందే విషయములు వాసనారూపముగ స్థితిని చెందును గాని కఠిన చిత్తమందును మెత్తఁబడిన చిత్తమందును స్థితిని చెందనేరవు. కరఁగిన లక్కయందు చేర్పఁబడిన రంగు మొదలగు పదార్థములు చక్కఁగ కలసికొనిపోయి కట్టెలు ఱాలు మొదలగువాని రాపిడి కలిగినను వీడిపోఁజాలవు. అటులే ద్రవించిన చిత్తమందు చేరిన వాసనలు చక్కఁగ కలిసికొనియుండి దృఢభావనలు కలిగినను మరల కరఁగినను వీడిపోనేరవు. భక్తిజ్ఞానవైరాగ్యనీతిబోధకవిషయంబులు సామాన్యజనుల హృదయంబుల కెక్కనపుడు శ్రావ్యము లగు గీతరాగాదులచే చిత్తము కరఁగించి పిమ్మట బోధించినచో చక్కఁగ నాటికొనును. హరికథాకాలక్షేపములయందు వీనుల కింపగు రాగములచేతను చమత్కారకథలచేతను శ్రోతల హృదయంబులు ద్రవింపఁజేసి యందు భక్తిజ్ఞాననీతివైరాగ్యబోధక విషయవాసనాబీజములను చల్లవచ్చునని శాస్త్రజ్ఞులు కనిపెట్టిరి. శ్రీకృష్ణమిశ్రపండితులు ఆలంకారికులగు తన శిష్యులకు వేదాంతతత్త్వవిషయంబులు బోధించి వారు గ్రహింపలేనితఱిని నెల్లరకును ప్రీతికరం బగు నాటకమును రచియించి వేదాంతవిషయంబుల నందుఁ జొనిపి ప్రబోధచంద్రోదయం బను పేరఁ బ్రచురించిరి. ఇటులే దుర్గవగాహతత్త్వవిషయంబులను ప్రాణులకు తెలియుటకై మహనీయులు చైతన్యచంద్రోదయము సంకల్పసూర్యోదయము జీవానందము అను పేరులఁ బరఁగు నాటకములను రచియించి మహోపకారము గావించిరి. అజీర్తి జ్వరము లోనగు వ్యాధులచే బాధితు లగు శిశువులకు చేదుకసటు వగరు గల యౌషధంబుల నిచ్చినఁ బుచ్చుకొనక తిరుగఁబడినపుడు చక్కెర తేనె బెల్లము మొదలగు ననుపానములచేఁ బొదిగి యా యౌషధమాత్రలనే యొసంగిరి మేని అనాయాసముగ పుచ్చుకొనియెదరు. దానంజేసి వ్యాధులు కుదురును. అవ్విధంబున మానవుల చిత్తవృత్తులఁ గనిపెట్టి వాని కనుగుణంబు లగు ననుపానములఁ దెలిసికొని శ్రావ్యము లగు రాగములచేత మనసు కరఁగించి చమత్కారకథలయందు భక్తినీతి జ్ఞాన వైరాగ్య బోధక విషయములను జొనిపి చిత్రవిచిత్రచమత్కారవాక్కులచే బోధించినచో వాసనారూపంబుగ సద్విషయంబులు వారి హృదయంబున నాటుకొనును. క్షేత్రమును చక్కఁగ దున్ని విత్తనములను చల్లిన నాటుకొనును గాని పైపైని చల్లిన నాటుకొనక గాలి కెగిరిపోవును. అటులే బహువృత్తుల భ్రమించు చిత్తమును ఏకాగ్రతలోనికిఁ దెచ్చి కరఁగించి సద్విషయవాసనాబీజములు చల్లవలెను. మైనపుటుండయందు సువర్ణ రేణువులు చేర్చుకొలఁదిని మైనపుటణువులు తగ్గి సువర్ణ మధిక మగునట్లు అనేకజన్మార్జితవివిధ వాసనలచే మలినంబగు నీ మనస్సను మైనపుముద్దయందు సద్వాసనాసువర్ణరేణువులను చేర్చుకొలఁదిని మలినవాసనలు తగ్గిపోవును. ఈ మనస్తత్త్వరహస్యమును కనుఁగొనిన కొందఱు పాశ్చాత్యవిద్వాంసులు బాలురకు బోధించు పాఠశాలలయందు నిర్బంధవిద్యాశిక్షా విధానమును మార్చి నవీనమార్గమును కనిపెట్టి చిత్తములను చమత్కారకథా వస్తుప్రదర్శన గీతాదులచే కరఁగించి (**Emotional Education**) యుత్సాహవంతులఁ జేసి యనాయాసముగ పాఠవిబులను బోధించుచున్నారు. ఇదియే క్రమవిద్యాశిక్షణ[illegible] వారి యభిప్రాయము. మనస్తత్త్వము నెఱింగి బోధించు వంతునకు లోఁబడని మానవుఁడును అసాధ్య మగు విషయంబును నుండ దని మానసికశాస్త్రజ్ఞుల మతము.

ఇవ్విధంబున వాసనాస్వరూపంబును మలినవాసనానాశనంబును చిత్తమును కరఁగించి సద్వాసనాబీజములఁ జేర్చు పద్ధతియు చెప్పఁబడినవి. ఇఁక వాసనాభేదంబులును చిత్తప్రసాదనసాధనంబు లగు మైత్ర్యాదివాసనల స్వరూపంబును తెలిసికొనఁదగియున్నది. మలినవాసన శుద్ధవాసన యని వాసన రెండు విధములు : అందు మలినవాసన తీవ్రబంధము మృదుబంధము నని రెండు విధములు. తీవ్రబంధ మగు మలినవాసన దంభ దర్పాహంకార క్రోధ పారుష్యాజ్ఞాన రూపమైన యాసురసంపద గలది. మృదుబంధ మగు మలినవాసన లోకవాసన శాస్త్రవాసన దేహవాసన యని మూఁడు విధంబులు. శుద్ధవాసన సత్త్వగుణసంజనితము లగు అభయ సత్త్వసంశుద్ధి దాన దమాదులు అమానిత్వాది జ్ఞానసాధనంబులు మైత్ర్యాది చిత్తప్రసాదనసాధనంబులు లోనుగాఁ గల దైవసంపద గలది. వీని భేదంబులును స్వరూపస్వభావగుణధర్మంబులును మలినవాసనానిర్మూలనప్రకారంబును మత్కృతమానసికశాస్త్రంబున విశదీకరింపఁబడియున్నవి. కావున నిట గ్రంథవిస్తరభీతిచే విరమించి ప్రకృతవ్యాసంబునకు విషయం బగు మైత్ర్యాదివాసనాచతుష్టయంబును వివరించుచున్నాఁడ

సూ. మైత్రీకరుణాముదితోపేక్షాణాం, సుఖదుఃఖ పుణ్యాపుణ్య
విషయాణాం భావనా తశ్చిత్తప్రసాదనమ్.

సుఖవంతులయెడ స్నేహంబును దుఃఖితులయందు కనికరమును పుణ్యాత్ములయెడ సంతోషంబును పాపాత్ములయందు ఔదాసీన్యమును భావింపవలయు నని సూత్రార్థము.

అంతఃకరణము రాగద్వేష పుణ్యపాపములచే కలుషిత మగును. ఒక సుఖ మనుభవింపఁబడుచుండ, ఇట్టి సుఖములే తన కెప్పుడు సంభవించుచుండవలయు ననెడి బుద్ధివృత్తి రాగ మనఁబడును. ఒక దుఃఖ మనుభవింపఁబడుచుండఁగ ఇట్టి దుఃఖము లెప్పటికి తనకు కలుగకుండవలయు ననెడి బుద్ధివృత్తి ద్వేష మనఁబడును. ఇందు రాగము సుఖము ననుభవించు కాలమునందు సర్వసుఖములు తనకు ప్రాప్తింపవలయు నను బుద్ధివిశేషము. సర్వసుఖములు అనఁగా రాజ్యధనవాహనపుత్రకళత్రాగ్రప్రాప్తివలనఁ గలుగు నిహలోకసుఖంబులు; రంభాసంభోగనందనోద్యానవిహరణదివ్యానందస్వర్గలోకాది సుఖంబులు పరలోకసుఖంబులు. వీనిని సంపాదించు సాధనసామగ్రి లేనందున నీ సుఖములు తనకు లభింపకపోయెనే యని ఈ రాగము చిత్తమును వ్యాకులపఱచుచుండును. రాగవ్యాకులితపురుషుఁడు సుఖముల ననుభవించు పురుషులను చూచి వీ రందఱు తనకు మిత్రు లని వారియం దెప్పుడు మైత్రిని భావించునో, అప్పుడు తన కుమారుని రాజ్యము తన రాజ్య మైనట్లు వారి సుఖము తన సుఖముగ నేర్ప

డును. కాఁబట్టి, సుఖములయందు తన కుండిన రాగమును నివర్తించి తద్ద్వారా చిత్తము నిర్మలమై యుండును. లోకములో నొక పురుషుఁడు తనకు రాజ్యము లేకున్నను తన కుమారునకు రాజ్యముండె నేని తనకు రాజ్యమున్నట్టులే యెట్లు భావించి సుఖంబు చెందునో అవ్విధంబుననే యొక్కొక్క పురుషుఁ డొక్కొక్క సుఖము ననుభవించుచునే యుండును కనుక వీరందఱు తన మిత్రులని దృఢముగ భావించెనేని అన్ని సుఖములు తనకు సంభవించినట్టు లేర్పడును. అప్పుడు సుఖములయందు తన కుండు రాగము నివర్తింపఁగనే వర్షాకాలము గడచిన పిమ్మట నదీజలము నిర్మలమై యుండి నట్లు చిత్తము నిర్మలమై యుండును. సుఖవంతులయెడ మైత్రీవాసన నభ్యసింపక పోయినచో రాగమువలన నీర్ష్యాసూయలు వారియందు కలుగును. ఎట్టు లనిన, తనకన్న తక్కువగ నుండువారికిఁ గాని సమానులకుఁ గాని జ్ఞాతులకుఁ గాని గొప్ప పదవులును సభాగౌరవంబును రాజసన్మానంబును పరీక్షాసిద్ధులును మణిరత్నాభరణాంబర వాహన యోగాద్యైశ్వర్యమును గలిగినపుడు వారిని జూచి యోర్వఁజాలక యశుభంబులను గుణములయందు దోషములను ఆరోపింపఁజూచుచుండును. తనతోడ సమముగ నొక తరగతిలో చదువుచు తెలివితేటలు లేక యదృష్టవశంబున పరీక్షాసిద్ధుఁడైన యొకఁడు గొప్ప యుద్యోగము వహించి గుఱ్ఱపు బండ్లమీఁద పోవుచు ప్రతిసభయందు సన్మానంబును కీర్తియు కలిగి మిడిసిపడుచుండునేని అతనికి పదభ్రంశంబును అధికారివలన నవమానంబును కీర్తికి భంగంబును బండి నుండి పడుటయు గుఱ్ఱముకాలు విఱుగుటయు పుత్రకళత్రాదినష్టమును కలుగవలయు నని యసూయాపరుఁ డెల్లప్పుడు కోరుచుండును. పరుల గుణములయందు దోష మారోపించుటవలనఁ గాని ఇతరు లారోపించి చెప్పుటవలనఁ గాని మిగుల సంతోషము గలవాఁ డగును. దుర్వాసన లగు నీర్ష్యాసూయలవలన తా నితరుల ద్వేషింప, ఈ వార్తలు తమ చెవులఁ బడి వా రితనిని ద్వేషింతురు. ఇట్లన్యోన్యద్వేషములవలన మహానర్థములు కలుగక మానవు. కాఁబట్టి బుద్ధిమంతుఁడు వివేకగుణంబువలన తనకన్న తక్కువవారును సమానులును జ్ఞాతులును గొప్ప పదవులు సభాగౌరవవస్త్రాభరణవాహనాదియోగములు పొంది సుఖవంతు లయినపుడు తన పుత్రసహోదరాప్తబంధువులఁబోలె వారెల్లరు తనవా రని భావించి వారి యోగక్షేమంబులం గోరుచు వారితో మైత్రి సలిపి ప్రేమించినచో వా రందఱు ప్రేమబద్ధులై వీనికి వశంవదు లగుచు తమ సుఖంబులు వీనితోఁ జెప్పి సంతసము పడయుదురు. ఇట్లన్యోన్యము ప్రేమబద్ధు లగునెడ ఈర్ష్యాసూయల కవకాశ ముండదు. కాఁబట్టి మైత్రీవాసనవలన రాగము మాత్రము నివర్తించుటయే కాక, ఈర్ష్యాసూయాదిదోషములు సయితము నివర్తించును. రాగవ్యాధిబాధితులు మైత్రీవాసనా దివ్యౌషధ రసాయనమును పుచ్చుకొనవలయు నని తాత్పర్యము.

ఒక దుఃఖ మనుభవించుచుండ ఇట్టి దుఃఖము తన కెన్నఁడును కలుగకుండవలయు ననెడి బుద్ధివృత్తి ద్వేష మనఁబడును. శత్రువ్యాఘ్రసర్పాదులు దుఃఖకారణములు. ఇవి యుండఁగ దుఃఖమును రాకుండఁజేయుటకు శక్యము కాదు. దుఃఖ కారణము లగు శత్రుసర్పవ్యాఘ్రాదుల నన్నింటిని నశింపఁజేయుటకును సాధ్యము కాదు. కనుక ఆ ద్వేషము సర్వదా హృదయమును తపింపఁజేయుచుండును. నిఖిలజంతువులకు ప్రతికూల మయిన దుఃఖము కలుగకుండవలయు నని దుఃఖవంతు లగువారియెడ కరుణను దృఢముగ భావించెనేని శత్రువ్యాఘ్రాదులయందుఁ గూడ ద్వేషము నివర్తించును. అందువలన చిత్తము ప్రసన్నమై యుండును. కరుణావాసన నభ్యసించు క్రమ మీ క్రింది విధమునఁ జెప్పఁబడుచున్నది.

శ్లో. ప్రాణాయథాఽత్మనోఽభీష్టా భూతానామపి తేతథా
ఆత్మౌపమ్యేన భూతానాం దయాం కుర్వంతి సాధవః.

తనయొక్క ప్రాణంబులు తన కెవ్విధంబున ప్రియంబులై యున్నవో అట్టులే సమస్తభూతములకును ప్రాణములు ప్రియంబులై యుండు నని సజ్జను లగువారు సకలభూతములను తమతో సమానముగ తలఁచి వానియందు మిగుల దయ నుంచుచున్నా రని యర్థము.

తన్నొరులు హింసించినఁ దన కెంత బాధ కలుగునో, ఇతరులను తాను హింసించినను వా రంత బాధ నొందుదు రని తన సామ్యమును జూచుకొని యితరులను హింసింపఁగూడదు. మానవభక్షకులు మనలను భక్షించుటకై హింసించునపు డెంత బాధ నొందుదుమో మన మాహారముకొఱకై మేఁకలు జింకలు పొట్టేళ్లు మొదలగు నల్పజీవులను హింసించునపు డవియు నంత సంకటము నొందు నని తలఁచి కొందఱు భూతదయాపరులు మాంసాహారమును విసర్జించి శాకాహారమును గైకొనుచు తమ దయారసము నంతట వెదఁజల్లుచున్నా రని నాగరకప్రపంచమున తెలియుచున్నది. ఇట్లుండ శాకాహారులే మాంసాహారమును గైకొనుట మిగుల చి[illegible]యము. సకలభూతదయాపరుఁ డగు మహానుభావుని హింసింపవచ్చు ద్వేషులు సయితము మహనీయుని దయాకాంతతేజస్సుచే నపగతకల్మషులై యేమియు నొనరింపఁజాలక సిగ్గువడి పోవుదురు. తపస్సంపన్ను లగు మహర్షుల యాశ్రమములయందు సంచరించు సింహవ్యాఘ్రసర్పాదులు వారికే యుపద్రవము నొనరింపక నిర్వైరముగ తిరుగుచుండును. కణ్వాశ్రమమునందలి సింగపుఁగొదమలు జింకపిల్లలు గోవ్యాఘ్రములు ముంగిసలు సర్పములు జాతివైరము లేక యన్యోన్యానురాగము కలిగియుండుట యా మహనీయుని దయాతేజస్సు నల్గడల వ్యాపించియుండుటచేతనే యని విజ్ఞులకు బోధపడక మానదు. కాఁబట్టి సకలభూతములయందును కరుణ కల మహానుభావునికి ద్వేష ముండదని తాత్పర్యము. ద్వేషమువలన దుఃఖము కల్గును. శుష్కతృణకుటీరమం దుత్పన్న మయిన జ్వాలనము స్వాశ్రయమును దహించు చందంబున నీ దుఃఖాగ్నియు హృదయమును దహించుచుండ, దయారసామృతసేచనమున చల్లార్పవలయును. బహువిధకష్టములచే దుఃఖము పొందువారలయందు కనికరము నుంచితిమేని, దుఃఖకారణము లగు హింసాదుల నొనరింపఁజాలము.

శ్లో. సర్వేఽత్ర సుఖిన స్సంతు సర్వేసంతు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యంతు మాకశ్చిద్దుఃఖమాప్నుయాత్.

ఈ లోకమునం దుండు భూతము లన్నియు సుఖము గలిగి యుండుఁగాక! రోగాద్యుపద్రవములు లేకుండునుగాక! జను లందఱు శుభంబులు పొందుదురుగాక! ఒకానొక ప్రాణియు దుఃఖము చెందకుండుఁగాక!—అని యెల్లప్పుడు సాధుజనులు తమ మనస్సులందు సంకల్పించి దయారసు గురుచున్నారు. కాఁబట్టి దుఃఖితుల యందు కరుణను భావించుటవలన ద్వేషము నివర్తించును. ద్వేష రోగపీడితులకు కరుణావాసనయే దివ్యౌషధము.

శ్లో. పుణ్యస్య ఫల మిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవాః
నపాపఫల మిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః॥

జనులు పుణ్యఫల మయిన సుఖమును మాత్ర మెప్పుడును కోరుదురు కాని, పుణ్యమును మాత్రము చేయరు. పాపఫల మైన దుఃఖమును కోరకుందురు కాని పాపములను మాత్రము ప్రయత్నముతో చేయుచుందురు. ఇది ప్రాణులయొక్క స్వాభావికప్రవృత్తి యని భావము. పుణ్యపాపములు రెండును పశ్చాత్తాపమును కలుగఁజేయును. 'పుణ్యకర్మము నేల నేఁ జేయకపోయితిని? పాపకర్మము నెందుకు నే నొనరించితిని?—అని పరితాపము పుణ్యపాపములవలన కలుగుచు చిత్తమును కలుషితము గావించుచుండును. పుణ్యకర్మములను చేయువారియందు (ముదిత) సంతోషమును దృఢముగ భావించె నేని పుణ్యవాసనచేత తాను గూడ జాగ్రత్తగ పుణ్యమును చేయును. పాపకర్మములను చేయువారియందు (ఉపేక్ష) అనాదరమును దృఢముగ భావించె నేని తానును పాపకర్మములను చేయక మానును. అందువలన పరితాపము కలుగక చిత్తము సుప్రసన్నముగా నుండును.

లోకములో కొంద ఱసూయాపరులు తాము పుణ్యకర్మము లొనరింపక తత్ఫల మగు సుఖము ననుభవించుచు, ఇతరులు సుఖానుభూతికై పుణ్యకర్మము లొనరించుచుండ తా మొనరింపని కార్యములు వీరు చేయుచున్నా రని యసహిష్ణులై వా రాచరించు కర్మములను దూషించుచు విఘ్నము నేయుచు వారును తమవలె నిష్కర్మకులు లగునట్లు ప్రయత్నించుచుందురు. ఇట్టి యసూయాగ్రస్తులు మలినవాసనావృత్తులై యంతఃకరణదోషముచే పుణ్యము నలుపను పేక్షించి పాపకార్యముల నామోదించి చేయుచుందురు. కాఁబట్టి అట్టి చిత్తమాలిన్యము పోవుటకై పుణ్యాత్ములను జూచి 'వీరలు ధన్యులు భాగ్యవంతులు, ఇట్టి పుణ్యము నాచరించు భాగ్యము నాకు లభింపక పోయె' నని చింతించి, వా రొనరించు కర్మములను జూచి సంతోషించుచుండిన యో తాను నా ప్రకారము చేయవలయు నని సంకల్పము కలుగును. ఇదియే ముదితవాసన యనఁబడును. పాపాత్ములను జూచి 'వీరలు దుఃఖమునకు కారణ మగు పాపకర్మముల నాచరించుచున్నారు వల దని వారించినను వినరు. ఆమోదించిన నట్లు సలుపవలయు నని సంకల్పము పొడముసు. వీరి జోలి మన కేల?' యని భూషింపక దూషింపక యుపేక్షించి తటస్థుఁడై యుండవలయును. దీనివలన పాపకార్యము లొనరించు నుద్యమము కలుగదు. ఇదియే ఉపేక్షావాసన యనఁబడును. ఇటులే మైత్రి కరుణ ముదిత ఉపేక్ష అను శుద్ధవాసనలచే చిత్తమందలి దుర్వాసనామాలిన్యమును పురుషప్రయత్నపూర్వకముగా పోఁగొట్టవలయును. చిత్తశుద్ధికై వలయు సత్కర్మాచరణాసక్తి భక్తి భూతదయ సాధుసాంగత్యము లోనగు ధీవృత్తుల నొసంగి నిఖిలజీవదయాపరుఁడును దీనానాథరక్షణదీక్షాదక్షుఁడును నగు పుండరీకాక్షుండు మనల నెల్లప్పుడు ప్రోచుఁగాత యని యింతట విరమించుచున్నాఁడను.

# భారతసందేశము

గాదె శ్రీజగన్నాథస్వామి గారు

భారతయువకులన్ బందెలఁ గుందించు
కంటకవృత్తిని గట్టిపెట్టి
అచ్చు యంత్రములపై ననవసరమ్ముగా
వేసిన భారంబు తీసివేసి
ప్రస్తుతవర్తకవ్యాపారసరణిలో
జరగెడు లోపంబు చక్కఁజేసి
అభియోగములఁ దీర్చు నధికారముల గ్రామ
పంచాయితుల క్రింద పనిలపఱచి
ప్రజల హక్కుల హరియించు పాడు చట్ట
ములను తొలఁగించి పాలింపవలయునయ్య!
రాజు లగువారి కివ్విధ ధర్మములు సువ్వె
సాధుపదవర్తి! శ్రీ జార్జి చక్రవర్తి! 1

సీ. భరతఖండసురభి ప్రాప్తించుటను గదా
మీ రాజ్యవిభవంబు మిన్నుముట్టె!
భరతఖండసురభి ప్రాప్తించుటను గదా
మీ కర్తృకం బెందు మించఁజొచ్చె?
భరతఖండసురభి ప్రాప్తించుటను గదా
మీ సీమ సౌఖ్యంబు మీఱఁదొడఁగె?
భరతఖండసురభి ప్రాప్తించుటను గదా
మీ చేయి కొఱగు చేయి మిగులకుండు!
తత్ప్రజల వాంఛితార్థముల్ తలఁపకుంట
శ్రేయ మర్థించు మీ కెటు చెల్లఁగలదు?
నిజము పల్కిన నన్ను మన్నించు టొప్పు
సాధుపదవర్తి! శ్రీ జార్జి చక్రవర్తి! 2

ఉ. మెత్తదనంబు నూని తమమీఁదికి వచ్చి సవారి చేయుచున్
మొత్తిన సత్త్వవంతు లగు బోయరువారికి స్వేచ్ఛ యిచ్చి మీ
చిత్తము మాదు భాగ్య మని శిష్టత నమ్మిన హిందుజాతికిన్
బొత్తిగ సున్న చుట్టుటలు పోలునె? లోకమువారు మెత్తురే?

సీ. నిజకరాకర్షణ నెఱిఁ గొన్న యప్పుల
దగఁ దీర్చు దినరాజు ధర్మ మెఱిఁగి;
తమముచే లోకంబు భ్రమయకుండఁగఁ గలల్
దయఁ జేయు నిశరాజు ధర్మ మెఱిఁగి;
ముజ్జగంబులు గల్గి బుధలోకపక్షపా
తస్థుఁ డౌ సురరాజు ధర్మ మెఱిఁగి;
దుష్టపాలనమును శిష్టపాలనము నా
దట చేయు యదురాజు ధర్మ మెఱిఁగి
తెలిసి యా నృపాలుర లేని వెలితి పోరయ
కుండ మీ యయ్య మీ యవ్వ దండి మించి
ప్రజల పాలింపవయ్య దేవతలు మెచ్చ
సాధుపదవర్తి! శ్రీ జార్జి చక్రవర్తి! 4

# రాయల స్వప్నము

భోగరాజు నారాయణమూర్తి గారు

మున్న రాచూరి దుర్గము ముట్టడించి
యున్న దినములలో రాయ లొక్కనాఁటి
నిండు వెన్నెల రాతిరి నిద్ర లేక
మనసు స్వస్థత లేక, తిమ్మరుసుఁ గూడ
అల్ల కృష్ణానదీతటిన్ జల్లగాలి
విసుకతిన్నె నధిష్ఠించి యిట్టు లనియె:
“శివుఁడొ విష్ణువొ పదునాల్గు భువనములకు
నా మతమ్మున నొక్కఁడే నాథుఁ డన్న!
ఆ పరాత్పరు నభవు నాద్యంతహీను
నిర్గుణాత్ము నిరంజను నిర్వికారు
నాజ్ఞ గొని నేను రాజనై యవతరించి
చేయవలసిన నా విధుల్ చేసినాఁడఁ
జేయుచున్నాఁడ నింకను జేయువాఁడ. 13

ii

ధగధగాయితసుందరాంతఃపురాంత
రస్థకాంతామణులతో నిరంతరంబు
అఖిలభోగభాగ్యంబుల నందుకొఱకు
రాజుల సృజింపఁ డా జగద్రాజరాజు.
ఆ జగత్సార్వభౌమున కవనిఁ గలుగు
ధరణిపతు లెల్ల సామంతధరణిపతులు.
అతని కీ నృపుల్ చెల్లించునట్టి పన్ను
ధర్మపరిపాలనమె కాని ధనము గాదు.
తనకు లోఁబడి యీ కప్పమును నొసంగ
నట్టి నృపులను శిక్షించు టతని మతము.
లేశమును స్వలాభమునకై యాశపడక
ప్రజల క్షేమమ్మునకుఁ బాటుపడునతండు
పరమపురుషుచేఁ గీర్తింపఁబడెడువాఁడు. 26

iii

కర్షకులు హర్ష మొందఁగ, వర్ష మొసఁగు
మేఘదేవుండు తన కెట్టి మేలు లేక;
చీఁకటు లడంచి ప్రజల రంజింపఁ జేయు
భానుఁ డేవేళఁ బ్రతిఫలవాంఛ లేక;
ఆరముగ్గిన పండ్లిచ్చు నడుగకుండ
గున్నమామిడి తన కెట్టి కోర్కె లేక,
ధారుణీతలభర మెల్లఁ దానె తాల్చుఁ
బన్నగేశ్వరుఁ డిసుమంత ఫలము లేక;
నిరతముఁ బరోపకారతత్పరత తప్ప
ఘనులు స్వార్థపరత్వమ్ముఁ గొనరు మంత్రి! 36

iv

ఈశ్వరాజ్ఞానుసార మే నింతవఱకు
నవ్యసామ్రాజ్యసింహాసనమ్ము నెక్కి,
ప్రజల బాధించు దుష్టస్వభావు లైన
యఖిలసామంతరాజుల నణఁగఁద్రొక్కి,
జారచోరభయమ్మును బాఱఁద్రోలి,
క్షామ మను మాట నట్టె నిస్సీమఁ జేసి,
ధర్మదేవత నాల్గు పాదములతోడ
నాట్య మాడించుచున్నాఁడ నాఁడు నేఁడు.
ఆంధ్రదేశమ్ముతోఁ బాటు ఆంధ్రభాష
నాకుఁ గడుఁ బ్రియ మాటచే నాఁటఁగోలె
మామకాస్థానసుందరమంటపమును
ఆంధ్రకవిరత్నములచేత నసదృశముగ
వన్నె కెక్కించి కైతకుఁ జెన్ను గూర్చి
నూతనగ్రంథభూషణోపేతఁ జేసి
బాస కొకకొంత యుపకృతి చేసినాఁడ. 51

v

దేశమును భాష యున్నతస్థితి వహించి
యుండుటకు నేను సంతస మొందుచుండ,
నిన్న రాతిరి నేఁ గన్న ఖిన్న మైన
స్వప్నము కతాన దేశభాషలకు నేను
పడిన శ్రమ వ్యర్థ మా నను భయము గలిగె.
ప్రాణమిత్రమ! యింక దాఁపఱిక మేల?
కల యెఱింగింతు [illegible] మందుఁ గల తెఱఁగు;
కల కసందర్భసందర్భములును లేవు,
ఏను మరణించినానఁట! ఎందుచేత
నొక్కొ నాకు జామాతనై నిక్కి నీల్గు
రామరా జక్రమంబుగ రాజ్య మాక్ర

మించినాఁడఁట! యతఁడు గర్వించి తుదకు
తురక రాజుల నెదిరించి దురమునందు
బలిమిమై వారిచేఁ జంపఁబడియెనంట!
అంత సామ్రాజ్య మంతయు నన్ని గతుల
దోఁచుకొనిరఁట చెనటులు దొరకినంత!
ప్రజలు ఖండింపఁబడిరఁట ప్రభువు లేక!
కవు లనాథు లైరఁట! మహీధవుల కెల్ల
నాంధ్రభాష యసహ్యమై యగపడెనఁట!

vi

సచివశేఖర! వినుమయ్య! చావునకును
గన్నులును జెవులుఁ గూడను గలవు కానఁ
బ్రాణములు లేక శవమునై పడిన నేను
ఆంధ్రదేశదీనావస్థ నరసి యరసి
ఆంధ్రకవు లిడు మొఱ లెల్ల నాలకించి
ఆంధ్రభాష దుస్థ్సితి కనులారఁ జూచి
ఘనవిచారాబ్ధి బాష్పభంగముల నడుమ
నీఁదుకొనుచును గుండెలు బాఁదుకొనుచుఁ
గలవరముఁ జెందుచుండ నాకస్మికముగ
నక్కజం బైన యొక చిత్ర మరసినాఁడ.

vii

ఒక్కమాఱుగఁ బశ్చిమదిక్కునుండి
యమి యాకాశమును నిండి పూర్ణ మైన
వ్యధవళ తేజము నాదు దృష్టియందుఁ
బడియె; పడుటయు నాశ్చర్యపడి, యీ దేటి
కాంతి యింతగను నెందుండి కలిగె ననుచు
వింతపడి చూచుచుండఁగ, నంతలోన
ఆ ధవళ తేజముననుండి యద్భుతముగ
"తెలుఁగురాయఁడ! దురపిల్లవలదు! వలదు!
తెలుఁగునకుఁ దెలుఁగువారికిఁ దెలుఁగు సీమ
కెట్టి యాపద మేము రానీయ" మనుచు
తెల్ల మొగములు తెల్లని దేహములును
వెల్ల దుస్తులు ధరియించి చల్లనైన
70 చూపులు గలట్టి యయ్యలు చూపుమేర
నాకుఁ గనుపండు వొనరించినారు మంత్రి! 94

viii

అమ్మహాద్భుతమందు నే నడఁగియుండ,
మరియొక విశేష మంతలో జరగె ననఘ!
ఆంధ్ర రాష్ట్రంబు గావలె నాంధ్ర రాష్ట్ర
మాంధ్ర రాష్ట్రం బటంచును ఆంధ్రజనులు
ఆంధ్ర పండితవరులును ఆంధ్ర రాజ
చంద్రులును గూడఁ దనుజితచంద్రు లైన
తెల్లవారలకడ కేఁగి యెల్లవారు
గొల్లవెట్టఁగ నే నది యెల్ల వినుచు,
80 ఘనవిపత్తిమిరమునుండి తెనుఁగుసీమ
కల్లదే! తెల్లవారెఁబో యనుచు నేను
తెల్లవోవఁగ— నింతలోఁ దెల్లవారె;
ఇట్టి బలువింత గల కల యెన్నఁ డెఱుఁగ"
నని యమాత్యున కెఱిఁగించె నాంధ్రరాజ
చంద్రుఁ డగు కృష్ణరాయ లం స్వప్నలీల. 108

# స్వప్నలోకము

శిరిసి ఆంజనేయులు గారు

చిన్నవాఁడను నన్ను నా కన్నతల్లి
పిలిచి దీపాలవేళకుఁ బీఁట వైచి
తినుట కింపగు కూరల దివ్య మైన
యన్నమును బెట్టె—
నే వాని ద్వేషించి
పొన్నువైఁ జేరి కనులు వాల్పంగ, నకట!
ఒరగిన యదెంత యెవ్విధిఁ జాటఁగలను?
సుఖముగా నేను లాలిఁ గూర్చుంటఁ జూచి
యెవ్వరో వచ్చి చేపట్టి యీడ్వఁదగునె? ౫
'బాలుఁడా! రమ్ము రమ్మని పలుకఁదగునె?—
ఆదరము లేక వారు నేయంగ నిట్లు, ౧౦
పెల్లుగా నేడ్చు నన్ను నా తల్లి చూచి
పజ్జఁ గూర్చుండి చనవుమై బుజ్జగించి
'ఏల యేడ్చెదవన్న? నీ కేమి భయము?
వారు బాలురు పిల్చుచున్నారు కనుము
తిన్నగా బడి కేఁగు మో యన్న!' యనుచుఁ ౧౫
బంప, నేఁ జని యొజ్జల ప్రక్కఁ జేరి
కాంతుతో వారు చెల్పు సంగతుల వినుచు

శ్రద్ధగా శాస్త్రముల నెల్లఁ జదువుకొనుచుఁ
బ్రమదమున వానిలోని సారంబుఁ గొనుచుఁ
బిన్నపెద్దలచేఁ జాల పేరు గనుచుఁ ౨౦
గాలమును బుచ్చుచుండ నాకస్మికముగ
నొక్కనాఁ డేను చెలికాండ్రు నూరిబయటి
కేఁగి యందందుఁ గన్నుల కింపుఁ గూర్చు
పచ్చికబయళ్ల నెంతయు మెచ్చుకొనుచు
నిసుకతిన్నెలపై వసియించి చనుచు ౨౫
నచట దాఁగిలిమూఁతల నాడుకొనుచు
నలర సెలయేళ్లలోఁ నీఁదులాడుకొనుచుఁ
బర్వతాగ్రములకుఁ జేరి పాడుకొనుచు
నంత వీతెంచు చలువ పయ్యరలఁ గనుచు
వింతవింతగఁ దోఁచు వసంతు రీతి ౩౦
నబ్బురంబుగఁ గన్నుల కందికొనుచు
నుత్తమారామసీమల యొరిమఁ గనుచు
విమలపక్షిసంతతికూజితముల వినుచు
నల మయూరరాజముల నాట్యములఁ గనుచు
సంతసించుచు మల్లె గుచ్ఛములఁ జనుచు ౩౫
సెగడు మొల్లల వన్నెచిన్నెలను గొనుచుఁ
జెదరి యందందుఁ గదలు తుమ్మెదలఁ గనుచు
మధురఫలములఁ దినుచు సమ్మదముఁ బెనుచు
చుండ, జరగిన చిత్ర మొకండు వినుఁడు.—

మదగజేంద్రంబు సనుదెంచి యెదుర నిలిచి ౪౦
తనదు తొండంబుఁ జాచి ముదంబు వెలయ
రత్నహారంబు నా కంధరమున వైచె.—

అంతలో నందుఁ గూడిన యఖిలజనులు
నన్ను వేగమ కొంపోయి నగరమునకు
భద్రపీఠంబునం దుంచి పరమభక్తి ౪౫
మంగళరవంబు లెసఁగ సామ్రాజ్యమునకుఁ
బట్టభద్రునిఁ జేసి సంభ్రమముఁ గనిరి.—

ఔర! యా వైభవం బేమి? యా విచిత్ర
మేమి తెల్పుదు? నా భాగ్య మేమొ కాని,
రతిని మించెడు సౌందర్యవతి యొకర్తె ౫౦
మురిసెములఁ జూపు ముద్దుల మోహనాంగి
చిఱునగవు మోముదమ్మిని జిలుకుచుండ
వచ్చి నాచెంతఁ గూర్చుండి మచ్చిక మెయి
ముచ్చటించుచు విడియంబు లిచ్చుచుండఁ
దనదు వాల్గంటి చూపులఁ దనుపుచుండ ౫౫
మించు సౌఖ్యాంబునిధిని దేలించుచుండ
సేవకావలి పదసేవ సేయుచుండ,
స్వర్గవైభవ మందిన సరణి తోఁచె
నదియ నా కమరావతి యగుచుఁ దోఁచె
నద్దియే మోక్షపదవి యటా నంచుఁ దోఁచె.— ౬౦

దాని మించిన దెద్ది యిద్ధరణిఁ గలదు?
దానికన్నఁ దనర్చు పదం బ దెద్ది?
కోటులకొలంది భృత్యులు గొలుచుచుండ
నిండు పేరోలగమున నుద్దండవృత్తి
రత్నసింహాసనమున నిరంతరంబు ౬౫
నధివసించుచు జనముల విధముఁ గనుచు
మేలుఁ గూర్చుచు రాజ్యంబు నేలుచుండఁ,
గాల మిట్టుల సుఖలీలఁ గడచిపోయె
బాహువిక్రమ మడఁగు సంబరము పోయె
నంతకంతకు నాయువు నరిగిపోయె ౭౦
దేహ మెంతయుఁ గృశియించె తెలివి పోయె
చాల ముదుసలినై నేను నేలఁ బడుటఁ
జూచి బందుగు లెల్ల నామట్టు ముసరి
బొమ్మలను గ్రుద్దుకొనుచు మొఱ్ఱో యటంచు
'హా' యనుచు నేడ్చునంత నే నదరి లేచి ౭౫
కన్నులను విచ్చి ముందువెన్కలను జూడఁ
గలిగిన విచిత్ర మే మని తెలుపఁగలను?

ఎది యనిత్యమొ నిత్య మెయ్యదియొ గాని
యది యసత్యమొ సత్య మెయ్యదియొ గాని
యొక్కఁడనె నేను గూర్చుండియుంటిఁ గాని ౮౦
పడక యొక్కటియే యగపడియెఁ గాని
దేహబద్ధమే నాయందుఁ దేలెఁ గాని
తల్లిదండ్రులతోడి నిద్దంపు సుఖము
పరమగురువుల చెంతఁ జొప్పడిన సుఖము
నెచ్చెలుల జూడఁ గాంచిన నిత్యసుఖము ౮౫
మునుపుఁ బచ్చనిబయళులఁ గనిన సుఖము
మెలపుమైఁ గనుఁగొన్న సమీరసుఖము
పర్వతాగ్రములందుఁ గన్పడిన సుఖము
నేను బొందిన వనసీమలోని సుఖము,
నేను గ్రోలిన యమృతములోని సుఖము ౯౦
చాల మురియించినట్టి రాజ్యంపు సుఖము
కాయ ముప్పొంగ నెఱిఁగిన కాంత సుఖము
మేను పులకించు పలుకులలోని సుఖము
మాయురే! స్వప్నముగఁ దోఁచె - మాసె - సుఖము
పొరగి త్రుటిలోన మాయమై పోయె సుఖము ౯౫
అవలఁ గనుఁగొంద మన్న లేదాయె సుఖము
చేయునది లేక పిల్ల దాయె సుఖము
అంత నే మందు? కట! విమ మాయె సుఖము
కాన 'నీ స్వప్న 'కము' లోని సుఖము
కాదు శాశ్వత మిది బూటకంపు సుఖము. ౧౦౦

# ఆంధ్రదేశప్రశంస

గాడె శ్రీజగన్నాథస్వామి గారు

శ్రీమాహేంద్రనగర్షృముఖకమహీభృ
చ్ఛేషాద్రిమధ్యక్షితిం
కృష్ణాగౌతమపుత్రికాముఖనదీ
తీర్థప్రపూతావనీమ్
రంభాచూతకుజాదిశోభితవనీం
నానామణిభ్రాజితాం
వందే సస్యవతీం వరాంధ్రజననీం
శ్రీభారతోర్వీసుతామ్. 1

ఉ. ఆదిఁ గళింగచోళవిష
యాంతరమై యొక పేరు లేక యా
మీఁదట శాతకర్ణుల స
మాకృతదృష్టి సమాఖ్యఁ దాల్చి యా
పై దొరలై ప్రసిద్ధు లగు
పల్లవ రాజమహేంద్ర కాకతీ
య్యాదులు పెంపఁ బెంపెసఁగు
నాంధ్రము నేఁ డెటు లయ్యెఁ జూడరే? 2

సీ. విక్రమార్కుని నాజిఁ బిల్కుమార్చిన మేటి
శాలివాహనుఁ డేడ సాగినాఁడొ?
చోళకళింగనృపాలుర గెల్చిన
విష్ణువర్ధనుఁ డేడ వెడలినాఁడొ?
ఢిల్లి సుల్తానుతో ఢీకొని యోర్చిన
యోరుగల్లుప్రభు వేడ నొదిగినాఁడొ?
గజపతిహయపతిగర్వంబుఁ దూల్చిన
యాంధ్రభోజుం డేడ కరిగినాఁడొ?
కాలగతిఁ బోవ మన భూమిపాలు రోలిఁ
జెన్నపురిరాష్ట్రమునఁ గొంత య న్నిజాము
రాజ్యమునఁ గొంత చేరి యాంధ్రమహి నేఁడు
కొఱఁతవడెఁ బేరునకుఁ గూడఁ గొంతవఱకు. 3

మ. పరికింపన్ జనసంఖ్య మూఁడవది యై
వైశాల్యసంపత్తి ని
భరతక్ష్మాస్థలమందు రెండవది యై
వర్తించు నాంధ్రంబు దు
ర్భరదైన్యంబు వహించు ఓ స్తైఖ! దొరల్
ప్రత్యేకరాష్ట్రంబుగాఁ
బరిపాటిన్ విభజింపకున్న నదియున్
వర్ధిల్లఁగా నేర్చునే? 4

సీ. సంఘసంస్కారంబు సల్పంగ సమకట్టు
రాణ్మందిరపురసంరంభమునను
జాతీయవిద్యాని కేతనంబును నిల్పు
బృందావనపురవిజృంభణమున
ద్రవిడాంధ్రవిభజనార్థము పనిఁబూను గుం
టూరి సదుద్యమాటోపమునను
గ్రంథాలయమ్ములఁ గల్గు లాభము చాటు
బెజవాడసముచితప్రేరణమున
సకలజనులందు నూతనోత్సాహశక్తి
యంకురించెఁ గావున మన యాంధ్రసీమ
యభ్యుదయ మందె నిస్సంశయముగఁ బ్రబలుఁ
బాడిపంటలుఁ దక్క సంపదలుఁ గల్గి. 5

సీ. కొమ్మరాజు లక్ష్మణాఖ్యుఁడు వీరభద్రుండు
నీ పల్లకిని బట్టి నెమ్మి నడప,
పీఠికాపురరాజు వేంకటగిరిరాజు
వింజామరమ్ములు వేడ్క వీవ,
తిరుపతివేంకటేశ్వరరామకృష్ణాది
కవులు నీ మహిమంబు గణుతిసేయ,
కృష్ణాంధ్రపత్రికాధీశ్వరప్రముఖులు
కర్పూరహారతుల్ కాన్క లొసఁగ,
తొంటి వైభవ మొక్కింత గంటి వింకఁ
దిరుగవమ్మ దిగ్వీధులు తేజ మెసఁగ;
నిన్ను భగవంతుఁ డేలెడి నిశ్చయంబు
సాంద్రవైభవసముపేత! యాంధ్రమాత! 6

సీ. మల్లవిద్యలు నేర్చి బల్లిదు లగు కోడె
రామమూర్తియు బుల్సు రామజోగి,
హరికథల్ పచరించి చిరకీర్తి గన్న నా
రాయణదాసు బాలాజిదాసు,
సంగీతవిద్యావిశారదుల్ సంగమే
శము శాస్త్రి యల వీణ రమణమూర్తి,
ఉభయసాహిత్యధుర్యు లగు వేంకట్రాయ
శాస్త్రి ముఖుం డి యాచార్యమూర్తి
ఇట్టి ప్రఖ్యాతసుతులఁ గన్నట్టి నీవు
చెన్నరాష్ట్రంబునను జేరి చెడఁగ నేల?
వంగదేశంబువలె స్వాతంత్ర్యశక్తి గల్గి
యవని వర్ధిల్లవమ్మ యో యాంధ్రమాత! 7


స్కాట్లండ్
అట్లాంటిక్. మ. స.
అట్లాన్టిక్
ఉత్తర సముద్రము
ఇంగ్లాండు
ఐరిష్ సముద్రము
ఎడింబరో
అబర్డీన్
హెబ్రిడీస్. సిం. శా.
ఆర్కనీదీవులు
పెంట్లండ్. సిం. శా.
లానార్కు
పెర్తు
OPAUL & CO.

# ఆద్య భారతీయ స్వపరిపాలనము

వడ్లమాని వేంకటసుబ్బరావు గారు, బి. ఏ.

రాజ్యాంగవిషయవ్యాసంగ మాసేతుశీతనగ మాధునిక భారతీయుని హృదయంబున నుంటయు, తద్విషయకుతూహల మప్రతిహతంబుగ కొన్ని వత్సరంబులనుండి కొనసాగుచుంటయు మన కెల్లరకు నాహ్లాదకరవిషయంబే కదా! అందు ప్రభుత్వనిర్వాహకులలో కొందఱకు హైందవులు స్వరాజ్యానర్హు లనియు ఆదినుండియు నితరుల పరిపాలనయే హైందవుల కుండె ననియు విచిత్రాశయము లుండుట యెంత విషాదకర మయినను, యథార్థ మని మన మనుకొన్న విషయమే యగును. కాని, యథార్థచింతన మొకింత యొనర్చిన నీ యూహ నిరాధారం బగుట స్పష్ట మగును. భారతదేశచరిత్రంబు నొక్కింత నిష్పక్షపాతబుద్ధితో నవలోకించిన ప్రతిపాదకుడును ప్రస్తుత మనర్హులుగా భావింపబడు నీ భారతీయులు పూర్వము విశాలరాష్ట్ర పరిపాలనా కుశలులును అధరీకృతాన్యరాజకీయ స్వపరిపాలనా సమర్థులు నయి యశేష శేముషీ విరాజితులుగ నుండి రనుట నిస్సంశయంబుగ జూడనగును. ఈ వచనంబులయందలి ప్రతిపదంబును సార్థకమయి యథార్థముగా నుండు నని వ్రాసిన, కొందఱకు విపరీతముగ తోచినదోచును గాని, ఇయ్యదియే సత్యము.

మహమ్మదీ యాగమనంబునకుం బూర్వము భారతీయులు తమ రాజ్యపరిపాలన మనవద్యంబుగ సాగించి రనుట న టుండనిచ్చి, తదనంతర భారతీయ చరిత్రంబునే చూచిన, పై వచనంబులు విపరీతార్థములుగ తోచకుండు టెట్లు? ఈ భాగంబు మనకు సామాన్యలభ్యంబులగు విషయంబుల చరిత్ర మనుట కేవలము సాహసము. అయ్యది
తీయ చరిత్రంబు గాదు. మహమ్మదీయనాయకుల జీవచరిత్ర,
విజయయాత్ర, మొగలాయీల విచిత్రకృత్యకథనము అనిన
ం బగును గాని, భారతీయసాంఘికాదివిషయంబుల నావంతయు నుచ్చరింపని యీ భాగమును మన చరిత్ర యనుట హాస్యాస్పదము గాదా? అట్టి వ్యర్థ చరిత్రలం జదివి, భారతీయ చరిత్రపఠన మొనర్చితి మని దురూహ నందియున్న మన కీ వాక్యంబులు చిత్రములుగా గానవచ్చు ననుటకు సందియం బుండదు. అ "మహమ్మదీయుల పరిపాలనమున పట్టణము లెల్ల తురుష్కరాజప్రతినిధుల
కారంబున నుండి, సర్వరాజ్యతంత్రంబులును వారల యాధీనంబు
ండుటచే, భారతీయ విషయంబు తిరోధాన మందుట
. కాని, గ్రామంబుల చరిత్ర నవలోకించిన నెంతయో
ము గాంచ నగును. వలయునప్పు డెల్ల ధనము నందుకొనిపోవుట
తప్ప, ఇతరవిషయంబులలో తురుష్కసంపర్కము గ్రామములనంటలేదు; గ్రామస్థుల జీవితంబు లావంతయు మార్పు లేకయే యుండెను. గుజనీవంశము పోయి గోరీవంశము వచ్చినను, మరియొకటి పోయి మరియొకటి వచ్చినను, గ్రామమునందలి సర్వవ్యవహారములును పూర్వపురీతినే జరగుచుండుటచే గ్రామములలో, పట్టణంబుల వలెగాక, మార్పులు లేకుండెను. యథావిధిగ పంచాయితీలు ధర్మసంస్థాపన మహాకార్యంబును కొనసాగించుచుండెను. తురుష్కనిరంకుశప్రభుత్వ మంతయు పట్టణంబులనే కానవచ్చెను గాని, పల్లెల నంటకుండెను. కావున మహమ్మదీయు లెంత నిరంకుశప్రభుత్వకాము లయినను, వా రెంత హైందవవిపక్షులుగా తోచినను, ఆద్యభారతీయస్వపరిపాలనావిశేషము నా బరగు నీ పంచాయితీవిధానము వారి దుండగముల కెడమీయక, స్థిరముగ నిలిచియుండెను. ఆద్యస్థితికి హస్తిమశకాంతరంబుగ హతాంగ మయినను, పంచాయితీపరిపాలనము తురుష్కరాజ్యవ్రాతములచే రూపుమాయ లేదు. మహమ్మదీయులు నట్టి ఘోరకృత్యమున కొడిగట్టకుండుటచే మనకు సంస్తవనీయులే యనవలయును గదా!

ఇంక నట్టి బెట్టిదంపు బాధల నందియు నిలిచియున్న స్థానిక స్వపరిపాలనావిభవంబు నీ భారతభూమియందు నిర్మూలముగ జేయజాలిన దెయ్యదియో తర్కింపబూనితిమేని, హిందూరమ కగణ్యలాభప్రద మగు మన యాంగ్లపరిపాలనవిధానమే యని ధాటిగ జె
నొప్పును. ప్రకృత మీ భారతభూమి నలంకరించియున్న
స్థానములును అవసరానవసరముల సరకుసేయక
జోక్యము కలుగజేసికొను రాష్ట్రీయోద్యోగు
తీయస్థానికస్వపరిపాలనకు బరమశత్రుస్వరూ
మూలకమై దుర్భరమహమ్మదీయాతంకమ
స్వపరిపాలనవిధానము నడుగంటజేయు
నొనర్చుచున్నవి. ఈ యూహనే నిప్పు
హెచ్. ఇలియట్ అను నాంగ్లమహాశ

"పూర్వకాలంబున జనులనుం
పాలకులతో నిర్వాకము....కంబు
ప్రభువులు దేశమును పాలించు
మాత్రము జనసమితిచేతనే ని
హాములే సమయానుసరణం
వ్యవహారంబుల సరిచూ
సంఘముల స్వాతంత్ర
నిర్మూలన మొనరి

రించిరి. "గ్రామసముతు" లను గ్రంథమున మెయిను దొరగారు చెప్పినయట్లు, మనవలన (బ్రిటీషుదొరతనమువారివలన) హిందువులు కొంతలాభము నందినను, వారు నష్టములఁ గూడఁ గొన్నింటి నందుచున్నారు. ఇట్టి స్వాతంత్ర్యమును తుదముట్టఁ దీసివేయుటయే మానవులయం దమూల్యముగఁ బరిగణింపఁదగు సహాచ్ఛక్తిని నాశన మొనరించుట యని వేఱుగ నుడువఁ బనిలేదు. మన యాంగ్లప్రభుత్వము హైందవుల స్వాతంత్ర్యమును విధ్వంస మొనర్చెను."

నిష్పక్షపాతజనకము లగు నీ వాక్యములనుబట్టి చూడ, హైందవ స్థానికస్వపరిపాలనా వినాశనమునకు, స్వహమ్మదీయపాలన కన్న నాంగ్లప్రభుత్వమే మహత్తరకారణం బని చెప్పవలయును గదా! అట్టి యీ లోపంబును దీర్చుటకై కాఁబోలు, ఆంగ్లప్రభుత్వమువా రటనట పుర మండల స్థానిక పాలనాసంఘములను నెలకొల్పిరి. కాని, అపేక్షణీయం బగు ఫలములు గానరావు. కారణం బన్వేషింప దవ్వుగఁ బోనక్కఱ లేదు. ప్రస్తుత మీ పాలనాసంఘంబులయందు రాజోద్యోగుల జోక్య మెక్కుడుగ నుండుటంజేసి ఇయ్యవి ప్రజల లాభంబునకును స్వీయపరిపాలనకును స్థాపింపఁబడిన విషయంబులుగా నెన్నఁబడ కున్నవి. ఇట్టి సంఘంబుల నుండఁదగిన విశ్వాసము ప్రజల కావిర్భవింప లేదు. నామాంతరమున వెలయుచున్న ప్రభుత్వశాఖ లను భ్రాంతి గలిగి ప్రజలు వీని నామోదింప కున్నారు. లేకున్న, నెలకొల్పఁబడి పెద్దకాలం బయినను వీనియందనుసమ్మేళన మావంతయుఁ బ్రజలకుఁ గలుగకుంట యెట్టిది? స్వపరిపాలనయందు జనుల కుండఁదగు ప్రేమము వీనియందుఁ గలుగక, ఇవి భయము నాపాదించుటచే, ప్రాచీన స్వపరిపాలనా విషయముల వలె లాభదాయకంబులు గాక వ్యర్థము లగుచున్న వని నుడువవలసి …ను.

…కాలంబున నీ స్వపరిపాలనావిషయంబు లెట్టు లుండెనో …, మనకుం గల ముఖ్యాధారములు రెండు: 1 పురా… ఇందుఁ బురాణములలో యథార్థవిషయంబు …తాచమత్కృతియే ప్రధానముగాఁ జూడఁ… యూహావిశేషంబులనుండి వాస్తవం …ట మగును. సంహిత లన్ననో, అటు …కాలములకుఁ దోడ్పడ సమకూర్చిన వగు … యువివాద్యములుగా నుండును. శ్రీయుత రాయబహదూర్ పండిత ఏ., గా రొకానొక వ్యాసమున నిట్లు

…విత్ వ్యతిక్రమము' (ఒప్పందల …ధ్యాయ మను నొక గ్రంథ …దల) ద్వివిధముగా నేర్ప సమూహకృతసంవిత్తు. …ు రాజకృత సము

దాయ మనఁబడును. అట్టి విద్వాంససమూహమునకు కర్తవ్య … విధిక్రమమునకే రాజకృతసంవిత్తు అను నామ మిడిరి. ఈ … మూహము నెన్నుకొనినప్పుడు 'స్వధర్మపాల్యతాం' (అనఁగ మతవిధులను నిర్వర్తింపుఁడు.') అని యుచ్చరింపఁబడినను, ఈరాజకృత సముదాయము సమయానుసరణముగ రాజకీయాది మతేతరవిషయంబులను సయితము చక్కఁబెట్టుచుండెడిది. * * * ఆరీతి నీ రాజకృత సముదాయము పశువుల బీళ్లను జలాధారములను దేవాలయములను సమయానుసరణంబుగ సంరక్షింపఁ గడఁగుచుండెడిది. ఈ సముదాయమున కొక్కని నెన్నుకొనుటకుఁ గాని అపదవినుండి యొక్కని తొలగించుటకుఁ గాని ప్రజల కావంతయు నధికారము లేకుండెను.

ఇఁక, బృహస్పతి యాజ్ఞవల్క్యుల ననుసరించి చూడ,

శ్లో. గ్రామశ్రేణీగణానాంచ
సంకేతః సమయక్రియా
బాధాకాలేతు సాకార్యా
ధర్మకార్యే తథైవచ.

శ్లో. బాధచోరభయే బాధాః
సర్వసాధారణ స్మృతాః
తత్రోపశమనం కార్యం
సర్వం నైకేన కేనచిత్.

ఆపత్సమయములందును జనసామాన్యోపయుక్తము లగు కార్యములఁ జేయుటకును గ్రామమునందలి ప్రజలు సముదాయములుగ నేర్పడి కర్తవ్యముల నిర్వర్తించు వాడుకయుం గలదు. ఇట్టివానికే ప్రజాసముదాయము లను నామంబు వ్యవహరింపఁబడును. ఈ సముదాయములు నిర్వర్తింప నొప్పుదలవడిన విధు లెవ్వి యన, గ్రామసభలు నూఁతులు పానీయజలాశయములు దేవాలయములు చెరువులు తోఁటలు బాగుచేయించుట, అనాథసంస్కరణ మొనర్చుట, మతకర్మములం దోడుపడుట, క్షామసమయంబులం బ్రజలకు సాయము సేయుట లోనగునవి. ఈ సమూహము పై నుదాహరింపఁబడిన విధులను నిర్వర్తింప లిఖితరూపమున నొప్పుకొందురు. సమూహకృతసంవిత్తు. ఈ సమూహమునుండియే కార్యచిం… పేరఁ గొంద రెన్నుకొనఁబడుటయుఁ గాననగును. ఈ … కుల సంఖ్య రెండునుండి యైదువఱకును గన్పట్టుచున్నది.

శ్లో. ద్విత్రయఃపంచవా కార్యాః
సమూహహితవాదినః
కర్తవ్యం వచనం తేషాం
గ్రామశ్రేణిగణాదిభిః.—బృహస్పతి.

అక్కాలంబున స్వల్పవిస్తీర్ణత నుండు గ్రామప… సంఖ్య సరియగు ననియే యూహింపఁ దగును; అంతకు పట్టణంబుల రాజకృతసమూహము వీరలకుం దోడగుఁ నిర్వహణ మన్నిగతులఁ సంపూర్ణముగ నుండు ననుటకే … జనము.

ఇంక నీ కార్యచింతకులలో నెవ్వఁడయిన నక్రమప్రవర్తకుఁడుగా తోఁచినవాని కపరాధమును విధించుట, వానిని పదవినుండి తొలఁగించుట, ఇంకను ఘోరదోష ముండిన గ్రామమునకు వెలి యొనర్చుట, లోనుగాఁ గల శిక్షల నొసంగు నధికారము ప్రజలకే యుండెను. ఇట్టివి సంభవించినపు డెల్ల ఆ విషయమును పాలకున కెఱింగింప, అతఁడు దాని నంగీకరించుచుండెను. ఈ విషయమున కాత్యాయనుఁడు:

శ్లో. సాహసీ భేదకారీ చ
గణద్రవ్యవినాశకః
ఉచ్ఛేద్యాః సర్వ ఏవైతే
విఖ్యాప్యైవ నృపే భృగుః.

అనఁగా, భృగువు చెప్పినట్టులీ ముఖ్యులలో పెద్ద ద్రోహము చేసినవాఁడును, గణద్రవ్యమును పాడుచేసినవాఁడును, సమూహములో నంతఃకలహములను పుట్టించువాఁడును పదవినుండి తొలఁగింపఁబడవలయును. ఈ విషయము రాజున కెఱుకచేయవలయును.

శ్లో. పూగశ్రేణిగణాధ్యక్షాః
పురదుర్గనివాసినః
వాగ్ధిగ్దండపరిత్యాగం
ప్రకుర్యుః పాపకారిణాం
తైః కృతం యత్ స్వధర్మేణ
నిగ్రహానుగ్రహం నృణాం
తద్రాజ్ఞా అనుమంతవ్యం
నిసృష్టార్థాహి తే స్మృతాః.—బృహస్పతి.

అనఁగా, పూగ (వర్తకసంఘము) శ్రేణి (వ్యవహారసంఘము) గణ(తదితరసంఘము)—వీని యధ్యక్షు లపరాధుల మందలించుట నిందించుట వెలివేయుట పురమునుండి వెడలఁగొట్టుట లోనుగాఁగల శిక్షల విధించి, ఆ వృత్తాంతమును రాజునకు తెలియఁజేయవలయు ననియు, రాజద్దాని నంగీకరింపవలె ననియు తేట యగును.

ఇందుకు తోడుగ బృహస్పతి:

శ్లో. ముఖ్యైస్సహ సమూహానాం
విసంవాదో యదా భవేత్
తదా విచారయేద్రాజా
స్వధర్మే స్థాపయేచ్చ తాన్.

అనఁగా, ముఖ్యులకు [illegible] సమూహమునకును శిక్షావిధానమున విరోధ [illegible] యుండు [illegible] సంబంధమును కలుగఁజేసి [illegible] [illegible]పవలయు నని తెలియఁజేయుచు [illegible] [illegible] "పూర్వోక్త కా[illegible]

పై విషయంబులంబట్టి చూడ, (తమతమ స్థానములలో) ఈ పురపాలకసంఘములు పురాతనకాలంబున విశేషాధికారము కలిగి, ఇప్పటి పురమండలాది పాలకసంఘములకన్నఁ గొన్ని విషయములలో కష్టతరమును విపులతరమును నగు విధుల నిర్వర్తించుచుండె ననుట నిర్వివాదాంశము. ఇంకను వానివాని స్థానములలో నీ సంఘములకు సివిలు క్రిమినలు (ధన దోష) విషయములలోఁ గూడ విశేషముగ నధికార ముండెడిది; సంఘముఖ్యులను సయితము దుష్ప్రవర్తనకుఁగాను పురము వెడలఁగొట్టఁజాలునంతటి స్వాతంత్ర్య ముండె నని స్పష్ట మగుచున్నది. ఈ ప్రజాభిప్రాయములను నరపతి గూడ నంగీకరింప వలసెడి దనుటయు తేటయగుచున్నది. ఆహాహా! మన భారతీయ పురాతన పురపాలనా విధాన మెంత ఘన మగు విషయమో గాంచి నారలు గదా! ఇట్టి విధానమునకు సమర్థ లయియున్న భారతీయులు స్వపరిపాలన కనర్హు లనుటకన్న నింకను మహత్తర మగు నింద నెద్దాని నూహింపఁగలమో యోజనచేయుఁడు. ఏవి యెన్ని విధముల నుండినయెడల గ్రామాదులకు శ్రేయోదాయక మగునో అన్ని విషయములను కుశాగ్రసునిశితంగాంచి, అందులకుం దగిన యేర్పాటుల నేర్పఱచిన హిందువు లఁట, స్వపరిపాలనభాగ్యమున కనర్హు లఁట! బాపురే విధీ! నిక్కము వక్కాణింపవలసివచ్చిన, ప్రస్తుతపాలకులచే నసమర్థులుగా నెన్నఁబడుచున్న మనవారలును మన భూమియు నాధునిక ప్రభుత్వమున కనుసరణీయంబులు నత్యంత లాభకరంబులు నగు నాదర్శముల నొసంగుచున్కి స్పష్టము. అట్టి సుహృదాశయముల ననుసరిం[illegible]టనే యాంగ్ల ప్రభుత్వమునకు మేలు గాని, ఊరక యకారణ[illegible]
యేమి కార్య మగును?

ఇప్పటికి రెండు
చంద్రగుప్తుని కాలంబున
దుండె ననుటకు విశే[illegible]
అనేక చరిత్రకా[illegible]
బుతే సాక్షి[illegible]
"పాలన[illegible]
అంగు
వాని
డెడి

దును జననమరణము లెట్లు వృద్ధిక్షయము లందుచున్నవో ఆ విషయంబును పాలకుల కన్నివేళల నెఱుకవడియుండుటకై యుపయుక్తము లగుచుండెను. నాలుగవ పంచాయితీవారు వర్తకవిషయములపై శ్రద్ధను వినియోగించుచు, ఏయే వస్తువుల నెట్టు లెట్టు లమ్మవలయునో ఎక్కడెక్కడినుండి యేయే సామగ్రుల నందవలయునో చెప్పుచు, వర్తకుల కన్యాయము వెన్నతోడఁ బెట్టిన దను మాటను దబ్బరచేయుచుండెడివారు. ఐదవ పంచాయితీవార లన్న, దేశీయకృతము లగు వస్తుసముదాయము నుపలక్షించుచు వానికిం దగిన ధరలఁ జూపుచు వ్యాపారమునకు దారితీయుచుండెడివారు. ఆఱవ పంచాయితీవారు దేశంబున విక్రీతంబు లగు వస్తువులపై పదియవపాలు కప్పంబుగ నందుకొనుచుండెడివారు. ఈ గతి నీ పంచాయితీ లన్నియు వేర్వేఱ ఆయా కార్యంబులఁ బూనుచున్నను, అందఱుం గలసి చేయఁదగు కార్యములు కొన్ని కలవు. అందు గ్రామసభాభవనంబుల నుచితస్థితి నుంచుట, ధరల తారతమ్యంబు లెక్కుడుగ లేకుండునట్లు సరిచూచుట, సంతలను రేవు స్థలములను దేవాలయములను క్రమవిధిని జరగునట్లు చేయుట మొదలగునవి ప్రధానములుగా నుండెను."

దీనింబట్టి రెండువేల వత్సరంబులకు పూర్వము గూడ స్వపరిపాలనవిషయము లెంత యుత్కృష్టదశయం దుండెనో స్పష్ట మగుచున్నది. స్వదేశీయవిషయంబులకొఱకే గాక యన్యదేశీయుల యాదరణంబునకు కూడ నొక పంచాయతీని స్థాపించిన యుదారమానసుల నీ కాలంబున నిగరకులు [illegible] చి యీాసడించుట యెంత

లెక్కల విషయం బొక్క

వేనోళ్ల చాటి, యన్యుల

ఇప్పటికి 2200 సంవ

[illegible]ఘనిబంధన మొక్కటి

మున స్తంభీభూతుఁడు

[illegible]యంబుల సంతతి

[illegible]లకను గన్న

[illegible]యంబుల

[illegible]త్త్యము

[illegible]

పట్టణములందుఁ గూడ నిట్టివియే నెలకొల్పఁబడియుండె నని యనుకొనుటయే సమంజసము. ఈ స్వపరిపాలన మౌర్యరాష్ట్రము విధ్వంసము చేయఁబడు నంతవఱకు (అనఁగా క్రీ. ము. 180 వఱకును) నిరఘాటముగ కొనసాగియుండె ననుటకు చరిత్రమే యాధారముగా నున్నది.

ఇఁక నుఱికొన్ని వత్సరంబులు గడచిన యనంతరము గూడ భారతీయ స్వపరిపాలనము సంస్తుత్యం బగు రీతి నీ హిందూదేశము నలంకరించె ననుటకు దక్షిణహిందూదేశమందలి పల్లవచోళవంశరాజుల చరిత్రంబులు గానవచ్చుచున్నవి.

వీరి కాలంబున రాష్ట్ర మంతయు మండలములు కొట్టములు నాడులుగా పాలనసౌలభ్యమునకు విభజింపఁబడి యుండెను. ఇందు కొన్ని గ్రామములును గ్రామసమూహంబు లనందగు పట్టణంబులు కొన్నియుఁ గలసి నాడు లను నామంబున వ్యవహరింపఁబడుచుండెను. ఆ కాలంబున దేశక్రమసుపాలనకొఱ కాయాయూర నొక మహాసభ నిర్మింపఁబడి యుండె నని చరిత్రలవలనను శాసనములంబట్టియు తెలియనగును. ఈ సభల లక్షణములనుగూర్చి ఇప్పటికి వేయి సంవత్సరములకు పూర్వము వ్రాయఁబడి, చెంగల్పట్టు జిల్లాలోని యుత్తరమల్లూరునందును కృష్ణాజిల్లాలోని ఉక్కలుగ్రామమునందును గానవగు శాసనములు జ్ఞానదాయకములుగా నున్నవి. ఈ శాసనములఁ బట్టి చూడ మహాసభలు కార్యనిర్వాహణసౌకర్యమునకుఁగాను కొన్ని సంఘములుగ నేర్పడుటయు అందు నాలుగు మాత్రము ప్రముఖత వహించి యుండుటయు స్పష్టముగఁ గానవగును. ఈ నాల్గింటి యధికారమును i యావద్వత్సరవిషయంబులమీఁదను, ii జలాశయములపైని, iii వనములమీఁదను, iv న్యాయముపైని చెల్లుచుండినట్లు తెల్లమగుచున్నది. ఈ సంఘములు ప్రతిసంవత్సరము నెన్నుకొనఁబడుచుండెను. ఇప్పటికి 1000 సంవత్సరములకు పూర్వము వ్రాయఁబడిన శాసనము మరియొకటి యాకాలంబున బాటలు మొదలగు జనసామాన్యోపయోగము లగు విషయముల నిర్మించుటకుఁ గావలసిన భూములను క్రయమూల్యములకుఁ బిలికొను నధికార మీ సంఘములకుఁ గలిగియుండుటను తేటపఱచుచున్నది. ఇంతే కాక, కనకదర్శక మనియు పంచవారవారీయ మనియు మఱి రెండు సంఘములు గూడ సూచింపఁబడియున్నవి. అందు కనకదర్శక మను నీ సువర్ణశాఖయే దేశమందు ప్రచారమున నున్న నాణెముల ముద్రణాద్యధికారమును గలిగి ప్రస్తుత టంకశాలాదు లొనర్చు కార్యక్రమమును చూచుచుండె నని రాయ బహద్దర్ వి. వెంకయ్య గారు [illegible] ఇత్యాది సరి యనఁగగు. [illegible] యనిన, ఆ కాలంబున నువర్ణ [illegible] దేశంబు [illegible]

[illegible]ండెను. పంచవారవారీయ మను [illegible]

[illegible]ములు నె [illegible]

# భాషాదశాపరిణామము

## కట్టా వేంకటరావు గారు, ఎమ్. ఏ.

అనాదిని భాష యొక్కటియే యనియు, ఆ మూలభాషనుండి యే క్రమక్రమముగా భేదము లేర్పడి ప్రస్తుతము వాడుకలో నున్న భాష లన్నియు వ్యుత్పన్నము లయిన వనియు భాషాశాస్త్రజ్ఞులలో కొందఱి యభిప్రాయము. అన్నిటికిని మూలభాష యొక్కటే యన్న సంగతి వివాదాంశ మైనను, కొన్ని మూలభాష లున్న వనియు వానినుండి క్రమముగా భాష లన్నియు నేర్పడిన వనియు చాల మందిచే అంగీకరింపఁబడినది. ఏ దెట్లయినను ఒకభాష అనేకభాషలుగా పరిణమించుట నిశ్చయము. ఈ క్రొత్త భాషలు దేశభేదముల ననుసరించి పరస్పరసంబంధ మున్నట్లు కూడ కనఁబడవు. ఒకటే మాతృభాషనుండి యేర్పడినను, సంస్కృతము లాటిను గ్రీకు ఇంగ్లీషు మొదలయినవానికి పరస్పరసంబంధ మున్నట్లు ఆ యా భాషలు నేర్చినవారికి సాధారణముగా పొడగట్టదు. అటులే అరవము తెలుఁగు కన్నడము మళయాళము మొదలైన భాషలకు మూలాధార మొక్కటే యని భాషాపరిశీలకులచే నొక్కి చెప్పఁబడినను, ఆయా భాషల నేర్చినవారికి ఒకరిమాట ఒకరికి తెలియకపోవుట చేత, అట్టి సంబంధ ముండు నని నమ్మ సాధ్యము కాకున్నది. పోలికలు చెడునట్లు భాషలు మాఱుచున్న వని దీనివలన తెలియుచున్నది. దేశభేదముల ననుసరించిన యీ మార్పులే కాక కాలభేదముల ననుసరించి కూడ భాష మాఱును. ఒకటే భాషలో కాలక్రమమున మార్పులు కలిగి, చాల కాలమునుండి వాడుకలో నున్న భాషలందు ప్రాచీనపురుషాంతరములవా రుపయోగించిన భాష ఆధునికులకు గ్రాహ్యము కాకుండుట కలదు. ప్రాచీనాంగ్లేయభాష ఆధునికులకు కేవల మన్యభాషయే. మధ్యమ పురుషాంతరములవారి భాషయు ఇప్పటివారికి తమ భాషతో కొంత సంబంధ మున్నట్లు కనఁబడినను సులభముగ బోధపడదు. ఇది యాంగ్లేయభాషతో పరిచయ మున్న చాలమందికి తెలిసిన సంగతియే. ఇదే రీతిగా భాషలన్నిటిలోను తరతరములనాటికి మార్పులు కలుగుచుండును. ఇట్టి మార్పులు కలుగుటకు కారణ మేమి? అప్పుడప్పుడు దేశపరిపాలకులు భాష యీ విధముగ మార్పఁబడవలె నని శాసించిరా? లేక జనులు సంఘములుగా కూడి రేపటినుండి మనము భాషను ఈరీతిగా మార్చి వాడుకచేయవలె నని తీర్మానించి మార్పుల నవలంబించిరా? లేక భాషాస్వభావములోను జనుల స్వభావములోను మార్పును కలుగఁజేసెడి సహజమైన కారణము లేమైన నున్నవా? ఇవి పరిశీలింపఁదగినవి.

భాష యనఁగా నేమి?—ఈ విషయమును పరిశీలించుటలో నిజమైన భాష యేదియో, అది శాసింపఁబడి కట్టుపడుటకు అనుకూలమా లేక మార్పును కోరుచుండునదియా కొంతవఱకు తెలిసికొనుట యవసరము. కావున, భాష యనఁగా నేమి యని యాలోచింతము. భాష యనఁగా సర్వజనులును మాటలాడునట్టిది. ప్రతిమనుష్యునకును పదార్థవిజ్ఞానము కలిగినతోడనే ఆయా పదార్థములతో సంబంధించిన కొన్ని భావములు కలుగుచుండును. ఆ భావములు కలిగినవెంటనే వానిని ఇంకొకరికి తెలియఁజేయుటకు కుతూహలము గాని లోకవ్యవహారధర్మముచేత అవసరము గాని కలుగును. అట్టి భావప్రకటనసాధనమే భాష. ఇట్టి సాధనము లనేకము లున్నవి. మూగలును చిన్న పిల్లలును చేసంజ్ఞలచేతను ముఖవికారములచేతను హావభావములను తెలుపుచుందురు. నౌకలలో దూరమున నుండువారును, రైలుపై పనిచేయువారును, వినఁబడనంత దూరములో నున్నప్పుడు పలురంగుల జెండాల మూలముగను రంగుదీపముల మూలముగను ఇంచుక వ్యత్యాస మున్న మహోపద్రవములు కలుగు సన్న విషయములలో కూడ వ్యవహరించుకొందురు. సంకేతపూర్వకముగా భావప్రకటనము చేయుటకు అనేకమార్గము లున్నవి. కాని, యవి యన్నియు ముఖాముఖిగ నుండి దృష్టి నుపయోగించునప్పుడే పనికి వచ్చును. ఏదైన తెరవంటిది అడ్డమున్నను, వెలుతురు లేకపోయినను ఇవి విస్తారముగ నుపయోగింపవు. అదియును గాక, కల్పనావిషయమున భావసూక్ష్మములను తెలియఁజేయుటకు ఇవి యన్నియు మితిలేని సాధనములు కానేరవు. ఇట్టి చిక్కులు లేకుండ, అందఱిచేతను సర్వకాలసర్వావస్థలయందును ఉపయోగింపఁబడుటకు వీలై విపులముగా భావప్రకటనము చేయఁజాలిన సాధనము శబ్దోచ్చారణ మొక్కటియే. ఈ శక్తి మనుష్యునకు దైవనిర్మితవిశేషము. దీనిని చిన్న పిల్లలు కుతూహలముతోను ఆనందముగాను అభ్యసింతురు. పెద్దలు చమత్కారముగాను వ్యవహారమున నుపయోగముగాను వాడుక చేయుదురు. ఇదియే భాష యని చెప్పఁబడునది. భాష చిరకాలము లిఖితమూల మైన స్థిరరూపము లేక శబ్దరూపముననే జీవించుచువచ్చెను; కొంతకు వ్రాఁత యనెడి స్థిరరూపమును ధరించి, ప్రస్తుత దినచర్యలో సంబంధించెడి వ్యవహారమునకే గాక అన్ని తరములలో నున్న బుద్ధిమంతుల భావవిశేషములను నాశరహితముగా చేయు సాధనమై భాష యన తానే యని స్పష్టీకరింపఁబడి వ్యవహరింపఁబడుచున్నది.

భాషాస్వభావ మెట్టిది?—ఒకరి యభిప్రాయమును మఱియొకరికి తెలియఁజేయు సాధనమే భాష. భాష వ్యవహరింపఁబడుటకు ముందు ఒక సంఘ మేర్పడియుండినఁ గాని ఒకరు మఱియొకరికి తెలియఁజేయుట అనునది సంభవింపదు. అట్టి భాష లేనిచో సంఘసంబంధ మైన దినచర్య జరగనేరదు. కనుక ఇవి రెండును అన్యోన్యాశ్రయములై ఒకటి నొకటి వృద్ధిచేయుచుండును. అందు

చేత మనుష్యులు కొంచెము నాగరికతను పొంది సంఘములుగా చేరిననాఁటినుండి భాష కూడ ఉండియే యుండవలెను. ఇట్టి సంఘీభావము చిరకాలమునుండి యున్న దని మనకు అనేకశాస్త్రముల వలన తెలియుచున్నది. భాష కూడ అంతకాలమునుండియు ఉన్న దనియే యూహింపవలెను. భాష యెప్పటి దప్పుడే చాలకాలము నశించిన పిమ్మట, ఏదేని చిహ్నరూపమున భాషను అందుఁ గల యభిప్రాయములను సంగ్రహించుటకు చేసిన ప్రయత్నమే వ్రాఁతగా పరిణమించెను. భాష యుండుటచేత వ్రాఁత అవసర మయ్యెను. అందుచేత ముందు మాట్లాడఁబడెడి భాష; దాని ననుసరించి వచ్చునది వ్రాయఁబడెడి భాష. వ్రాయఁబడు భాష మాట్లాడు భాషనే ఆధారముగాఁ గలది. వ్రాయఁబడు భాష యున్నను లేకపోయినను తప్పక యుండితీఱవలసినది మాట్లాడు భాషయే. లోకానుభవము కూడ దీనినే స్థిరపఱచును. వ్రాఁత యన నెట్టిదో యెఱుఁగని బాలురును స్త్రీలును పామరులును యథేచ్ఛముగా భాషను వాడుచునే యుందురు. ఇది స్వభావసిద్ధము. శారీర మానసిక సాధనములు కూడ ఇందునకు అనుకూలముగనే నిర్మింపఁబడినవి. ఇవన్నియు బాగుగా ఆలోచించి చూడ, భాష యనఁగా వాడుకలో మాటాడుకొను భాషయే యని యూహింపఁదగినది. మాటాడు భాషకు శబ్దోచ్చారణమే ముఖ్యాధారము. శబ్దమునకు ఉత్పత్తిస్థానము కంఠము. గాలి మన యూపిరితిత్తులనుండి బయలుదేఱి కంఠముగుండ పైకిఁబోవునప్పుడు గొంతుకలో నుండు రెండు త్రాళ్లవంటివానిపై రాచుకొనిపోవుచు ధ్వనిని పుట్టించును. తీఁగలను బలాత్కారముగాను గట్టిగాను కదలించినయెడల అవి ధ్వనిచేయు నని వీణ తంబురా మొదలైనవాని విషయమై మన మెఱిఁగినదే. సాయంకాలము టెలిగ్రాఫు తీఁగల ప్రక్క నున్న రోడ్డుపైఁ బోవువారికి ఝుమ్మను శబ్దము వినఁబడును. బలాత్కారముగా గాలి వీచుచు ఆ తీఁగలను రాచుకొనిపోవుటచే ఆ ధ్వని పుట్టుచున్న దని మన మందఱ మెఱిఁగినదే. ఈ యనుభవ మున్నవారికి మన కంఠములో కూడ శబ్దము ఇటులే పుట్టుచున్న దని భావించుట సులభసాధ్యము. ఈ శబ్దము అనేకవిధములుగా మార్పఁబడి స్వర* భేదములతో ముఖద్వారము నుండి వెలువడుచున్నది. వైణికుఁడు వేఱువేఱు స్థలములలో తీఁగలను నొక్కి స్వరభేదములను కలుగఁ జేయును. సానాయి వాయించువాఁడు దానిపై నున్న రంధ్రములను యుక్తముగా మూసియు తెఱచియు అనుకూలమైన స్వరభేదమును కలుగఁజేయును. ముఖద్వారముయొక్క విపులత్వము ననుసరించి సానాయి ధ్వనులలో భేదము కలుగును. మన నోటిలో కూడ ఇదే విధముగ స్వరభేదములను కలుగఁజేయు సాధనము లున్నవి. అందు నాలుక పెదవులు ప్రధాన మైనవి. వీనిని ఇష్టమువచ్చినట్లు కదల్పవచ్చును. ఈ కదల్చుట కున్న యవకాశమే స్వరభేదమునకు ముఖ్యాధారము.

పెదవులను మూసి విప్పిన నొక స్వరము. క్రింది పెదవిని పండ్లతో కలిపిన మరియొక స్వరము. ఇటులె పెదవులను ముణిఁచియు, వెడల్పుగా నుంచియు, గుండ్రముగా మార్చియు శబ్దోచ్చారణ చేసిన, కొంచెము కొంచెము భేదములతో స్వరవిశేషములు కలుగును. నాలుక చేయు పని బాగుగ యోచించినయెడల; అత్యద్భుతముగాఁ గానవచ్చును. వీణకు మెట్లు నొక్కుటవల్ల నేమి యుపయోగమో నోటికి నాలుకను మార్చుటవల్లను అట్టి యుపయోగమే. నాలుక అతి చంచలము; నోటిలో అనేకస్థానములందుండి అనేకవిధముల మాఱుటకు శక్తి కలది; పైకి క్రిందికి, ఈప్రక్కకు ఆ ప్రక్కకు, కూడ చలింపఁగలదు. ముఖద్వారమును తెఱచియుంచి శబ్దము చేసినప్పుడు నాలుకయొక్కయు పెదవులయొక్కయు మార్పులచేతనే ఆయా భేదములతో అచ్చు లన్నియు పుట్టుచున్నవి. హల్లులకు కూడ నాలుకయే ప్రధానము. నాలుక చివర భాగము వివిధస్థానములను తాఁకియున్నప్పుడు శబ్దోచ్చారణ చేసిన, హల్లు లుచ్చరింపఁబడును. కొంచెము శ్రద్ధతో స్వరముల నుచ్చరించుచు అద్దము నెదుట కనిపెట్టినయెడల ఇది యంతయు సులభముగాను స్పష్టముగాను తెలియఁగలదు. స్వరభేదములు కలుగుటకు నాలుకయొక్కయు పెదవులయొక్కయు చలన స్వభావమే కారణ మైనయెడల అవి యొక స్వరము నుచ్చరించునపు డుండవలసిన స్థానమునుండి యొమాత్రము ఎక్కువ తక్కువ కదలినను ఆ స్వరమునకు వ్యత్యాసము గలుగుట స్వభావసిద్ధము. మాటలాడుటలో ఏమాత్రము అజాగ్రత్తగా నున్నను ఈ మార్పు కలుగుచునే యుండును. మిక్కిలి జాగరూకతతో మాటలాడినప్పుడు ఇట్టి వ్యత్యాసములు కలుగకుండ కాపాడవచ్చునేమో కాని, సర్వసాధారణముగా కొంచెము అజాగ్రత్తగా మాటాడుటయే చాలమందికి అలవాటు. మాటలాడుటకు ముఖ్యోద్దేశము ఒకరి యభిప్రాయము ఇంకొకరికి తెలుపుట. ఇది యందఱకును, అనఁగా పండితులకును పామరులకును కూడ, అనుదినము వ్యవహారములో మిక్కిలి యవసరము. భాషావిషయమున పండితు లనువారు లెక్కకుఁ జాల తక్కువ. వారు కూడ మాటాడునప్పుడు వాడుకచేయు భాషలో అజాగ్రత్తగానే యుందురు; ఎల్లప్పుడును శాస్త్రప్రకారముగనే మాటలాడ నేరరు. మాటలాడునప్పుడు అజాగరూకత పండితులయందు కూడ చాలవఱ కుండును. బాగుగ నాలోచించినయెడల దీని యాథార్థ్యము అందఱకును గానవచ్చును. భాషావిషయమున పామరుల సంఖ్య మిక్కిలి యెక్కువ. పామరులకు భాష యున్న నేమో శాస్త్రజ్ఞానము సున్న. ఇది తప్పు ఇది యొప్పు అనునది వారికి ఎంత మాత్రమును స్ఫురింపదు. ఏదో యొకవిధముగా తన యభిప్రాయ మింకొకరికి తెలిసిన నంతే చాలు నని ప్రయత్నించి, అది సమకూరినచో వారు మిగిలిన సంగతులను యోచించువారు కారు. వారు సమయము ననుసరించి తొందరగాను మెల్లగాను మాటాడుచుందురు. ఈ విధముగ మాటాడిన, భాష యీ విధముగా మాఱు నన్న భయము వారికి లేదు. అట్లు మాఱు నన్న జ్ఞానము కూడ లేదు. ఏది-యెట్లయినను, వ్యవహారము జరిగిన చాలును. అందుచేత మాటలాడుటయందు కించి

---

* ‘స్వరము’ అను మాట ఈ వ్యాసమున ఇంగ్లీషు ‘Sound’ అను మాటకు బదులుగా వాడఁబడెను.

దజాగ్రత్త సర్వజనసామాన్య మని మన మూహింపవచ్చును. ఇట్లు సాధారణముగా నుండు లోపమునకు మనుష్యస్వభావములోనే యేదేని మీఱ శక్యముగాని కారణము లుండవలెను.

మనుష్యస్వభావ మెట్టిది?—మనుష్యుఁడు వీలయినంతవఱకు తన కేవిధమైన శ్రమయు కలుగకుండ తప్పించుకొనుటకు ప్రయత్నించు చుండును; వ్యవహారసిద్ధిని పొందుటలో తప్ప దని తోఁచిన శ్రమకు వెనుదీయఁడు. తప్పించుకొనుటకు వీ లున్నప్పుడు మీఁద వేసికొనఁడు. ఉన్నవానిని క్లిష్టముగా వాడుకచేయుట మిక్కిలి యిష్టము. వ్యర్థముగా ధనము గాని, కాలము గాని, దేహములోని శక్తి గాని, కర్చుపెట్టుటకు యుక్తాయుక్తవిచక్షణ చేయఁగల మనుష్యుఁ డెంతమాత్రము నొప్పుకొనఁడు; సూక్ష్మమార్గము లున్నప్పుడు చిక్కయిన చుట్టుత్రోవలఁ బోఁడు. ఒక దినములో ఒక యూరికిఁ బోవుట కవకాశ మున్నప్పుడు ఒక మాసములోఁ బోవు సాధనము నంగీకరింపఁడు. ఒక డబ్బుతో తెలియఁజేయఁగల సమాచారమును అఱరూపాయి కర్చుపెట్టి తెలియఁజేయఁడు. తనకు స్వాధీనమైన యింకొకరు ఏదేని పని చేయఁగలిగినయెడల తానే దానిని చేయుటకు పూనుకొనఁడు. ఒక మాటతో అభిప్రాయము నంతటిని పూర్తిగ తెలియఁజేయఁగలిగినప్పుడు ఒక వాక్యమును వ్యర్థపుచ్చఁడు. ఇటులే యన్ని విషయములలోను యుక్తమైన కూడికతోను క్లిష్టముగాను వ్యవహరించును. తాను ప్రతిదినము ఆడెడి మాటలలో కూడ ఇదే ప్రకారము దేహశక్తిని అనవసరముగా వ్యర్థము చేయక తన భావమును ఇతరులకు తెలుపుటకు సూక్ష్మమార్గము నవలంబించును. మాటలాడునప్పుడు నాలుకను పెదవులను కదల్చుటలో విశేషముగా శ్రమపడకుండుటకు ప్రయత్నించుచుండును. సరిగా కదల్చుట మానిన, స్వరభేదము వెంటనే కలుగకమానదు. దీనినుండియే భాష మాఱుచుండును. మనుష్యస్వభావ మాలోచించినను మార్పు భాషకు తప్ప దనియే తోఁచుచున్నది. ఇట్లు ఉపయోగింపఁబడు భాషను ఉపయోగముచేసెడి మనుష్యులు, తమతమ స్వభావములచేతనే మార్పును అనుకూలపఱచునప్పుడు, భాషకు మార్పు రాక యెట్లు తప్పును? మాటలాడుటలో శ్రమను క్లిష్టపఱచుటకును కూడిక చేయుటకును కొన్ని మార్గములు కలవు. అవియే భాషాదశాపరిణామమునకు ముఖ్యకారణములు.

అనుకరణము—అం దిది మొదటిది. అనుకరణ మనఁగా ఒకరు పలికినదానిని విని అదేప్రకారముగా ఇది తప్పా ఒప్పా యని యాలోచింపక వాడుకచేయు అభ్యాసము. తనంతట తానే బాగుగా యుక్తాయుక్తతల నాలోచించి, 'ఈ మాట నుచ్చరించుటకు ఇదియే విధానమా, మరియొక ఉన్నదా? మరియొకటి యేల యుండఁగూడదు? ఇది తప్పా ఒప్పా?' అని వితర్కించుటకు కొంత శ్రమపడవలెను. ఆ శ్రమ ననుభవించుట కిష్ట ముండదు. ఆంగ్లేయము నభ్యసించు విద్యార్థుల సంగతి చూచిన, ఇది బాగుగ గ్రాహ్య మగును. వారికి ఆంగ్లేయపదముల నుచ్చరించుటలో అనేకములైన యనుమానములు కలుగుచుండును. సరియైన యుచ్చారణ మేదో నిఘంటువులలో నూచింపఁబడును. చాలమంది నిఘంటువులను పరిశీలించి నిజమును తెలిసికొనుట కవశ్యమైన శ్రమ కిష్టపడక ఇంకొక రెట్లుచ్చరింతురో అది సరియైనను కాకపోయినను అటులే దాని ననుకరించుచుందురు. అనుకరణము కూడ స్వభావసిద్ధమైనదియే. పిల్లలు భాషను అదేవిధముగ నేర్చుకొందురు. పామరులు కూడ భాషను చాలవఱకు అనుకరణముచేతనే నేర్చుకొందురు. అనుకరణ మనఁగా ఒక రుచ్చరించినదానిని విని దానివలెనే యింకొక రుచ్చరించుటకు ప్రయత్నించుట కదా. వినుటలో లోప మున్నను ఉచ్చారణశక్తిలో లోప మున్నను మార్పునకు అవకాశ మున్నది. తమకు తామే ఆలోచించి సంగతిని గ్రహించుటకు శక్తి గలవారు కేవలము అనుకరణమున కాశింపరు. చదువుకొని వివేకులైనవారు దేని నేని విన్నయెడల వారు తమ పూర్వానుభవము ననుసరించి అది సరియా కాదా యని యాలోచించుచుందురు. ఇట్టి యాలోచనశక్తి లేనివారే యింకొకరివలె పలుకఁ బ్రయత్నించుట. అట్టివారి యనుకరణము లోపములతో నిండి యుండును. భాషను మాటలాడువారిలో ఎక్కువమంది యిట్టి యాలోచనశక్తి లేనివారే యని యిదివఱకే చూచితిమి. చిన్న పిల్లలకు అనుకరణము స్వభావసిద్ధము. వారు పలికినదానిని జాగ్రత్తగా వినఁజాలరు. వినినను అన్ని స్వరములు వారికి సులభసాధ్యములు కాకపోవుటచే కష్టమైన స్వరములకు మాఱుగా సులభమైన స్వరములను వాడుక చేయుదురు. 'ర' పలుకలేని చోట 'ల' పలుకుదురు. ఇటులే చదువు లేని క్రిందిజాతులలో కొందఱు పైజాతులవారివలె శబ్దోచ్చారణకు ప్రయత్నించునప్పుడు వారు చేయు కొన్ని తప్పులు మనకు వినోదమును కలిగించు చుండును. ఒత్తులు లేనిచోట ఒత్తి పలుకుదురు; ఉండవలసినచోట మానెదరు. 'శ' 'చ' లను అన్యోన్యము మార్చుచుందురు. ఇవి మన మందఱ మెఱిఁగినవే. ఈ మార్పులను చాలవఱకు మనము పరిహసించి తిరస్కారభావముతో అవలంబింపక పోయినను, క్రమక్రమముగా భాషాదశాపరిణామమునకు అవి చేయఁగలిగిన పనిని చేయక మానవు. స్వతంత్రాలోచనశక్తి గలవారు బాగుగ యోచించి యిట్టి వాడుకను తిరస్కరించినను, అట్టి శక్తిలేనివారే సాధారణముగా నెక్కువమంది యుండుటచేత భాషకు ఆయా మార్పులు వారివల్ల జరగకతప్పదు. చదువుకొన్న పండితులు కూడ దీనిచేత కొంతవఱకు బద్ధులే. వారు కూడ తమలో తామే ఒక రింకొకరివలె పలుకఁ బ్రయత్నించి కొంచెము మార్పును కలుగఁజేయుచుందురు. ఇవి యన్నియు క్రమక్రమముగా వాడుకలోనికి వచ్చి స్థిరముగా భాషలో నిలుచును. ఈ కారణముచేతనే భాషకు రూపమందును అర్థమునందును కూడ మార్పు కలుగుచుండును. కొన్నికొన్ని రూపభేదములు స్వభావముచేతే అవశ్యమైనను ఆ భేదములను సరిగా జ్ఞప్తియందుంచుకొనుట కష్టము గనుక క్రమముగా ఆ భేదములను తొలఁగించి యేకరూపమునకు మార్చుటకు ప్రయత్నించు చుందురు. ఇటులే మాటల యర్థములో కూడ మార్పు కలుగును. ఏ రెండు మాటలకైన కొంచెము అర్థభేద మున్నప్పుడు ఆ భేదమును నిరాకరించి ఆ రెండు మాటలను ఒకే యర్థము గలవానినిగా వాడుక చేయుదురు. రూప

ములలోవలెనే అర్థములలో కూడ భేదములను తొలఁగించి సమత్వమును కలుగఁజేయుటలో మార్పు కలుగుచుండును. ఇట్టి మార్పు వ్యాకరణరూపములలోను వాక్యరచనలోను కూడ కన్పట్టును. ఆంగ్లేయము నభ్యసించిన కొందఱు తెలుఁగు వ్రాయుటలోను మాటాడుటలోను వాక్యరచనను కొంతవఱకు ఆంగ్లేయము ననుసరించియే చేయుట కలదు. భాషలోని వైరుధ్యములను లేకుండఁజేసి అన్నిటిని వీలయినంతవఱకు ఒకటే సూత్రముక్రింద సమర్థించు ప్రయత్న మీ సంబంధమైనదే. ఇటులే ఈ కారణముచేత భాష కనేకమైన మార్పులు కలుగుచుండును. చిన్నపిల్లల మాటలలోను, అర్థము సరిగఁ దెలియక అన్యభాషాపదములను వాడుకచేయు పెద్దలలోను, తమకన్న నధికులవలె మాటాడఁ బ్రయత్నించెడి యల్పులలోను, వినుటయందును ఉచ్చరించుటయందును కలుగు లోపములచేత భాషకు మార్పు కలిగి, ఆ మార్పులు క్రమక్రమముగా భాషలో నాటుకొని నిలుచును గాన, అనుకరణము భాషాదశాపరిణామమునకు ముఖ్యకారణములలో నొకటి యని యూహింపవచ్చును.

నొక్కి చెప్పుట—ఇయ్యది రెండవ కారణము. మనుష్యునకు మాటలాడునప్పుడు అనవసరముగా శ్రమపడుట కిష్ట ముండదని చెప్పితిమి. అట్టిచో, నొక్కి చెప్పుట శ్రమ కాదా? అది యేల చేయవలెను? ఒకసారి నొక్కి చెప్పుటకుకన్న రెండు సారులు చెప్పుటకు ఎక్కువ శ్రమ యవసరము. అట్లు రెండు సారులు త్రిప్పి చెప్పవలసిన యావశ్యకత యుండు నేమో యని యనుమానమున్నప్పుడు రెండు సార్లు శ్రమపడుటకు మాఱుగా ఒకసారే మామూలుకన్న కొంచెము గట్టిగాను స్పష్టముగాను చెప్పినయెడల అనావశ్యకమైన శ్రమ యుండదు. ఇట్లు చేయుట శ్రమను తగ్గించుకొని దేహములోని శక్తిని క్లుప్తముగా వాడుకొనుటకే. దీనిని మనము ముఖ్యముగా కొన్నిచోట్ల కనిపెట్టఁగలము. ఆంగ్లేయులు క్రొత్తగ మన దేశమునకు వచ్చినప్పుడు మనతో కూడ తమ దేశములో మాటలాడినట్లే మాటలాడుదురు. అది మనకు తెలియక 'అయ్యా! ఏమి సెల?' వని తిరిగి తిరిగి యడుగుచుందుము. వారు తిరిగి తిరిగి చెప్పవలసిన యావశ్యకత యుండును. కొంతకాలమైన తరువాత రెండు మూఁడు సార్లు చెప్పుటకన్న మొదటిసారే జాగ్రత్తగాను స్పష్టముగాను చెప్పినయెడల అనవసరమైన శ్రమ యుండ దని వారు క్రమముగా అట్టి యలవాటును చేసికొందురు. అప్పుడు కూడ తా మొక యాంగ్లేయునితో మాటలాడునప్పుడు తమ మామూలు ధోరణిలోనే మాటాడుదురు. కాన, ఆంగ్లేయులు మనతో మాటలాడు తీరునకును తమలో తాము మాటలాడుకొను తీరునకును కొంత భేద ముండును. అధికారియు సేవకుఁడును మాటలాడు తీరు కూడ ఈ విషయమున కొంత గమనింపవలసినదే. తాను చెప్పునది తెలియకపోయిన, తన యధికారి యేమి కోపగించుకొనునో యని సేవకుఁడు జాగ్రత్తగాను స్పష్టముగాను చెప్పుచుండును. ఆ యధికారి యన్ననో అట్టి భయము లేని స్వతంత్రుఁడు గాన ఆడెడి మాటలలో చాల భాగము మ్రింగివేసి మాటలాడుచుండును. మాటలాడుటలో నున్న యిట్టిభేదము భాషాదశాపరిణామమునకు కారణము కాఁగలదు. ఉపన్యాసకుఁడు తాను చెప్పునది సభవారి కందఱుకు వినఁబడునట్లు ప్రయత్నించుటలో కూడ ఈ భేదము కనఁబడును. ఇందువలన భాషకు మార్పులు కలుగును. ఉచ్చారణలో ఏస్వరమును వదలివేయరు. కొన స్వరములు వినఁబడ వేమో యన్న భయముచేత వానికి సంబంధించిన క్రొత్త స్వరములను కలిపి పలుకుచుందురు. లేనిచోట ఒత్తులు పెట్టి పలుకుచుందురు. ఒక మాటలోని యొక భాగమును తక్కినవానికంటె నెక్కువగా నొక్కి పలుకుటచే స్వరములలో కొన్ని మార్పులు కలుగుచుండును. హ్రస్వాచ్చులు దీర్ఘములుగను, దీర్ఘాచ్చులు సంయుక్తాచ్చులుగను మాఱుచుండును. ఒక మాటలో నొక్కిపలుకని భాగములో నున్న దీర్ఘములను హ్రస్వములుగను హ్రస్వములను తేలికగను పలుకుటయు జరగును. ఒక వాక్యములో కూడ ఇటులే కొన్నిమాటలకు ప్రముఖత యిచ్చి నొక్కి పలికినందువలన ఆ మాటల యుచ్చారణ బలపడి స్వరములలో మార్పు కలుగుచుండును. ఎక్కువ జాగ్రత్తగా పలుకుటలో నాలుక నుంచవలసిన స్థలమునకు పైఁగా నుంచుటవలన అచ్చుల స్వభావము మాఱును. ఈప్రకారము స్వరములు అనేక విధములుగా మాఱి రూపభేదములను కలిగించును. ఈ కారణముచేతనే మాటల కర్థభేదము కూడ కలుగును. మన భావములను స్పష్టముగా తెలియఁజేయవలె ననెడి యాతురతచే ఒక మాటతో కలిపి దాని పర్యాయపదమును కూడ వాడుక చేసి క్రమక్రమముగా వానిలో భేదమును కలుగఁజేసి, తిరిగి యా మాటలను వేఱువేఱు అర్థములలో నుపయోగించెదము. ఒకే మూలమునుండి వ్యుత్పత్తియైన మాటలు వాడుకలో క్రమముగా భేదింపఁబడి వేఱర్థములతో నిపుడుపయోగింపఁబడును. తొందరగా మాటలాడుటలో స్వరములకుఁ గలిగిన కొన్ని కొన్ని లోపములు తిరిగి యీ కారణముచేత సవరింపఁబడుచుండును.

మాంద్యమువలన మాటలాడుటలో కలిగెడి యజాగ్రత్త మూఁడవ కారణము. ఇది రెండవ కారణమునకు వ్యతిరేక స్వభావము కలది. 'మన మెట్లు మాటలాడినను ఎదుటివారు తెలిసికొన సమర్థులు; కొంత తెలిసికొనకపోయినను దానివలన మనకు విస్తారము నష్టము లే' దని తోఁచినపుడు వానికి అనుగుణముగానే కొన్ని లోపములతో నుచ్చరించుటకు సందేహింపము. పైని చెప్పిన ప్రకారము ఒక యాంగ్లేయుఁడు ఇంకొక యాంగ్లేయునితోను అధికారి సేవకునితోను మాటలాడునప్పుడు ఇట్టి యజాగ్రత్త యుండును. నిదుర లేచిన వెంటనే యాడెడి మాటల స్వభావమును కొంత పరిశీలించిన, ఇది బాగుగ తెలియును. శీతకాలములో మిక్కిలి చలి వేయునప్పుడు మూతిని కూడ కప్పుకొని మాటలాడెదము; అప్పుడు పెదవులను నాలుకను సరిగా కదపుటకు బద్ధకించుటచే ఇట్టి యజాగ్రత్తయే యుండును. ఈ కారణముచేత ముఖ్యముగా స్వరములలోనే మార్పు కలుగును. కొన్ని యచ్చుల స్వభావము మాఱును. కొసనున్న స్వరములు కొన్ని లోపించుచుండును. స్వరములలో దృఢమైన వానికి బదులు తేలికైనవియు కష్టమైనవానికి బదులు సులభమై

నవియు వాడుకచేయఁబడును. ఈ సందర్భమున నాలుకయొక్కయు పెదవులయొక్కయు చలనస్వభావమెట్టిది యని యోచించినయెడల చాల సంగతులు సుగ్రాహ్యము లగును. పెదవుల సంగతి మొదట చూతము. ఇ, ఈ, ఎ, ఏ, ఐ — వీని నుచ్చరించుటకు పెదవులను బాగుగ సాఁగదీసి యుంచవలెను. ఉ, ఊ, ఒ, ఓ, ఔ — వీని నుచ్చరించుటకు పెదవులను బాగుగ ముణిఁచి యుంచవలెను. ఏదేని యొక మాటయందు మొదట 'ఇ' తరువాత 'ఉ' వచ్చినయెడల పెదవులను మొదట సాఁగదీసి యుంచి 'ఇ'ని ఉచ్చరించి, వెంటనే ముణిఁచి 'ఉ'ను ఉచ్చరింపవలెను. అప్పుడు పెదవులు హఠాత్తుగ ఒక స్థానమునుండి యింకొక స్థానమునకు మాఱవలెను. ఇది చాల కష్టసాధ్యమైన పని. అందుచేత ఈ రెండింటిలో ఒకదానిని రెండవదానికి సరిపోవునట్లు మార్చినచో అవసరములేని శ్రమ యుండదు. మనుష్యస్వభావమును బట్టి చూడఁగా మాట యెట్లు మాఱినను సరియే కాని తాను శ్రమకొప్పుకొనఁడు. 'చూచును' అను పదములో అన్నియు 'ఉ'కారములే అగుటచేత కష్టము లేదు. 'చూచులిని' అని పలుకుటకు ప్రయత్నించినచో, దాని కష్టము తెలియఁగలదు. అట్లు పలుకుట కటువుగా కనఁబడును. తప్పుగా కూడ తోఁచును. ఒకరూపములో తప్పు గాని 'ఉ'కారము, ఇంకొక రూపములో ఏల తప్పుగాను కటువుగాను తోఁపవలెను? పెదవుల కనుకూలమైనట్లు మన మంగీకరించితిమి. పెదవులు "మే మంత వేగముగను సులభముగను మాఱఁజాలము. ఇట్లు మార్చినఁ గాని మే మా మాటనే యుచ్చరింపఁజాలము."— అని నిరోధించినయెడల అదియే సరి యని మన మొప్పుకొంటిమి. ఈ విధముగనే స్వరములు అన్యోన్య సంబంధము కలిగి తమ కనుగుణముగా మాఱుచుండును. ఇటులే నాలుక సంగతి కూడ యోచింపుఁడు. 'ఇ'—'ఒ'—వీనిని వేఱువేఱుగ నుచ్చరించునప్పుడు నాలుక వేఱువేఱు స్థానములలో నుండవలసివచ్చును. ఈ స్వరముల నొకదాని వెంటనే రెండవదాని నుచ్చరింపవలసినప్పుడు పై చెప్పిన ప్రకారము నాలుకను గూడ మార్చుట సులభసాధ్యము కాదు గాన, నాలుక యిందుకై కావలసిన శ్రమను తీసికొనుట కిష్టపడదు. కనుక ఆయా స్వరములనే అనుగుణముగ మార్చుకొనవలెను. నాలుక స్వభావముచేత అచ్చులే గాక హల్లులు కూడ మాఱవలసివచ్చును. ఒక హల్లు కంఠ్యమై దాని తరువాతి యచ్చు తాలవ్యమైనయెడల, అంత త్వరగా నాలుక తన స్థానమును మార్చుకొనలేదు గనుక, కంఠ్యమైన హల్లు తాలవ్యముగా మార్పఁబడును. ఈ కారణముచేతనే హల్లులలోను అచ్చులలోను వాని స్వభావముల ననుసరించి పరస్పరము మార్పులు కలుగక తప్పదు. ఒక మాటలో నెక్కువ యక్షరము లున్నయెడల, వాని నన్నిటిని జాగ్రత్తగా పలుకునంతటి శ్రమను, మామూలుగా మాటలాడునప్పుడు, తీసికొనుట కిష్ట ముండదు. కొన్ని యక్షరములను విడిచి వానికి సరిపోవునట్లు ఏదేని యొక మార్పును కలుగఁజేయుదుము. 'చెప్పవలెను' అను మాట మొదట 'చెప్పవలె' గాను పోనుపోను 'చెప్పాలి' గను మార్పఁబడెను. ఈ రెండవ రూపములో 'వ'ను విడిచి పూర్వాచ్చును దీర్ఘముగా చేసిరి. ఈ విధమైన మార్పుచేత భాషలో చాల రూపములు మాఱిపోయినవి. పదములు కొన్నికొన్ని సమయములయందు సరళములుగా మాఱుటకు కూడ నాలుకను సులువుగా మార్పలేకపోవుటయే హేతువు. అచ్చులయొక్క గాని హల్లులయొక్క గాని సంధికిని ఇదే కారణము. ఒక యచ్చును పలికి రెండవ యచ్చును పలుకుటకు తిరిగి నాలుకను మార్చుట కష్టము గనుక, అవి రెండును కలిసి వాని మధ్యమస్వభావము గల యచ్చుగా మాఱును. హల్లుల విషయమై కూడ ఇదే ప్రకారము జరగును. ఈ మాంద్యకారణముచేతనే ముఖ్యముగా భాషలో పెక్కు మార్పులు కలుగుచున్న వని బాగుగా పరిశీలించినచో పొడగట్టకపోదు. ఇట్లు భాష దినదినమును ఈ కారణములచేత మాఱుచునే యుండు నని గ్రహింపఁదగినది.

ఈ పైని చెప్పిన కారణము లన్నియు కాలభేదము ననుసరించునవి. భాష నానాఁటికి మాఱుచుండును. కొలఁది కాలములో విశేషమైన మార్పేదియు కానరాదు. నిన్నటినుండి నేఁటికిఁ గాని నిరుటికిని ఈ యేఁటికిని గాని కొన్ని సంవత్సరముల క్రిందటినుండి నేఁటికిఁ గాని భాషను పరిశీలించినయెడల విస్తారము వ్యత్యాసము కనఁబడకపోవచ్చును. కాని, వందల కొలఁది యేండ్లు ఆలోచనలోనికిఁ దీసికొని ఒకే భాషలోని తారతమ్యములను పరిశీలించినయెడల భేదము బాగుగా కానవచ్చును. పది వందల యేండ్ల క్రిందటి భాష యిప్పటివారికి కేవలము అన్యభాషగానే కనఁబడును. రెండు మూఁడు వందల యేండ్ల క్రిందటి భాషకును ఇప్పటిదానికిని అంత వ్యత్యాసము లేకపోవచ్చును. వాని కున్న యనుబంధము సులభముగాను స్పష్టముగాను కనఁబడవచ్చును. అయినను మార్పుచేత కలిగిన భేదము కూడ అంత సులభముగానే కానవచ్చుచుండును. చిరకాలమునుండి అవిచ్ఛిన్నముగా వాడుకలో నున్న భాషలలో దీని యాథార్థ్యమును, భాషను మార్చుటయందు ఈ కారణముల కున్న శక్తియును కానవచ్చును. ఈ విషయమును జాగరూకతతో పరిశీలింపనివారికి ఇది యిట్లు కాఁగలదా యని అనుమాన ముండును. "ఇన్నాళ్లు ఈ భాషను మాటలాడుచుంటిమి. ఏమియును మార్పు మా కగపడదే" అనుటకును అవకాశ మున్నది. ఎప్పుడును చూచుచున్న తలిదండ్రులకు పిల్లవాని యెదుగు కానరాదు. అనుదినమును మార్పు జరగుచునే యుండును గాని, అది సతతము చూచుచున్నవారికి జరగినట్లు కనఁబడదు. మార్పు లే దందురా? ఉన్నది. ఉన్న దని యెట్లు కనఁబడును? చిన్నతనములో చూచినవారు చిరకాలము చూచుట మాని తిరిగి చూచినయెడల వ్యత్యాసము వారి కగపడును. లేదా, మూఁడేళ్ల నాఁటి ఫోటోగ్రాఫును దాఁచి పదునా రేండ్ల వయసున నున్న రూపముతో పోల్చి చూచినచో వ్యత్యాసము కనఁబడును. అంతే కాని, దినదినమును చూచెడివారికి కానరాదు. చిన్ననాఁటి ఫోటోగ్రాఫును పెద్దనాఁటి రూపముతో పోల్చి చూచినచో వ్యత్యాసము ఏ ప్రకారముగా కనఁబడునో, అదే రీతిని భాషలో కూడ నేఁడు వాడుకలో నున్న భాషను చాల కాలము క్రిందట వాడుకలో నున్నదానితో పోల్చి చూచినయెడల వ్యత్యాసము కనఁబడును. ఈ మార్పు మిగుల

మెల్లగాను క్రమక్రమముగాను జరగుచుండును.

అనఁగా మార్పునకు మితి యున్నది. భాషయొక్క స్వభావములోనే యీ మితికి తగినంత యవకాశ మున్నది. భాష యొకని సొత్తు కాదు. అది సంఘము ననుసరించి యున్నది. ఏ మార్పును కూడ ఎవరి యిష్టము వచ్చినట్లు వారు చేయలేరు. చక్రవర్తు లైనను శాసించి భాషను మార్పలేరు. భాషయొక్క ముఖ్యమైన పని ఒకరి భావమును ఇంకొకరికి తెలుపుట యవుటచేత అందఱును అంగీకరించినఁ గాని ఏ మార్పు చేసినను భావసూచన కానేరదు గనుక, ఏ మార్పు జరిగినను క్రమముగా నైనను అది యందఱకును తెలియవలెను. భాష భావప్రకటనకు తగిన సాధనమై యెప్పుడు నుండవలెను. ఏదేని మార్పును హఠాత్తుగా కలుగఁజేసినయెడల, సంఘములోనివారు అది తమకు కూడ క్రమముగా అలవాటుపడువఱకును దానిని వెక్కిరింతురు. పండితులు తప్పని గర్హింతురు. కొంత కాలము ఈ వెక్కిరింతలను సహించి ఏ క్రొత్త రూప మయినను వాడుకలో నిలిచియున్నయెడల ఆ వెక్కిరింత మూలముగనే ఆ మాట అందఱకును అలవాటుపడును. క్రమముగా అందఱును దానిని ధారాళముగ వాడుకచేయ మొదలు పెట్టుదురు. పండితులును క్రమముగా స్వీకరింతురు. ఒక గుఱ్ఱము పగ్గములతో లాగఁబడుచున్నను స్వభావముచేతనే అవశ్యమైనంతవఱకు ఏ ప్రకారముగా నడచుచునే యుండునో, భాష కూడ అదే ప్రకారముగా పండితులచే సంరక్షింపఁబడుచున్నను పామరులచే మార్పఁబడుచునే యుండును. మాటలాడు భాష పామరుల సొత్తు. దానిని వారు తమ కనుకూలమైనట్లు సహజమైన కారణములచేత మార్చుచునే యుందురు. విచ్చలవిడిగా భాషను మార్చుటకు వారు ఎట్లు స్వతంత్రులు కారో, అటులే స్వభావమునకు విరుద్ధముగా భాషను మార్పకుండుటకు కూడ వారికి స్వాతంత్ర్యము లేదు. అన్ని విధములను సహజమైన కారణములచేత కలుగు మార్పును ఎవ రాఁపఁగలరు? అందుచేతనే సమస్తజీవజంతువులకును పెరుఁగుటయు, పెరుఁగుటచే మార్పు కలుగుటయు నెట్లు స్వభావసిద్ధమో, అటులే జీవజంతుపోషితమైన భాషకును పెరుఁగుటయు, పెరుఁగుటచే మార్పు కలుగుటయు స్వతస్సిద్ధము.

ఈ పైని చెప్పిన దంతయు కాలభేదము ననుసరించిన మార్పును గుఱించి. ఇఁక దేశభేదము ననుసరించిన మార్పులను గుఱించి కొంచెము పరిశీలించి ముగింతము. ఈ మార్పునకును భాషాస్వభావమే కారణము. భాష విస్తారముగా మాఱకుండుటకు దినచర్యలో ఒక సంఘముచేత వ్యవహరింపఁబడుచుండవలెను. అట్లు అవిచ్ఛిన్నముగా వ్యవహరింపఁబడుటకు ఏదేని యాటంక మున్నయెడల భాషాభేదము కలుగును. ఏదేని కారణముచేత ఒకే భాషను మాటలాడువారు వేఱువేఱు సంఘముల క్రింద విభజింపఁబడినయెడల కాలము ననుసరించిన మార్పు ఆయా సంఘములలో వేఱువేఱుగా కలిగి భాషాభేదము కలుగుచుండును. విస్తీర్ణప్రదేశమున ఒక భాష మాటలాడువా రున్నయెడల పరస్పరసంపర్కము క్రమముగా తగ్గును. లేదా, సులభముగా దాఁటరాని కొండ గాని నది గాని రెండు సంఘముల వారికిని అడ్డుగా నున్నయెడల కూడ పరస్పరసంపర్కము తక్కువగుచుండును. ఒక సంఘములో వాడుక యగు రూపములు పదములు వాని యర్థములు ఇంకొక సంఘములో వాడుక యగువాని నుండి భేదించుచుండును. ఈ కారణములచేతనే రెండు సంఘముల వారును మొదట ఒకే భాషను మాటలాడుచుండినను క్రమక్రమముగా వేఱువేఱుగా జరగిన మార్పులచేత ఒకరిభాషతో మరియొకరి భాషను చూడఁగనే పొడగట్టు పోలిక చెడిపోవును. క్రమక్రమముగా అవి బొత్తిగా సంబంధము లేని భాషల క్రింద పరిణమించును. భాషాచరిత్రములను బాగుగ పరిశీలించి చూడ, అన్నియు ఒకే భాష నుండి వచ్చినట్లు తెలియవచ్చినను, వాడుక చేయువారికి మాత్రము అవి వేఱువేఱు భాషలే. అఱవము తెలుఁగు మళయాళము కన్నడము మరికొన్ని యనాగరికులచే మాటలాడఁబడు భాషలన్నియు మొదట ఒకే భాష యనినచో ఎవరు నమ్ముదురు? అయినను అదియే కదా యథార్థము. ఇవన్నియు ఒకే మూలభాషనుండి వ్యుత్పన్నమయినవి. అందఱును మొదట ఒకే ద్రవిడ భాషను మాటలాడుచు దేశమందు వ్యాపించి భిన్నులై ఆ భాషలోనే తమకుతమ కనుకూలమైన మార్పులను కలుగఁజేసి ఎవరి భాష వారిదిగా నేర్పఱచుకొని వాడుచున్నారు. అటులే ఒక మాతృభాషయు అది భిన్నమగుటచే పుట్టిన సోదరీభాషలును కలసి ఒక భాషాకుటుంబ మగుచున్నది. ఈ యొక్కొక్క భాషయు వేఱువేఱుగా భిన్నమయి వేఱువేఱు కుటుంబములుగా వృద్ధిపొందును. లోకము నిండ ఈ కారణముల చేత పరిణమించిన భాషాకుటుంబములే. ఈ రీతిగ దేశభేదముల ననుసరించియు పైని చెప్పిన రీతిగ కాలభేదముల ననుసరించియు భాషలు సతతము మాఱుచునే యుండును. పైని చెప్పిన ప్రకారము భాషా పరిణామమున కవసరమైన కారణములు ఎట్లు మీఱరానివో స్వభావజనితమైనవో తెలిసినపుడు, భాష ఒకరిచేత శాసింపఁబడి యెప్పుడును మీఱరాని కట్టుబాటులకు లోఁబడునది కాదని వేఱె చెప్ప నక్కఱ లేదు. భాషాపరిణామము నదీప్రవాహమువంటిది. దేశకాలభేదముల ననుసరించి స్వభావానుసారముగ భాష యనేకవిధముల పరిణమించును.

# భారతమాతృదర్శనము

కే. వీ. ఆచార్యులు గారు

"నిర్మలాత్ము లీశ్వరుం జూడఁగలరు"

భక్తులు ఈశ్వరదర్శనమును జేయ నెంతురేని తాము మున్ముందు నిర్మలాత్ములు గావలయును. ఆత్మశుద్ధికి దేహశుద్ధి యత్యావశ్యము. కావుననే పూజారి దేవాలయప్రవేశము చేయుటకు పూర్వము స్నానమాచరించి శరీరశుద్ధి గలవాఁడై యపవిత్ర సంకల్పముల నెల్ల హృదయమునుండి పాఱఁద్రోలి నిర్మలహృదయుఁడై భగవద్దర్శనము గావింపవలసియుండును. క్రొత్తగ నిట్లు సర్వేశ్వరుని సన్నిధికిఁ జేరువాఁడు విభ్రమచిత్తుఁడై స్వామిస్వరూపమును వెంటనే సాకల్యముగ నాలోకింపఁజాలఁడు. ఐనను, కిల్బిషములచే విడువఁబడినవాఁడై నిలిచి భక్తిశ్రద్ధలచే నేకాగ్రచిత్తతను సాధించి ఈశ్వరమూర్తిని స్థిరదృక్కులతో నవలోకించినప్పుడు దేవుని సత్స్వరూపమును గ్రహింపఁగలఁడు.

మాతృదేశారాధనకును అట్టి శుద్ధిక్రియ యత్యావశ్యము. చాల కాలమునుండి భారతదేశీయులు దేశమాత్రారాధనను మఱచియుండిరి. ఇప్పుడిప్పుడు లోకమందలి సర్వదేశములవారును స్వదేశారాధనను సాగించిరి. ఈ కాలమే "మాతృదేశారాధనయుగము"గ మాఱిపోయినది. ఎంత యధమదశయం దున్నను ప్రతిమానవుఁడును తన దేశమును తన సంఘమును గౌరవింపనినాఁడు తన గౌరవము గాని తన యునికి గాని క్షేమమున నుండఁజాల దని గ్రహించుచున్నాఁడు. కాలానుగుణ్యముగ భారతీయులును స్వదేశమాత నారాధింపఁ గుతూహలు లగుచుండిరి. ఆ భారతదేవి యాలయమున ప్రవేశించుటకు పూర్వము వీరికి నిర్మలాత్మ లభించినఁ గాని ఆ మాతృస్వరూపదర్శనము సాధ్యము కాఁజాలదు. విదేశీయవేషభాషానుకరణమువలనను అన్యదేశీయాచారావలంబనమువలనను పరదేశీయజీవితవిధానాదర్శస్వీకరణమువలనను భారతీయులు మలినగాత్రులై యున్నారు; మలినగాత్రమునకు ఫలముగా స్వమతస్వసంఘస్వధర్మవిద్వేష మను భీకరరోగ మావహించి వారి యుత్సాహమును జంపి చైతన్యమునే యడఁచివేసినది. భారతీయులు స్వత్వహీను లైరి. ఇతరదేశీయులు మిక్కిలి సంభ్రమముతో తమ తమ దేశముల నారాధించుచుండుటను గాంచి, ఆ కోలాహలము విని ప్రబోధము నంది తాము స్వదేశారాధనతత్పరులై ఇతరులం బోలె పరుగిడ నుంకించుచున్నారు. కాని, వీ రవలంబించిన యన్యదేశీయజీవితవిధానముచే శరీరములును, విదేశాదర్శస్మరణముచే హృదయములును మలినములై యున్నవి. స్వదేశమాతృదేవాలయమును దొచ్చు నర్హత గాని ఆ దేవిని దర్శించు శక్తి గాని తమకు లే దని వారు గ్రహింపనయ్యెను. దీని కంతటికిని కారణం బగు స్వదేశస్వసంఘస్వధర్మనిరసనముం గూర్చిన పశ్చాత్తాప మను సముద్రమందు స్నానమాడి వారు శుచిర్భూతులు గావలసివచ్చెను.

అదృష్టవశమున భారతదేశార్చనాతత్పరు లగు కొందఱు హైందవనాయకులయొక్కయు కొందఱు భారతస్వీకారసంతానముయొక్కయు సుబోధలవలన భారతయువకు లనేకులు మాతృసేవాతత్పరులై పశ్చాత్తాపసముద్రమున జలకమాడి శుచిర్భూతులై దేశమాతృదర్శనాతురులై వెలయుచుండిరి. అట్టి వారికి భారతమాతృదర్శనమును చేయించుట కర్చకులు గావలసివచ్చెను. ఇటువంటి యర్చకశ్రేష్ఠులలో నొక్క రగు రాధాకుముదముఖర్జీ గారొక రని చెప్పనగును. వారిచే విరచిత మయిన "హిందూదేశప్రధానసమష్టిభావ" మను గ్రంథము మాననీయము. అందుండి దేశనాయకులు దేశభక్తులు దేశసేవకులు మాతృదేశస్వరూపధ్యానమును పూర్వఋషిప్రోక్తవిధి నెట్లు చేయవలయునో యొకింత తెలియఁగలరు.

భారతవర్ష ముత్తరదక్షిణముల రెండువేల మైళ్లను తూర్పు పడమరల పందొమ్మిది వందల మైళ్లను వ్యాపించిన మహావిశాలప్రదేశము. మన పాలకుల స్వదేశ మగు గ్రేటు బ్రిటనుకంటె పదునాఱు రెట్లును, ప్రపంచము నంతను నిప్పు డల్లకల్లోలమున ముంచుచున్న సంహారణకారణ మగు జర్మనీకంటె నాఱు రెట్లును వైశాల్యమున పెద్దది. భౌతికలక్షణములను బట్టి చూచినచో, లోకమందలి మహోన్నతపర్వతశిఖరములచే చెన్నొందు హిమవన్నగముతోడను, అత్యుష్ణప్రదేశములతోడను, అతిశీతలసీమలతోడను, అత్యధికవర్షపాతతలములతోడను, వర్షలేశశూన్యము లగు నెడారులతోడను, మహాభీకరము లగు సాంద్రారణ్యములతోడను, విచిత్రచిత్రీకృతము లగు మృగపక్షిసంతానములతోడను, నానావిధసస్యరాసులతోడను, దేవసము లగు నార్యసంఘములతోడను, పశుప్రాయు లగు ననాగరికజాతులతోడను, అనంతములై పరఁగు మతమతాంతరసిద్ధాంతములతోడను, భిన్నభిన్నసాంఘికాచారములతోడను ప్రకాశించుచు, సంకుచితమహాప్రపంచమో యనం దగు భారతమాతృస్వరూపము నొక్కసారిగా నెవండు చూడఁగలఁడు? ఇట్టి సమగ్రదృష్టికి కారణభూతులై భారతవర్షము నెల్ల నొక్క వ్యష్టిరూపముగ భావన సేయుట విధాయకమని చిరకాలము క్రిందట శాసించిన మహర్షిగణము పూజనీయము. ఆర్యు లీ దేశమున ప్రవేశించి దీనినే తమ మాతృభూమిగ గణింప నారంభించినది మొదలు, వారి యధినివేశములు దేశమున వ్యాపించిన కొలఁది వారి దేశమాతృసమష్టిభావము విశాలము కాసాఁగెను. క్రమక్రమముగ వారి స్వదేశమాతృభావనయందు హిందూదేశ మంతయు

నిమిడి పోయినది. ఆ సమగ్రభావము ప్రస్తుతము మనల పాలించు నాంగ్లేయ ప్రభువుల రాజనీతివలనఁ గలిగిన దని మన పాఠశాలలలో గఱపఁబడు బోధలందు సత్యము లేదు. ఈ భ్రమను గట్టి పట్టుదలతో విద్యారంభకాలమునుండియు నుగ్గుఁబాలతో పోసినట్లు మన బాలురకు కలిగించు విద్యావిధానమును దేశమం దెల్లెడ వ్యాపింపఁజేయుచుండుట ప్రయోజనకరము గాదు. ఇందు సత్య మెంత గలదో విచారింపుఁడు.

ఆర్యులు హిందూదేశపు వాయువ్యదిశ నున్న కొండ కనుమల ద్వారమున నీ దేశము ప్రవేశించిరి. వా రందఱు నొక్క సారిగ రాక తెగలు తెగలుగ వచ్చి పంజాబు కాశ్మీరము ప్రాంతముల నాక్రమించిరి. కొలఁది కాలమునకే ఆ తెగ లన్నియు సమ్మేళన మైనవి. ఆ కాలమున వారి నందఱిని ఏకముఖముగ నడపి, ఆర్యధర్మమును ఆర్యసాంప్రదాయమును సమష్టిదృష్టితో సంపుటీకరించిన ప్రథమశూరశిఖామణియే భరతుఁడు. ఇతని ప్రశంస ఋగ్వేదమునఁ గానఁబడుచున్నది. ఐతరేయబ్రాహ్మణమున 8-వ పంచికలో "ఏతేనహవా ఐంద్రేనమహాభిషేకేన దీర్ఘతమామామయతే యః దోష్మంతం భరతం జ్ఞాభిషిషేచ తస్మాత్ ఉదౌష్యంతః భరతః సమంతం సర్వపృథ్వీం జయం పర్యాయాస్వేయాచ మేధ్యై రీజైయిత్యాది" అని భరతుని దండయాత్రలు విజయయాత్రలు పట్టాభిషేకములు యాగములు మొదలగునవి ప్రశంసింపఁబడియున్నవి. ఈ కథ నాధారము చేసికొనియే భాగవతరచయిత భరతునకు 'సామ్రాట్' 'విరాట్' అను బిరుదముల నొసంగి, అతఁడు కిరాతులు హూణులు యవనులు పౌండ్రులు మొదలగు నెన్నేని జాతులను జయించి తన రాజ్యమునఁ గలిపి ఆర్యసాంప్రదాయమును వ్యాపింపఁజేసినట్లు వర్ణించియుండెను. ఆ యార్యశక్తి విజితదేశభాగముల నెల్ల సధినివేశములుగ మార్చి, ఆయా ప్రదేశములందు ఆర్యసాంప్రదాయశిక్షావిధానముల నెలకొలిపి, తన యధికారావరణములోనికి వచ్చిన ప్రజలు తమతమ మతములను సిద్ధాంతములను సాంప్రదాయములను ప్రత్యేకలక్షణములను కాపాడుకొను స్వాతంత్ర్యము గలిగియు, తమ కందఱకును కేంద్రస్థాన మైన ఆర్యసాంప్రదాయమున వారు సోదరభావమున సమష్టిభావముతో నొండొరులు గలసి మెలసి మనుట కనుకూలాదర్శముల నిరూపించెను. అట్టి మహాద్భుతనాగరికతావ్యాప్తికి మూలకర్త భరతుఁడు. అతనిం బట్టియే ఆర్యసామ్రాజ్యమునకు భారతవర్ష మను నభిధానము గలిగినది. ఆర్యాధినివేశములు పెరిఁగిన కొలఁదిని ఆర్యసామ్రాజ్యము వ్యాప్తిగాంచిన కొలఁదిని, భారతవర్ష నామముచేఁ బరఁగిన ప్రదేశమును విశాలమగుచు జనసామాన్య మా ప్రదేశ మంతటి నొక్క సమష్టిదేశముగ గ్రహించుట లభించినది.

ఈ సమగ్రభావమును జనులందు స్థిరముగ నిలుపుట కప్పటి నాయకులు బహుశప్రయత్నములు గావించియుండిరి. అప్పటి యార్యులు ముఖ్యముగ ప్రకృతిశక్తుల నారాధించెడివారు. తమ పైరు పంటల కాధారము లయి, వాణిజ్యమునకు సాధనము లై, వివిధ దేశభాగములనుండి రాకపోకలకు వసతు లై, నాగరికతావ్యాపనకు రాజమార్గము లై వెలసిన పంజాబు నదుల మహోపకారమును వారు గుర్తించి వానిని పూజించిరి. ఆ నదుల వెంట ననేకతీర్థస్థానములు నెలకొలిపిరి. తుదకు వీని కన్నింటికిని పేటికరైమె వఱలు దేశమును పూజింపసాగిరి. ఇట్లు మహాద్భుతరీతిని మన పూర్వపు ఋషిసత్తములు దేశాభిమానమును భగవదారాధనగ మార్చి దేశసేవను పావనతరం బగు మతధర్మాచరణగ పరిణమింపఁజేసియుండిరి.

ఋగ్వేదము (x 75) నందలి

"ఇమం మే గంగే యమునే సరస్వతీ
శుతుద్రిస్తోమంసచతాపరుష్ణ్యా
ఆసిక్న్యామరుద్వృధేవితస్తయార్జీకీయే
శృణుహ్యా సుషోమయా."

అను నదీస్తోత్రమును జనులు దినదినమును పఠించుచు తమ మాతృదేశస్వరూపమును ధ్యానించునట్లు శాసించిరి. ఇట్లు వారు తమ భూగోళశాస్త్రికదృఙ్మండలమునం దిమిడియున్న దేశము నంతను సమష్టిరూపమున ధ్యానించుచు వచ్చి రనుట స్పష్టము.

ప్రాచీనార్యులకు తెలిసిన యుత్తరహిందూదేశమును నిర్ణయించుట కనేకనిదర్శనములు గలవు:

"ఆసముద్రాత్తు వై పూర్వా
దాసముద్రాత్తు పశ్చిమాత్
తయోరే వాంతరం గిర్యో
రార్యావర్తం విదు ర్బుధాః."

అని మనువు వ్రాసియున్నాఁడు.

అమరకోశమున: "ఆర్యావర్తః పుణ్యభూమిః మధ్యం వింధ్యహిమాగయోః" అనియు, మహాభారతము కర్ణపర్వమున

"శతద్రుశ్చ విపాశా చ తృతీ యేరావతీ తథా
చంద్రభాగా వితస్తా చ సింధుషష్టా వహిర్గిరేః."

అనియు నుండుటచేత, వింధ్యహిమాలయములకు నడుమను సింధూగంగానదుల మైదానములందును అప్పటియార్యావర్తము ఇమిడియుండెనని తెలియవచ్చుచున్నది.

ఈ హద్దులను దాఁటి యార్యులు దక్షిణదేశమునకు వ్యాపించిన కొలఁదిని వారి దేశమాత స్వరూపమును విస్తృతి గాంచినది. ఋగ్వేదమందలి నదీస్తోత్రమునకు పాఠాంతరము కల్పింపఁబడినది:

"గంగేచయమునే కృష్ణే గోదావరిసరస్వతి
నర్మదేసింధుకావేరీ జలేస్మిన్ సన్నిధిం కురు."

దీనిని కోట్లకొలఁది హిందువులు తాము స్నానము చేయునప్పుడెల్లను దేవపూజలు చేయునప్పు డెల్లను దినదినము పఠించుచు, కుటుంబకష్టనిష్ఠురములచే సంకుచిత మైపోవు తమ భావప్రపంచమునకు వ్యాప్తి కలిగించి, దేశమాతయొక్క గొటుంబము నంతను సమగ్రదృష్టితోఁ గాంచవలసినవా రగుచుండిరి. హిందూదేశ మంతయు భారతవర్ష మే యైనది. ఈ పావనభూమి శాంతితపముల కుచితస్థలము లగు సప్తభూధరములచేతను గూడ లక్షిత మగుచున్నది.

"మహేంద్రోమలయఃసహ్యః శుక్తిమానృక్షపర్వతః
వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః."

మఱియు ప్రధానపుణ్యక్షేత్రములును దేశనం దెల్ల భాగముల నావరించునట్లు స్థాపింపఁబడినవి :

"అయోధ్యా మథురామాయాకాశీకాంచీహ్యవంతికా
పురీ ద్వారావతీ చైవ సప్తైతా మోక్షదాయకాః."

హిందూమతస్థాపకుఁ డగు శ్రీ శంకరాచార్యులును దేశ మంతటిని సమగ్రదృష్టితోఁ గాంచి తన జయధ్వజములో యన నాలుగు తీర్థక్షేత్రములను దేశమందలి నాలుగు కోనలందును స్థాపించి యున్నాఁడు :

ఉత్తరమున　　బదరీకేదారనాథము
దక్షిణమున　　రామేశ్వరము
పడమట　　ద్వారక
తూర్పున　　జగన్నాథము

ఈ నాలుగును శంకరాచార్యుని యాధ్యాత్మికసామ్రాజ్యమునకు రాజధానులై దేశము నంతటిని వాని మాతృభూమి యగు భారతవర్షముగ మార్చినవి.

ఈ రీతినే మన ప్రధానపుణ్యతీర్థములు పుణ్యసరోవరములు వైష్ణవ శైవారాధనాలయములు దేశమందలి యన్ని పార్శ్వముల నావరించి యున్నవి. దృష్టాంతమున కీ క్రిందివానిని మాత్రము పేర్కొనెదను:

ఉత్తరమున: తప్తకుండము, మానససరోవరము, ముల్తాను, ఉజ్జయిని;
తూర్పున: శ్వేతగంగ, విందు, కనరా, అమరేశ్వరము;
దక్షిణమున: ధనుష్తీర్థము, పంప, శ్రీశైలము;
పడమట: గోమతికుండము, నారాయణ, సూరతు, సౌరాష్ట్ర.

ఇంకను నెన్నెని గలవు. వీనిని వేలకొలఁది భారతీయు లను దినము స్మరించుచుందురు. ఇట్టి మాతృదేశభక్తియే హిందువుల ప్రత్యేకజాతీయలక్షణము. చిన్న లనక పెద్ద లనక బీద లనక కలవారనక, తీర్థసేవలు పూర్వము అందఱికిని తమవిధులుగ నేర్పడ, భారతవర్షపు భూగోళశాస్త్రికస్వరూపము ప్రజలందు ప్రతిష్ఠితమై వఱలుచుండెను. ఇట్లు హిందువులే కాక, బౌద్ధమతాచార్యులును బౌద్ధరాజులును సమగ్రదేశాభిమానమును స్థిరీకరించి, తమ ముఖ్యధర్మ మగు 'అస్థిపూజ'లకై కట్టించిన విహారములవలనను చైత్యములవలనను ధర్మప్రకటనస్తంభములవలనను దేశారాధనను ప్రజలందు వ్యాపింపఁజేసి రని చెప్పఁగలము. ఢిల్లీ తిరుహూత సంకిస సంచి మొదలగు చోట్ల నున్న స్తంభములును, విహారము నాసిక అజంత ఎల్లోరా కార్లి కన్హారి భజభిన్స ఉదయగిరి భాగ మొదలగు తావులందలి గుహాల్లును, మాణిక్యాల శారనాథము సంచి అమరావతి మున్నగు స్థలములఁ గల స్తూపములును దీనికి నిదర్శనములు. పాలీగ్రంథములు చూచినయెడల, లెక్కలేనన్ని బౌద్ధపుణ్యతీర్థములు పావనక్షేత్రములు దేశము నలముకొనినట్లు సులభముగ గ్రహింపఁగలము. వానిని దర్శించుటను మతధర్మముగ పాటించు ప్రజలకు దేశాభిమానమును వేఱుగ బోధింపవలయునా?

ఇట్లు భూగోళదృఙ్మండలము సతముఖమున వ్యాప్తి చెందుటయే కాక, రాజనీతికలన కూడ బలపడినట్లు చారిత్రకాధారములు పెక్కు గలవు. అర్థికశాస్త్రపరిశోధనవలన దేశసమష్టిభావము ఎంతమాత్రమును నూతనము గాదని విశదము కాఁగలదు. చంద్రగుప్తుని కాలమునాఁటి కౌటిల్యుని యర్థశాస్త్రమున ఉత్తరాపథము (హిమాలయములకై పోవు మార్గము) వలన విశి మహావిశి అగ్రోహ బహ్లావ మొదలగు చోట్లనుండి చర్మములును, నేపాలమునుండి కొంగళ్లును, కాంభోజ సింధు ఆరట్ట (పంజాబు) దేశములనుండి గుఱ్ఱములును, తూర్పు దేశము లగు వంగ పౌండ్ర సువర్ణకుడ్యక మగధ కాశి కళింగ దేశములనుండి వస్త్రములును; దక్షిణాపథము (వింధ్యకు దక్షిణభాగము) వలన తామ్రపర్ణిక కుల చూర్ణ నదులనుండియు పాండ్యవాతక మహేంద్ర ప్రముఖపర్వతములనుండియు ముత్యములును; పెక్కుచోట్లనుండి బంగారు మొదలగు లోహరాజములును సుగంధద్రవ్యములును లభించునట్లు వ్రాయఁబడియున్నది. ఇటువంటి యార్థికవాణిజ్య శాస్త్రజ్ఞానముతో పూర్వపు చక్రవర్తులు రాజ్యమును విస్తరింపఁ బాటుపడుచువచ్చిరి. తమ రాజ్యము సంపదలతో తులదూఁగవలె ననియు, భారతదేశపాలకు లందఱు కలసి యొక్క సామ్రాజ్యమును స్థాపింపవలె ననియు, వారు దండయాత్రలు దిగ్విజయములు చేయుచుండెడివారు. కాళిదాసుచే వర్ణింపఁబడిన రఘుమహారాజుయొక్క విజయములును, మహాభారతమందు చూపట్టునట్లు అర్జునసహదేవులచే జయింపఁబడిన దేశములును జాతులును, సుగ్రీవునిచే వివరింపఁబడిన దేశముల నామములును, చంద్రగుప్తుఁడు అశోకుఁడు మొదలగు పూర్వరాజుల రాజ్యవిభాగ రాజ్యపాలనా విధానములును, రాజసూయ వాజపేయ సవనములు చేయు రాజుల యర్హతలును ధర్మములును, రాజ రాజరాజ అధిరాజ సామ్రాట్ ఏకరాట్ సార్వభౌమ ప్రముఖ బిరుదావళి నందుటకై రాజులు తమతమ యధికారమును పెంపొందించుకొనవలయు రీతులును పరిమితులును, ఋగ్వేదము ఐతరేయబ్రాహ్మణము తైత్తిరీయారణ్యకము శతపథబ్రాహ్మణము కాఠకసంహిత బృహదారణ్యకోపనిషత్తు అథర్వవేదము శుక్రనీతి తైత్తిరీయసంహిత పంచవింశబ్రాహ్మణము మున్నగు గ్రంథములందలి లెక్కలేనన్ని వాక్యములును, ప్రజలయందలి దేశాభిమానము—రాష్ట్రిక మాండలిక గ్రామ సంఘ శాఖాభిమానములచే బద్ధమై సంకుచితమై పోకుండ—సాధ్యమైనంత సమగ్రవ్యాప్తి గాంచుటకు మార్గము చూపుచు వచ్చినవి.

రాజు లెట్టి సంకల్పములతో తమ యధికారవ్యాప్తిని చేయుచుండిరో తెలుపుట కింకొక్క దృష్టాంతము మాత్రము చూతము: ఐతరేయబ్రాహ్మణము (VIII. 4, 1) ననిట్లున్నది: "పరమోన్నతదశ నందిన చక్రవర్తిత్వమునకు దిగంతము వ్యాపించిన రాజ్య ముండవలయును. అది యే యడ్డును లేక సర్వత్ర వ్యాపించిన రాష్ట్రముగ నుండవలెను. సముద్రపర్యంతము దేశ మంతయు ఒక్క రాజ్యమై ఒక్క పరిపాలనవిధానమున వఱలవలయును." ఇట్టి రాజ్యసమ్మేళనాసమష్టిపరిపాలనను ప్రత్యక్షముగ సాధించిన రాజుల పేరు

లనేకము సంస్కృతివాఙ్మయమునఁ గాననగును.

పాశ్చాత్యపండితులచేతను వారి సూచనల ననుసరించి బోధ సలుపు నుపాధ్యాయులచేతను దేశాభిమాననిర్మూలక మగు సాధునికవిద్యావిధానమున విద్య గఱచిన చదువరులచేతను వక్కాణింపఁబడురీతిని భారతవర్ష మనఁగా పరస్పరసంబంధ మే మాత్రమును లేని భిన్నప్రదేశములకు అర్థహీనముగ ప్రయోగింపఁబడు శబ్ద మనెడి విశ్వాసమును విడిచి, ప్రకృతిసిద్ధ మగు భూగోళశాస్త్రికనియమములఁ బట్టియు నానావిధమతధర్మప్రచారసరళిని బట్టియు రాజ్యపాలనావిధానములఁ బట్టియు భారతదేశపు నిజస్థితిని గూర్చి గాఢతర విమర్శను గావించితిమేని, ఆసేతుహిమాలయము వ్యాపించియున్న మహావిశాలప్రదేశముయొక్క సమగ్రసుందరమూర్తిని మనము దర్శింపఁ గలము. ఆ దేవి ప్రసాదించు నార్యసాంప్రదాయము లేక ప్రపంచమే పేద యగును. అహింస, సోదరభావము, సమష్టి, హైందవబోధనాసూత్రములు లేక లోకమున శాంతిసుఖము లుండఁబోవు. క్షణభంగురములును తుచ్ఛములును నగు విషయవాంఛల ప్రవర్ధనము గావించు బోధలను విడిచి, భారతీయు లెల్లరు దేశమాత చేయు ఆత్మావబోధకసాంప్రదాయబోధల వినవలయును; గర్వమును ద్వేషమును పెంచి ఖడ్గములను శతఘ్నులను సాధనములుగఁ బూని లోకము నంతను నిబిడ మూఢత్వమున నణఁగఁద్రొక్కి నాగరికప్రచారము చేయుచుంటి మను కొను పాశ్చాత్యసంఘముల మార్గములనుండి తొలఁగి, నమ్రతయు ననురాగమును పరోపకారచింతయు సమహితత్వమును సాధన చేయు దీక్ష వహించి, హైందవు లందఱు స్వదేశమాతృదర్శనముఁ జేయుదురు గాక! నారదాదులు విష్ణుభక్తిచే చూచిన దీ దేవి నే; మార్కండేయునకు వరంబు లొసఁగిన దీ దేవియే; రామకృష్ణాద్యవతారముల భారతీయుల నాశీర్వదించిన దీ దేవియే; మహావిరాగులకు పరమశివుని రూపమున దర్శన మిచ్చిన దీ దేవియే; భక్తు లేయే రూపముల ధ్యానించిన నయ్యయ్యాకారముల ననంతరూపములు దాల్చి ఈ భారతమాత ప్రత్యక్షము కాఁగలదు. ప్రతిభారతీయుఁడును ఈ దేవియొక్క ప్రతిబింబమే. ఈ దేవి యునికిని దెల్పుటకు ప్రహ్లాదుని వాక్కులను కొలఁది మార్పులతో స్మరింతుముగాక!

" కల దంభోనిధిలోన గాలిఁ గల దాకాశంబునం గుంభినిం
గల దగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ ఖద్యోతచంద్రాత్మలం
గల దోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం
గల దీ భారతమాత వే ఱె వెదకంగా నేల నీయాయెడన్?"

కావున, ఓ భారతసూనులారా! ఈ మన దేశమాత తన గర్భమునఁ దాల్చిన ప్రతిబ్రాహ్మణుఁడును మన సోదరుఁడే, ప్రతి వైశ్యుఁడును మన యనుజుఁడే, ప్రతి క్షత్రియుఁడును మన భ్రాతృసత్తముఁడే, ప్రతిశూద్రుఁడును మన సహజన్ముఁడే, ప్రతి నిమ్నజాతుఁడును మన తమ్ముఁడే, ప్రతిముసల్మానును మన యనుజన్ముఁడే, ప్రతి క్రైస్తవుఁడును మన భ్రాతయే, ప్రతి యైరోపీయుఁడును మన యమ్మ పెంచు నన్నయే — అని యుచ్చైస్స్వనమున గానము చేయుఁడు. అందఱును జేరి జాతిద్వేష మతద్వేష వర్ణద్వేష శాఖాద్వేషములను బాఱఁద్రోలి ఈ దేశమాతను ఈ పావనమూర్తిని ఈ భారతిని త్రింశత్కోటికలకంఠనినాదముతోఁ గీర్తింపుఁడు.

" తనువున్ హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనార్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మన్ హరిన్ నమ్మి సజ్జనులై యుండుట భద్రమంచుఁ దలఁతున్ స్వారాజ్యవాంఛాపరుల్"

అని ఘోషించు దేశభక్తాగ్రగణ్యు లగు అభినవ ప్రహ్లాదుల బోధల నాలకించి, భారతమాతృదర్శనముం జేసి, ఆ పావనమూర్తి పూజలకుం గడంగుఁడు.

## ఆంధ్రమాతృవిలాపము

బుడమగుంట శివరామయ్య గారు

ఆంధ్రరాష్ట్రంబు ముఖ్యం బవశ్యం బంచుఁ
దలఁచుచున్నా రీ సదస్యు లెల్ల;
అమలాంధ్రవిశ్వవిద్యాలయంబును బెట్టఁ
దలఁచుచున్నా రీ సదస్యు లెల్ల;
స్థాపింప నాంగ్లవృత్తాంతపత్రిక నొండు
దలఁచుచున్నా రీ సదస్యు లెల్ల;
సంఘస్థదోషముల్ చయ్యన వారింపఁ
దలఁచుచున్నా రీ సదస్యు లెల్ల —
అనుచుఁ దీర్మానములు సేసి యమితముగను
సభను వదలియు వానిని జరపుటకును
యత్నములు సేయఁగా నొల్ల రాంధ్రు లకట!
మరల సభ గూడువఱకును మందు లగుచు. ౧

సీ. దేశభాషలఁ బట్టి దేశంబు విభజించు
టతిముఖ్య మని పల్కినట్టివారు
దేశభాషలలోన దేశపాలన సేయు
టతిముఖ్య మని పల్కినట్టివారు
దేశీయులకు విద్య దేశభాషల నేర్పు
టతిముఖ్య మని పల్కినట్టివారు
దేశీయసభలలో దేశభాషల వాడు
టతిముఖ్య మని పల్కినట్టివారు
నైన యాంధ్రులే సిగ్గఱి యాంధ్రసభల
మాతృభాషాభిమానంబు మందఁజేసి
యన్యభాషలయం దుపన్యాసములను
నిచ్చుచుండంగ నితరుల నెన్న నేల? ౨

సీ. రాజకీయములందు రాజ్యప్రతిభ సాచు
వంగదేశీయులు వఱలుచుండ,
అఖిలపారిశ్రామికాసక్తచిత్తులై
పారశీకులు పెంపు వడయుచుండ,
కార్యనిర్వహణదక్షత చెలంగ మరాటు
లభివృద్ధి గాంచి పెల్లలరుచుండ,
విద్యానవద్యులై యుద్యోగవంతులై
యఱవ లభ్యున్నతి నందుచుండ,
అట్టి దొక్కటియును లేక యాంధ్రు లొక్క
సభలు జరపుటతోడనే సంతసించి
తమ పనులు దీఱె నని మదిఁ దలఁతు రనఁగ
వారి దుస్థితి నెన్నంగ వశమె కాదు?

# ప్రస్తుతవిద్యాపద్ధతి

వల్లూరి వేంకటరావు గారు, బి. ఏ., బి. ఎల్.

దేశాభివృద్ధికి ముఖ్యసాధనము విద్యయే. ఇప్పుడు హిందూదేశమున విద్యావ్యాప్తికొఱకు ప్రజలును ప్రభుత్వమువారును కూడ కుతూహలముతో పనిచేయుచున్నారు. కీర్తిశేషు లయిన గోకలే మహానుభావుడు సామ్రాజ్యశాసనసభలో ప్రవేశపెట్టిన నిర్బంధవిద్యాశాసనము అప్పటికి త్రోసివేయఁబడినను, ఆయన నాటిన విద్యాబీజములు మొలకలెత్తి దేశమంతటను విజృంభించుచున్నవి. జార్జి చక్రవర్తి పట్టాభిషేకమహోత్సవసమయమున నొసంగిన విరాళమును హార్డింజి ప్రభువు ప్రతిసంవత్సరము విద్య కగుచున్న ఖర్చును వృద్ధిచేయించుటయు, ఇప్పటి మన రాజప్రతినిధి విద్యావిషయమున విశేషాతురతను వెలిపుచ్చుచు నిచ్చిన గంభీరోపన్యాసములును, వారణాసి పాటలీపుత్ర నగరములలో స్థాపింపఁబడుచున్న నూతన విశ్వవిద్యాలయములును, మన విద్యాభివృద్ధిని సూచించుచున్నవి. కాని, ప్రస్తుతవిద్యాపద్ధతిలో పెక్కు లోపములు గలవు. అవి సవరణ కావలసియున్నవి.

15 సంవత్సరముల పూర్వముకంటె ఇప్పుడు బాలుర విద్యకయ్యెడు ఖర్చు విశేషముగా పెరిఁగినది. స్కూలు జీతములు కొన్ని తరగతులకు రెండు రెట్లును, కొన్ని తరగతులకు మూఁడు రెట్లును వృద్ధి చేయఁబడినవి. ఈ దినములలో భాగ్యవంతులకే విద్యావలంబనము సుసాధ్యము కాని, బీదవాండ్రకు బహుకష్టముగాఁ గాన్పించుచున్నది. ఉన్నతవిద్య ధనవంతులకే కాని బీదల కుద్దేశింపఁబడలేదన్నట్లు కనఁబడుచున్నది. ఒక బాలుఁడు బి. యే. పరీక్షయందు కృతార్థుఁ డగుసరికి, అనఁగా విద్య ప్రారంభించినది మొదలు 15 సంవత్సరములకు కావలసిన ఖర్చు 1,316 రూపాయ లగు నని జాక్ లా యను నొక హూణదేశస్థుఁడు లెక్కకట్టెను. ఈ మొత్తము చాల తక్కువ యనియు, ఈ మొత్తముతో నింగ్లాండు దేశమున బి. యే. పరీక్షవఱకు చదువుకొనుటకు సాధ్యమే కా దనియు, ఇక్కడ విద్య చవుక యగుటవల్ల బి. యే. లు సయితము తపాల బంట్రోతులుగను రైల్వే పోర్టరులుగను నుండి గవర్నమెంటువారిని దూషించుచున్నా రనియు లాగారు వాదించియున్నారు. కాని, ఇంగ్లాండుదేశముయొక్కయు హిందూదేశముయొక్కయు పరిస్థితులలో విశేషవ్యత్యాసము కల దను విషయమును లా గారు మఱచియుండవచ్చును. బి. యే. లు తపాల బంట్రోతులుగను రైల్వే పోర్టర్లుగను నుండుటను గుఱించి లా గారు పొరపడినా రని వేఱె చెప్ప నక్కఱలేదు. జాక్ లా గారు లెక్కవేసిన 1,316 రూపాయల మొత్తమునకు తఖ్సీలు క్రింద తెలియఁజేయఁబడినది:

| | | రు. |
|---|---|---|
| 11 సంవత్సరములకు స్కూలు జీతములు | ... | 330 |
| స్కూలు పుస్తకములు | ... | 70 |
| 4 సంవత్సరములకు కాలేజి జీతములు | ... | 384 |
| కాలేజి పుస్తకములు | ... | 100 |
| రైలు వగయిరా ఖర్చులు | ... | 360 |
| దరఖాస్తు ఖర్చులు | ... | 72 |
| | మొత్తము | 1316 |

ఈ మొత్తములో బాలు రన్యస్థలములకు వెళ్లి చదువుకొను నప్పుడు అవశ్య మగు భోజనపు ఖర్చులును అద్దెలును చేరనేలేదు. బాలుఁడు ఎఫ్. యే., బి. యే. పరీక్షలకు చదువుకొను నాలుగు సంవత్సరములలోను అధమము 300 రూపాయిలు భోజనమునకును 120 రూపాయిలు అద్దెలకును ఖర్చగును. విద్యార్థులు సాధారణముగా నీ మొత్తములకంటె నెక్కువే ఖర్చుపెట్టుచున్నారు.

ఈ మొత్తములే బాలుర విద్యాభ్యాసమునకు సరిపోవు నని యెంచినను, నెలకు 100 రూపాయిల లోపుగా ఆదాయము వచ్చువారు తమ బాలురకు పూర్తిగా విద్య చెప్పించుటకు శక్తి చాలకున్నది. బాలుర విద్య నిమిత్తము అనేకు లప్పులపా లగుచున్నారు. ఇప్పటికే చాలమంది విద్యార్థులు ఎఫ్. యే., బి. యే. లకు చదువుచున్నా రనియు, కాలేజి విద్య యింకను కష్టతరము గావించి కొలఁదిమంది మాత్రమే చదువుకొనునట్లు చేయుటకు ప్రయత్నములు జరగుచున్న వనియు, 1912-వ సంవత్సరమున జాక్ లా గారే చెప్పియున్నారు. ఉన్నతవిద్య జనసామాన్యమునకు లభింపకుండ చేయుట కడు విచారకరము, దేశమున కరిష్టము. స్కూలు జీతములు కాలేజి జీతములు సాధ్య మయినంతవఱకు తగ్గించి చాలమంది బాలు రున్నత విద్యాభ్యాసము చేయుట కవకాశము కలిగించుటయే శ్రేయస్కరము.

ప్రస్తుతవిద్యాపద్ధతుల ప్రకారము ఒక బాలుఁడు బి. యే. పరీక్ష యంత్య మగువఱకు చదువుకొను సరికి 15 సంవత్సరములు పట్టుచున్నది. బాలుఁడు ప్రతిపరీక్షయందును తప్పక కృతార్థుఁ డయ్యెనేని బి. యే. అనిపించుకొను సరికి 20 సంవత్సరముల యీడు గలవాఁ డగుచున్నాఁడు. అటుపిమ్మట వైద్యము చదువుకొన్నను ఇంజనీయరింగు కాలేజిలో ప్రవేశించినను మరి యయిదు సంవత్సరములకుఁ గాని చదువు పూర్తి కాదు. అప్పటికి బాలున కధమము 25 సంవత్సరముల యీడు వచ్చును. మన హిందూదేశములో మనుష్యుని జీవితకాలము మొత్తముమీఁద 45 సంవత్సరములు మాత్రమే. విద్యాలయములలో చదువు పూర్తిచేసికొని గృహస్థాశ్రమము ప్రవేశించుసరికి బాలునకు సగము జీవితకాలము గడచుచున్నది. 30 సంవత్సరముల క్రిందట 12 సంవత్సరముల వయస్సు గల బాలుఁడు మెట్రిక్యులేషను పరీక్షయందు కృతార్థుఁ డగుట కవకాశ ముండెను. ఆ పద్ధతి ప్రకారము చదువుకొని పరీక్షలు పూర్తిచేసినవా రిప్పటికిని కొందఱు జీవించియే యున్నారు. వారికంటె ఈ నవీనపద్ధతుల ప్రకారము విద్య నేర్చినవా రెక్కువ బుద్ధిమంతు లగుచున్నా రని చెప్పుటకు వీలు లేదు. ఇంగ్లాండుదేశములో 21, 22 సంవత్సరముల వయస్సు వచ్చెడి సరికి బాలుఁడు ఐ. సి. యస్. పరీక్షయందు

కృతార్థుఁడయి హిందూదేశమునకు వచ్చి నెలకు 600 రూపాయిల వేతనము సంపాదించుకొను సామర్థ్యము కలవాఁడగుచున్నాఁడు. ఇక్కడ మెట్రిక్యులేషను చదువుకొని ఇంగ్లాండు దేశమునకు వెళ్లి మూఁడు సంవత్సరములు మాత్రము చదువుకొని వచ్చినయెడల బారిష్టరుగా పనిచేయుటకు కొంచెము కాలము క్రిందటివఱకును అవకాశముండెను. ఇక్కడ బి. యే. చదువుకొని గాని చదువక గాని ఇంగ్లాండు వెళ్లి రెండు మూఁడు సంవత్సరము లున్నయెడల అక్కడ గొప్ప వైద్యవిద్యాపారీణుఁడయి వచ్చుట కవకాశ ముండెడిది. ఇప్పటి నిబంధనల ప్రకారము మన రాజధానిలో 16 సంవత్సరముల వయసు రానియెడల ఏ బాలుఁడును మెట్రిక్యులేషను పరీక్షకు వెళ్లుటకే యర్హుఁడు కాఁడు. హిందూదేశస్థుల యాయుఃప్రమాణములు యోచింపక విద్యార్థి పాఠశాలలలోఁ గడపవలసిన కాలమును వృద్ధి చేసినయెడల ఏమియు ప్రయోజన ముండదు.

మరియు నిప్పుడు బాలురు పరీక్షలకు చదువవలసిన గ్రంథములు బహు బహుళముగా నున్నవి. పరీక్షలు కఠినముగా నున్నవి. తప్పక పరీక్షలందు కృతార్థులు కావలె నని విద్యార్థులు రాత్రింబగళ్లు కష్టపడి చదువుచున్నారు. పరీక్షలకయి యేర్పాటుకాఁబడు గ్రంథములు చదువుటయందే వారు తమ కాల మంతయు వినియోగించుచున్నారు. పరీక్షయందే దృష్టి నిలిపి చదువవలసియుండుటచేతను గ్రంథబాహుళ్యముచేతను బాలుఁడు జ్ఞానాభివృద్ధికొఱకు పాటుపడుట కవకాశము కలుగకున్నది. తమ తరగతుల కేర్పడిన పుస్తకములు గాక, ఇతర గ్రంథములు చదివి విషయభాషాజ్ఞానములు సంపాదించుకొనుటకు వారికి వ్యవధి లేకున్నది. తమ నియమితగ్రంథములు చక్కఁగా చదువుకొని యితరగ్రంథము లనేకములు చదువఁగలిగిన మిక్కిలి తెలివి గల బాలురు కూడఁ గలరు. కాని, సామాన్య మయిన తెలివితేటలు గల బాలుర సంగతియే పయిని చెప్పఁబడినది.

పరీక్షలు కఠినముగా నుండుటచేతను బాలురు చదువవలసిన గ్రంథములు విశేషముగా నుండుటచేతను బాల్యావస్థలోనే వీరు బలహీను లగుటకు కారణ మగుచున్నది. అన్యగ్రామములకు వెళ్లి భోజనాదిసదుపాయములు లేకపోవుటవల్ల కూడ బాలురు కృశించిపోవుచున్నారు. ఇప్పుడిప్పుడు పాఠశాలలకు సంబంధించునట్లు భోజనగృహములు (హాస్టలులు) అక్కడక్కడ కట్టుచున్నారు గాని, మొత్తముమీఁద విద్యార్థులు భోజనవిషయములోను బసల విషయములోను మిగుల కష్టపడుచునే యున్నారు. విద్యకై కడు బాధలు పడి విద్య పూర్తిచేసికొని ప్రాపంచిక వ్యవహారములలో ప్రవేశించు సరికి పెక్కుమంది బాలురు బహుదుర్బలు లయి రోగపీడితు లయి యేపని గాని పట్టుదలతో చేయుటకు శక్తి లేక యున్నారు. మరియు పాఠశాలలలో బాలుర యారోగ్యస్థితిని బాగు పఱచుటకు సరి యయిన ప్రయత్నములు జరగుచుండుట లేదు. బాలుఁడు తన దేహారోగ్యమును సరిగా నుంచుకొని బలమును వృద్ధి చేసికొనుటకు తగు వ్యాయామము లేదు. వారమున కొకదినము మాత్రము వ్యాయామ మేర్పఱచినయెడల, దానివలన ప్రయోజన మేమియు నుండఁజాలదు. ప్రతిదినమును ఎడతెగక ప్రతిబాలుఁడును దేహారోగ్యమున కుపయుక్త మయిన వ్యాయామము చేయునట్లుపాధ్యాయు లేర్పాటు చేయవలెను.

ఇప్పటి పాఠశాలలలో బాలురకు నేర్పఁబడుచున్న విషయములు పాఠశాల విడిచిన తరువాత వారి కెంత మాత్రము నుపయోగకరములు గాఁజాలవు. బాల్యావస్థలోనే ప్రతిబాలుఁడును మతాభిమానమును దేశాభిమానమును గలవాఁడయి ధర్మమార్గానువర్తి కావలెను. చిన్న వయసులో సుగుణము లలవడనియెడల, వయసు ముదిరిన తరువాత సుగుణసంపద కలుగుట యరుదు. క్రింది తరగతులలో నిప్పుడు బాలురకు ధర్మము గాని మతము గాని దేశాభిమానము గాని బోధింపఁబడుట లేదు. ప్రస్తుతము బాలురు నేర్చుకొను విషయములవలన వారు నీతిమార్గానుచరు లగుటకుఁ గాని దైవభక్తాగ్రేసరు లగుటకుఁ గాని దేశాభిమాను లగుటకుఁ గాని యెంత మాత్రమును అవకాశము లేదు. మన హిందూదేశములో నీ సుగుణములు కలవా రనేకులు గలరు గాని, వా రట్లగుటకు కారణాంతరములు గలవు. జర్మనీ మొదలగు కొన్ని పెద్ద దేశములందు క్రింది తరగతులలో బాలురకు ముఖ్యముగా ధర్మ మత దేశచారిత్ర సంబంధము లగు విషయములనే నేర్పుచున్నారు. ఆ ప్రకారముగానే యీ దేశములో కూడ విద్యాపద్ధతి మాఱవలెను; బాలుర పఠనమున కేర్పఱచు గ్రంథములు మన ధర్మశాస్త్రములందును మన పూర్వచరిత్రలందును బాలుర కభిమానమును కలుగఁజేయునవిగా నుండవలెను.

ఇప్పుడు పాఠశాలలలో బాలురకు విద్యను నేర్పు పద్ధతి ప్రకారము ఏ బాలుఁ డెంతవఱకు శ్రద్ధాసక్తులతో చదువుచున్నాఁడో తెలిసికొనుట కవకాశము మిక్కిలి తక్కువగా నున్నది. కొన్ని కొన్ని పాఠశాలలలో తమ కుపాధ్యాయు లే విషయమయి యేమి బోధించుచున్నదియు బాలు రితరులతోఁ జెప్పుటకు వారికే తెలియకున్నది. విద్యాబోధనక్రమము పరిపూర్ణముగా నిర్ణయింపఁబడక మిక్కిలి యనిశ్చయముగా నున్నది. పూర్వము బాలుఁడు ప్రతిదినము సరిగా పాఠములను చదువుచున్నదియు లేనిదియు వాని యుపాధ్యాయులకు ప్రశ్నోత్తరములవల్లను మాసాంతమున బాలుర మార్కులు కూడి తరగతిలో వారివారి స్థలములను నిర్ణయించుటవల్లను తెలియుచుండెడిది. ఆ పద్ధతి యిప్పుడు పెక్కు పాఠశాలలలో మానివేయఁబడినది. ఈ పద్ధతివలన మిక్కిలి యుపయోగము కల దని కొందఱుపాధ్యాయు లిప్పటికిని అభిప్రాయపడుచున్నారు. స్థలనిర్ణయపద్ధతివలన మరియొక లాభము కూడఁ గలదు. దానివలన ప్రతిబాలునికిని తన పాఠములను చక్కఁగా చదువుకొని తనతోడి బాలుర నతిక్రమింపవలె నను కుతూహలము జనించుచుండును.

విద్యాపద్ధతిలో నున్న లోపములను కూడ పయి యధికారులకు తెలియఁబఱచి సవరణ చేయింపవలసిన బాధ్యత మన యుపాధ్యాయులదియు శాసనసభ్యులదియు కూడ నయియున్నది. అప్పుడప్పుడు జరగుచున్న యుపాధ్యాయసభలలో నీ యంశములు చర్చింపఁబడుచున్నట్లు కనఁబడదు. తక్కువ కష్టముతో బాలురకు జ్ఞానాభివృద్ధి కలుగఁజేసి చదువువలన బాలురు బలహీనులు గాక బలవంతు లయి దేశమున కుపయోగకరముగా నుండునట్లు చేయవలెను.

# జాతీయజీవనము — వాఙ్మయము

కోరాడ రామకృష్ణయ్య గారు, బి. ఏ.

సామాన్యముగా జాతీయజీవనము తద్వాఙ్మయమున ప్రతిబింబితంబై యుండు ననుమాట, ఇతరభాషావాఙ్మయపరిచితి లేని కేవలహైందవవిజ్ఞానధురంధరు లగు మనవారికి కొందఱకు తెలియదేమో కాని, పాశ్చాత్యవాఙ్మయములను అచ్చటి విమర్శకాభిప్రాయములను పరిశీలించినవారి కెల్లరకును అది వాఙ్మయవిషయమున నొక ముఖ్యతత్త్వముగ గోచరింపక మానదు. ఏతత్తత్త్వావగాహనకు దేశచరిత్రజ్ఞానము కూడ కొంచె మవసర మని తోఁచెడిని. దేశమున నొక్కొక కాలమునఁ గల్గు వివిధరూపంబు లగు విప్లవములును జాతీయజీవనము నెట్లు మార్చుచుండునో అట్లే భాషావాఙ్మయమును గూడ మార్పఁగలిగియుండును. ఒకవేళ మనవారీ విషయము నంతగా గమనింపకున్నను, దేశచరిత్రరచనావిషయమున నాదినుండియు తూష్ణీంభావము వహించి యెల్లప్పుడును పరమార్థచింతాతత్పరు లైన వీరియెడల నిది యంత యాశ్చర్యజనకము కాదు.

ఇఁక మన మొక మహాకవిచే రచియింపఁబడిన యొక గ్రంథము చదువుచుండినచో, అద్దానఁ జిప్పిలుచుండు రసంబులు మన మనోభావంబుల నాకర్షించి యానందమ్మున నోలలాడించును. అప్పు డొకవేళ మన పరిశీలనాబుద్ధి మాటువడియుండవచ్చును. కాని, మఱియొకసారి దానిం బరిశీలనతోఁ జదివిన, ఆ గ్రంథమునందలి పాత్రల చర్యలనుండియు వారి సంభాషణక్రమమునుండియు, భావములనుండియు అట్టి పాత్రల నాడించు నాంతరశక్తి యగు నా గ్రంథకర్త యభిప్రాయములఁ గన్పెట్టుట యంత దుస్సాధ్యము కాదు. కవుల స్వాభిప్రాయసూచన నెంతమాత్రము సహింపని నాటకాదిరూపకములలో నిది మిక్కిలి దుస్సాధ్య మనియే చెప్పవలసియున్నను, సామాన్యముగా ప్రతిగ్రంథము వెనుకను మాటువడియైనా దాని నంత నావరించియో లేక మధ్యమధ్యమున నొకచో పొడసూపుచుండియో ఆ కవి చదువరులకుఁ గన్పట్టుచునే యుండును. మఱియు ప్రతి మనుజుని భావములును—భావ మన నేల? వాని జీవిత మంతయు ఆయా కాలనిర్ణీతంబై యుండును; అనఁగా—వాని జీవిత మా కాలమున నా సాంఘికజీవనము నాశ్రయించియుండు ననుట. కావున నొక సంఘమునందలి ప్రతి వ్యక్తియొక్క యాశయములును ఆ కాలమం దా సంఘస్థితిని సంఘజీవితమును వ్యక్తీకరించుచుండును. ప్రతిభావంతుఁ డగు నా కాలపు కవిచే రచియింపఁబడిన యొక గ్రంథమునందు మన మా గ్రంథకర్త యభిప్రాయములను మాత్రమే సేకరించుట లేదు. సాధారణముగా నొక కవి తన దేశకాలవ్యవస్థలకు లోనై సాంఘికవ్యవస్థలను జాతిమతవికారములను బయలుపఱచుచుండును గావున, ఆ యుగమందలి వాఙ్మయమునం దంతటను ఆ కాలమున నా జాతియొక్క స్థితిగతు లన్నియు సూచింపఁబడియుండును. ఒకవేళ నొక కాలమున నొక రిద్దఱు మహాపురుషులు దేశకాలవ్యవస్థల నధిగమించి సార్వజనీనంబులును పరమోత్కృష్టంబులు నగు భావములను ఆదర్శములను తమ గ్రంథముల వెలయించినను, ఆ కాలమున వాఙ్మయ మంతయు నట్టిదై యుండుట గాని, ఎంత గొప్ప కవు లైనను తమ గ్రంథరాజముల నెచ్చటనైన తమ చుట్టుప్రక్కల దేశముననో సంఘముననో యుద్రేకము పుట్టించి తన్మయంబు గావించుచుండిన కొన్ని మహోద్యమముల చొక్కియున స్వాభావిక మగు పొరపాటు నైనఁ గనఁబఱుపకుండుట గాని తటస్థింపదు. కావున, ఇంతకును దేలిన దేమన, ఒక దేశమున నొక కాలమందలి వాఙ్మయ మచ్చటి జనుల మనోవీథుల నెడతెగక పాఱుచుండెడి భావప్రవాహమును వారి జీవితచరితను తనలో కేంద్రీకృత మగునట్లు చేసి, అప్పటి సంఘస్థితి నశ్వరంబును శాశ్వతంబును నగునటుల ఆ దేశమున నెలకొల్పు ననుటకు సంశయము లేదు.

ఇట్లు వాఙ్మయము దేశచరిత్రజ్ఞానసంపాదనమునకు తోడ్పడు ననుట వ్యక్తమే. అట్లే దేశచరిత్రయు వాఙ్మయాభివృద్ధికిం దోడ్పడెడి యాయా కారణముల నిరూపింప సమర్థంబై యుండును. చరిత్రకన్న వాఙ్మయమున నొక్క విశేషము కలదు. చరిత్ర యాయా దేశములం గల్గు వివిధోద్యమములను వాని వికాసమును అచ్చటి రాజకీయ సాంఘిక ఆర్థిక నైతిక స్థితులను వర్ణించి, ఆయా యుద్యమంబులకును వాని పరిణామములకును కారణముల నారసి నిరూపించుచుండ, ఈ వాఙ్మయ మట్టి యుద్యమకారణంబులకు మూలంబు లగు జనుల భావోద్రేకములను వారి యంతఃకరణంబులను విశదపఱచును. మఱియు నిది దేశమునఁ గలిగిన రాజకీయ విప్లవములవలనఁ గాని అన్యదేశీయభాషాసంసర్గమువలనఁ గాని, ఆ జాతీయజీవనమునఁ గలిగిన మార్పులను గూడ విస్పష్టంబుగఁ దెల్పుచుండును. కావున, వీని సంబంధం బతిసన్నిహితం బని యెన్నఁదగియున్నది.

ఇందునకు తార్కాణముగ నిప్పుడు మన దేశమున బాగుగ వ్యాపించి మిగుల నెన్నికగన్న యాంగ్ల వాఙ్మయముం జూడ నగును. ఆ దేశమున జాతీయజీవన మే కాలమున నెట్లు మాఱుచు వచ్చెనో తదనుగుణ్యంబుగనే కవితయందలి రుచియు మాఱుచు వచ్చెను. ఈ కవితారుచికి తగినట్లుగనే విమర్శనాపద్ధతులును ప్రబలినవి. అప్పు డేయే భావము లాదేశీయుల మనముల నాకర్షించి యుద్రేకము గల్గించుచుండినవో అవియే యా యుగమందలి కవితయందును స్ఫురించుచుండినవి. ఆంగ్లదేశమున పదునాల్గవ శతాబ్దమునకు పూర్వము వాఙ్మయమున చేరఁదగిన కవిత మిగుల స్వల్ప మని చెప్ప నగును. ఈ 14-వ శతాబ్దమందలి తన దేశీయుల స్థితిగతులను మ/

చారముల దుస్థితిని భాషావైఖరిని దెల్పుచు "ఖాసరు" అను కవి "కాంటర్ బరీ కథలు" అను గ్రంథమును రచించియున్నాఁడు. పదునాఱవ శతాబ్దమున ఆంగ్లదేశీయ నావికశిఖామణుల యద్భుత యాత్రల వలనను వారిచే కనుఁగొనఁబడిన నూతనఖండముల పరిజ్ఞానమువలనను వారికి సముద్రములు స్వాధీనమై పరదేశములతో సులభముగ వ్యాపారము చేయఁగలుగుటచే దేశ మొక్కుమాఱుగ ధనవంత మగుటవలన దేశీయులకుఁ గలిగిన యపరిమితానందోత్సాహములయొక్క ఫలమో యన్నట్లు ఆకాలమున షేక్స్పియర్ సిడ్నీ స్పెన్సర్ మొదలగు మహాకవీంద్రులు బయలువెడలి, తమ యా యుత్సాహము నప్రతిమానం బగు కవితారూపమున వెలయించి యాంగ్లవాఙ్మయమున నగ్రపీఠిక నలంకరించిరి. తరువాత పదునేడవ శతాబ్దము మధ్యమున దేశమున సంభవించిన రాజకీయములును మతవిషయకములు నగు కల్లోలముల నన్నిటిని ఆ కాలమున కవిసార్వభౌముఁడగు మిల్టన్ వ్రాసిన గ్రంథములనుండి బాగుగ తెలిసికొనవచ్చును. మరియు నీ శతాబ్దముయొక్క యుత్తరభాగమున ప్రజాప్రభుత్వము పోయిన పిదప ఆంగ్లసింహాసనము నధిష్ఠించిన రెండవ చార్లెసునకు ఫ్రెంచి దేశముతో సంబంధంబును దానియందభిమానమును నుండుటవలన ఆ దేశీయు లగు మాల్ హర్బీ బాయిలూ మొదలగు వారి కవితారీతులును విమర్శనా పద్ధతులును ఈ దేశమున వ్యాపించి ఇచ్చటి కవితాపద్ధతులను గూడ మార్చినవి. దీనితో కవితయందలి పూర్వపు రుచి మాఱి కవితాప్రవాహము మాఱుత్రోవఁ బట్టినది. అప్పటి కవులు భావనాశక్తిని గొలుచుట మాని, అతివిశదంబును వ్యక్తంబును నగు శైలిలో ఆ కాలమున ప్రబలిన జీవనపద్ధతులను కాఫీ క్లబ్బులను చీట్లాటలను పానగృహములను గుఱ్చి చమత్కారముగ వర్ణింపఁజొచ్చిరి. ఈ కాలపు జీవనపద్ధతులయభిప్రాయములను బట్టి చూచుటచే, వారికి షేక్స్పియరు మొదలగువారి కవితలం దాదరము లేకుండెను. పదునెనిమిదవ శతాబ్దమున యైరోపాదేశము నెల్ల నొక్కుమాఱుగా కలఁత నొందించిన గొప్ప రాజకీయవిప్లవము ఫ్రాన్సుదేశమున బయలుదేఱినది. దీనికి వ్యక్తిస్వాతంత్ర్యము విశ్వజనసౌభ్రాతృత్వము మొదలగు నుదారభావంబులు జనుల మనంబులం దుదయించుటయే ముఖ్యకారణము. ఇంగ్లాండు దేశమునకుఁ గూడ నీ నూతనభావములు ప్రాఁకినవి. ఇచ్చటి మహాకవుల మనంబులు నట్టి గంభీరభావములతో పొంగిపొరలినవి. మరల కవితయందలి రుచి మాఱి, పూర్వకవితయందును ప్రాచీన మగు దేశచరిత్రయందును ఆదరము హెచ్చినది. 17-వ శతాబ్దమున ప్రబలిన కవితాపద్ధతుల పై నాదరము పోయినది. ప్రకృతియే వీరి నూతనభావములకును కవితకును గూడ నుద్బోధకం బయ్యెను. షెల్లీ బైరన్ కోలరిడ్జి వర్డ్స్వర్తు మొదలగువారు స్వాతంత్ర్యాదర్శమును ప్రకృతివైచిత్ర్యములను అనేకరీతులఁ గొనియాడి యాంగ్లవాఙ్మయమున మరల సహజకవితను నెలకొల్పి యొక నూతనయుగ మేర్పఱచిరి. 19-వ శతాబ్ద మాంగ్లదేశమున నొక గొప్ప పారిశ్రామికయుగ మని చెప్పవచ్చును. ప్రకృతిశాస్త్రము విశేషముగ నభివృద్ధి గాంచినది. జాతీయజీవన మనేకవిధములై పర్వినది. దీనిని వాఙ్మయమున నెలకొల్పుటకు నవలలు విశేషముగ తోడ్పడినవి. యంత్రాగారములలో ప్రబలిన కొన్ని యమానుష కృత్యంబులను సంస్కరించుటకు లేడీ బ్రౌనింగ్ డికెన్సు మొదలగువారి వ్రాఁతలు సహాయపడినవి. టెనిసన్ మహాకవీంద్రుఁ డా కాలపు దేశోద్ధారకులను గొనియాడి యనేకవిధము లగు యుగధర్మములను కవితయందు నెలకొల్పి ఈ యుగమునకు వాఙ్మయమున శాశ్వతపదవిని కల్పించినాఁడు. కావున ఆంగ్లవాఙ్మయ పఠనంబున నేయే యుగముల నేయే ధర్మములు ప్రబలినవో, ఆ జాతియొక్క జీవనపద్ధతు లేయే రీతుల మార్పు చెందినవో కనుఁగొనుట సులభసాధ్య మను మాట విశదమే.

ఇఁక, హైందవవిజ్ఞానమున కంతకును మూలాధారం బగు సంస్కృతభాషావాఙ్మయ మా జాతీయభావము నెట్లు స్ఫురింపఁజేయుచున్నదో చూతము. ఏతత్పరిశీలనావిషయమున నాంగ్లవాఙ్మయమునకును సంస్కృతవాఙ్మయమునకును నొక్క భేదము కలదు. ఆంగ్లభాషయందు తద్దేశచరిత్రను తెల్పు ననేకగ్రంథములు కలవుగాని, సంస్కృతవాఙ్మయము మిగుల ప్రాచీన మగుటవలనను అప్పటి కాలపు చరిత్రను తెల్పు నితరాధారములు లేకుండుటవలనను, ఉన్న వాఙ్మయమును బట్టియే మన మా కాలపు చరిత్రను నిర్ణయింపవలసి యున్నది. ఇప్పటికి నాలు గైదు వేల యేండ్లనుండి వచ్చిన వాఙ్మయమునుండియే, మన మా కాలమున నివసించియుండిన హైందవజాతియొక్క స్థితిగతులను, వారి నాగరికతను తెలిసికొనఁగలుగుచుంటి మను విషయమే జాతీయజీవనమునకును వాఙ్మయమునకును గల సన్నిహితసంబంధమునకు ప్రబలం బగు నిదర్శనము. హైందవవిజ్ఞానమునకు మూలము లగువానిలో ప్రాచీనతమంబు లగు ఋగ్వేదమంత్రములు, ఈజిప్టు చైనా దేశములలో నాగరికతాగంధమే లేని కాలపునాఁటి హైందవుల నాగరికతాగరిమను చాటుచున్న వని పెద్దలు చెప్పుచున్నారు. హింద్వార్యుల నాగరికత ఋగ్వేదకాలమున పసితనమున నున్న దనియు, అప్పుడు వారిలో కొంతమంది వ్యవసాయముచేత జీవించుచున్నను చాలమంది పశుచారణోపజీవులనియు, మంత్రరచనాసమర్థు లగు బ్రాహ్మణులే విల్లంబులను పూని తమ శత్రువులతో పోరుచుండెడివారనియు, స్త్రీలు కూడ మంత్రములు రచించుచుండెడివారనియు, వారు బట్టలను నేసికొనుచుండెడివారనియు, ప్రకృతియందు గోచరము లగు వైచిత్ర్యములనే వా రారాధించెడివారనియు, తదారాధనారూపములే యీ ఋగ్వేదమంత్రము లనియు తెలియవచ్చుచున్నది. కాలక్రమమున నిట్టి యారాధనయందు శ్రద్ధ తగ్గినకొలఁదిని ఆ జనులకు క్రతువులయం దాదరము హెచ్చుటయు, ఈ క్రతువిధానముల నుద్గాతాధ్వర్యులకు విధింపఁబడిన కార్యక్రమము ననుసరించి వీరు పఠింపవలసిన మంత్రసముదాయమే సామయజుర్వేదరూపంబులు చెందినట్లును, వీరి కార్యక్రమమును నడపవలసిన రీతులును ఆయా సంహితలయొక్క యాంతర్యార్థమును తెల్పు గద్యరూపంబులైన వ్యాఖ్యానంబులునే బ్రాహ్మణము లనియు కూడ తెలియవచ్చుచున్నది. ఈ బ్రాహ్మణముల కాలము వీరి జాతీయ

జీవితమునను వాఙ్మయమునను గూడ రెండవ యుగ మని చెప్పవచ్చును. ఈకాలమున నార్యులు కర్మపరులును తత్త్వవిచారణావ్యగ్రులు నై యుండిరి. ఇప్పుడే వర్ణధర్మములు గూడ ప్రబలినవి; వార్ధక్యమున జను లరణ్యములలో నసించుట యనెడి యాచారము వాడుకలోనికి వచ్చినది. బ్రాహ్మణాంతర్గతము లైన యారణ్యకము లను భాగములు తత్త్వవిచారణరూపంబులును ఉపనిషత్తులకు మూలభూతంబులు నై వెలసినవి. ఇవన్నియు పూర్వయుగమందలి మంత్రములవలె ఛందోబద్ధములు గాక గద్యరూపంబుననే రచియింపఁబడినవి. పిదప నుపనిషత్తుల యుత్కర్ష హెచ్చి కపిలుఁడు సాంఖ్యదర్శనమును వ్యాపింపఁజేయునప్పటికి ఋత్విక్కుల ప్రాబల్యము తగ్గినది. ఇది మూఁడవ యుగము. ఈ కాలమున సంహితబ్రాహ్మణములయందలి యంశములను సులభముగ బోధపఱచుకొనుటకుఁగాను వానిని క్లుప్తపఱుపవలె, ననుబుద్ధితో సూత్రములు వ్రాసిరి. ఇంకను వివిధశాఖల హైందవవిజ్ఞాన మంతయు సూత్రములలోనికి వచ్చినది. నాగరికత హెచ్చినది. వాఙ్మయము వృద్ధి చెందినది. వైదికకర్మకలాపం బంతయు శ్రౌతసూత్రముల నింపఁబడినది. ఆచారవ్యవహారములు నిర్ణయించుటకు గృహ్యసూత్రములు. పరిపాలనాక్రమమును తెల్పుటకు ధర్మసూత్రములు ప్రాతిశాఖ్య లను శిక్షాసూత్రములు పాణిని వ్యాకరణసూత్రములు ఛందస్సూత్రములు మొదలగునవి బయలుదేఱినవి. హైందవవిజ్ఞానమున కంతకు నలంకారభూతంబు లగు షడ్దర్శనములును బయలుదేఱినవి. ఇవి యన్నియు నా కాలమందలి హిందువుల యాత్మజిజ్ఞాసను అగాధం బగు బుద్ధిబలంబును వారి నాగరికతావికాసంబును వేనోళ్ల చాటుచున్నవి. కాని, యీ కాలమున సాంఘికజీవనమున గట్టి మార్పులు జరగినవి. బ్రాహ్మణుల యధికారము విజృంభించినది. ఋగ్వేదమతమునం దావేశము తగ్గినది. త్రిమూర్తులు మొదలగు ననేకదేవతలు వెలసిరి. అర్థము లేని కర్మలు ప్రబలినవి. జాతివైషమ్యములు నంత్యజాతియం దనాదరము నంకురించినవి. ఇట్టి సమయమున గౌతమబుద్ధుఁడు బయలుదేఱి, వర్ణభేదములవలన గొప్పతనము రాఁబో దనియు సత్ప్రవర్తనవలన నందఱు ముక్తి పడయఁగల రనియు, జీవహింస కూడ దనియు — ఈ మొదలగు బోధలు చేయుటచే, జనసామాన్యము నొక్కసారిగా నాకర్షింపఁగలిగెను. అప్పటినుండియు బౌద్ధమత మంతకంతకు వృద్ధిచెంది యశోకుని కాలమున దిగంతవ్యాప్తి చెంది హిందూమతము నణఁచివేసినది. పిదప, హిందూదేశము పరదేశీయుల దండయాత్రలకు లోనై చాల కాలమువఱకు శాంతి లేక యుండెను. గుప్తుల, విక్రమాదిత్యుని పరిపాలనమున కొంత శాంతి గలుగుటచే హిందూమతము కూడ కొంత తలయెత్తుటకును, కాళిదాసభవభూత్యాదిమహాకవుల కవితావిజృంభణమునకును కొంత యవకాశము దొరకినది. కాని, క్రమక్రమముగ సామాన్యజనులలో విద్యావ్యాప్తి తగ్గుచుండుటచేతను, కవులకును సామాన్యజనులకును సంబంధము తగ్గుటచేతను, దేశము మహమ్మదీయుల కధీనమైన పిదప జాతీయభావమే నష్టప్రాయ మగుటవలనను, తరువాతి కవితకును జాతీయజీవనమునకును అంత సంబంధ మున్నట్లు కనఁబడదు. సహజకవిత తగ్గిన కొలఁది కవితావిమర్శన ప్రబలి యాలంకారికగ్రంథములు బయలువెడలినవి. ఈయాలంకారికుల నిబంధనలను దాఁటిపోకుండుట కూడ కవుల కాచార మైనది.

ఇంతకు పూర్వము చాలకాలము క్రిందటనే యార్యులు దక్షిణహిందూస్థానమునకు వచ్చియుండుటచే హైందవవిజ్ఞాన మచ్చట వ్యాపించుటే గాక క్రమముగ కొంత కాలమునకు సంస్కృతభాషాసంసర్గమువలన దేశభాషలయందు వాఙ్మయాభివృద్ధికి చేయూఁత దొరకినది. చాల కాలమువఱకును సంస్కృతప్రాకృతభాషలయందే రాజకీయ వ్యవహారములు జరపఁబడుటవలన దేశభాష లభివృద్ధి చెందుటకు వీలు లేకున్నను, క్రీ. శ. 7-వ శతాబ్దము ప్రాంతమున వేఁగిదేశమును జయించిన చాళుక్యప్రభు వగు సత్యాశ్రయుఁడు దేశకవిత నీ దేశమున నెలకొల్పినట్లు నన్నెచోడమహాకవి తన కుమారసంభవకావ్యమునందు "మును మార్గకవిత లోకంబున వెలయఁగ దేశకవితఁ బుట్టించి తెనుంగు నిలిపి రంధ్రవిషయమునఁ జన సత్యాశ్రయునితొట్టి చాళుక్యనృపుల్" అను పద్యమున తెల్పియున్నాఁడు. ఇట్లు సత్యాశ్రయునిచే నాటఁబడిన కవితావృక్షము సంస్కృతభాషావాఙ్మయము లను దోహదములచే క్రమముగ వృద్ధిచెంది రాజనరేంద్రునినాఁటికి పుష్టి గాంచి యమూల్యము లగు ఫలముల నిచ్చినది. సంస్కృతవాఙ్మయమే దేశమున నెక్కుడాదరము వడసియుండుటచేతను, పండితులు కవులు నగువారి కీ భాషయందే యభిమానము కలవారగుటచేతను, దేశభాష గాని దేశీయచరిత్ర గాని సంస్కృతముతోడి సంబంధము లేకయే స్వతంత్రకవితను పుట్టించునంతటి స్థితిలోనికి రాకుండుటచేతను, సంస్కృతగ్రంథముల భాషాంతరీకరణములే ప్రథమమున నీ దేశీయవాఙ్మయమున బయలుదేఱిన గ్రంథము లగుట తటస్థించియుండును. మఱియు నప్పటికి బాగుగ దేశమున వ్యాప్తి చెందినట్టియు సామాన్యజనులలో నన్ని విధము లగు హైందవధర్మంబులను వ్యాపింపఁజేయు నుద్దేశముతో బయలువెడలినట్టియు సకలవిజ్ఞానంబునకు నాలవాలం బైనట్టియు పురాణంబులను, దేశభాషలోనికిఁ దెచ్చిననే, తిక్కనసోమయాజి చెప్పినట్లు, "భారతామృతముఁ గర్ణపుటంబుల నారఁ గ్రోలి యాంధ్రావళి మోదముం బొరయఁ" గల్గు నని యప్పటివారు తలంచియుండుటచేతనే, ప్రథమయుగమాంధ్రవాఙ్మయమున భాషాంతరీకరణయుగమై వెలుఁగొందినది. కాని, ఈ యుగమున కంతకును, ఈ యుగమున కేమి ఆంధ్రవాఙ్మయమున కంతకును, అలంకారం బగు భారతము కేవలాంధ్రీకరణ మని చెప్పుట సమంజసము కాదు. దీనిని కేవలాంధ్రీకరణముగ భావించి మూలముతో నచ్చటచ్చట సరిచూచి ఆయా పట్ల మూలముకన్న కొంత భేదముగ నుండుటను బట్టి, ఎక్కువ రసవంతముగను రమ్యముగను నుండుటను గనుఁగొనియుఁ, పూర్వపుప్రమాణముచేతనే దీనిని విమర్శించి మూలమునకు సరిగ లే దని మరల కొందఱు నిర్ణయించుచున్నారు. ఒక విధ మగు దోషముగ నెన్నఁబడుచున్నను ఈగుణమే దీని యుత్కృష్టతకు కారణము. కావున, భాషాంతరీకరణమైనను, ఈ గ్రంథమును మూలముకన్న రసవంతముగను రమ్యముగ

చేయు నుద్దేశముతోడనే నన్నయాదులు కొంత స్వాతంత్ర్యమును దీసికొనియుండుట నిజ మగుటవలన, ఈ యుగముననే రాఁబోవు యుగమందలి స్వతంత్రగ్రంథముల చిహ్నెలు కొంతవఱకు పొడసూపుచున్న వని చెప్పనొప్పును. క్రమముగ కవుల కీ భాషయం దభిమానము హెచ్చుటయు, వట్టి భాషాంతరీకరణములనే చేయుట గాక తమ స్వతంత్రకల్పనాశక్తిని వర్ణనాచాతుర్యమును ఎక్కుడుగ చూపవలె ననెడి యభిలాష బలమగుటచే మూలగ్రంథములనుండి కథయు కొన్ని కల్పనలు మాత్రమే తీసికొని స్వకల్పనలచే పెంచి భాషాంతరీకరణమునకును స్వతంత్రగ్రంథమునకును మధ్యస్థముగ నుండునట్లు చేయుచువచ్చిరి. దీనికి శ్రీనాథుఁడే ముఖ్యోదాహరణము. ఈతనిని భాషాంతరీకరణయుగమునకును కావ్యయుగమునకును నడుమ రెంటిని కలుపుచుండెడి యొక వంతెనగాఁ బోల్పవచ్చును. 14-వ శతాబ్దము ప్రారంభమున ప్రతాపరుద్రదేవుని యాస్థానమున నుండిన విద్యానాథుఁడను సంస్కృతకవివలెనే అతని మంత్రులకుఁ గాని దండనాథులకుఁ గాని కృతియిచ్చిన మారన మంచన భాస్కరకవి మొదలగువారి గ్రంథములవలన నొక్కింత వారివారి విషయము తెలిసినట్లు, పదునైదవ శతాబ్దమున నున్న శ్రీనాథుని గ్రంథములవలన నా కాలమందలి రెడ్ల చరిత్రయు నాంధ్రజనుల స్థితియుఁ గూడ నొక్కింత తెలిసికొనఁగలుగుదుము. తరువాత 16-వ శతాబ్దమున నాంగ్లదేశమందువలెనే కృష్ణదేవరాయల భుజపేరిక నలంకరించి మహోన్నత పదవి నొందిన యాంధ్రభూమి కొక నూతనవికాసము గలిగి రాజకవియు కవిరాజును నగు నాతని ప్రాపున కవితాసతి నూతనతేజంబు వడసినది. ఈ కాలమున నాంధ్రదేశమందువలెనే యాంధ్రసారస్వతమునను స్వాతంత్ర్యగుణము నెలకొల్పఁబడినది. సంస్కృతగ్రంథములను తెనిఁగించుట మాని ఏ పురాణమునుండియో యొక గాథను తీసికొని దానిని తన రచన కనుకూల మగునట్లు పెంచి రసవంతము లగు స్వతంత్రకావ్యములను రచించుటకు ప్రథమమున దారితీసినవాఁడు రాయల యాస్థానకవి యగు పెద్దన. ఇంక నీ యాస్థానమున నుండి యష్టదిగ్గజము లని పేరువడసిన ముక్కుతిమ్మనాదు లీ దారినే పోయి యనేకము లగు స్వతంత్రప్రబంధముల నాంధ్రవాఙ్మయమున కలంకారములుగఁ జేసిరి. కృష్ణదేవరాయలు దక్షిణహిందూస్థానము నేలిన రాజు లందఱిలో గొప్పవాఁడనియు అతని పరాక్రమము వైదుష్యము కవిజనంబులయెడ నాదరము మొదలగు కొన్ని విషయముల నా కాలపు పెద్దన తిమ్మన మల్లన ధూర్జటి మొదలగువారి కవితలను బట్టి మనము గ్రహింపఁగలము. ఇట్లే ఇఁక తరువాతి కవులు కూడ పెద్దన చూపిన ప్రబంధసరణినే గతానుగతికముగ ప్రవర్తించుట చేతను, తమ పాండిత్యప్రకర్ష చూపుటయే ఆ కాలమున నొక గుణముగ పరిగణింపఁబడుచుండుటవలనను, క్రమముగ కవితకు వికాసము తగ్గుటయే గాక ఆ కవిత యాయా కవుల కాశ్రయు లగువారి వంశచరిత నొక్కింత మనకుఁ దెల్పుచుండెనే గాని, ఆంధ్రదేశమునందలి జనసామాన్యముయొక్క స్థితిగతులను తెలుప సమర్థం బగుట లేదు. ఇది యిది యన నేల? సామాన్యముగ నాంధ్రవాఙ్మయ మంతయు అట్టిద యని చెప్పవచ్చును. ఇంతకు నీ దేశమునందలి కవిత రసజ్ఞులగు కొందఱు రాజుల పోషణవలన వృద్ధి చెందిన దగుటవలన ఆ కవులును తమ కాశ్రయులై తమ్ము పోషించుచున్నవారి ప్రభావంబును వంశావళియు కొంత వర్ణించి ఆశ్వాసాంతముల మఱి రెండు మూఁడు బిరుదావళులు చదువుచుండుట తప్ప, ఆ రాజ్యమందలి జనులయొక్క గాని సామాన్యముగ నాంధ్రజాతియొక్క గాని స్థితిగతుల నైనను ఆశయముల నైనను వర్ణించి చెప్పుటకు ప్రసక్తియే పట్టలేదు. దీనికి కారణ మాంధ్రజాతికి స్వాతంత్ర్యజీవనము కొంతకాలమైన నెడతెగక లేకుండుటయే. కొందఱు రాజు లాంధ్రకవుల నాదరించి యాంధ్రవాణి నుద్ధరించినను, దేశమున శాంతి తక్కువయగుటచే జాతీయజీవనమున కంతగా ప్రోత్సాహము లేకుండుటయు, రాజుల యాస్థానములలో తమ కాలమును గడపుచుండిన కవిరాజులకు సామాన్యజనులతో విశేషపరిచితి గాని వారి భావములను ఆదర్శములను పరిశీలించుటకు తగిన యవకాశము గాని యున్నట్లు కనఁబడదు. మఱియు సామాన్యజనులలో విద్యావ్యాప్తి శూన్యప్రాయం బగుటం జేసి యిట్టి పరస్పరసంబంధమునకు వీలు దొరకినది కాదు. కావున, అప్పటి రాజులును వారి మంత్రులును సామాన్యముగ యశోలుబ్ధు లగుటచే, కవిరాజుల సంకీర్తనంబున తమ పేరు శాశ్వతంబుగ నుండు నని తలఁచి వారివలనఁ గృతులు గొనుటయు, కవులును తమ్మాదరించువారు లేక వారి ప్రాపున చేరి వారి గుణముల సంకీర్తనము చేయుచు, కథాభాగమునకు ఏ పురాణమునుండియో యొక విషయమును దీసి దానియందే తమ చాతుర్యంబును వెలయింపఁ జూచిరి. కావున, వీరి గ్రంథములలో సాధారణముగా మనకు దినచర్యయందు కనబడెడి మానవజీవితంబును మనోవృత్తులును భావంబులును గనఁబడక పూర్వయుగములఁ బ్రసిద్ధి చెందిన కించిదతిమానుషప్రభావము గలవారి చర్యలను వారి యాకారములను మన యెదుట నిల్పి, మన కున్నతాదర్శములను బోధించుచుండిరి. వాఙ్మయముయొక్క ముఖ్యప్రయోజనము మానవజీవితప్రతిపాదనము గాని నైతికప్రతిపాదనము మాత్రమే కాదు. ప్రతిభావంతుఁ డొకఁడు మానవజీవితమును బాగుగ పరిశీలించి, ఆయా జనుల యవస్థలను ఆయా స్థితులవారి భావములను ఒక్కొక విషయమున వారి కనుభవసిద్ధము లయ్యును బయటికి వెల్వడ సమర్థములు గాని మనోవృత్తులను బాగుగ కనిపట్టి చక్కని సందర్భములు కల్పించి వారికి చెప్పుచున్నచో, అవి వారి మనమును తత్క్షణమే యాకర్షించుటకు సంశయం బేమి? ఒక పుస్తకము చేపట్టినంతనే, అందు పాఠకునకు స్వానుభవము లగు విషయము లనేకములు పొడకట్టుటయే గాక, తనవలెనే కష్టసుఖములకు పాల్పడినవారి చిత్తములను కుఱించిన యభిప్రాయములను వాని కది వెలిపఱచుచు, వాని స్థితికై సానుభూతి గనఁబఱచు ననేకు లగు సాటి జను లా గ్రంథమునఁ గన్పట్టుటచేతనే, వాని కొక మాదిరి యానందమును తాపోపశమనంబును మనశ్శాంతియుఁ గల్గుచుండును. కావుననే జార్జి ఎలియట్ అనునామె 'వాఙ్మయ మనునది మన యనుభవజ్ఞానమును వృద్ధిచేసి

SAKUNTALA'S DEPARTURE FROM KANVASRAMA



శకుంతల భర్తృగృహమునకు బోవుట.

కొనుటకును సామాన్యముగా మనము కలిసికొనుటకు వీలులేని పలువురు సజాతీయులతోడి సంబంధము కలుగఁజేసికొనుటయును ముఖ్యమార్గ' మని చెప్పియున్నది. ఇట్లు శాశ్వతంబులును నైజములు నగు జాతీయభావములను జనుల మనోవృత్తులను ప్రతిపాదించునది యగుటం జేసియే వాఙ్మయమునందు మానవకోటి యంత యభిమానమును గౌరవమును గలదై యున్నది.

కాని, మన యాంధ్రకవు లీ విషయము నంతగా పాటించినట్లు కనఁబడదు. ముఖ్యముగ ప్రబంధ మనునది చాలవఱకు వర్ణనాత్మక మగు కవితలో చేరినదే గాని, భావావబోధమే ముఖ్యవిషయముగఁ గలది కాదు. మఱియు నలంకారశాస్త్రనిబంధన లీ గ్రంథములను నైజకవితకు మరింత దూరముగఁ జేయుచున్నవి. సాధారణముగా ప్రబంధములలో కథాసరళియు రచనాప్రణాళికయు సమానమే యగుటచే కథ మొదలు చెప్పినచో తుదవఱకు నూహించి చెప్పుట సుసాధ్య మగుచుండును. ఆలంకారిక మతప్రకారముగ నష్టాదశవర్ణనలు లేనిది కావ్యంబు గాకుండుటచే నెట్లయిన నా వర్ణనలను కథలో ప్రవేశపెట్టి యా గ్రంథమును కావ్య మనిపించుట కెటస్థించుచున్నది. మఱియు నాయకుఁడు ధీరోదాత్తాదిగణంబులో చేరి యుండవలెననియు అట్టివానికీయా గుణంబు లుండవలెననియు ముందుగనే పేర్కొనియుండుటచే ఈ గ్రంథకర్తల కేమాత్రమును గ్రంథమందలి పాత్రలను స్వానుభవమునుండి యథేచ్ఛముగ నిరూపించుటకు స్వాతంత్ర్యము లేకుండెను; తమ గ్రంథము శాస్త్రసమ్మత మగు ప్రబంధమో నాటకమో కాకపోవు నేమో యని యా నిబంధనల నతిక్రమింప నొల్లకుండుటవలన, వారి గ్రంథముల నట్టాడు పాత్ర లచ్చున పోఁతపోసినవానివలె నుండుటయే కాని నేలమీఁద స్వేచ్ఛావిహారము సల్పుచు తమతమ మనోవృత్తులను మనకు విచ్చలవిడిగ వెలిపుచ్చుచున్న వానివలెఁ గన్పట్టవు. కవు లాయా కాలములందలి మానవ జీవితమును పరిశీలించి సందర్భానుసారముగ పాత్రలను సృష్టింపక యే పురాణమునుండియో యొక ప్రఖ్యాత పురుషుని తీసికొని వాని ప్రసిద్ధంబు లగు గుణములను వర్ణించుటచే నీ గ్రంథములును సులభముగ శాస్త్రసమ్మతము లైనవానిఁగ చేయఁగలుగుచుండిరి. వీరి కీ యాలంకారిక సమ్మతంబు లగు నుత్తమపాత్రలు పూర్వ పురాణగాథలయందుఁ గన్పట్టెనే కాని, తాత్కాలిక దేశచరిత్రయం దెప్పుడును గన్పట్టలేదు. దీనికి కారణ మాంధ్రజనుల కెప్పుడు నాయా రాజుల ప్రాపున సుఖజీవనము పడయుటయందే కాని సాంఘిక జీవనమునందును దేశచరితయందును నభిమానము గాని యభిలాష గాని లేకుండుటయే కావచ్చును. జనుల మనముల నొక విధ మగు స్వాతంత్ర్యాభిలాషయు నాత్మగౌరవమును నుదయించినఁ గాని సంఘోద్యమములందు రుచియు వానియం దభిమానమును పుట్టవు. సంఘోద్యమములును దేశోద్యమములును కవిజన మనంబుల కుద్దీపకములు. కవితకే కాదు, తదితర మానవశక్తుల కన్నిటికి నభ్యుదయవికాసము లుత్తేజకములు. అట్టి కాలముననే కవితయు నూతనమై స్వాభావికమై వికాసవంతమై వెలుఁగొందుట; కానినాఁడు, తాపత్రయ సంతాపితంబు లగు నా కవిజన మనంబులవోలె వికాసవిహీనమై యేవో కొన్ని కట్టుపాట్లకు లోనై గతానుగతికంబుగ నుండును. కావున కొంతవఱ కాంధ్రవాఙ్మయస్థితి యా జనుల స్థితిగతులను కూడ తెల్పుచున్న దనుటలో సంశయము లేదు.

కాని, ఇప్పుడు హిందూదేశచరిత్రయం దొక నూతనయుగము ప్రారంభించినది. ఇప్పటికి 150 సం. క్రిందటనే బ్రిటిషు సామ్రాజ్య మీ దేశమున శాంతిని నెలకొల్పినను, ఈ శాంతియొక్కయు నాంగ్లదేశీయుల సంసర్గముయొక్కయు, నాంగ్లవాఙ్మయపఠనముయొక్కయు ఫలితము లిప్పుడు బాగుగఁ గన్పట్టుచున్నవి. ఈ సామ్రాజ్యావలంబనమున నింత కాలమునుండియు నివురు గప్పిన నిప్పువలె నున్న ప్రాచీన హైందవవిజ్ఞాన మిప్పుడు స్వాభావిక తేజంబున ప్రకాశించుచున్నది. తద్దేశచరిత్రజ్ఞానముతోడనే ఈ దేశజనులకు జాతీయజీవనమునం దభిలాష యుదయించినది. ఆత్మగౌరవము వ్యక్తిస్వాతంత్ర్యము మొదలగు నుదారభావము లంకురించినవి. దేశాభిమానమును భాషాభిమానమును హెచ్చినవి. దేశజనుల మనంబు లుత్సాహపూరితంబులై యున్నతాదర్శంబులతో తులదూఁగుచున్నవి. దేశసేవయు భాషాసేవయు ప్రతివానికిని ముఖ్యవిధు లని యంగీకరింపఁబడుచున్నది. ఇట్టి నూతనాదర్శంబులు నూతనోద్యమంబులు వాఙ్మయమున ప్రతిఫలింపకపోలేదు. సంస్కృతవాఙ్మయ మంతయు తీక్ష్ణబుద్ధితో పరిశీలింపఁబడుచున్నది. ఈ భాషయే యాధునికశబ్దశాస్త్రసమస్యల ననేకములను సాధించుటకు తోడ్పడి యా శాస్త్రము నభివృద్ధిచేయుటచే, పాశ్చాత్యుల గొప్ప మన్ననలకు పాత్రమైనది. ప్రాచీనహైందవనాగరికత యంతయు వట్టి నమ్మఁదగని పురాణగాథ క్రింద త్రోసివేయఁబడక, నవీనవిమర్శనాపద్ధతుల ధాటి కాఁగి లోకజనుల నాశ్చర్యనిమగ్నులఁ జేయుచున్నది. ప్రస్తుతము వెనుకఁబడియున్న హైందవజాతి పురోవృద్ధికి ప్రాచీననాగరికతయే మూలాధార మగు నని గుర్తించుటచే, దానిని పునరుజ్జీవింపఁ జేయుటకు సాధ్య మగు ప్రయత్నము లన్నియు చేయఁబడుచున్నవి. రవీంద్రనాథుఁడు మొదలగు కవీశ్వరు లీ నూతనోద్యమముల యాదర్శములఁ గొనియాడుచు నీ జాతియందలి నూతనోద్భేదమునకు తగిన ప్రోత్సాహము నిచ్చుచున్నారు. ఆంగ్లవాఙ్మయసంసర్గమువలన కవితయందలి పూర్వపు రుచి మాఱినది. దేశభాషావాఙ్మయము లన్నిటిలోవలెనే, యాంధ్రవాఙ్మయమునను నూతనశాఖలు బయలుదేఱినవి. ఈ జాతీయోద్భేదముయొక్క చిన్నెలు క్రమముగ కవితయందును ప్రసరించుచున్నవి. అనేకసంఘములు పరిషత్తులు బయలుదేఱి భాషను వాఙ్మయమును వృద్ధిపఱచుచు, ఇంకను తద్విధానముల నారయుచున్నవి. ఇప్పటి కాంధ్రకవిత కాశ్రయాపేక్ష తప్పిన దని చెప్పవచ్చును. క్రమముగ దేశమున విద్యావ్యాప్తి హెచ్చుచుండుటచే కవితయొక్క గుణాగుణములు నిర్ణయించి తగు ప్రోత్సాహము నిచ్చుట కాంధ్రజనసమితియే పూనుకొనుచున్నది. ఇట్లు జాతీయ జీవనముతో పాటు వాఙ్మయమును భిన్నావస్థలఁ బొందుచుండుటను గనుపెట్టి, ఇప్పుడు వ్యక్తములై క్రమముగ స్ఫుటము లగుచున్న యీ నూతనయుగచిహ్నములను ధర్మములను కవితయందు నెలకొల్పి దేశజనుల కుత్సాహమును నుద్రేకమును పుట్టించి, ఈ జాతీయోద్యమమునకు తోడ్పడి దేశీయకవిశిఖామణు లందఱును శాశ్వతకీర్తిని బడయుదురుగాక !

# విమర్శనా పద్ధతులు

కూచిమంచి వేంకటసుబ్బరావు  కోదాడ రామకృష్ణయ్య గార్లు

ఆంధ్రభాషయందు కృతివిమర్శన మెట్లు చేయవలయునో తెలుపు గ్రంథము లతిస్వల్పముగా నున్నవి. అవి పూర్వకవికృతములు, సంస్కృతమునుండి భాషాంతరీకృతములు. అవి ప్రబంధము లెట్లుండవలయునో శయ్య లెన్ని విధములో నాయకు లెన్ని తరగతులవారో ఈ మొదలగు విషయములను గూర్చి చెప్పును. అంతే కాని, వానిని చదువుటవలన ప్రతివాఁడును ఈ గ్రంథము బాగుగ నున్నది ఈ గ్రంథము బాగుగ లేదని చెప్పఁజాలఁడు. వానివలన నొక గ్రంథము పూర్వలాక్షణికుల నియమముల నన్నిటి ననుసరించి వ్రాయఁబడియున్నదో లేదో మాత్రము తెలియును. అంతే కాని రసవంత మయిన కవిత్వ మన నేదియో కవిత్వమున కుండవలసిన లక్షణము లేవియో అవి తెలుపఁజాలవు. కొన్ని యూహాలు మాత్రమే కవితకు సరిపడియుండును. ఏదియు ఛందోబద్ధ మయినంత మాత్రమున కవన మనఁబడదు. "ఈ రెంటికిని గల భేద మేమి? ఈ భేద మెట్లు గుర్తింపవచ్చును?" అను సంగతులను విచారించు గ్రంథము లేవియు లేవు. తెనుఁగున కవిజీవితగ్రంథములు ప్రబలకుండుటకు కారణము మన పూర్వకవుల జీవితమును గుఱించి తెలియక పోవుటే కాదు, అట్టి యాచారమే లేక పోవుటయును. ఇందులకు ముఖ్యకారణము కృతివిమర్శన యెట్లు చేయవలయునో తెలుపుగ్రంథములు లేక పోవుటయే యని మా యభిప్రాయము. ఏదైన గ్రంథమును చదివి 'ఇది బాగున్నది, అది బాగుగ లే' దని యనుటయేనా కృతివిమర్శనము చేయుట? లేక ఇంక నేమైన కలదా? "ఇది యెందుకు బాగున్నది? ఎందుకు బాగు లే" దను ప్రశ్నలకు నుత్తర మీ పూర్వలాక్షణికగ్రంథములను చదువుటవలన తెలియనగునా? తెలియఁజాల దనియే మా యభిప్రాయము. కనుక నీ వ్యాసమున కావ్య మన నేమియో కావ్యవిమర్శన మెట్లు చేయవలయునో సూచించుట కొకింత ప్రయత్నము చేయఁబడును. కావ్యము కృతి యను పదములను రెండింటిని వాఙ్మయభాగమునకై యుపయోగించుచున్నాము. కావున, ఈ పదములవలన మనవారు కావ్య మని యెంచు కొన్ని గద్యపద్యాత్మకములగు గ్రంథములే కాక, గద్యరూపము లైనట్టియు నాటకరూపము లైనట్టియు గ్రంథములు కావ్యలక్షణములను బొందియుండిన శతకములు దండకములు పదములు పాటలు యక్షగానములు మొదలగు నవి యన్నియు గ్రహింపవలయును. ఈ గ్రంథములయందు వేనిని రచించినను వానిని కవి యనవలయు ననుట స్పష్టమగుచున్నది.

విమర్శన మనఁగా నేర్పుతో చేయఁబడిన యొక పనియొక్క తత్త్వమును తెలిసికొని దాని గుణాగుణములను పరిశీలించి తగు నభిప్రాయమును కలుగఁజేసికొనుట యని చెప్పవచ్చును. కావున, కృతివిమర్శన యనఁగా నొక కృతిని గుఱించి యిట్టి యభిప్రాయమును కలుగఁజేసికొనుటయే. 'రుచి' 'అభిరుచి' యను పదములు విమర్శనావాదములలో సామాన్యముగ నుపయోగింపఁబడుటచే వీని యర్థమును మనము బాగుగ తెలిసికొనవలసియుండెను. ఈ పదములను నిపుణతతో చేయఁబడిన యేదేనొక పనియొక్క విశేషమును గ్రహించుటకు కావలసిన సామర్థ్యమును తెలుపుటకై యుపయోగింతుము. ఇట్టి విశేషములను గ్రహించుపట్ల మన బుద్ధి యొక్కటియే కాక భావములు కూడ పనిచేయవలయును. ఇట్టి శక్తినే రసజ్ఞత యందురు. దీనివలన విమర్శనముయొక్క ముఖ్యోద్దేశ మొక కావ్యముయొక్క రసమును గ్రహించుటే కాని దాని యాధిక్యమును గుఱించి నిర్ణయించుట కాదని తేలుచున్నది. కావ్యము లుత్కృష్టతయందు దేని వెనుక నేది వచ్చునో ఏ కవిని ముందుంచవలయునో ఏ కవిని తరువాత నుంచవలయునో యను నంశము కావ్యవిమర్శకుని ముఖ్యోద్దేశము కాదు. అట్టి సూక్ష్మభేదములు నిర్ణయింపఁజాలము. ఒకవేళ నిర్ణయింపఁగలిగినను అది సర్వజనాదరణీయమై యుండదు. గొప్ప కవులకందఱకును స్వతంత్రములై యనన్యసామాన్యములగు గొప్ప లక్షణములు కొన్ని కలవు. ఈ లక్షణములు అనేకవిధములై యుండుటచే వీనియందు తరతమభేదములను కల్పించుటకు తగిన యవకాశము లేదు. ఇట్లు శ్రీనాథుఁడా లేక పోతనా, పింగళిసూరనా లేక రామరాజభూషణుఁడా గొప్ప కవి యని యడిగినయెడల ఇద్దఱును గొప్ప కవులని చెప్పుటయే దీనికి సరియైన యుత్తరము. పోతన కవిత్వమునందలి గొప్ప లక్షణములు కొన్ని శ్రీనాథుని కవిత్వమున లేవు. ఇట్లే శ్రీనాథుని కవిత్వమునందలి గొప్ప లక్షణములు కొన్ని పోతన కవనమందు లేవు. కావున, వీరి నిద్దఱిని సరిపోల్చుటకు సమాన మగు నాధార మేమియు లేదు. కాని, మనుచరిత్ర గొప్పదియా లేక కవిజనచకోరచంద్రోదయము గొప్పదియా యని యడిగినచో కొంచెము సులభముగను స్పష్టముగను చెప్పవచ్చును. ఈ రెండింటికిని గల భేదము నేర్పఱచుటకు ముఖ్య మగు సమానమైన యాధారము కలదు. మఱియు నొక్కొక్కనికి కొన్నికొన్ని లక్షణములు గొప్పవిగ కనఁబడుచుండును. కనుకనే, కావ్యవిమర్శనమున కవితయందు గొప్పతనమును సూచించు లక్షణము లేవియో, ఏ కవి వీనియందే లక్షణములు గలిగియున్నవాఁడో తేలుటచే, మన మాకవిని బాగుగ గ్రహింపఁగలుగుచున్నాము. దీనిని బట్టి కావ్యవిమర్శనాపద్ధతి యనఁగా, ఏదైన నొక కావ్యముయొక్క యుత్కృష్టతను తగు విధమున గ్రహించుటకుఁ గావలసిన నిధానములనే కాక, అట్టి కార్యమునకు తోడుపడు విషయములను అట్టి యభిజ్ఞతను వృద్ధిపఱచు సంగతులను

కూడ పఠించుట యని తెలుపుచున్నది. కావ్యపఠనమునకు మూఁడు మార్గములు కలవు. వానియందు మూఁడవదానితో మాత్రమే కావ్యవిమర్శన యావశ్యకతను కలుగఁజేసికొనుచున్నది.

(క) మొదటి మార్గము చారిత్రకవిమర్శనము. ప్రతిజాతి యొక్క వాఙ్మయమును ఆ జాతీయజీవితమునందు కలుగుచుండు మార్పులను తెలియఁజేయుచుండును. వాఙ్మయము చరిత్రయొక్క ముఖ్యభాగమై యున్నది. ఒక జాతియొక్క చరిత్ర వారి వాఙ్మయమునందలి ముఖ్యగ్రంథములయినను చదువకయే తెలియదు. ఇట్లాంధ్రుల చరిత్రను వ్రాయు నతఁ డాంధ్రులలో ఘనత నొందిన కవులచే రచింపఁబడిన గ్రంథములను చదువకుండినను, మహారాష్ట్రుల చరిత్ర వ్రాయునతఁడు తద్వాఙ్మయమునందలి ప్రసిద్ధగ్రంథములను చదువకుండినను అంత సంపూర్ణమైన చరిత్రను వ్రాయఁజాలఁ డని చెప్పవచ్చును. ఒక దేశమునం దొక్కొక్క కాలమున సంభవించెడి రాజకీయసాంఘికవిప్లవములవలన ఆ దేశచరిత్రయందును ఆ జాతీయ జీవితమునందును గలుగుచుండెడి మార్పులను ఆ కాలపు కవిత కొంతవఱ కైనను సూచింపక మానదు. ఇట్లు కృష్ణదేవరాయల కాలమునం దాంధ్రుల జీవితచరితమునఁ గలిగిన మార్పులను చాలవఱకా కాలమునాఁటి కవితయందు చూడ వీలగును. కృష్ణామండలములోని రెడ్ల కాలమునాఁటి యాంధ్రుల చరిత్రమునందలి మార్పులను 'పల్నాటి వీర చరితము' మొదలగువానియందు చూడనగును. ఫ్రెంచివా రిండియా దేశమునకు వర్తకము నిమిత్తమై వచ్చి భూములను సంపాదించి రాజ్యమును సంపాదించుటకై చేసిన ప్రయత్నములును అందువలన నాంధ్రుల చరిత్రమునఁ గలిగిన మార్పులును రంగరాయచరిత్రము మొదలగువానియందు చూడఁదగును. మహమ్మదీయప్రభుత్వమువలన నాంధ్రదేశమునఁ గలిగిన మార్పు లనేకశతకములయందు కానఁబడుచున్నవి. ఈ విధముగనే యాంగ్లేయరాజ్యాధిపత్యమున నాంధ్రదేశమున నెట్టి నూతనోద్యమములు ప్రబలినవో ఇంకను కలుగుచున్నవియో ఈ కాలమున బయలువెడలు గ్రంథములను పరిశీలించినచో సులభముగ తెలిసికొనఁ గలుగుదుము. కావున, దేశచరిత్రయందుఁ గలుగుచుండెడి మార్పులను వానివలనఁ గలిగెడి జనుల యాశయములయందలి మార్పులను కొంతవఱకు తెలిసికొనిననే, ఒక్కొక్క కాలమున నొక్కొక్క విధమైన గ్రంథములు ప్రబలుటకును వానియం దొక్కొక్క విధమైన నూతన విషయములు వర్ణింపఁబడుటకును గల కారణములను మనము గ్రహింపఁగలము. బొబ్బిలిపాటను మనము బాగుగ గ్రహించుటకు బొబ్బిలి యుద్ధమును గూర్చి మనకు కొంత తెలియవలయును. రైలుబండిపాట మన కిప్పు డంత మనోహరముగ నుండకపోయినను అది ప్రథమమున దేశమందు రైలు వేయఁబడినప్పుడు దేశీయుల మనంబు లెప్పు డెట్టి యద్భుతాశ్చర్యములతో నిండియుండినవో యిప్పటికిని మనకు తెలియఁజేయుచున్నది. భారతయుద్ధము జరగిన కాలమున దేశస్థితి యెట్లుండెనో జనుల యాచారము లెట్లుండెనో కొంతవఱకు మనకు తెలిసి యుండినఁ గాని అందలి విషయములు కొన్ని మనము బాగుగ గ్రహింపలేము. ఆ కాలమందు జనులలో బహుపతికత్వ మొక యాచారమై పరిగణింపఁబడుచుండె నని తెలిసికొనిననే, ఒక స్త్రీ కేవురు పతు లగుట యెట్లు సంఘటించెనో మనము గ్రహింపఁగలము. లేదా, కవి యేమి యిట్లు వ్రాసె నని యాలోచనలో మునుంగవలసివచ్చును; లేక యిది యొక పురాణ గాథ, దీనికి తల యేమి తోఁక యేమి యని త్రోసిపుచ్చవలసివచ్చును. మఱియొకటి. చంద్రరేఖావిలాపమును చదివినయెడల హాస్యరసప్రధాన మగు కావ్యమువలె మాత్రము కనఁబడును. కాని, అందలి ప్రతిపద్యముయొక్క నిశ్చయార్థమును, ఆకాలమునాఁటి కవులయొక్కయు రాజులయొక్కయు దురాచారములను మనము పూర్తిగ తెలిసికొనినంతనే, మనకు గోచరం బగును. కావున, కవితావిమర్శనము చేయువానికి దేశకాలస్థితులతో కొంతయైనను పరిచయ ముండవలెను. ఇట్టి జ్ఞానము లేకున్నచో కొందఱి కవులను మనము తగునట్లు విమర్శన చేయఁజాలము. ఇట్లు మన పూర్వకవులచే రచింపఁబడిన కావ్యములయందు శృంగారరస మాధిక్యముగఁ గలదని వారిని నిందించెదము. అట్టి సంగతిని తెలిసికొనలేకపోవుట వారి లోపము కాదు. ఆ కాలమం దది యాచారమై యున్నది. తిక్కన కూడ ఆ కాలమున నుండినయెడల, ఆ విధముగనే శృంగారవర్ణనలు చేసియుండు నని చెప్పవచ్చును. కొందఱు తమ కాలమందు ప్రబలిన యాచారముల నామోదింతురు. మఱికొంద ఱామోదింపక తమ స్వాతంత్ర్యమును చూపుదురు. కావున, మనము విమర్శించునప్పుడు వారికి కొంత యవకాశ మిచ్చి వారి యభిప్రాయములయెడ ఆదరము చూపుచు సానుభూతితో చర్చింపవలయును.

ఇంతే కాక, ఒక్కొక్క కాలమునందు ప్రబలిన యాచారములు నాలోచనలును వాఙ్మయముయొక్క విధములను నిర్ణయించుచుండును. జాతీయజీవనమునఁ గలుగుచుండు మార్పుల కనుగుణ్యముగ నొక్కొక్కప్పుడు కవితయందలి రుచియు మాఱుచుండును గావున, ఒక్కొక్క కాలమున నొకవిధమైన కావ్యములు ప్రాముఖ్యము లోనికి వచ్చుచుండును. ఇట్లాంధ్రవాఙ్మయమున ప్రథమయుగము భాషాంతరీకరణయుగమై యుండినది. నన్నయకు పూర్వము చాల కాలమునుండి దేశమందు సంస్కృతభాషయు సంస్కృతవాఙ్మయమును బాగుగ వ్యాపించియుండుటయు, సంస్కృతభాషయందే కాని ప్రాకృతభాషయందుఁ గాని రాజకీయవ్యవహారము లన్నియు జరపఁబడుటయు తటస్థించుటచే, దేశికవిత కొంత వృద్ధిలోనికి వచ్చిన పిదప కూడ, అదివఱలో దేశీయుల యాదరమును పడసినట్టియు అనేక విధములవిశేషాంశములతోఁ గూడికొనియున్నట్టియు అన్యభాషాగ్రంథములను భాషాంతరీకరించుటయే యావశ్యక కర్తవ్యంబై కన్పట్టును. అనంతర మనుసరణములు గాని స్వతంత్రగ్రంథములు గాని బయలువెడలుట సహజము కావుననే, నన్నయతిక్కనాదుల కాలమున పురాణములు భాషాంతరీకరింపఁబడియెను. మనుచరిత్రకాలమున ప్రబంధములు వృద్ధిలోనికి వచ్చినవి. తరువాత ద్వ్యర్థికావ్యములు బయలుదేఱినవి. తెనుఁగున మొదటినుండియు ద్వ్యర్థికావ్యము లుండె ననియు అందు వేములవాడ భీమకవికృతమైన ప్రథమగ్రంథము నశించె ననియు కొందఱు చెప్పుచున్నారు. అవి యన్నియు నశించు టాక యంత. ఒకవేళ నశించి

నను భీమకవి రచించిన ద్వ్యర్థికావ్యము తరువాత అట్టి గ్రంథము చాల కాలమువఱకు ఇతరులచే రచియింపఁబడకుండుట మరియొక వింత. కావున, ఈ సంగతి యాదరణీయము కాదు. ఆంధ్రవాఙ్మయమునందలి యవస్థలను సూక్ష్మబుద్ధితో పరిశీలించినచో, అందు మొదట నెవ్వఁడేని యొకదారి తీసినచో మఱియొక తెఱం గెఱుకపడువఱకును మన కవు లా దారినె పట్టి పోవువా రను విషయము మనకు తట్టకపోదు. కావున, భీమకవి తరువాత రామరాజభూషణుని వఱకు ఇతరులు ద్వ్యర్థికావ్యరచనకే పూనుకొనకుండుట చూడ భీమకవియె యట్టి కావ్యమును రచించియుండలే దని తెలియవచ్చుచున్నది. కాని, రామరాజభూషణుని తరువాతనే ఇతరు లా రచనకుం గడఁగుటయు అట్టి కావ్యములను రచించుట యొక గొప్పతనముగ పరిగణింపఁబడుటయు లటస్థించినది. రామరాజభూషణుఁడు మాత్రమే ద్వ్యర్థికావ్యరచన కేల పూనుకొనవలెనో యిచ్చట కొంచెము విచారింపవలసియున్నది. పెద్దనార్యుఁడు మనుచరిత్ర వ్రాసినంతనే వానితో నించుమించు సమకాలికుఁడగు రామరాజభూషణుఁడును సమర్థుఁడగుటవలన నంతకంటె నుత్కృష్ట మగు గ్రంథము నా ఫక్కినే రచియించి రాజు మన్ననలఁ బడయవలయు నని తలంచియుండును. అంతకు ముందు ధ్వని ప్రధానం బగు కావ్య మున్నతపదం బందు ననువాడుక కలదు గదా? ఇట్టిది యాలంకారికులముచేఁ గూడ శ్రేష్ఠ మని యెన్నఁబడుచున్నది. భారతమున తిక్కన కూడ ధ్వనిని చూప నెన్నియో ప్రయత్నములు జయప్రదముగఁ జేసెను. కావున, తాను కూడ వసుచరిత్రమునం దీ ధ్వనినే ప్రధానముగాఁ జేసినచో తన కోర్కె నిండార ఫలింపవచ్చు నని యూహించి యా కావ్యగుణమును తన ప్రబంధమున చిమ్మివైచెను. ఈ విధముగ వసుచరిత్ర రచనయందు ధ్వనిని కావ్యగుణములలో నంత ప్రధానముగ ప్రదర్శించిన రామరాజభూషణుఁడు వసుచరిత్ర రచించిన పిదప, తనచే నూతనముగ సంపాదింపఁబడిన యపూర్వసామర్థ్యమును వినియోగించుటకు తగిన తెఱ వెద్దియై యుండనోపును? ద్వ్యర్థికావ్యమును రచించుటే యని నిశ్చయముగ చెప్పనగును. ఇఁక రామరాజభూషణకృత మగు ద్వ్యర్థికావ్యమును లక్ష్యముగ చేసికొని ఇతరు లావిధమున ద్వ్యర్థికావ్యములను త్ర్యర్థికావ్యములను గూడ రచింప మొదలుపెట్టిరి. కావున, ద్వ్యర్థికావ్యములు రామరాజభూషణుని కాలముననే యేల వాడుకలోనికి వచ్చిన వని విచారించితిమేని, ఈ ప్రశ్నకే చారిత్రకవిమర్శనముచే నుత్తర మీయ సుసాధ్య మగుచున్నది.

మఱియు నొక్కొక్క కాలమున సంస్కృతపదభూయిష్ఠము లగు పద్యములు జనుల కాహ్లాదము కలిగించుచుండును. తన కవిత్వము 'నిజము కర్ణాటభాష' యందు చేయఁబడిన దని చెప్పుకొన్నను, శ్రీనాథుని కవిత్వమునందు సంస్కృతపదము లధికము. ఈతని కాలమువారి కవిత్వమునం దంతటను ఈ విషయము చూడనగును. కాని, కూచిమంచి తిమ్మకవి తన గ్రంథముల నెక్కుడుగా నచ్చతెనుఁగు పదములు వాడెను. ఆ కాలమునం దచ్చతెనుఁగు పదములను ప్రయోగించు వాడుక విశేషముగ ప్రబలియుండెను. కావుననే అడిదము సూరకవి 'శుద్ధాంధ్రకవి' నని చెప్పికొనియున్నాఁడు. మఱియు ప్రస్తుతము సులభశైలిలో వ్రాయఁబడిన వచనకావ్యము లాదరణీయములై వృద్ధిలోనికి వచ్చుచున్నవి. ఇట్టి పైని వ్రాసిన సంగతులను బట్టి యొక కాలమందు కావ్యరచన యెట్లుండెనో కవిత్వమం దెట్టి లక్షణములు జనుల కిష్టములై యుండెనో ఆయా లక్షణములు గల కవిత లాయా కాలములలో ప్రబలియుండుటకును అప్పటి జనుల యాదరము వడయుటకును గారణము లేవై యుండునో ఆయా కాలములందలి జాతీయజీవన మీ కవితాప్రసారము నేయే విధముల మార్పఁగలిగెనో ఈ మొదలగు విషయములు చారిత్రకవిమర్శనమువలన తెలియనగును. కావుననే యొక కాలమందు ఘనులుగా నెంచఁబడిన కవులు మఱియొక కాలమున నల్లించఁబడకుండుటయు ఒక కాలమున జనుల యాదరమె పడయని కవులు మఱియొక కాలమున మహాకవులుగ నెంచఁబడుటయు సంభవించుచుండును. ఈ విషయములు కొంతవఱకు మన కావ్యములయందలి కృతినిర్మాణప్రస్తావమున చూడనగును. అందలి పద్యములను బట్టి యొక్కొక్క కవి కవితయం దేయే లక్షణములు గొప్ప వని యెంచెనో ఏయే లక్షణములను నిరసించెనో మనకు తెలియుటే కాక, ఆయా కాలములయందు కవుల యభిప్రాయము లెట్లుండెనో కూడ తెలియును.

ఇట్లు జాతీయధర్మములు వాఙ్మయమున ప్రతిబింబితములై యుండు ననియు ఆ జాతీయజీవితమునఁ గలుగుచుండెడి మార్పులు కవితాధోరణిని గూడ మార్చుచుండు ననియు ఈ మొదలగు విషయములు చారిత్రకవిమర్శనమువలననే తేలును కాని, ప్రతిమనుజుఁడు నింకొక మనుజుని కొంతవఱకు పోలియున్నను వానికంటె భిన్నములగు లక్షణములు కొన్ని నియతముగ కలిగియుండునట్లే, ఒక్కొక్క కాలమున నొక విధముగు కవిత ప్రబలినను ఆ కాలమందలి ప్రతికవియందును ఇతరకవులయందుఁ గానరాని కొన్ని స్వతంత్రలక్షణము లుండును. కాని, చారిత్రకవిమర్శన మీ స్వతంత్రలక్షణములను గణన చేయదు. ఇట్టి విమర్శన మాయా కాలములలో కొన్ని సామాన్యలక్షణములు చూడఁదగు నని సమాధానము చెప్పునే కాని, ఆయా లక్షణములయం దేవి మంచి కవితకు చెందుననియో ఏవి చెందనివియో నిర్ణయింపకపోవుటచే, కావ్యపఠనమునకు ముఖ్యమైన యభిరుచిని తృప్తిపఱుపఁ జాలదు. కావున, కావ్యవిమర్శనము చారిత్రకవిమర్శనముకన్న భిన్నమై వెలయుచున్నది. ఇట్లనుటచే చారిత్రకవిమర్శనయొక్క యావశ్యకత తగ్గుట లేదు. ఏల యన, కావ్యవిమర్శనావిధానములను పూర్తిగ చర్చించునపు డప్పటప్పట నితరకాలములయందలి కవితారీతులతో నొక కాలమందలి పైరులను పోల్చి చూచుచుండుట యావశ్యకమై యున్నది గదా!

(చ) ఇఁక రెండవవిధమైన విమర్శనమును గూర్చి కొంచెము ముచ్చటించెదము. ఇది కవిజీవితముతో సంబంధించియుండును. ఏదియైన నిపుణముగా చేయఁబడిన పనిని చూచితిమేని ఆ పనివానిని గూర్చి కొంత తెలిసికొనఁగోరెదము. అట్లే యొక కావ్యము రసవంతమై

యుండినయెడల ఆ కవిని గూర్చి కొంత వినఁగోరెదము. ఒక కవి యెఱ్ఱనివాఁడో నల్లనివాఁడో పెద్ద వయసున కవనము చేయ నారంభించెనో చిన్నతనమునందే యారంభించెనో ఈ యంశములు మనకు తెలియకపోయిన నతని కావ్యము చదివి దానియందలి మంచిచెడ్డల నారయుటకు వీలు లేకపోలేదు. అయినను ప్రతిమనుజునియందును కొన్ని స్వతంత్రలక్షణము లెట్లుండునో అట్లే ప్రతి కవియందును అట్టి లక్షణములు మిగిలిన కవులనుండి అతనిని వేఱుపఱచుచుండును. కావున, ఆ కవియొక్క యభిప్రాయములు మనకు బాగుగ తెలిసిన యెడల అతని కవనమును మనము బాగుగ గ్రహింపఁగలము. కవి గ్రంథములను అందలి విశేషాంశములను పూర్తిగ గ్రహింపవలయు నన్నచో ఆ కవి జీవితమును గుఱించి మనకు కొంత తెలియవలయును. మన పూర్వకవుల జీవితములను గుఱించి మనకు బాగుగ తెలియకపోవుట చేత ఈ విషయము నింతటితో ముగించి మూఁడవ విధమైన విమర్శనమునకు పోవుదము.

(ట) ఈ మూఁడవ విమర్శనమును కవితావిమర్శన మని కాని కవిత్వతత్త్వవిచారణ యని కాని చెప్పవచ్చును. ఏదైన నొక కావ్యమును దీసి 'దీని యాధిక్య మేమి? ఇ దెంతవఱకు రసవంతమైన కావ్యము? దీని యాధిక్యమునకును సర్వజనాదరణీయంబై యిది యింత కాలంబు నశింపకుండుటకును కారణ మేమి?' అని యడుగవచ్చును. ఇట్టి ప్రశ్న వేయుటకుఁ గాని దానికి సమాధానము చెప్పుటకుఁ గాని ఆ కాలమందును అంతకు పూర్వమును జరగిన చరిత్రాంశముల నెఱిఁగియుండుట గాని కవిజీవితముతోడి పరిచయము గాని యవసరము లేదు. నిజముగ నుత్కృష్టకావ్యము లొక కాలమునకే చెందునవి గాక సార్వకాలికములై యుండును. ఇట్లని ఆ కాలమందలి ధోరణు లేవియు ఆ కావ్యములయందుఁ గానరావని మా యభిప్రాయము కాదు. కాళిదాసకృతి కావ్యము లొక కాలమునందలి యొక జాతియొక్క యాచారవ్యవహారములను వర్ణించినవైనను, ఇప్పటికిని తదితర జాతుల జనంబులకు నానందంబు గూర్చుచున్నవి. కాని, పోతన మహాకవి కృతంబైన భోగినీదండక మా కాలమున కొంత యాదరము పడసినను ఇప్పటి కాలమున పడయఁజాలదు, పడయుటయును లేదు. ఇట్లు కవిజీవితమును గుఱించి యేమియు తెలియకున్నను, అతనిచే రచియింపఁబడిన కావ్యము గొప్పదై యుండెనా దాని యాధిక్య మెన్నఁటికిని నిలిచియే యుండును. తిక్కనసోమయాజి జీవితము మనకు తెలియకున్నను అతని భారతము చదివి మన మానందించుచునే యుంటిమి. కాని, కవియొక్క జీవితచరితయు అతని కాలమందలి యాచారములును మనకు బాగుగ తెలిసెనా, కవి వానిచే నెంతవఱకు నుద్రేకింపఁబడెనో వాని నెట్లు తన కావ్యమున నివేదించెనో గ్రహింపఁగలము. వాని యుద్దేశములను బాగుగ గ్రహింపఁగలము, అనఁగా కవిహృదయము మనకు బాగుగ బోధపడఁగలదు. కాని, మన కవులే పురాణగాథనో తమ గ్రంథమున కితివృత్తముగ తీసికొని దాని నించుక మార్చియో మఱికొంత చేర్చియో దానియందే తమ వర్ణనాచాతుర్యమును చూపుచు పరమార్థోపదేశము చేయఁబూని యున్నతాదర్శములను చాటు నున్నతపాత్రలను వాఙ్మయమున నెలకొల్పిరి. అంతే కాని, వారు మానవజీవితమును గుఱించిగాని మఱి యే విషయమును గుఱించి గాని తమ యభిప్రాయమును తెలుపుచు తమ విషయమై యేవిధమైన ప్రశంసయైన చేయుచు వ్రాసిన గ్రంథములు తెలుఁగు భాషయందు మిక్కిలి తక్కువ. అట్టివి శతకములలో కొన్ని భాగములును కావ్యములయందలి పీఠికలలో కొన్ని భాగములును రామదాసు చరిత్ర మొదలగునవి నాలు గైదును మాత్రము కలవు. తమ యభిప్రాయమును వెల్లడిచేయుచు కావ్యములను వ్రాయు వాడుక మన తెలుఁగు కవులలో లేదు. మనకవులకు జనులకు కూడ పురాణములయందును పూర్వగాథలయందును గల యత్యాదరమును, కావుననే వా రా పురాణపురుషలోకమునుండి సామాన్యజనసమితిలోనికి దిగకుండుటయు, పూర్వలాక్షణికులచే నిర్ణయింపఁబడిన నిబంధనలను ఒట్టియే కావ్యరచనకు పూనుకొనుటయు, అట్టి వాడుక లేకుండుటకు ముఖ్యకారణము లగుచున్నవి. మఱియు వీ రే రాజుల యాస్థానములనో యుండి వారి యనుగ్రహముకొఱకై కావ్యములు రచించుచుండుటం జేసియు, వీరికిని సామాన్యముగ నాంధ్రజనసమితికి నెక్కుడు సంబంధము లేకుండుటం జేసియు, వీరి యుత్తమపాత్రలు ధీరోదాత్తాదినాయకులు పురాణగాథలందుఁ గన్పట్టెనే కాని, తాత్కాలికదేశచరిత్రయం దెచ్చటను గన్పట్టలేదు. మఱియు నీ లాక్షణికుల నిబంధనలు కవుల స్వాతంత్ర్యమునకు మారకము లని చెప్పవచ్చును. అందుచేతనే మొదట రచియింపఁబడిన నాలు గైదు గ్రంథములు తప్ప తక్కిన వన్నియు చదువుటకంత యానందదాయకములు కాకుండుట. కావుననే ఒకటే విధమగు వర్ణనలు ఒకటే విధమగు రాజులు ఒకటే విధమగు నాయికానాయకులు గన్పట్టుదురు. ఈ కావ్యములలో వర్ణింపఁబడిన జనులు మానవులు గారు. వారు దేవతలో కఱ్ఱబొమ్మలో యయి యుందురు. ఇంకను ఇట్టి యాపద లెన్నియో యాంధ్రవాఙ్మయమునకు తటస్థించినవి. అవి ముం దుదాహరింపవలసియుండుటచే నింతటితో ముగించుచున్నాము. కాని, యీ సందర్భమున జ్ఞప్తియం దుంచుకొనవలసిన యంశము మన కవులే గ్రంథములయందును తమ యభిప్రాయములను వెలిపఱుపకుండుటయే. కావున, కావ్యముయొక్క గుణములను పరీక్షచేసి దానియందలి యాధిక్యమును కనుఁగొనుటకు ప్రయత్నించుటయే మనము చేయఁగలిగిన పనియై యున్నది. ఇట్లు కావ్యములను విమర్శించు పద్ధతులు ద్వివిధములై యున్నవి. మొదటిది కావ్యవిషయమునకు లేక వస్తువునకు చెందియున్నది, అనఁగా కథ రసము ఊహాపోహాలు మొదలయినవి. రెండవది కావ్యాకారమునకు చెందునది, అనఁగా కావ్యస్వరూపము పద్యముల సొంపు మొదలయినవి. కావ్యవిమర్శనమున, ఈ లక్షణములలో నొకదానికి మఱియొకదానితోఁ గల సంబంధము, వానిలో వివిధము లగువానికిఁ గల ప్రాముఖ్యము, ఎట్టి లక్షణము లేయే విధమయిన కావ్యరచనకు చెందునో, మొదలగు విషయము లన్నియు చర్చింపఁబడును. ఈ విధముగ నాలోచించినయెడల విమర్శన యనునది విద్య గాక శాస్త్రమై యున్నది. శాస్త్ర మని చెప్పుటవలన, ఏదైన నొక

కావ్యమును దీసికొని దానిని విమర్శన చేయక విమర్శనాపద్ధతులను మాత్రమే విశదీకరించుట యని తెలియుచున్నది. సామాన్యముగా కావ్యవిమర్శన మనఁగా నేదైన నొక కావ్యమును విమర్శన చేయుట యని తలంతురు. కాని, విమర్శన చేయుట కాధారముగా నందఱిచే నంగీకరింపఁబడినట్టియు ప్రపంచమునందలి వాఙ్మయమును పరిశీలించి గ్రహింపఁబడినట్టియు కొన్ని సంగతులను వ్యాపకము చేయుటయే దీని ముఖ్యోద్దేశమై యున్నది. కావున, విమర్శన మట్టి ముఖ్యసంగతులను గుర్తించుట కావశ్యకమైన కొన్ని ప్రమాణములను గాని విధానములను గాని సూచించును.

దీనిని బట్టి విమర్శనము గూడ అలంకారశాస్త్రాంతర్భాగమే యని యెంచరాదు. లక్షణశాస్త్ర మవి మనవా రలంకారశాస్త్రమునకు పేరు పెట్టుచున్నను నిజముగా అది శాస్త్రము కాదు. అది విద్యయై యున్నది. కనుక నిఁక ముందు 'కావ్యలక్షణ' మని యుపయోగింపఁబడినప్పుడు దానివలన నే విధమయిన కావ్యమునైన రచించుటకు తగిన విధానములను తెలుపున దని గ్రహింపవలయును. అనఁగా కావ్యలక్షణమునకును కావ్యవిమర్శనమునకును గల భేదమిది. కావ్యలక్షణ మేదైన నొక కావ్యము నెట్లు వ్రాయవలయునో చెప్పును. కాని, కావ్యవిమర్శనము వ్రాయఁబడిన యేదైన నొక గ్రంథము నెట్లు పరిశీలింపవలయునో దాని గుణముల నెట్లేర్పఱుపవలయునో చెప్పును. కావ్యలక్షణమున కొక సంగతి చెప్పఁదగినది యా కాదా యను విషయముతో సంబంధము లేదు. చెప్పఁబడిన సంగతి చెప్పఁదగినదేనా యనియు అది జనుల కే విధముగ నగపడునో యనియు కావ్యవిమర్శనము చర్చించుచుండును. కావ్యలక్షణము గుర్తింపఁజాలని యనేకసూక్ష్మలక్షణములను గూడ గ్రహించుచు కావ్యవిషయమునకు కావ్యరూపము సరిపడియుండెనో లేదో కూడ పరీక్షించుచుండును. కావున, కావ్యరచనావ్యాపారముకన్న కావ్యవిమర్శనావ్యాపార మధికము. కాని, విమర్శనాపద్ధతులు కావ్యలక్షణముయొక్క పద్ధతులవలె మిక్కిలి విస్పష్టముగ నుండఁజాలవు. క్లుప్తముగా విమర్శన మొక శాస్త్ర మనియు, సరియైన వాఙ్మయమున కుండవలసిన లక్షణముల నేర్పఱుపఁబూను ననియు, ఈ లక్షణముల నేర్పఱుచుట కావశ్యకములైన విధానములే మిగిలిన కావ్యములను పరీక్ష చేయుట కుపయోగపడు ప్రమాణము లనియు చెప్పియున్నాము.

కాని, కొందఱీ విధముగా ప్రమాణముల నేర్పఱుచుటకు వీలు లేదని వాదింతురు. వారి వాద మిది: వాఙ్మయవిషయములలో స్వాభిప్రాయముకన్న మిన్నయైన ప్రమాణము లేదు. ఒక కావ్యమును గూర్చి భిన్నాభిప్రాయములు గలిగిన నొకదానిని మఱియొకదానికన్న నెక్కువగా నెంచుటకు కారణ మేమియు లేదు. అభిరుచి విషయమున బాహ్యప్రమాణమే యుండుటకు వీలు లేదు. ఏదైన నొక గ్రంథ మాహ్లాదదాయకమై యున్నయెడల సరి. అంతే కాని, ఆ యానందము నిజమైన దని కాని కా దని కాని చెప్పుటకు వీలు లేదు. ఒకటి యెక్కువ యని కాని తక్కువ యని కాని యనరాదు. కావ్యము చదువరులకు సంతోషమును కలుగఁజేయుటకై నిర్ణయింపఁబడినది. అది నాకు సంతోషమును కలుగఁజేసినయెడల, అది మంచి కావ్య మని నే నెంచెదను. చాలమందికి సంతోషమును కలుగఁజేసిన యెడల చాలమంది మెచ్చెదరు. కాని, దానిని గూర్చి తారతమ్యపరీక్ష చేయుటకు వీలు లేదు. కావ్యవిషయకాభిప్రాయము లభిరుచిని బట్టి యుండును గావున, వానికి కారణములను చూపఁజాలము. అవి నియమబద్ధములు కావు. ఇది వీరి వాదము.

ఈ వాదమును గూర్చి కొంచెము చర్చింపవలయును. కొన్ని కావ్యములు వాఙ్మయమున తదితరములకంటె నెక్కుడుగా జనులచే నాదరింపఁబడుచున్నవి. నైతికప్రతిపాదన మొకవేళ ఈ గ్రంథముల కాయాధిక్యమును తెచ్చిపెట్టిన దని చెప్పుటకు వీలు లేదు. ఏలయన, మంచి నీతులను గఱపునదైనను ఒక కావ్య ముత్తమలక్షణములతోఁ గూడియుండక జనుల యాదరమును పడయలేకపోవచ్చును. కావున, ఇట్టి భేదములు కలుగుటకుఁగాను స్వాభిప్రాయాధీనము కానట్టియు అంతకు భిన్నములై కవితయం దుత్కృష్టతానిర్ణాయకములగునట్టియు కొన్ని ప్రమాణము లుండవలయును. 'లోకో భిన్నరుచిః' అనుటవలన, అభిరుచి కధీనములగు విషయములయందు జనుల యిష్టానిష్టములను గూర్చి మన మేమియు నిర్ణయింపఁజాల మనియే కాని, అట్టి యభిరుచి సరిగ నుండెనో లేదో యను విషయమును నిర్ణయించుటకు ప్రమాణములే యుండఁగూడ దని కాదు. ఇంగువ వాసన యొకని కింపుగ నుండును, మఱియొకని కసహ్య మగును. ఇట్టిచో, ఇంత దుర్వాసన గల వస్తువు నీ కెట్లింపుగ నుండె నని కాని, ఇంత సువాసన గల వస్తువు నీ కేల సహ్యము కాకుండె నని కాని యడుగరాదు. ఒకనికి దంపుల పాటలు త్యాగరాయ కృతులకన్న నింపుగా నుండవచ్చును. దీనిని బట్టి త్యాగరాయకృతులు దంపుల పాటలకన్న మంచివి యనుటలో నర్థము లేకపోలేదు. దంపుల పాటలయం దభిరుచి కలవా రొకరే కాక వానికి సహాయముగ నూఱుగు రున్నను, వా రందఱు గూడ తక్కువ గానియం దుత్కృష్టత నాపాదించి పొరపడి రని చెప్పుటకు వీలు కలదు. కావున, పలువుర కొకటి రుచించినంత మాత్రమున నద్దానియం దుత్కృష్టగుణములు కల వని చెప్పుటకు వీలుపడదు. ఇట్టి విషయములందు కూడ నెక్కువతక్కువలు సకారణముగ నిరూపింపవచ్చును. అవి యెక్కువమంది యభిప్రాయము వలన మాత్రమే యట్లు నిరూపింపఁబడుచున్న వని యెంచరాదు.

సరే, ఇది నిజమై యుండవచ్చును. కాని, బుద్ధిమంతులును తగు సామర్థ్యము కలవారును నగు విమర్శకులయందుఁ గల భిన్నాభిప్రాయములను గూర్చి యేమి చెప్పెదు రని యాక్షేపణ కలుగవచ్చును. అభిరుచియందలి ప్రమాణములు వేర్వేఱు దేశములలో వేఱువేఱుగా నున్నవి. ఒక దేశమందే, ఒక్క కాలమునందలి యభిరుచి ప్రమాణములకును ఇంకొక కాలమందలివానికిని భేదము కలదు. ఒక కాలమునందే సమర్థులగు విమర్శకులు కొందఱు కొన్ని కావ్యములను గొప్పవిగను మఱికొంద ఱా కావ్యములనె న్యూనములుగను నెంచియున్నారు. శృంగారవర్ణనతో నిండియుండిన గ్రంథము లొక

కాలమున జనరంజకముగా నుండెను. ఈ కాలమున నవి యెక్కువగా నెంచఁబడుట లేదు. కాని, కొంచె మాలోచించినచో ఈ ప్రకరణములయందలి భేదములు నిజముగా నగపడుచున్నంత యధికమైనవి కావు. వేలువేలు మనుష్యులయందును కాలములయందును జాతులయందును కనఁబడెడి యభిరుచియందు భేదాంశములకన్న సాదృశ్యాంశము లెక్కువయై యున్నవి. ఎట్లయిన, ఈ సాదృశ్యాంశములే ముఖ్యమైనవి. వీనిని బట్టియే వాఙ్మయము శాశ్వతిస్వరూపముం బడయుట, కళలు కల్పాంతస్థాయులై యుండుట. వ్యాస వాల్మీకి కృత భారత రామాయణములు రచింపఁబడిన కాలముకంటె ఇప్పటి కాల మెంతో మార్పు చెందినది. కాని, ఆ గ్రంథము లే మాత్రము ప్రాఁతవడలేదు. ఆ కాలమున ఆ గ్రంథముల నేయే లక్షణములకై యభినందించియుండిరో, ఆ లక్షణములవలననే ఇప్పుడు మనము వానిని చదివి యానందించుచున్నారము. కావున ఆ కాలమున నే లక్షణములు గలది నిజమగు కవితగా నెన్నఁబడినదో అట్టిదే ఇప్పుడు కూడ కవితాశబ్దవాచ్యం బగుచున్నది. ఇట్లభిరుచియందు కొంత వఱకు సామ్య ముండుటచేతనే సార్వకాలికము లగు విమర్శనాధారములు కలుగుటకు వీలగుచున్నది.

ఇంతియ కాదు. కొన్ని విషయములను గూర్చి యభిరుచియందు భేదములు కనఁబడుచున్నను, అవి యన్నియు మఱికొన్ని ముఖ్యాంశములను గూర్చి మనకుఁ గల యభిరుచియొక్క సామ్యముతోఁ గూడి యుండవచ్చును. కొన్ని విషయముల నభిప్రాయభేద ముండినను ముఖ్యాంశములలో నైకీభావ ముండవచ్చును. ఇట్లు నాటకరచనయందు కొందఱు మహాకవులు 'విషయైక్యము' 'కాలైక్యము' 'స్థలైక్యము' ఈ మూఁటి నవశ్యముగ పాటింపవలయు నని యభిప్రాయపడినను, తరువాత మఱికొందఱు ఈ మూఁటి నంత యావశ్యకముగ నెంచుట లేదు. దీనియం దిట్లభిప్రాయభేదము కలదు. అట్టి యభిప్రాయభేద మున్నను నాటకరచనయందు విషయైక్య మెల్లప్పుడు నావశ్యకమే యని యన్ని మతములవారు నొప్పుకొనవలసి యున్నది. ఇట్లు సమర్థు లగు విమర్శకులలో నభిప్రాయభేద మొక్కొక్కొక లక్షణము-మిగిలిన ముఖ్యలక్షణములకంటె నత్యావశ్యక మని తలంచుటలోఁ గలుగుచున్నది.

ఇంతవఱకును విమర్శకుల యభిప్రాయములయందు భేదము లుండుటచే సర్వజనాదరణీయము లగు విమర్శనావిధానముల నేర్పఱుచుటకు వీలు లే దను నాక్షేపణలను గూర్చి విచారించియున్నాము. మఱికొందఱు వాఙ్మయముయొక్క స్వభావమును బట్టియే, విమర్శనాశాస్త్ర మనునది యొకటి యుండుటకు వీలు లే దని యనవచ్చును. వారి వాదము నీ క్రింద సంగ్రహించుచున్నాము. శృంగారప్రబంధములను చదివినపు డొక యానందము కలుగుచున్నది. హాస్యప్రబంధములు చదివినపుడు మఱియొక విధమగు నానందము పుట్టును. వీరరసభరితంబు లగు కావ్యములు వేఱొక విధమైన యానందమును కలిగించును. మతగ్రంథములవలనఁ గలుగు నాహ్లాద మొక విధమైనది. ఇట్లు వాఙ్మయముయొక్క ఫలసిద్ధి యనంతము. అట్టిచో, వీని కేకీభావము కుదురు టెట్లు? అట్టి యేకీభావమే లేనప్పుడు విమర్శనాశాస్త్ర మనునది యె ట్లుండఁగలదు? అనఁగా, బాహ్యప్రపంచమున నెన్నెన్ని తెఱఁగు లగు వస్తువు లున్నవి. వానిని చూచుటవలన మన కెన్నెని మనోవికారములు కలుగుచున్నవి. అట్లే కవిత యాయా వస్తువుల నన్నిటిని ప్రదర్శించు మనది గావున వానివలనఁ గలుగు మనోవికారములు కూడ ననంతము లగుచున్నవి. అట్టియెడ ఈ యనంతము లగు కార్యముల కన్నిటికిని చెందు విధానముల నేర్పఱచు టెట్లు? "బాణు వేగంబును భవభూతి సుకుమారతయు మాఘు.. ..దండి సకృత, అల మయూరు సువర్ణకలన చోరుని యర్థసంగ్రహంబు మురారి శయ్య నేర్పు సోము ప్రసాదంబు సోమయాజుల నియమంబు భాస్కరుని సన్మార్గఘటన, శ్రీనాథుని పదప్రసిద్ధధారాశుద్ధి అమరేశ్వరుని సహస్రముఖదృష్టి" యును కావ్యమునకు కావలసిన యుత్తమ గుణములే. ప్రబంధ మే విధమున కవిత యగుచున్నదో ఆ విధముననే శతకము నగుచున్నది. "బ్రతికియుండిన సుఖములఁ బడయవచ్చు" "ముగురం గూర్చిన ముండ దైవమునకున్ మోమోటు లేదో సుమీ" ఇత్యాదివాక్యములు కూడ నుత్తమ కవితాలక్షణములను పొందియున్నవి. ఏ మన ప్రతిమలను చేయువాని నేర్పు కృష్ణదేవరాయని కాలమున స్థాపింపఁబడిన యుగ్రనరసింహవిగ్రహమునం దెట్లు చూపెంపఁబడినదో, అట్లే యొక వజ్రాంగుళికమునందును చూఁడవచ్చును. కావున, అనేకవిధములుగ కవితలు వాఙ్మయస్వరూపమును చెందును. ఒకానొకప్పుడు మన బుద్ధిని సంతోషపఱుచుటచేతనో భావోద్రేకము కలుగఁజేయుటచేతనో ఒక కృతి ఘనత వహింపవచ్చును. ఒకప్పుడు పదసౌష్ఠవముచే పేరుగాంచవచ్చును. ఇట్లనేకవిధముల నుత్కృష్టతం బడయవచ్చును. వీని నన్నిటిని కొన్ని సామాన్యజాతులుగ మార్చితిమా, వానియందలి వ్యక్తిభావము నశించుచున్నది. ఇట్టి జాతులు చాల నుండినయెడల మన బుద్ధియొక్క శక్తులను భావములయందలి భేదములను వర్ణించుటలో గందరగోళమో లేక సంక్షోభమో తప్పదు. కావున, విమర్శనముయొక్క ముఖ్యవ్యాపార మేమి యనఁగా, ఒక కృతియం దేమేమి యుత్తమగుణములు కలవో చూపించుటయె కాని, ఈ కావ్య మింకొక కావ్యముకన్న గొప్పది లేక తక్కువది యని చూపించుట కాదు అభిరుచికి ప్రమాణముల నేర్పఱచుటయుఁ గాదు. విమర్శకుఁ డొక గ్రంథమును చదివి తన కానందమును కలుగఁజేసిన భాగములను బహుళః మిగిలిన వారికిఁ గూడ నానందము కలుగఁజేయు నను తలంపుతో చూపించుట మాత్రమై యున్నది. ఏ విమర్శకుఁడు తెలివి గలవాఁడును సానుభూతి కలవాఁడును నగుచున్నాఁడో అతని విమర్శ బాగుగ నుండును.

ఈ వాదమున కొంత నిజము కలదు. దీనివలన విమర్శనము సర్వవ్యాపి యగు వ్యాపారము గాక, దాని ప్రసారమునకు కొంత పరిమితి గల దని తేలుచున్నది. కావ్యగుణములు నిజముగ ననంతములు. కాని, వానియందు కొంత వ్యవస్థ కలిగించుటకు వీలు లే దని యెంచరాదు. ఎప్పు డొక కావ్యగుణము మఱియొక కావ్యము గుణమునుండి భిన్న మని మనము గుర్తించుటకు వీ లున్నదో, అప్పుడే యీ భేదము

లను కనుఁగొనుట కుపయోగించు నాధార మొకటి యున్న దనియును తేలుచున్నది. కాని, ఈ వేఱువేఱు గుణములను జూపించుచుండిన కావ్యము లన్నిటియందును కూడ నెట్టి సమానలక్షణము లుండుటచేతనే వీనిని కావ్యము లనుచున్నామో వీని నన్నిటిని కలిపి వాఙ్మయ మనుచున్నామో వానిని నిరూపింపవచ్చును. భావనాశక్తి కావ్యములలో వేయి విధములుగ నగపడవచ్చును. అయినను, కవనమునకు భావనాశక్తి యావశ్యకము గదా. కావున, భావనాశక్తి యన నేమో అది యెట్లు పనిచేయుచుండునో చెప్పుటవలన వాఙ్మయమును మనము సరిగా గ్రహింపవచ్చును.

ఇంతవఱకు చర్చించిన యాక్షేపణలు గాక, వేఱొక యాక్షేపణ చేయఁబడుచున్నది. ఇది వెనుకటి మాఁటికన్నను బలవత్తరమగుటచే దీనిని జాగరూకతతో పరిశీలింపవలయును. వాఙ్మయము భావమందు వ్యక్తిభావమును ప్రదర్శించును. వాఙ్మయ మన నేమి యను ప్రశ్న కుత్తరము 'అది ధీప్రభావ' మని చెప్పుటయె. అది యనిర్వాచ్యమును, వర్ణనాతీతము నగుదానిం దెలుపునదియై యున్నది. ధీప్రభావ మీయీ నియమముల ననుసరించి యుండవలె నని మనము చెప్పఁజాలము. మన మెన్ని నియమములను చేసినను వాని ననుసరించిన రెండింటిలో నొకటి యుత్తమకవిత కావచ్చును, రెండవది కాకపోవచ్చును. విమర్శన యందులకు కారణమును చూపఁజాలదు. ఒకచో ధీప్రభావము కల దనియు రెండవచో లే దనియు మాత్రము విమర్శకుఁడు చెప్పఁగలుగును. ఏ మన, ధీప్రభావము పృథక్త్వము వీనియొక్క లక్షణ మద్వితీయతయే. అట్టి యద్వితీయ మగుదాని నెట్లు నిరూపించుట, లేక వర్గీకృతము చేయుట? కనుక, నిజముగ నిట్టి పృథక్త్వమును ప్రచురించు కావ్యమెల్ల నూతననిర్మాణ మగుచున్నది. దీనియొక్క నూనత ఈ యద్వితీయతయందే యుండుటచే దానిని మన నియమములు బంధింపవు. పోతన యెంతవఱకు నన్నయతిక్కనలను పోలియుండెనో, వారికంటె భేదమును కనఁబఱచుచు తన వ్యక్తిభావము నే విషయమున కనఁబఱచెనో చెప్పుటచేతఁ గాని విమర్శకుఁడు మనలను పోతనను బాగుగ గ్రహించునట్లు చేయఁజాలఁడు. పోతనయందు ముఖ్య మగు నట్టియు ఇతరకవులందు లేనట్టియు విషయములను గుర్తెఱుంగుట గదా మన ప్రయత్నము. ఇందువలననే మనము పోతనను గ్రహింపఁ గలుగుచున్నారము. ఇట్లు గ్రహించుటకు విమర్శకుఁ డెట్టి సహాయకారి యగుచున్నాఁడు? అని వీరు చెప్పుదురు.

ఎట్టి విమర్శనయు ఈ పై సంగతిని మనకొఱకు చేయఁజాలదు. ఒక గ్రంథమునందా కవి సత్త్వమును గ్రహించుటకై మనమే యా గ్రంథమును చదువవలయును. ఎవరికి వారే చదివి యానందింపవలయును. పంచదార రుచి యెంత వర్ణించినను, అది గానిని పోలి యుండును దీనిని పోలియుండును అని చెప్పినను, దానిని స్వయముగా రుచిచూచినఁ గాని దాని రుచి తెలియదు. పంచదార రుచి పంచదారదే. అది వర్ణనాతీతము. ఇట్లే ప్రతి యుత్తమకావ్యముయొక్క ఘనతయుఁ గూడ కొంతవఱకు వర్ణనాతీతముగ నున్నది. కావున విమర్శనావిధానము లతిస్వల్పములుగ నుండవలెను. సర్వతఃప్రసృతము లగునట్టియు సవిస్తరమగునట్టియు విధానముల నేర్పఱుపఁబూనరాదు. అట్లు చేసినచో అవి పరంపరాగతము లగునట్టివి యైన కావలయును, లేదేని వేఱువేఱు విమర్శకుల స్వాభిప్రాయములుగ నైన నుండవలయును, లేదా ప్రస్తుతకాలమునకు మాత్రమే చెందునవి యైనను గావలయును. కాని, అవి సార్వకాలికములు సార్వజనీనములై యుండనోపవు ఇట్టి నియమములను మనవారలు చేసియుండుటచేతనే ఆంధ్రవాఙ్మయమునందు మొత్తముమీఁద నొక్క రూప మగు కవితయే వెలువడినది. కావుననే, కవియందుండవలసిన సత్త్వము నశించి యొకరూపమును పొందియున్నది. వసుచరిత్ర తరువాత వేనినైన నిరువది ప్రబంధములను తీసికొని యొకటి రెండవదానికన్న నెట్లు భిన్న మగుచున్నదో నిరూపింపఁ బ్రయత్నింపుఁడు. పురవర్ణనము పుష్పలావికావర్ణనము రాజవర్ణనము మొదటి యాశ్వాసమునను, వేఁట మొదలగునవి రెండవ యాశ్వాసమునను, ఇట్లే గతికొన్ని సంగతు లితరాశ్వాసములను కనఁబడుచున్నవి. ఆ కావ్యముల కథాభాగమున కిసుమంతైన నడ్డు కలుగకుండ మూఁడు వంతుల పద్యములను తీసివేయవచ్చును గదా? ఒక గ్రంథములోని కథానాయకుని మఱియొక గ్రంథమున కథానాయకునిఁగా చేయవచ్చును గదా? ఆ గ్రంథములలోని కథానాయకులు మనకు మనుష్యులవలె కనఁబడుచున్నారా? ఇట్టి యాపద ఆంధ్రవాఙ్మయమున కేల వచ్చినది? పూర్వలాక్షణికు లేర్పఱచిన నిబంధనలవలననే కదా? స్వతంత్రప్రతిభ యీ నిబంధనలకు లొంగియుండునా? అందువలన విమర్శనావిధానములు వాఙ్మయనిర్మాణవిధానములు కాఁజాలవు, కాఁగూడదు, కావు. ఆ విధానములు కవికై యుద్దేశింపఁబడి యుండలేదు అతని కవితారసమును గ్రహింపనెంచువారలకై యుద్దేశింపఁబడినవి. 'కవి ర్గాయతే న క్రియతే' యను వాడుక కలదు. భావోద్రేకము కలిగి కవిత చెప్పువాఁ డీ విధుల ననుసరింపఁడు. ఇంతే కాక, అతని కవితె నాధారము చేసికొని ఈ విధు లేర్పఱుపఁబడుచున్నవి. 'అందఱును చెప్పుచుండిరి, నే నేల చెప్పఁగూడదు?' యని యేవో చిపరపాపరతీఁగెల చేఁపల బుట్టల్లినట్లు పద్యములు కూర్చువాఁడు కవి శబ్దవాచ్యుఁడు కాఁజాలఁడు. అట్టివాని కవిత "భోజనం దేహి రాజేంద్ర ఘృతసూప సమన్విత" మనునట్లుండునే కాని 'మాహిషంచ శరచ్చంద్ర చంద్రికాధవళం దధి" యనునట్లుండదు. విధులను గమనించియుండవచ్చును గాని, కవి కాఁజాలఁడు. ఇంతకును తేలిన దేమన, విమర్శనావిధానము లెంత బాగుగా నుండినను, విమర్శ చేయఁబూనువానికి సహజముగ కొంత గ్రహణశక్తి యుండనియెడల నివి యేవియు తోడ్పడవు. తాను విమర్శన చేయు గ్రంథము నవగాహన చేసికొనుటకు తగిన సామర్థ్యము స్వయముగా నుండవలెను గాని, విమర్శనావిధానములు కలుగఁజేయఁజాలవు. అట్టి శక్తి యున్నయెడల విమర్శనావిధులు దానిని క్రమపఱచి యుపయోగపడునట్లు చేయును.

విమర్శకుఁడు ప్రతిభావంతుఁడాయెనా అతని వ్రాఁత కూడ వాఙ్మయమున చేరుచున్నది. అదియును నుత్తమకావ్యమువలెనే మన బుద్ధిని భావములను కూడ తృప్తిపఱచును.

పైన చెప్పఁబడిన సంగతులను బట్టి విమర్శన యనఁగా దోషారోపణ కాదని తేలుచున్నది. అయినను ఆ గ్రంథకర్త కుకవి యని పరిగణింపఁబడుదు నేమో యను భయముచే దోషములను దోషములని చెప్పుటకు భయపడఁగూడదు; లేని యౌన్నత్యము నొక కావ్యమునం దున్న దని చెప్పుచు జనులను మోసపుచ్చరాదు, ఉన్న గుణములను గణనచేయక యుండరాదు.

SEETA AND RAVANA



రావణుడు సీతాపహరణమునకై వచ్చుట

# ఆంధ్రవిషాదనాటకము

తణికెళ్ల వీరభద్రుఁడు గారు, ఎమ్. ఏ.

ఆంగ్లభాషాపరిజ్ఞానము కలవారికి విషాదనాటకములే యాంగ్ల సారస్వతమునందు ముఖ్యకావ్యము లని తప్పక తోఁచును. మన యాంధ్రవాఙ్మయమునందు విషాదనాటక మనునది గగనకుసుమ మైనది. మన సారస్వతమున విచారనాటకము లేదను నంశము కడు శోచనీయము. ఆంధ్రభాషయందలి నాటకము లన్నియు సాధారణముగా మంగళాంతములుగా నుండును. కొన్ని నాటకములు మొదటి నుండి తుదవఱకు శృంగారవిషయములను గూర్చి గాని ప్రాణుల సుఖజీవనములను గూర్చి గాని వ్రాయఁబడుటచే నవి పూర్తిగ మంగళప్రదము లైనవి. అట్టి నాటకములు కథానాయకుల వివాహములతోను వారి జయధ్వనులతోను నంత మొందును. కాని, అట్టి రూపకములందు మానవుల బాధలకును వారి క్లేశములకును స్థల ముండదు. చిత్రనళీయమువంటి నాటకములందు విచార మంతగా లేకపోలేదు. నలదమయంతులకు కలిగిన కష్టములను చూచి కంట తడిపెట్టనివారును జాలి నొందనివారును సభ్యులలో నుండరు. నాటకమందు చాలవఱకు విచార మున్నను తుద కెన్నఁడయిన నా సతీపతులు కలియఁగల రని యాశ వీడనివారు చదువరులలోఁ గాని దిదృక్షులలోఁ గాని యుండుటరుదు. అంతమందు సర్వజనులును సౌఖ్య మొందుటచే ఈ నాటకములు మంగళాంతము లను నామమును ధరింపవచ్చును. నాటకములలో మరియొక జాతి గలదు. కొన్ని కథలు మానవుల యాపదలను మనఃక్లేశములను వర్ణించును. నాటక మంతయు విషాదపూరితమై యుండును. ప్రారంభించినది మొదలు పంచమాంకమువఱకును నరుల లోపములును వారి దుష్కార్యములును వానివలన సంభవించు నాపదలును నాటకమునకు కథాభాగములుగా నేర్పడును. సత్పురుషులకుఁ గలిగిన విపత్తులకు మనము కుందుచుందుము. పాపభీతి లేక ప్రాపంచికమాయకు లోనై జనుల కపకారము చేయుటయే యుద్దేశముగాఁ గల యపరాధులను చూచి యాగ్రహము నొందుదుము. వారికి శిక్ష గలుగవలె ననియు నిరపరాధులు సురక్షితముగా నుండవలె ననియు కోరుచుందుము. ధర్మమునకై జీవము సయితము విడిచిన సారంగధరుని చరిత్ర నిజముగ విషాదనాటకమున కుచిత మైనది. అనేకకవు లీ నాటకమును రచించిరి. ఎల్లరును దీనిని మంగళాంతముఁ గావించిరి. కారణ మరయుట శ్రమ కాదు.

తెనుఁగునందు దుఃఖాంతరూపకములు లేకుండుటకు కారణములు పెక్కులు కలవు. మన ప్రాచీనగ్రంథములందు ఇట్టివి లేవు కాన తెనుఁగునందు కూడ ఇట్టివి వ్రాయఁగూడ దనునది మొట్టమొదటి కారణము. వాస్తవముగ పూర్వాచారపరాయణత్వము శ్లాఘాపాత్రమే కాని, ఒకానొక సమయమున త్యజింపవలయును గదా? మరియొక కారణమును కలదు. సృష్టిలో హరిశ్చంద్ర సారంగధరాది పుణ్యాత్ములు సత్యమే ముఖ్య మని యెంచి దానిని కాపాడు యత్నమున ప్రాణములు సైతము కోల్పోవుటకు సిద్ధపడినపుడు తుదకు వారికి సౌఖ్య మబ్బకపోయెనా? "ధర్మ ఏవ జయతి" అను మాట నిష్ఫల మగు నఁట. సజ్జనరక్షణమును దుష్టవినాశమును లేనప్పుడు పరమేశ్వరుఁడు లోకమందు ధర్మమును స్థాపించు ననుమాట కర్థ మేమి? మొత్తముమీఁద ధర్మనిరతులకు జయము రాకపోయెనా, జనాళికి ధర్మమందలి నమ్మకము పోయి వారి ధర్మాభిలాష క్రమముగా క్షీణించు నని కొందఱి యభిప్రాయము. ఇట్లు పలు తెఱంగుల యోచనలచే విషాదనాటకము జనన మొందుటకు వీలైనది కాదు. కీర్తిశేషుఁ డగు ధర్మవరము కృష్ణమాచార్యునిచే రచియింపఁబడిన "సారంగధరము" తప్ప,మన యాంధ్రభాషయందు విషాదరూపక మను నామమునకు తగిన వేఱొండు నాటకము కానరాదు. జితేంద్రియుఁడును సద్గుణమూర్తియు నగు సారంగధరుని చరిత్రము మిక్కిలి ప్రఖ్యాతి గాంచిన దగుటచే నా కథను గూర్చిన నాటకము లెన్నియో కలవు. కాని, నాటకమందంతటను విషాదము వ్యాపించియుండినను, అంత్యరంగమున సిద్ధుఁడేతెంచి సకలజనులను సజీవులను చేయుటచే నాటకము దుఃఖాంతమును కోల్పోవుచున్నది. కృష్ణమాచార్యుని గ్రంథమందు మాత్రము సిద్ధుఁడును ఆకాశవాణియును కోరఁబడకపోవుటచే అది పూర్ణమైన విషాదనాటక మైనది. ప్రప్రథమమున కన్యాన్వేషణమునకై పంపఁబడిన విభావసుఁ డను బ్రాహ్మణుఁడు చిత్రాంగి సందేశమును సారంగధరున కెఱింగింపకుండుట విషాదమునకు మూలాధారమై యున్నది. చిత్రాంగికి సారంగునియందు మిక్కుటమగు ప్రేమ. తా వలచిన వాఁడు దక్కకపోవ, విధివశముచే నొక ముదుసలిని పరిణయమాడి మొదటినుండియు ఆ నవమన్మథునియందు గాఢముగ నాటుకొనిన యనురాగమును మరల్చుటకు యత్నించి, క్రమముగ పరితాపము హెచ్చ, తుద కామె సారంగధరుని లోఁబఱచుకొనుటకు కృతనిశ్చితురాలాయెను, మహాపాపమున కొడిగట్టెను. చిత్రాంగి పాత్రసంపోషణక్రమ మత్యద్భుతముగ నుండును. న్యాయస్థానమందు సారంగధరునిపై నిందనిర్ధారణము చేయఁబడ, అతఁడు శిక్షితుఁ డాయెను. క్రమముగ, చిత్రాంగి దౌరాత్మ్యము వెలువడ, రాజు విచారింపఁ జొచ్చెను. సారంగధరుని రక్షణసమయము దాఁటిపోయెను. చిత్రాంగి భీతి చెంది ప్రాణము గాపాడుకొనుటకు సకలప్రయత్నములను చేసి నగి. నింద మోపఁబడఁగా, ఆమె హృదయము వ్రక్క లయ్యెను. రాజు పుత్రశోకముచే మూర్ఛ నొందెను. అతని మతి చాంచల్య మొందెను. కావున పంచమాంకమందు ముఖ్యపురుషు లందఱును

ఇహలోకమును విడిచిరి.

ఈ విషాదసారంగధరము బహువిధముల నాంగ్లభాషయందలి దుఃఖరూపకములను పోలియున్నది. ఆంగ్లమున "షేక్స్పియరు" అను కవిసార్వభౌముఁడు "హామ్లెట్" "ఒథెల్లో" "మేక్బెత్" "లియర్" మొదలగు నాటకములను రచియించెను. వీనిని జాగ్రత్తగా పరికించి చూడ, విషాదరూపకములందలి చమత్కృతులును షేక్స్పియరు కవి యొక్క యభిప్రాయములును పద్ధతులును, వే యేల? విషాదనాటక సారాంశము లెల్లను మనకు విశదము కాఁగలవు. ప్రతి నాటకమందును ఎన్నియో పాత్రము లున్నను, కడపటి యంకమున కథానాయకుని జీవచరిత్రలోని కష్టకాలమే వర్ణింపఁబడును. మొదట అతని గుణములును అతని స్థితియును అతనికి రాఁబోవు చిక్కులును సూచింపఁబడును. క్రమముగ నాపదలు వృద్ధి కాఁగా, అతని పరితాపము హెచ్చును. త్వరలో అతనిని అతనితోడి సంబంధము కలవారిని మృత్యుదేవతకు బలిగా నిచ్చుటకు తగిన సన్నాహములు జరుగుటయు, తుదకు వా రందఱును కడపటి రంగమున పరలోకప్రాప్తి చెందుటయు చూచుటయు తటస్థించును. కాని, కొందఱకు ఈ కష్టము లన్నియు మానుషప్రయత్నము లగుటచే పరులను నిందించుట యనావశ్య మని తోఁచుచుండును. ఈ నాటకములందు కథాభాగమునకును పాత్రసంపోషణమునకును దృఢమైత్రి గలదు. స్థితిని బట్టి పాత్ర స్వభావోద్భవమును పాత్రముల వర్తనము ననుసరించి కథయు మార్పు చెందుచుండుటను చూడఁగలము. "హామ్లెట్" తన పినతండ్రి దుర్మార్గుఁ డని యెఱిఁగి యతనిని వధింపవలె నని ప్రతిజ్ఞ పూని ఆ పౌరుషమును క్రియలో చూపకపోవు లోప మెవ్వరిది? ఆ రాకొమరుని మనము చింతతో నిండియున్న మాట నిజమే కాని, ఆ దోషిని హత్య కావించు సమయము వచ్చినపుడు వెఱ్ఱి యాలోచనలచే వెనుదీయకపోయెనా, తన ప్రాణమును కన్న తల్లి ప్రాణమును నమ్మిన చెలి ప్రాణమును కోల్పోయియుండఁడు గదా?

కథానాయకుఁడు సత్పురుషుఁడు కావలె నను నియమ మెన్నఁడును లేదు. క్రూరులును ధనార్జనపరులును రాజద్రోహులును కూడ నాయకులుగా నుండుటను చూచుచున్నాము. క్రూరులను చూచినపుడు భీతియు నిరపరాధులను చూచినపు డెల్ల కనికరమును మాపట్టియం దుద్భవించుచుండును. కథానాయకుని యత్నము సదుద్యమ మైనచో, అతనిని చూచి మనము జాలిపడవచ్చును. సాహసము కలవాఁడు దుర్మార్గుఁ డైన నేమి? అతని శక్తిసామర్థ్యములను చూచి యాశ్చర్యము నొందనివా రుండరు. రాజద్రోహి (మెక్బెత్) కథకు నాయకుఁ డైనంత మాత్రమున, ఆ కథను చదువుట మానితిమా? చిత్రాంగి దుర్మోహమునకు పాల్పడె నని ఆ నాటకమందలి కవితాచమత్కృతి తగ్గెనా? దుర్మార్గులను గూర్చియు వారు ధర్మనిరతులను జయించుటకు చేయు ప్రయత్నములను గూర్చియు వినుట మనకు నీతిదాయకము కాదా? కథానాయకుఁడు మంచివాఁ డైనను అతని సుగుణములే అతనికి ముప్పు కలుగఁజేయును. ఒథెల్లోయందు ఒక ప్రధానగుణ మున్నది. అతఁడు మనుష్యులు చెప్పు మాటలను నిష్కల్మషబుద్ధితో విశ్వసించును. దానికై అతనిని మనము ప్రస్తుతింతుము గదా? కాని, ఇంచుకైన ననుమానము లేక పరమచండాలుఁ డగు "ఇయాగో" చెప్పిన మాటలను నమ్ముటచే కదా పతివ్రతాశిరోమణి యగు సతీతిలకము నతఁడు మృత్యువు నోటఁ బడవైచెను. చిత్రాంగికి వివాహపూర్వము నుండియు సారంగధరునియందలి ప్రేమ మత్యద్భుతము. ఆ సుందరాంగునియం దమోఘమైన యనురాగ ముండుటయు, అతనినే దైవముగా పూజించు నిశ్చలభక్తి కలుగుటయు శ్లాఘాపాత్రములే. కాని, ఆమె చెడు నడతకును దౌరాత్మ్యమునకును మూలకారణము సారంగునియందలి మోహము కాదని యెవరైన చెప్పఁగలరా?

నాటకరచనయందు షేక్స్పియరు రెండు విషయములలో నెక్కుడు శ్రద్ధ వహించును. నాటకమున కంతకును ఇతివృత్తమును పాత్రపోషణమును ముఖ్యమైనవి. ఈ రెండు భాగములందును అద్భుతమైన శక్తి గలదు. కావుననే, అతని రూపకములు రసభరితము లగుటయు, ఈ కవి నాటకకర్తల కందఱకును చక్రవర్తి యని పేరు సంపాదించుటయు సమకూడినవి. ఈ రెండును గాక, మరియొక మూఁడవ ఘనత యితనియందు లేకపోలేదు. కాళిదాసాదిమహాకవుల మూలధన మగు కవితాచమత్కృతి యను మహామంత్రశక్తి ఇతనియందుఁ గూడ నున్నది గాని, అది కావ్యరచనకు చెందును గాన ప్రస్తుతము దాని మాట య టుండనీయవచ్చును. ఈ నాటకములందు ఇతివృత్త ముత్పాద్య మని చెప్పఁజాలము. కథ ప్రఖ్యాత మైనను దానిని మార్చి రసపూరితముగా చేయుటచే ఈ నాటకములు షేక్స్పియరుచే కల్పింపఁబడిన వనియే చెప్పవచ్చును. కథాసందర్భమును చూచి పాత్రములను సృజించును. క్రమముగా కథ పరిపక్వ మగుటయు, దాని ననుసరించి పాత్రముల స్వభావములు మాఱుటయు చూచెదము. మొట్టమొదటి నుండియు కథాభాగమునకును పాత్రపోషణమునకును పరస్పరసంబంధము గలదు. చిత్రాంగికి సారంగధరుని యందు ప్రేమ యున్న మాట సత్యమే. రాజనరేంద్రుఁడు వేఁటకు పోవుటచేతనే కదా ఆమె మనము వికల మగుటయు మదనతాపము నోర్వఁజాలకపోవుటయు ఘోరపాపమునకు సాహసించుటయు సంభవించినవి. ఇవ్విధమునఁ గాక, కథాభాగము వేఱుగాను పాత్రపోషణము వేఱుగాను నున్నచో, తీర్థమునకు తీర్థము ప్రసాదమునకు ప్రసాద మని చెప్పవచ్చును. పాత్రపోషణ మనఁగా నెట్టిదో మన గ్రంథకర్తలకు చాలమందికి దుర్జ్ఞేయము; పట్టివర్ణన మని వారి యభిప్రాయము. ప్రబంధములందు ప్రాచీనకవులు రాజులయం దే సుగుణములు వర్ణించిరో అవియే ప్రతికథానాయకునియందును చూపింపఁబడుచున్నవి. మొదటినుండి తుదవఱకు ఒకని గుణములే కవి పూర్తిగా వర్ణించినచో అంత రస ముండదు. వ్యంజనయే కావ్యమునకు పరమాత్మవంటిది. ఒక పాత్రము చేయు కార్యములను బట్టియు, వివిధావస్థలయందును ఆ పురుషుఁడు గాని స్త్రీ గాని యాడు పలుకులను బట్టియు మన మా పురుషునిం గాని స్త్రీని గాని గూర్చి యోచించుట కవకాశ ముండవలెను. అంతే కాక, ప్రతి కథానాయకుఁడును సద్గుణశాలి యని చెప్పు నాచారము కలదు, నాటక

మునందు సత్పురుషుల వర్ణనము కూడ కావలసియున్నది. మూర్తీ
భవించిన పుణ్యగుణములో యనఁదగు హరిశ్చంద్రాదిదివ్యపురుషులను
గూర్చి చదివి దైవసమాను లగు నమ్మహానుభావులను గుఱించిన
ధ్యానముచే మానవమన స్సించుక సే పైనను ప్రపంచసహవాసముచేఁ
గలిగిన మలినమును వదల్చుకొని ఆ సత్పురుషుల సంపర్కముచే లభించు
నానందమును పొందు ననుట నిక్కువము. కాని, నాటకము వ్రాయు
సమయమున నాయకుఁ డెంత గొప్పవాఁ డైనను అతఁడును మానవుఁడే
కనుక అతనియందు కూడ ఏదో యొక లోప ముండవచ్చు నని యూ
హింపవచ్చును గదా? సారంగధరుఁ డన్ని విధముల మంచివాఁడే కాని,
తన ప్రాణమిత్రుఁ డగు సుబుద్ధి చిత్రాంగి యువతి యనియు రాజు నూర
లేనపుడు తనయింటికి దాసి నంపుట మిగుల సందేహాస్పద మనియు, ము
మ్మాటికిని చెప్పి ఆమె యింటికి పోవల దని నిర్బంధ పెట్టినను, దూషించి,
వలదన్న కార్యము చేయఁబూనుట గొప్ప లోపము కదా? మరియు
న్యాయస్థానమందు న్యాయాధిపతి సారంగధరుని సాక్ష్యము కోరఁగా,
నే నేమియు చెప్ప నని యూరకుండి తాను చిత్రాంగి యింటికి
పోయిన మాట సత్య మని యంగీకరించి తనమీఁద నీ నింద యేల
యారోపింపఁబడిన దని ప్రశ్నించినపుడు మౌన మూనుటవలన కదా
ఈ యుపద్రవము ! అతఁడు తన పినతల్లి మానమును గాపాడ యత్నిం
చెను గాని, నిజ మెట్లు న్యాయాధీశునకు తెలియఁగలదు? నాటకము
లందును మరి యితరకావ్యములందును పురుషులను వర్ణింపవలసివచ్చి
నపుడు మహాపుణ్యాత్ములను గూర్చి వ్రాయవలెనా లేక లోకమందు
సర్వసాధారణముగా మనకు కనుపించు ప్రాణులను గూర్చి వర్ణింప
వలెనా యను నంశము యోచింపఁదగినది. నిత్యమును మన కండ్ల
యెదుట కనుపించు సామాన్యమనుష్యుల సాధారణజీవితమును వర్ణిం
చినచో చదువరుల కానందము కలుగదు సరి కదా, వారు నేర్చు
కొను నూతనాంశ మేగియు నుండదు, లేక దైవసమాను లగు మహా
పురుషుల జీవితమును కావ్యమందు చిత్రించినచో వారి చారిత్రము
మనకు మిక్కిలి నీతిదాయకమే. కాని, అట్టి విచిత్రపురుషుఁడు మానవ
కోటియందు కలఁడా యను సందియము కలుగుచుండును. ఆ పురు
షుఁడు మానవేతరుఁ డైనచో వాని జీవితమునకును మన జీవితమున
కును సంబంధము లేదు గాన, వాని ప్రవర్తనము మన మనుసరింపఁ
బని లే దన్ని కొంద అభిప్రాయపడుదురు. అట్టి మహానుభావుఁడు
సృష్టియం దుండునా యని యనుమానము కలుగును. వ్రాయఁబడిన
యంశమందు సందియ మించుకైనను కలిగినచో ఆ కావ్యమందలి రస
మును పూర్తిగా గ్రోలు టెట్లు? షేక్స్పియరు దీనిని గ్రహించియే,
తన కథానాయకు లెంత గొప్పవా రైనను మానవులే కనుక వారికి
లోపములను మరి యితరమానవచిహ్నములును కలిగియున్నట్లు చూ
పించియున్నవాఁడు. ఒకవేళ దుర్మార్గుఁ డెక్కడనైన కథానా
యకుఁ డైనచో అతఁడును మనుష్యుఁడే కనుక నేదైన సుగుణమును
గాని మరి యితరమానవగుణమును గాని కలిగియుండును.

కృష్ణమాచార్యుని సారంగధరము తప్ప మన యాంధ్రభాష
యందలి విషాదనాటకముల పద్ధతి మన కంతగా రుచింపదు. నాట
కమం దంతటను మానవుల దుఃఖము చిత్రింపఁబడును. కాని, చిట్టచివ
రకు ఆకాశవాణి వచ్చి యథార్థము తెలియఁజేసి కథయందలి బంధ
విమోచనమును చేయుటో లేక ఏదో యొక సిద్ధుఁ డేతెంచి మృతి
నొందినవారికి సంజీవి నిచ్చుటో చూచుచుందుము. ఇది యనుభవ
విరుద్ధము. కృష్ణమాచార్యుఁ డీ రెంటి సాహాయ్యమును కూడ కోరక
దను నంశము సంతోషదాయకము. చిత్రాంగి రారాజును మోస
పుచ్చి సారంగధరుని ప్రాణములు హరించినది. సారంగుఁడు శిక్షకు
పంపఁబడిన వెనుక చిత్రాంగి దుష్ప్రవర్తనము క్రమముగా చీఁకటిలో
నుండి వెలికి వచ్చినది. ఆ రహస్య మెట్లు బయల్పడెనో ఎంత కాల
మైన తరువాత నెన్ని నిదర్శనములు చూచిన యనంతరము రా
జామెను శిక్షించుట కుద్దేశించెనో విశదీకరింపవలెను గాని ఇతివృత్త
చమత్కారము తెలియక ఆకాశవాణి వచ్చి యథార్థము వాక్రుచ్చె
నన్న మాటవలన లాభము లేదు. నాటకమునందలి యందము చెడును.
ఈ విషయము కృష్ణమాచార్యుని గ్రంథమందు నైపుణ్యముతో
చూపఁబడినది. విషాదనాటకము విషాదముతోనే ముగియవలెను.
నాటకము విషాదాంతము కావలసినదియు మంగళాంతము కావలసి
నదియు గ్రంథకర్త కథాభాగమును పాత్రములను ఏ విధమున చిత్రిం
చెనో అదియే సూచించును. విషాదనాటకమునకు మంగళాంతమును
గూర్చుట మిక్కిలి యన్యాయము. ఈ నాటకములందు పాత్రముల
మనస్సులు మార్పులను చెందక తప్పదు. సాధారణముగా కథానాయ
కుని హృదయమందు ఒక విధమైన సంగ్రామము ప్రారంభించును. క్రమ
ముగా నీ పోరాటము తీక్ష్ణమై యతని మనస్థైర్యము చెడును. పంచమాం
కము చేరు సరికి మనఃపరితాపము హెచ్చుటయు అతఁడు దానిని భరింపఁ
జాలక పోవుటయు తుద కతనికిని అతనికి సంబంధించినవారికిని ఈ శరీర
మున్నంత కాలము మనశ్శాంతి కలుగ దనియు మనకు నిశ్చయముగా
తెలియును. అట్టి ధగధగ మండుచుండు నగ్నిహోత్రము చల్లారు
టెట్లు? ఒథెల్లో నాటకమందు కథానాయకునకు ప్రాణముకన్న
నెక్కుడుగా భావించిన తన ప్రియసతియందు దురదృష్టవశముచే నను
మానము కలిగినది. ఆ యనుమానము మితి మీఱినది. ఆ మనోవేదనను
భరింపఁజాలక అతఁ డామెను వధింపఁబూనెను. అట్లు చంప
నుద్యుక్తుఁ డైనను ఆమె కోమలశరీరమును చూచి రక్తమయము చేయఁ
గూడ దని యోచించెను. ఆమె సౌందర్య విలాస వైభవమును ముఖ
వికాసమును కడసారి తిలకింప మది ప్రేమ ముప్పొంగినను వెనుదీయక
యామెను తన యాగ్రహమునకు బలిగా నిచ్చిన ఒథెల్లో తన భార్యను
వధింప కూరకుండునా? ఆ దంపతులు తదనంతరము సఖ్యపడి జీవిం
తురనే వే యేల? ఒథెల్లో తిరిగి తన యర్ధాంగిని కన్నార తిలకింపఁ
గలఁడా? మరియు చిత్రాంగి మన్మథప్రేరితురాలై కుమారుని
గవయఁగోరుటయంతటి యఖండపాపమునకు సాహసించినది. విఫలప్రయ
త్నయై తన బాళి నంతయు వెలిబెట్టినందులకు లజ్జించి యాగ్రహము
పూని మహాక్రూరత వహించి సారంగధరుని మృతునిఁ గావించి తిరిగి
యా సుందరుఁడు సజీవియై తన్నుఁ జూడవచ్చినపు డెదు రేఁగి
"కుమారా! క్షేమమా? నా తప్పు సైరింతుమా" అని యతనిని పలుక

రించు నని కలలోనైన నూహింపఁగలమా? లేక, చిత్తచాంచల్యముచే మూర్ఛ నొందిన రాజనరేంద్రుఁడును పుత్రశోక మను మహాసముద్రమున పాతాళము నంటిన రత్నాంగిదేవియు కుమారునిఁ జూచి "తండ్రీ సారంగధరా ఎంత యాలస్యము చేసితివి? నీకై చూచుచుంటిమి. ఆశీర్వాదము గైకొమ్మా" అని చెప్పుదురా? మనస్తాపము మితి మీఱి పరాకోటిని చెందినపుడు నాటకము విషాదాంతము కావలసియుండును. మంగళాంతము చేయవలె నని గ్రంథకర్త యూహించినచో పాత్రములయం దంత మనోవేదనమే కల్పింపఁడు. తా మెన్నఁటికైన సుఖమనుభవింపఁగల మనెడి యాశను వారియందు పుట్టించును. వీ రందఱును కలియుటకును వారి కష్టములు దరిచేరుటకును తగిన యవకాశము కల దని చదువరులకు సూచించుచునే యుండును. చిత్రనళీయమందు నలదమయంతులకు ఎడఁబాపు కలిగినది. మనకు విచారమును కనికరమును ఉద్భవించును. ఎన్నఁటికిని తన ప్రియు సందర్శనము కాదను నిరాశ మాత్రము సతీపతులలో నొకరికిని లేదు. ఆ సమావేశ మెప్పుడు వచ్చునా యని వా రువ్విళ్లూరుచుండిరి.

సీ. "ఎన్నఁడు నాదండ కన్నులార ముదంబు
తోడ నా ప్రాణేశుఁ జూడఁగలుగు?
ఎన్నఁడు నా ముద్దు చిన్నారి సుతుఁ గాంచి
యింపు మీఱఁగఁ గౌఁగిలింపఁగలుగు?"

అని దమయంతి తనలో తా ననుకొనుచుండుటను చూచి తన భవిష్యత్సౌఖ్యసం దామెకు కొంత యాశ కల దనియు ఆ యాశ నెఱవేఱు ననియు దిదృక్షులకు తోఁచుచుండును.

షేక్స్పియరు నాటకములందు ఎవరి సుఖదుఃఖములకు వారే కర్తలైనను కొంత దైవికయత్నము కూడ లేకపోలేదు. విషాదాంతము కాక తప్ప దను రంగమునకు కథాభాగము వచ్చినపుడు కర్మవశ మనునది కూడఁ గాన్పించును. హఠాత్తుగా కర్మవశముచే నొకానొక సమయమందు లాభమును మరియొక సమయమందు నష్టమును సంభవించుట లోకమందు చూచుట లేదా? రాజనరేంద్రుఁడు చిత్రాంగి క్రౌర్యము కనుఁగొని సారంగధరుని శిక్ష యాపు చేయవలె నని పంపిన సేవకుఁడు దారిలో తెలఁపని తలంపుగా నాలస్యమై యా కుసుమకోమలుని కరపాదచ్ఛేద మొనరించిన నఱచటి క్షణము వఱకు చేరకపోవుట దైవికమే కదా? ఆదికాలమున చిత్రాంగి తన యనురాగమును సారంగధరునితో మనవి చేయు మని విభావసునితో చెప్పినపు డా బ్రాహ్మణుఁడు సందేశమును పూర్తిగ మఱచె నను మాట యెవరి నేర మని యెంచఁగలము? అది విధివశమున కాక మరి యేమి? ఒకానొకప్పుడు పురుషులు సదుద్దేశముతో నొక యత్నము చేయఁబూనినను, తగిన కారణము లేకయే వారి కార్యము ఫలవంతము కాకపోవుటయు వారు దుర్మార్గులచే హింసింపఁబడుటయు చూచుచుందుము. వారు సత్పురుషులై యుత్తమోద్దేశముతో వర్తించునపుడు వారికి బాధ కల్గినా, విధి కాక మరియెవరు కారణము? ఇట్లు మనుష్యయత్నమునకును కర్మవశమునకును పోరాటము జరగుచున్నట్లు లోకమందు చూచుచున్నారము. మార్లోవంటి విషాదనాటకకర్తలీ సంగ్రామమును తమ గ్రంథములందు చర్చించిరి.

విషాదనాటకములు వ్రాయుటకు కొన్ని యభ్యంతరములు కల వని పలువురు వక్కాణించుట వినియున్నాము. దుష్టులను చిత్రించుటయు వారి చరిత్రలను చెప్పుటయు హేయమైన దనియు దుర్నీతిదాయక మనియు వారు వాదింతురు. ఈ యభిప్రాయముకంటె ఆంధ్రనాటకపితామహుఁ డని వన్నెకెక్కిన కృష్ణమాచార్యుని వ్రాఁతయే దీనికి సరియైన ప్రత్యుత్తరము.

" దుర్నీతి నించుకైనను ప్రకటింపకున్న నీతికి, కాంతి కలుగదు రావణుని దుర్నీతి లేకున్న శ్రీరామున కంత కీర్తి కలుగునా? దుర్యోధనుని దుర్నీతి లేకున్న పాండవుల కంతటి ఖ్యాతి కలిగియుండునా? కావున, నీతి కుదుర్పవలె నన్న దుర్నీతి నించుక ప్రకటించియే తీరవలె నని నా సవినయవిజ్ఞాపనము. రుచిభేదములును అభిప్రాయభేదములును ఉన్న నుండును గాక, విశ్వామిత్రునకు క్రోధమే లేక యతఁడు వసిష్ఠునితో కయ్యమాడకుండెనా, హరిశ్చంద్రుని సత్యవాక్పరిపాలనమును పరీక్షించు టెట్లు?"

విషాదనాటకము చదువరుల కానందము నీయ దనియు సదా విచారము కలుగఁజేయు ననియు కొంద ఱూహింతురు. లోకములో సుఖము కోరువారు దుఃఖమునకు గూడ భాగస్థులు కావలయును. ఎల్లప్పుడును సౌఖ్యమం దున్నవానికి కష్ట మనఁగా నెట్టిదో తెలియదు. పిన్ననాఁటినుండియు ధనములో మునిఁగి తేలువాఁడు దరిద్రునిఁ జూచి నవ్వుట యాశ్చర్యమా? సకలైశ్వర్యములతో తులఁదూఁగు మనుజుఁడు శోక మన నెట్టిదో గ్రహింపఁజాలఁడు. హిందూమాతకు ప్రియపుత్రుఁ డగు గౌతమబుద్ధుఁడు దయార్ద్రహృదయుఁ డయ్యును తాను హంసతూలికాతల్పమున శయనించుచు తన హర్మ్యమం దున్నంత కాలము మానవకోటి కష్ట మన నెట్టిదో తెలియఁగల్గెనా? అతఁడు వీథి వెంట బయలుదేఱి మనుష్యుల బాధలను చూచిన తత్క్షణమే ప్రాణికోటిని రక్షింపవలె నని గ్రహించుట తటస్థ మయ్యెను. బంగార మగ్నిలో కాలినఁ గాని శుద్ధిని పొంద దని మన కెల్లరకు తెలిసిన యంశమే. "హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధి స్స్యామి కాపివా" అని కాళిదాసు చెప్పిన మాటల యాథార్థ్యమును సందియపడువాఁ డెవఁడు? మనస్సును నిర్మలము చేయుటకును ఆత్మను సంరక్షించుకొనుటకును మనకు తఱచు కష్టములు రావలె ననియు లేనిచో మనము మన యాదర్శములను మఱచిపోవుట కవకాశము కలుగు ననియు తలఁచుచుందుము. మనకు బాధలు వచ్చినపుడే హృదయము విశాల మగుటయు పరుల కష్టములను చూచి జాలి నొందుటయు వారి క్షేమమును గోరుటయు సంభవించును. "తనయందు నిఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబును" జరపు బాలభక్తుని గాఢప్రజానురాగ మబ్బవలె నన్న, ఎన్ని కష్టములు పొందియుండవలెను? కాఁబట్టి చదువరుల హృదయములను విశాలములను చేయుటకు విషాదనాటకములే యుచితములు. ఇంతకును షేక్స్పియరు నాటకములవంటి నాటకములు చదువుటవలన విచారము కలుగునో, లేక ఆ విచారములో పాత్రానంద ముద్భవింప ఆ నాట

కములందు వర్ణింపఁబడిన మహాపురుషుల సంపర్కముచే నొక వింత వికాసము కల్గునో యనుభవజ్ఞులు గ్రహింపకపోరు.

విషాదములవలన జనసామాన్యమునకు సద్గుణము లుండుటచే ప్రయోజనము లే దని యభిప్రాయము కలుగును గాన, సత్పురుషులు సుఖమును దుర్మార్గులు తుదకు దుఃఖమును పొందవలెనని యనేకులు వాదింతురు. కాని, మనకు సాధారణముగా లోకములో సత్యసంధులు హింసింపఁబడుటయు దుష్టులు జయ మొందుటయు గోచరమగుచున్నది. "సత్పురుషుల కెందుఁ గాని ప్రాయికముగా బాధలు వచ్చుటయే మనము కనుచున్నాము. అది గాక, లోకమున జరగు విషయములలో నెన్నియో పొరపాటులు కలవు గదా? సద్గుణములు కలవా రెందఱకో దుఃఖము కల్గుట చూడమా? వాని కన్నిటికిని కారణము చెప్పుట సాధ్యమా?" అని రామకృష్ణమాచార్యుఁడు వ్రాసెను. విషాదనాటకములయందు సత్పురుషులు దుఃఖాంతి మొందుటచే లోకమందు న్యాయము లే దనియు భగవంతుని న్యాయశీలనమందు నమ్మకము చెడు ననియు కొందఱి భయము. అది పొరపాటుగ యూహింపవలెను. మన మందఱమును శ్రీ కృష్ణుని భగవంతునిఁగా పూజించుచుంటిమి గదా?

శ్లో. "పరిత్రాణాయ సాధూనాం
వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగేయుగే."

అని శ్రీకృష్ణుఁడు చేసిన ప్రతిజ్ఞయందు మనకు దృఢమైన నమ్మకము కలదు. ఆ పరమేశ్వరుఁడు మనల నందఱను న్యాయముతో నేకచక్రముగా నేలుచున్నాఁ డని యెఱింగి మనకు ముక్తి నిమ్మని యతనిని గూర్చి సదా ధ్యానించుచుందుము. కాని, ఈ ధైర్య మెల్లపుడును స్థిరముగా నుండునా? జన్మ మెత్తిన తర్వాత నెప్పుడును దుష్కృత మనఁగా నేమో యెఱుఁగని మనకుఁ గాని లేక స్వప్నావస్థయందైనను పాప మన నెట్టిదో తెలియని మన ప్రాణసమాను లగు బంధుమిత్రుల కెవరికిఁ గాని యొక మహావిపత్తు సంభవించినపుడు మన మన స్సెంత చేల యగును? "ఆ సాధ్వీమతల్లికి అట్టి యాపద సంప్రాప్తించు నని కలనైన తలఁచి యెఱుఁగను. ఈ ప్రపంచ మంతయు మాయ తప్ప వేఱు కాదు." అని మనము వేసరుచుండ లేదా? లోకమునకు పాలకుఁడే యున్న యెడల ఇట్టి యన్యాయము జరగఁగూడదు కావున జగదీశుఁ డెవ్వఁ డైనను కలఁడా లేఁడా యని మనము ప్రశ్నిఁ మట లేదా? కాని, హృదయమందలి ఈ యధైర్య మచిరకాలములోనే యదృశ్యమై యొక విధమైన మనోవికాసము కలుగ మన ప్రస్తుతకష్ట మంతయు ప్రాక్తనజన్మకర్మఫల మని యూరట చెంది పరాత్పరుఁడు న్యాయశీలుఁడే యనియు అతఁడే కరుణాసముద్రుఁడనియు అతనియందలి భక్తి క్రమముగా హెచ్చుటయు చూచుచుంటిమి. అవ్విధముననే యొకవేళ కొందఱు పాఠకులకు విషాదనాటకములు చదివిన తర్వాత మనుష్యసౌఖ్యమును గూర్చి భీతియును నిరాశయును కలిగినను పరమేశ్వరుఁడు న్యాయశీలుఁడా కాదా యని సంశయము తోఁచినను కొలఁది కాలములోనే ఈ మేఘము లన్నియు నెల్లాచెదరగుటయు జ్ఞానోదయము కలుగుటయు జగదీశ్వరుని న్యాయవర్తనమున నధికవిశ్వాసము కలుగుటయు సంభవించును.

కావున, విషాదనాటకములవలన లాభము లే దని వాదించుట గొప్ప పొరపాటు. మనకు నిజముగా నీతి బోధించుట కుచిత మదియే. దానియందు మానవుని యావజ్జీవమును చిత్రించుటకును వాని కష్టసుఖములను మన కండ్లయెదుట చూపుటకును వీ లగును. మానవహృదయమందలి తీఁగెల నన్నింటిని వాయించుటకు అవకాశ మీ కావ్యమం దున్నట్లు మరియెక్కడను గాన్పింపదు. ప్రకృతియొక్క ప్రతిబింబమును చూపుటయే నాటకపు ముఖ్యోద్దేశ మని యొక మహాకవి వాక్రుచ్చెను. కావున, మన సుఖదుఃఖములను వర్ణించి మనల నంధకారమునుండి వెలుతురులోనికి తీసి, లోకతత్త్వ మెఱింగించి జగదీశచింతనామృతమును గ్రోలుటకు తగు సమర్థత నిచ్చు గ్రంథమే కావ్యమను నామమునకు తగినది.

# సమష్టివాదము

విష్ణుభొట్ల సూర్యనారాయణ గారు, బి. ఏ., బి. ఎల్.

సర్వకాలసర్వావస్థలయందును ఒక విధమైన స్థితిగతులకుఁ గాని చట్టములకుఁ గాని కట్టుబఁాటులకుఁ గాని విధానములకుఁ గాని లోనైయున్న ప్రతి మనుజుఁడును తన క్షేమమునకుఁ గాని తన తోడివారైన యితరుల యోగక్షేమమునకుఁ గాని అట్టి స్థితిగతులే అట్టి చట్టములే అట్టి కట్టుబాటులే అట్టి విధానములే యవసరమని తలంచుట సామాన్యమై యున్నది. 'అట్టి స్థితిగతులు మొదలగునవి లేకున్నచో, లోకమంతయు చెడిపోదా? దేశమంతయు నల్లకల్లోలము కాదా? జనులందఱు సుఖజీవనులై యుండఁగలరా?' అని చాలమంది వాపోవుచుందురు. కాని, ఆతురపడక నిష్పక్షపాతబుద్ధితో నాలోచించి చూచిన, అట్టి యూహ తప్పని వారే గ్రహింపఁగలరు. భారతరామాయణాది కాలములందుండిన స్థితిగతులకును, బౌద్ధకాలపు స్థితిగతులకును, ఇటీవల యశోకచంద్రగుప్తుల కాలపు సందర్భములకును, మహమ్మదీయరాజుల నాఁటి యాచారములకును, ఇపుడు మనము నివసించుచున్న కాలపు టాచారములకును గల వివిధభేదములును మనకు గ్రాహ్యములైన విషయములే. ఆయా కాలములందుండెడి యాచారవిధానము లాయా సందర్భములకు లోనై కాలానుగుణ్యముగా మాఱుచునే యున్నవి. అట్టి మార్పు లవసరమే యైనను వాని నాచరణలోనికి తేవలయు నన్నచో కొంత కాలయాపనమును కొంత శ్రమయు నుండక పోవు. అట్టి మార్పుల ననుచరణలోనికి తేవలయు నన్న యత్నము లెల్ల సఫలములును కాఁజాలవు. అంతమాత్రమున నాయా మార్పులను జనులు వదలిపెట్టిదరను మాటయు కల్ల.

పైని చెప్పిన మార్పులలో సమష్టివాద మొకటి. ఇయ్యది సంఘసంస్కరణములలో నొక యుద్యమమే. ఈ యుద్యమము ప్రప్రథమమున పీరు లేరో యనునాతఁడు 1838-వ సంవత్సరమున, అనఁగా ఇప్పటికి సుమారు 80 సంవత్సరముల క్రిందట మొదలుపెట్టియున్నాఁడు. ఈ వాదోద్భవమునకు పాశ్చాత్యదేశముయొక్క, అందును ముఖ్యముగా ఆంగ్లదేశముయొక్క పారిశ్రామికదుస్థితియే కారణభూతము. ఈ పారిశ్రామికస్థితిని బాగుచేయుటయే ఈ వాదానుచరుల ముఖ్యోద్దేశము. ఆంగ్లదేశమున నీ యుద్యమమును నాటి నీరు పోసి పెంచినది రాబర్ట్సు ఓవెననునాతఁడు. దీనినే జర్మనీదేశమునందు కారల్ మార్క్సును ఫ్రాన్సునందు సైంటు సైమనును మొదలుపెట్టిరి.

ఈ వాదానుచరుల యభిప్రాయములను చెప్పనగునే కాని, ఇద మిత్థమని నిర్ధారణ చేయుట కీ వాదమింకను తగినంత పక్వమునకు వచ్చియుండలేదు. ఫ్లింట్ అను నొక సమష్టివాది ఈ వాదమును గూర్చి యొక పుస్తకము వ్రాయుచు, "సమష్టివాదముయొక్క లక్షణములను నిర్దేశించుట కిదివఱలో సాధ్యమై యుండలే" దనియు, "ఇంకముం దెన్నఁడును సాధ్యముగా" దనియు చెప్పియున్నాఁడు. ఇతఁడు చెప్పినది పూర్తిగా నిజము గాకున్నను కొంతవఱకైనను నిజమే యని ప్రతివారును ఒప్పుకొనక తప్పదు. ఈ వాదము మొదలిడినప్పటి నుండియు దీనిలో ముఖ్యమైన విషయములయందే మార్పులు గల్గుచున్నవి. కావున, ఈ వాదాభిప్రాయములను మాత్రమే చెప్పనగును.

ప్రస్తుతపు సామాజికవిధానమునందనేక దోషములున్నవనియు వానిని నివారణ చేయుట యత్యావశ్యమనియు అందులకు తగువారు రాజ్యాంగమువారే యనియు కావున వారు తగు ప్రయత్నములను చేయవలె ననియు వీరి ముఖ్యోద్దేశము. వీరి యభిప్రాయముల నొక విధముగా నాలోచించినచో లోకాభివృద్ధిని చేయవలె ననియు, ఇంకొక విధముగా నాలోచించినచో ప్రస్తుతసామాజికవిధానమునందు ప్రబలముగా నున్న వ్యక్తివాదమును పూర్తిగా నణఁగఁద్రొక్కవలె ననియు వీ రభిప్రాయపడుచున్నట్లు తోఁపఁగలదు. లోకహితార్థమై స్వార్థము నణఁగఁద్రొక్కుటయే ఈ వాదముయొక్క ముఖ్యసారము. వ్యక్తిని సంఘమునకు లోఁబఱచుటయే దీని ముఖ్యోద్దేశము.

### వ్యక్తివాదము

ఆర్థికజీవితమునందు వ్యక్తియే ప్రధాన మని చెప్పునది వ్యక్తివాదము. సాంఘికదుస్థితికి వ్యక్తివాద మే కారణ మని యూహింపఁదగి యున్నది. వీరిచే వక్కాణింపఁబడిన ప్రస్తుత కాలపు సాంఘికస్థితిలోని లోపములను మన మాలోచింతము. దారిద్ర్య మెల్లెడలను దేశము నావరించియున్న దనియు, మనుష్యజీవితమునం దుండెడి మంచి నెల్లను నశింపఁజేయఁ జాలినంత చెడుగు సాధనములు బీదవారియం దున్న వనియు, అనారోగ్యకరము లగు నావాసను లెల్లెడలను వృద్ధి యగుచున్న వనియు, ప్రతి యార్థికశాస్త్రజ్ఞునకును, ఆర్థికశాస్త్రజ్ఞున కన నేల, వివేచన గల ప్రతి మనుజునకును తోఁచక తప్పదు. ఇప్పటి కాలపు పనివారిది నిక్కముగా దురవస్థయే. ఎచ్చట చూచినను వీరి స్థితి యవమానకర మైనదిగను దుర్నీతికర మైనదిగను నున్నది. వీ రందఱు నితరుల యధీనమునం దున్నవార లే కాని, వారికి స్వాతంత్ర్య మెంత మాత్రమును లేదు. వీరిని జనులు హేయముగ చూచుటయే కాని గౌరవార్హులుగ నెంచుట లేదు. ఇతరులు వీరి నెక్కడ చూచినను నీచులుగ చూచి యవమానపఱచుచుండుటయే కాని వీరును మానవజన్మ మెత్తుటచే మనతో సమానులే యని యెంచుట లేదు. వీరి బాగునకై యూరక మాటలను చెప్పుటయే కాని యెట్టి ప్రయత్నములును చేయుట లేదు. వారి వార్ధక్యమునకు వీలుపడునట్లు కూడఁబెట్టుకొనుటకైనను తగిన కూలి సైత మిచ్చుట లేదు. వారు బల ముడుగునంతనే తినుటకు తిండియు త్రాగుటకు నీరును లేక మలమల మాడి చావ వలసినవారై యున్నారు. వారికి కూలి నెక్కువగా నిచ్చినను వారు ప్రస్తుతపు స్థితిని బట్టి కూడఁబెట్టుకొనునంత దూరాలోచన గలవారుగా కూడ లేరు. వీరి కిచ్చిన కూలి యథమపక్షము సద్వినియోగపఱుపఁబడుట యైనను లేదు. వీరు తమ డబ్బును కల్లు త్రాగుట మొదలగు దుర్వ్యసనములకు వినియోగపఱచుచున్నారే కాని, ఉచిత మైన వ్యయములు చేసికొనుట లేదు. కూలివారల స్థితి యిట్లుండనిండు.

ద్రవ్యవంతు లన్ననో, పని చేయక సోమరితనమును వృద్ధిచేసికొనుచు, నీతి ననుసరించిన పద్ధతులు త్రొక్కక మిన్నును మన్నును గానక మదాంధులై స్వలాభమును పరుల లాభమును గూడ నాలోచింపక గర్వమున విఱ్ఱవీఁగుచున్నారు. ద్రవ్యవంతులకును బీదలకును నడుమ నింకొక తరగతి గలదు. వీ రెంతవఱకును తమ లాభము నాలోచించువారే కాని ఇతరుల లాభము నాలోచించువారు కారు. ఇతరు లెట్టి పాట్లు పడుచున్నను, ఎట్టి యవస్థలకు లోనైయున్నను, ఎట్టి స్థితిగతులకు పాలైయున్నను వీరు సంబంధము కలుగఁజేసికొనరు. తమ సామీప్యమున తమ సమక్షమున నెట్టి దుర్నీతికరము లైన సంగతులు గాని ఘోరకృత్యములు గాని జరగుచున్నను, వీ రా వైపున కైనను తిరిగి చూడరు. వీ రెల్లప్పుడు తృప్తి చెందకున్నను నిష్కాములై యున్నట్లు కన్పించుటకు యత్నించుచు, ఇతరుల కనేకులకు హానికరమే యైనను తమ స్వలాభమునే యాలోచించి మెట్ట వేదాంతమును బోధించుచుందురు. నిక్కముగా బీదవారికి సయిత మొక గ్రుడ్డి గవ్వ నైనను వీ రీయరు. ఇట్లు ఈ మూఁడు తరగతులయం దుండు లోపములను చెప్పినంత మాత్రముననే ఆయా జాతులయందు నీతిపరు లగునట్టియు దయార్ద్రహృదయు లగునట్టియు గుణవంతు లైనట్టియు మహనీయులు లే రని యర్థము కాదు. సామాన్యముగా నట్టివారి సంఖ్య యత్యల్పము. అరు దనియే చెప్పవచ్చును.

స్వలాభమును కోరి రన్నంతనే వీరు ధర్మప్రవర్తన ననుసరించుట లే దని యర్థము కాదు. ఎంత స్వలాభమును కోరు మనుజుఁ డైనను, కొన్ని విషయములలో మాత్ర మితరులతోఁ గలసి పనిచేయక తప్పదు. ప్రతి మనుజుఁడును తన పొట్టకై తాను పాటుపడవలయును. అట్లు పాటుపడునపు డితరులతో కలసి పనిచేయవలె నని వీరు చెప్పుచున్నారు.

ఈ పై చెప్పిన సామాజికావస్థనే సమష్టివాదులు వ్యక్తివాద మనుచున్నారు. ఇట్టి సామాజికవిధానము మనుష్యస్వాతంత్ర్యము ననుసరించిన ఫలితము కా దనియు కాలానుగుణ్యములు గాని కొన్ని పూర్వుల యాచారముల ననుసరించుటచేఁ గల్గిన దనియు ఈ సమష్టివాదులు నమ్ముచున్నారు. ఇందలి లోపము లన్నిటికిని జనులకు వర్తకమునం దున్న పరస్పర స్పర్థయు నిజసంపదయు కారణము లని వీ రూహించి యున్నారు. నిజసంపద యన, వారివారి సొత్తులయందు వారివారికిఁ గల హక్కు. ఇది ప్రస్తుతకాలమునందు

నిరాఘాటముగ నున్నది. ఈ లోపముల నన్నింటిని
నివారించుటకును ప్రస్తుతసామాజికసంపద్విభాగమును
బాగుపఱచుటకును జనుల కెక్కువ సౌఖ్యము నిచ్చు
టకును శ్రమతో పాటు సంపద నుత్పాదించుట కవశ్య
మగు భూమియు మూలధనమును కూడ సమాజమునం
దున్న జను లందఱకు నుపయోగకర మగునట్లు ప్రజల
యధీనమునం దుంచుట వీరి యుద్దేశము. ప్రభుత్వ మంత
యు ప్రజల హస్తగతమై యుండవలయు నని ఈ వాద
ము బహిరంగముగా చాటుచున్నది; నిర్వచనార్హత్వ
సంపాదనమునకు ఆస్తి యవశ్య మని చెప్పెడి
ప్రస్తుత పద్ధతులను ప్రతిపక్షము చేయుచున్నది.
ఈ యెన్నికలయందు కల్పనాశక్త్యుత్పాదితంబు లై
నట్టియు లోకానుభవమునం దెన్నఁడును ఎచటను
పనికివచ్చినట్లు పరిగణింపఁబడనట్టియు కొన్ని స్వా
తంత్ర్యపు హక్కులను మరికొన్ని పిచ్చి యడ్డులను
ఈ వాదము నిరాకరించుచున్నది. తమ యధీనము
క్రింద నుండి తమ యుపదేశములచే నడపఁబడునట్టి
ప్రభుత్వమునందు నివసించెడి జనుల లోకానుభవమే
యెన్నికలయందు వారివారి కర్హత్వ మియ్యఁగల దని
కూడ ఈ వాదులు ప్రకటించుచున్నారు. కావున, ఈ
వాదుల ప్రభుత్వము క్రింద విశాలతమ మైన రాజకీయ
స్వాతంత్ర్యము జనుల కబ్బఁగలదు. ఈ విధముగా ప్రతి
వ్యక్తితోఁ గలసి సంఘమునం దుండెడి శ్రమయొక్కయు
కూలియొక్కయు అవస్థలను గూర్చియు సాంఘికధర్మము
లను గూర్చియు అం దుండెడి జనులస్థితిని గూర్చియు ఆలో
చించెడి ప్రభుత్వమునకు పురుషానుభవసాహాయ్యము
లెంత యవశ్యములో స్త్రీల యనుభవమును సాహాయ్య
మును నంత యవశ్యము లే యని ఈవాదుల యుద్దేశము.
సమష్టివాదము ప్రబల మైనకొలఁది దేశమునం దుండెడి
శక్తిసామర్థ్యములు వృద్ధి కాఁగల వనియు అట్టివాని నుప
యోగించుటకు తగు నవకాశములు మెండుగా నుండు
ననియు అట్టి యుపయోగమువలనఁ గల్గెడి లాభము లనే
కము లనియు అవి జనులకు హృదయరంజకముగా
మెప్పు గల్గింపఁగల వనియు ఈ వాదు లభిప్రాయపడు
చున్నారు. అప్పుడే వస్తూత్పాదనాసామగ్రి చక్కఁబడఁ
గలదు. అప్పుడే వస్తూత్పత్తి నేలిక యగును, దేశాభ్యు
దయము హెచ్చఁగలదు. అప్పుడే శక్తిసామర్థ్యము
లుపయోగకరము లైన పనులయందు వినియోగింపఁ
బడఁగలవు. పని చేయలేనివారి సంఖ్య తప్పక తగ్గఁ
గలదు. ఇ దంతయు దేశాభివృద్ధి కప్పుడే సాహాయ్యము
కాఁగలదు.

ప్రజాప్రభుత్వ మవశ్య మని చెప్పినంతనే దూర
దృష్టి లేనట్టియు గుణగ్రహణత్వమునందు కొంత లోపము
కలిగినట్టియు ప్రతికక్షులు కొంద ఱీ వాదమును అరాజ
కుల వాదమును నొకటిగనే గ్రహించి దీనిని తూలనాడు
చున్నారు. అట్టి యూహ కేవలము దురూహ యని
నేను తలంచుచున్నాఁడను. రాజ్యము సంఘమునకు
బాధాకర మనెడి స్పెన్సరు మొదలగు తత్త్వజ్ఞులచే నను
వాదింపఁబడిన వ్యక్తివాదమునకును అరాజకుల వాద
మునకును కొంతవఱకు సంబంధము కలదు; కాని ఈ
సమష్టి వాదమునకును అరాజకుల వాదమునకును ఎంత
మాత్రమును సంబంధము లేదు. అరాజకులకు రాజ్య
మనావశ్యకము. అట్టి రాజ్యాంగ మవశ్య మైనను
అందలి సభికు లందఱును సంఘోపయుక్త మైన ధర్మ
మార్గము నవలంబించెడి నీతిజ్ఞులుగా నుండవలయును.
అది గాక, అరాజకవాదతత్త్వమునకు మనుజుని నిసర్గసు
స్వభావ మవశ్యము. సమష్టి వాదమునకో, జనులలో
నొకరితో నొకరు కలసి మెలసి యుండవలె ననెడి సంఘీ
భావ మవశ్యము. ఇట్టి సంఘీభావమును పునాదిగా
నుంచుకొని దిట్టముగా కట్టఁబడినది సమష్టివాదప్రాసా
దము. ఇంతే కాక, ప్రపంచమునం దెల్లెడలను, ఈ
రెండు వాదములును వేఱువేఱుగా నెన్నఁబడుచున్నవి;
ఒక వాద మింకొక వాదముయొక్క యభివృద్ధి కడ్డు
కలిగించుచున్నది. ఈ రెండు వాదముల కిన్ని భేదము
లున్నను రెంటిని కలుపుట మిక్కిలి చిత్రముగా నున్నది.
ప్రస్తుతపు సామాజికస్థితిని నిందించుచు మార్పులను
నిరూపించెడి ప్రతికక్షుల వేర్వేఱు వాదముల నన్నిటిని
ఒకే యనుమానదృష్టితో చూచుచు వానియందలి
భేదాభేదములను విచక్షణ చేయకుండుటయే ఇట్టి కల
గలుపునకు కారణముగా నూహింపవలసియున్నది.

ఇది యటుండఁగా, వీరి యభిప్రాయముల నాలో
చింతము. సాంఘికలోపముల నన్నిటిని నివారించుటకును
ప్రస్తుతపు సామాజికసంపదయొక్క విభాగమును బాగు
పఱచుటకును జనుల కెక్కువ సౌఖ్యము నిచ్చుటకును
శ్రమతో పాటు సంపద నుత్పాదించుట కవశ్య మగు
భూమియు మూలధనమును సమాజమునం దున్న జను



పడమటిరంగమున డెల్విలువనమునందు దాగియున్న జర్మనులను భారతీయాశ్వయోధులు దాకినపుడు జర్మనులు శరణాగతులగుట



కార్సోప్రస్థమునందు ఇటలీసైన్యములు దుర్గమ కాంతారమునందు ఆస్ట్రియనులను దాకుట కుపక్రమించుట



రాత్రి వెన్నెలయందు జర్మను కందకములను నాక్రమించుకొనుటకై యాంగ్లసైన్యములు ప్రయత్నించుట



సముద్రతలమునందు జలాంతర్గామి ఇంధనమును (పెట్రోలు) గైకొనెడి విధము
నీటియందు దాచిన పెట్రోలును నింపుచున్నది

తేలెడి నావాశ్రయమునందు మరమ్మత్తు చేయబడుచున్న గొప్పయుద్ధనౌక



వర్డునునందు నాశనము చేయబడిన క్రైస్తవ దేవాగారము



షడమాల రంగమునందు విషవాయు భయమును దెలుపుట కేర్పాటుచేసిన ఘంటానాదము



ట్రోనెసువనమునందు పరాజితులైన జర్మనుయోధులు శరణాగతులగుట

లందఱకు నుపయోగకర మగునట్లు లోకుల యధీన మునం దుంచవలయు నని ఈ సమష్టివాదు లందఱు నుద్దేశించి యున్నారు. తక్కిన విషయములందు మాత్రము వీరు భిన్నాభిప్రాయులై యున్నారు. లోకుల యధీనము క్రింద నుంచుట యన నేమిటో విప్పి చెప్పు నపుడు వీరి యభిప్రాయములు వేర్వేఱుగా నున్నవి: (1) రాజ్యాంగమువారి యధీనము క్రింద నుండవలయు నని కొందఱును (2) ఆయా స్థలములయం దుండు సమస్త జనుల యధీనమునం దుండవలయు నని కొందఱును (3) ఎవరి యధీనమునం దున్నను నిజసంపద యుండఁగూడ దని మరికొందఱును (4) అసమానభావత్వమునకు సందియ్యకుండునట్లు కొన్ని వస్తువులయందు నిజసంపద యుండిన నుండవచ్చు నని ఫూరియర్ మొదలగువారు కొందఱును అభిప్రాయపడుచున్నారు.

పిమ్మట మొత్తముగా నుత్పాదింపఁబడిన సంపద యంతయు నెట్లు విభాగింపఁబడవలె ననెడి యంశము నందును వీరు భిన్నాభిప్రాయులైయే యున్నారు. ఎవరు తమ శక్తివలన నెంతకు పాత్రు లగుదురో అంతనే వారి భాగమని సైమనును అతని శిష్యులును చెప్పిరి. ఎవరి కెంత యవశ్యమో అంతంత వారివారి కియ్య వలయు నని ఫూరియరును అతని శిష్యులును వచించిరి. లూయీ బ్లాంకును అతని యనుచరులును శక్తిసామర్థ్యవివక్ష చేయకయే, అవసరానవసర నిరూపణము చేయకయే అందఱకును సమానముగా పంచవలె నని యుద్దేశపడిరి. ఈ మూఁడభిప్రాయములును సరియైనవి కా వని చూపవచ్చును. వీరి యభిప్రాయములందు దోషములు మిక్కుటముగా కన్పించుచున్నవి.

రామచిలుక పుట్టుకకు పిసినికాయ చినుఁగుటయు కోడిపిల్ల బయలువెడలుటకు గ్రుడ్డు బ్రద్దలగుటయు నెంత యవసరమో, వీరి యభిప్రాయములను అనుసరణలోనికి తెచ్చుటకు సామాజికవిప్లవము నంత యవసర మని తోఁచుచున్నది. ఇట్టి విప్లవమువలన కొన్ని మార్పు లేర్పఱుపఁబడకపోవు కాని, ఇప్పుడు కష్టపడి తమ జీవనములు గడపుకొనువారి కింత శ్రమ యనవసర మగుటచేతను, శ్రమ యన్న నెట్టిదో యెఱుఁగని ధనికులు కష్టపడవలసివచ్చుటచేతను, వారీ పద్ధతుల నవలంబింపక పూర్వము దేశ మంతయు నల్లకల్లోలము కాఁగలదు. ఈ ధనికులు శ్రమపడ లేకుండుటచేతను పని వారికి ధనసాహాయ్యము లేకుండుటచేతను ఉభయులును దిక్కుమాలినవా రగుదురు. కష్టపడి పనులు చేయువారికి కష్టపడుటయం దిచ్ఛ తగ్గక మానదు. అందువలన దేశము కొంత కాలము హీనస్థితియం దుండ వలసివచ్చును. విప్లవమువలన లోకమునకు నష్టమే కాని అంతగా లాభ ముండఁజాలదు. దేశమునందలి యాస్తి సంతతిని వంశానుక్రమమునుండి తప్పించి రాజ్యాంగము వారి యధీనమునకు కష్టము లేకయే తెప్పించితి మని యొక నిమిష మనుకొందము. అట్లు చేసినను కొన్ని విషయములయందు మాత్రము వంశపరంపరతను తప్పింపఁజాల మను విషయమును మనము తెలిసికొనవలసి యున్నది. తల్లిదండ్రుల చక్కఁదనము గాని తెలివి గాని చెడుగుఁదనము గాని వ్యాధులు గాని పుత్రులకు సంభవింపక మాన వనెడి యంశము మన కెల్లరకును విశదమే. ప్రకృతియే యిట్టి పక్షపాతము వహించియుండ, మన మెంత ప్రయత్నము చేసినను సమానత్వమును పొందఁగలమా యను శంక పొడముచున్నది. అందు నీ యాస్తి సంతతిని రాజ్యాంగమువారి యధీనమున నుంచవలయు నని కదా ఇందు కొందఱి యూహ? ఇట్లే వారి యధీనము చేసినచో, దేశమునందలి సంపద యంతయు వారి యధికారమునం దుండుటం జేసి వారి కుండు పలుకుబడి గాని మాట చెల్లుబడి గాని ఇతరుల కుండఁజాలదు. అందువలన నసమానత్వము గలుగుచున్నది. అసమానత్వమును బాపి సమానత్వమును నెలకొల్పు నుద్దేశించు వీరి యూహ భంగము కాఁగలదు.

మరికొందఱు నిజసంపదను పూర్తిగా తీసివేయవలె నని యభిప్రాయపడుచున్నారు. దూరదృష్టితో నాలోచించినచో, ఇయ్యది సాధ్యమా కోరఁదగినదా యని శంకింపవలసివచ్చుచున్నది. నిజసంపద యుండుటవలననే ప్రతివానికిని వస్తూత్పాదనయం దాసక్తి యుండుట. నేను కష్టపడి సమకూర్చుదానికి నేనే యధికారి నగుదు ననెడి యాశ నా మనమునం దుండుటం జేసియే నే నేదియేని సమకూర్చుటకుఁ గడంగుట. అట్లు లేదేని, నేను కష్టపడి యార్జించినదానిని నలువురికిని పంచిపెట్టవలసి వచ్చినచో, నాయం దుత్సాహ ముండఁజాలదు. కాని, దీనికి సమాధానముగా మనుజులు తమ మేలు మాత్రమే చూచుకొను పశువులు కా రనియు పరోపకారార్థమై వీరు కష్టపడుటకు వెనుదీయ రనియు అయ్యది మనుజస్వభావ మనియు సమష్టివాదు లందురు. అట్లయ్యును, దేశమున కెంత యవసరమో యంత మాత్రమే జను

లుత్పాదింప యత్నింతురు కాని, రమ్యముగ నుండు నట్టియు మనోహరము లగునట్టియు వినోదకరముగా నుండునట్టియు చక్షుఃప్రీతికరము లగునట్టియు వస్తువుల నుత్పాదింపరు. అందువలన అనేకశాస్త్రములు నశింపవలసి యుండును. కావున, నిజసంపదను తీసివేయ యత్నించుట దేశమున కరిష్టమే కాని లాభమును కలుగఁజేయఁజాలదు. ఇట్లు కాక, పూరియరు చెప్పునట్లు కొన్నిటియందు మాత్రము నిజసంపద నుంచుద మన్నచో, అసమానత్వము సంభవింపక మానదు. అప్పుడు ప్రయత్నము లన్నియు నిష్ఫలము లగును.

ఇంక నీ వాదుల విభాగపు పద్ధతులను విచారింతము. "వారివారి శక్తిసామర్థ్యములవలన నెవరెవ రెంతెంతకు పాత్రు లగుదురో వారివారి కంతంత" యని సైమను గారి యభిప్రాయము. పాత్రతయే ప్రమాణ మగునెడల సహజభేదములవలన తెలివి గలవారు ఎక్కువ సంపదకును తెలివి తక్కువవారు తక్కువ సంపదకును పాత్రు లగుదురు. అందును అసమానభావ మేర్పడుచున్నది. అసమానత్వము తీసివేయ నెంచి కదా ఈ వాదుల యత్నము చేయుట! కావున, ఈ విభాగ పద్ధతి బాగుండలేదు.

ఇట్లు కాక, పూరియరు చెప్పిన ట్లవసరమునే ప్రమాణము చేయుద మన్నచో, దేశమునం దుత్పత్తి చేయఁబడుచున్న సంపద చాలునా యని యనుమానపడవలసి వచ్చుచున్నది. ఇయ్యఁగలవా రుండ, అవసరములు వృద్ధిగాక యుండునా? ప్రతివారును మేడల యందే నివసింప యత్నింతురు. ప్రతివారును చక్కని విలువ గల బట్టలనే కట్ట నుద్యుక్తు లగుదురు. మనుజుల వాంఛ నియమము లేనిది. ప్రాత వాంఛలు ఫలించు చుండ, క్రొత్త వాంఛ లుద్భవిల్లుచుండును. అట్లు, వాంఛలు వృద్ధి చెందునే కాని దేశ మార్థికాభ్యుదయమును పొందఁజాలదు. అందువలన నీ పద్ధతి సాధ్యపడునా యని తలఁపవలసివచ్చినది.

ఈ పద్ధతి నవలంబింపక లూయీ బ్లాంకు చెప్పినట్లు సంపద నంతను సమానముగా భాగింత మన్నచో ద్రవ్యవంతు లని బీదవా రని భేద మంతగా నుండదు గాని, లోకమునం దున్న జను లందఱును దరిద్రులే కావలసియుందురు. దేశమునందలి కొండల నన్నిటిని పగులఁగొట్టి లోతు గల జలప్రదేశములను పల్లపు ప్రదేశములను తదితరప్రదేశములతో పాటు సమానమైన యెత్తు గలవిగా చేయఁ బ్రయత్నించుటయం దెంత యనుభవమును తెలివిని వినియోగింపవలెనో ఇందును నంతే యనుభవమును తెలివిని వినియోగింపవలసియుండును. ఇయ్యది యెవరికిని సాధ్యమైనదిగా తోఁపదు.

పైని పేర్కొనఁబడిన వాదు లందఱును కొంత కాలము శ్రద్ధ వహించి పనిచేసిరి గాని వారి యభిప్రాయము లన్నియు నసాధ్యము లగుటం జేసి తమ యత్నము లన్నియు వ్యర్థములుగా నెంచి వారు తమ వాదములను వదలియున్నారు. వీరీ వాదములను వదలి పెట్టినను, ఈ వాదము పూర్తిగా నశించియుండలేదు. ఇందు కొన్ని లోపములను చక్కఁబఱచి కారల్ మార్క్సను నతఁడీ వాదమును వృద్ధిచేసెను. ప్రస్తుతము దేశములం దెల్లెడలను వ్యాపించియున్న వాద మితఁడు పరిష్కరించినదే. తమతమ కృతజ్ఞతను తెలుప నెంచి ఈ వాదానుచరు లీ వాదమునకు "మార్క్సిసమ్" అని పేరు పెట్టియున్నారు. దీనినే మనము సంఘవాద మని పిలువవచ్చును. ఇంగ్లీషున దీనిని "కమ్యూనిజమ్" అని వాడుదురు.

ఈ మార్క్సు జర్మను దేశపు జ్యూమతస్థుఁడు. ఇతని గురువు గొప్ప వేదాంతియు శాస్త్రవేత్తయు నగు హాగెలు గారు. ఇతని తెలివి యత్యద్భుత మైనది. 1818-వ సంవత్సరమున నితఁడు జన్మించెను. 1841-వ సంవత్సరమున కీతఁడు తన విద్యను పూర్ణము చేసికొనెను. ఆ ముందు సంవత్సరమే ప్రష్యను దేశపు ప్రజాప్రాతినిధ్యపు రాజకీయాందోళనాబ్ధియందు తానును యాత్ర చేయ మొదలిడెను. ఇతఁడు పిచ్చిపిచ్చి మోహపు కోరికలు గలవాఁడు. సాంఘికపరిణామమును గూర్చి తన గురువు కొద్ద చాలవఱకు నేర్చుకొనెను. ఏ విధానపు పరిణామమునకును దేశచరిత్రయే ముఖ్య మని ఇతనికి గట్టిగా తెలియును. అందువలన నతని చుట్టు నున్న దేశీయుల స్థితిని కన్నారఁ గాంచెను. దేశ మెల్లెడలను దుర్భర మైన దరిద్రావస్థయం దున్నట్లు కనుఁగొనెను. తన దేశమును వదలి ప్యారిసు నగరమునకు పోయి యచటి సమష్టివాదులను కలసికొనెను. అటు పిమ్మట ఇతఁడు తన వాదమును బయల్పఱచెను. ఆదర్శమాత్రములుగా నుండు ప్రతిపద్ధతిని ఇతఁడు వదిలి పెట్టెను. ఇతఁడు కని పెట్టిన క్రొత్త పద్ధతి యేమియు లేదు. ఇతఁడు సమష్టివాదపు మొక్క చుట్టును పెరుఁగు

చున్న రెల్లును గడ్డిని ఊడఁబెరికి రాళ్లను రప్పలను పెల్లగించి, దానికి చక్కని కుదురు కట్టి, అందు నీరు పోసి ఆ మొక్కను వృద్ధి చేసెను. ప్రప్రథమమున మొదలుపెట్టఁబడిన వాదమును గొంతెమ్మ కోరికగను చోద్యమైనదిగను మనఃకల్పితముగను నెంచి అందలి యనిశ్చితము లైన విషయముల నన్నిటిని వదలిపెట్టి ఈ వాదమునకు కొంత రూపిచ్చెను.

వీరి యుద్దేశములు

వస్తూత్పాదనమందు జనులు పడుచున్న శ్రమయే వస్తువుయొక్క విలువకు కారణ మని వీరి యుద్దేశము. అందువలన వస్తూత్పాదనకై నిజముగా పాటుపడు వారు శ్రమపడి పనిచేయునట్టి పనివారే కాని, కొన్ని కారణములవలన వీరు కష్టపడినను వీ రుత్పాదన చేసిన సంపదను వీ రనుభవింపక ఇతరు లనుభవించుట తటస్థించుచున్నది. వీరి కష్టఫలమును కష్టపడక యూరక కూర్చున్నవార లనుభవించుట మామూ లాయెను. "కష్టీ ఫలీ" యను నార్యోక్తి యబద్ధ మాయెను. అందుచే పనిచేసి కష్టపడి జీవించువా రెల్లరును బీద లైరి. పని చేయనివారు ధనికు లైరి. ఆ ధనికుల కీ బీదలు స్వాధీను లైరి. వీరి స్వాతంత్ర్య మడుగంటెను. ఇట్టి దుస్థితి చిరకాల ముండునది గా దని మార్క్సు గారి యూహ. మొత్తముమీఁద అందఱును కలసి పని చేయవలసిన కాల మాసన్న మైనది. ఇట్లందఱును కలసి పనిచేయుట కుత్పాదింపఁబడిన వస్తువులమీఁద అందఱ కును సమాన మైన యాజమాన్య ముండుట యవసరము. కావున, ప్రస్తుతపు నిజసంపద నశింపవలసిన కాలము సమీపించినది. ఇట్టిది సంభవించుటకు విప్లవ మనవసరము. ఇయ్యది సంభవించినంతనే సమాన భావము తనంతట తానే వచ్చును. అప్పు డెవ రెంత పని చేసిన, ఆ పనికి తగినంత సంపద వారికి వచ్చును. ప్రతి మనుజుఁడు నెక్కువ సంపదను సంపాదింప యత్నించి యెక్కువ పని చేయును. అందువలన లోకము వృద్ధి చెందును. ఇదియే మార్క్సు గారి వాదము. ఇదియే మార్క్సుమతము లేక సంఘవాదము.

ఇందలి లోపములు

వీరి యభిప్రాయములందు లోపము లుండక పోలేదు. అయా లోపములను గూర్చి కొంత యాలోచింతము. వస్తువుయొక్క విలువ దాని నుత్పాదించుటయం దుండు శ్రమవలన నిర్ణయింపఁబడుచున్న దనెడి యూహ కేవలము తప్పు. శ్రమయే విలువకు కారణ మగునెడల, వస్తు నిర్మాణమునందలి శ్రమ నిత్య మగుటం జేసి ఆ వస్తువుయొక్క విలువ క్షణక్షణమును దినదినమును మాఱక స్థిరముగ నుండవలెను. ఇయ్యది యాచరణములో జరగునది కా దని బజారునకు పోవు ప్రతి మనుజునకును తెలిసియే యున్నది.

మొత్తముమీఁద అందఱును కలసి పనిచేయవలసిన కాలము సమీపించుచున్న దని వీ రూహించి యున్నారు. ఇది కూడ అన్ని విషయములయందును నిజముగా దని లోకానుభవజ్ఞు లెల్లరకును తెలిసిన విషయమే. వ్యవసాయమునం దిట్టి దెన్నటికిని సరిపడదు. వీరి విభాగపు పద్ధతులయందును ఇట్టి లోపములు కొన్ని యున్నవి.

ప్రస్తుతకాలపు సమష్టివాదు లందఱును ఈ లోపములను కనుఁగొనియే యున్నారు. ఈ వాదు లందఱును విప్లవ మెంత మాత్రము పనికిరా దని యొప్పుకొని యున్నారు. సంపద నుత్పత్తి చేయుట కవసర మగు వస్తువులయందు జనుల కున్న స్వాధీనత నూహాయం దైనను ఈ వాదులు తీసివేయఁగలరు గాని, సహజముగా వంశపారంపర్యముగా వచ్చుచున్న గుణములను తీసివేయఁజాల రను మాట వీరును గ్రహించియే యున్నారు. పరిపూర్ణసమానభావము నేర్పఱచుట యసాధ్య మని వీరును తెలిసికొని యున్నారు. కొంతవఱకైనను సమాన భావ మేర్పడుటకు నిజసంపదను నిర్మూలముచేయవలె నని ఇప్పటికిని వీరు పట్టుపట్టియున్నారు. ప్రస్తుత కాలపు సమష్టివాదు లందఱు నిట్టివారే. నిజసంపదను తీసివైచిన, వీ రెట్లు వస్తూత్పాదనకై పాటుపడుదురో ఇప్పటికిని తెలియఁజెప్పకున్నారు. దేశమునం దెల్లెడల నేదేని యొక చిత్రమైన మార్పు గల్గినఁ గాని వీరి వాదము ఫలించునట్లు గాన్పింపదు.

# రాజా తోడరుమల్లు

దుగ్గిరాల సూర్యప్రకాశరావు గారు, బి. ఏ.

అక్బరు చక్రవర్తియొక్క రాష్ట్రస్థాపనమునకును అతఁడు తలపెట్టి కొనసాగించిన రాజకీయసాంఘికసంస్కారములకును సహాయభూతుఁడై హిందూదేశచరిత్రమున సుప్రసిద్ధి చెందిన రాజా తోడరుమల్లుని బాల్యావస్థను గుఱించి మనకు స్పష్టముగ తెలుపఁజాలిన యాధారములు లేవు. తోడరుమల్లు ఖత్రీజాతివాఁడు. పంజాబీలు తమదేశీయుఁడని చెప్పుకొనుచున్నను, అతఁడయోధ్యారాజ్యమండలి లహార్పూరను గ్రామమున జన్మించె ననుట నిశ్చయము. లాహోరు జిల్లాలోని చూనమణ్ పట్టణమునం దతని దివ్యభవనము లిపుడును శిథిలము లగుచు కాననగును. తోడరుమల్లు బాల్యమున బహుకష్టముల ననుభవించెను. తోడరుమల్లుని శైశవమందే అతని తండ్రి మృతి నొందుటవలన ప్రపంచవ్యవహారమార్గముల నెఱుఁగక ఇంటినుండి బయటికి రాఁదగని యతని తల్లి ఈ యేకపుత్రుని పెంచుటకు కడు శ్రమలకు పాలయ్యెను. గొప్పరాష్ట్రముయొక్క యార్థికస్థితులను చక్కఁబఱచుటయే కాక దాని యభివృద్ధికి వలయు మార్గములను సర్వవిధముల పరిపూర్ణము గావింపవలసినవాఁడైన తోడరుమల్లు బాల్యమున దరిద్రములో మునిఁగి తేలుచు అనపేక్షణీయసాంగత్యమున కాలము గడపుచుండెను. తన సర్వశక్తులు వినియోగించి పుత్రున కుచితవిద్యను కఱపుటకు తల్లి ప్రయత్నించెను కాని, దానికి కావలయు గ్రంథజ్ఞాన మపుడు సాధ్యము కాదయ్యె. తనకొఱకు తల్లి పడిన కష్టములవలననె అతని కుదారభావమును ఔన్నత్యజ్ఞానమును అంకురించి ఆమె బోధనలవలన సద్ధర్మములును అధికారాపేక్షయు అతనియందు ప్రజ్వరిల్లె. తన్మూలమున అతఁడు తన బాధ్యతల నెక్కుడు సామర్థ్యముతో నిర్వహింపఁగలిగెను. తనతోడిబాలు రాటపాటలయందు ప్రొద్దు పుచ్చుచుండ, అతఁడు భావిస్థితికి సంసిద్ధుఁ డగుటకు దృఢనిశ్చయుఁడై పాటుపడుచుండుట వలన అపూర్వబాలుఁడను ప్రఖ్యాతిని పడయఁగలిగెను. బడిపంతులు నేర్పఁగలిగిన దంతయు అతఁడవలీలగ నేర్చెను. తల్లి యాశీర్వాదములను గొని ఆ బాలుఁడు స్వగ్రామమునుండి బయలుదేఱి గొప్ప యాశలతో మనోరథముతో పాదచారియై ఢిల్లీనగరమునకు పోవుచుండ, ఆ గ్రామము పొలిమేరలలో పెడకడిని చుట్టుకొని యొక త్రాఁచుపా మతని కంటఁ బడెను. అప్పు డా సర్పముపై నొక కాటుకపిట్ట హఠాత్తుగ వ్రాలి శీఘ్రమ యెగిరిపోయెను. తన కెదురుగ వచ్చుచున్న యొక బ్రాహ్మణుఁ డా జీవసర్పముపై నా మందపిచ్చుక వ్రాలుటను చూచి, అది మంచి శకున మనియు మన శాస్త్రములు నిజ మయ్యెనేని అట్టి శకున మైనవాఁడు రాజ్య మేలు నని గాని గొప్ప రాజునకు మంత్రి యగు నని గాని వానియందు వ్రాయఁబడియున్న దనియు చెప్పె తోడరుమల్లును సంతోషపఱచెను. పదునైదు దినములనాఁటి కా బాలుఁడు మెల్లగ ఢిల్లీ చేరి, చేతి ద్రవ్యమును కట్టబట్టయును లేక యొక మఠమున ప్రవేశించెను. అప్పటి కోశాధ్యక్షుఁ డగు ముజఫరు ఖానునకు కొందఱు లేఖకులు కావలసియున్నందున, తోడరుమల్లున కదృష్టదినము లారంభమై కాఁబోలు వెంటనే అతనియొద్ద నొక లేఖకుఁడుగ నియమింపఁబడెను. తోడరుమల్లునకు పనియందుఁ గల విరామము లేని శ్రద్ధను జాగరూకతను సమర్థతను ముజఫరు ఖానుఁడు శీఘ్రముగ కనుపెట్టి, అతనిని స్వీయభృత్యవర్గమున చేర్చుకొనెను. ఈ నూతనపదవియందు తోడరుమల్లు తన యుద్యోగరహస్యములను పూర్ణముగ గ్రహించి కోశవ్యవహారవిషయమునం దసమానజ్ఞానమును సంపాదించుటచేత, పేరునకు లేఖకుఁడైన యతనిని ముజఫరు ఖానుఁడు ప్రతివిషయమును గూర్చియు అడుగుచు నొక విజ్ఞానసర్వస్వముగ భావింపఁదొడఁగెను. ఒక సంవత్సరమునాఁటికి తోడరుమల్లుని గ్రహణశక్తియు మేధాకలనయు ముజఫరు ఖానునకు స్పష్టములై, వాని కతఁడు మెచ్చి తోడరుమల్లునకు చక్రవర్తి సందర్శన మిప్పించెను. తన్మూలమున తోడరుమల్లునకు కొలఁది కాలమున కా మంత్రిత్వపదవియే లభ్య మగుటకు హేతువయ్యెను. అప్పటినుండియు చక్రవర్తి కతనియందు నమ్మకము కుదురుటయే కాక, తన యాప్తసేవకవర్గములోనివానిఁగ నెంచి తోడరుమల్లుని విపులజ్ఞానమునకును శక్తిప్రజ్ఞలకును సంతసిల్లి స్వీయభృత్యకోటిలో చేర్చుకొనెను.

చక్రవర్తిసన్నిధిని మసలుచుండువాఁడగుటచే తోడరుమల్లు తన పూర్వపు ధోవతిని నిలువుటంగీని వదలి మహమ్మదీయసభ్యునివలె బిగువు పైజామాలను కమ్మరబందులను ధరించి కలము పట్టిన చేతితో కత్తిని ఝళిపించుచు చక్రవర్తి పరివారముతో స్వారిచేయ నారంభించెను. అతని పరిశీలనమును గ్రహణశక్తియు అత్యద్భుతము లగుటవలన, శీఘ్రకాలముననే అతఁడు దండులోని వ్యవహారములను సులభముగ గ్రహింపఁగలిగెను. చక్రవర్తి దండు వెడలినపుడు ప్రతి వ్యవహారమును గంధర్వకోలాహలముగ నుండుటచే నొక మనుష్యుని కనుఁగొనుటకు కొన్నివారములు నెలలు పట్టుచుండెను. ఈ యాత్రల కొఱకు రాష్ట్రకోశమునందలి విస్తారధనము వ్యయ మగుచున్నను, పరివారమునకు కావలయు భోజనాదిద్రవ్యములను గ్రామములందు కొల్లగొనుచు నడిమివారే ధనమును హరించి పేద రయితుల కందనీయక వారిని హింసలు పెట్టుచున్నా రని యతఁడు శీఘ్రముగ గ్రహించెను. ఈ యక్రమములను తోడరుమల్లు సహింపనేరక యుద్ధవిడిసిన ప్రతి దండునకును కావలయు నేర్పాటులను చేయింపఁబూని దండు

దిగిన చోట బజారులు పెట్టించి సరకులను క్రమ మైన వెలలకు విక్రయింప నేర్పాట్లు చేసెను. ఆ విక్రేతలకు రాష్ట్రకోశమునుండి ధనసాహాయ్యము చేసి క్రమ మైన లెక్కల నంపించుటవలన, చక్రవర్తి సైన్యములకొఱకు నిరాధారు లగు రయితులను కొల్లగొట్టి యేడ్పించు పద్ధతి యచిరకాలమున నామమాత్రావశిష్ట మయ్యెను.

ఇట్టి యసమానప్రజ్ఞాధురంధరుని నైపుణ్యమును అప్రతిహత మనోదార్ఢ్యమును సేవారంభదశయందే ద్యోతకములు కాఁగా, వాని నక్బరు మెచ్చి అతని యార్థికోద్యోగమున కదనముగ సేనాధిపత్యమును గూడ నొసఁగెను. మొగలాయి సేనలలో ధీరులును సమర్థులు నైన బహదరు ఖాను అలీకులీ బేగ్ అను నిద్దఱు సేనాధిపతులు రాజద్రోహులై తిరుగఁబడి అయోధ్యా ప్రాంతములయందు చెలరేఁగి యల్లరి చేయుచుండ, వారిని శిక్షించుటకు మీరు మయిజులు ముల్కును విశ్వాసపాత్రుఁడైన తోడరుమల్లును అక్బరు నియోగించెను. మీరు మయిజులు ముల్కు అగ్నిసన్నిభుఁడును రాజా తోడరుమల్లు ఆజ్యమువంటివాఁడును అగుటచేత, దూరదృష్టియు తగు ప్రయత్నములును లేకుండ వారిరువురును బహదరు ఖానుని దుర్భేద్య మగు శిబిరమును ముట్టడించిరి. బహదూర్ ఖాను బయలువెడలి రాఁగానే రాష్ట్రీయసైన్యములు పలాయితము లైనను, శౌర్యోదారుఁ డగు తోడరుమల్లు స్థిరముగ నిలిచి బహమూర్ఖానుని పెంచ మడఁచుటవలన, మొదట జయోత్సాహు లైన రాజద్రోహులు భగ్నాశయులై చక్రవర్తిఁ క్షమాపణమును వేఁడుకొనిరి. ఈ ప్రార్థనయు రాష్ట్రీయ సైన్యములు మొదట పరాజయము నందె నన్న వార్తయు ఏక కాలమున తెలియుటవలన, అక్బరు తన సహజౌదార్యబుద్ధితో జితులైన శత్రువులను క్షమించి తన సేనానులను వెనుకకు రప్పించెను.

చిత్తూరు సూరతు రణతంబూరు ముట్టడులలో తోడరుమల్లు సేనాధిపతిగ నుండెను. ఆ సమయములం దతఁడు విశ్రాంతి నెఱుఁగక సేనలలో నెవరికిని విశ్రాంతి కలుగనీయలేదు. తన యూహలవలనను పన్నుగడలవలనను జయము సర్వత్ర సాధ్య మై, అతఁడు సమర్థుఁడును నిపుణుఁడును నగు సేనాని యను ప్రఖ్యాతిని సంపాదించెను. చక్రవర్తి సంతుష్టుఁడై అతనిని వెంటనే స్వతంత్రసేనాధిపతిగ నియమించి ఘూర్జరదేశమును జయించుటకు పంపెను. ఆ కార్యమును కూడ అతఁడు జయప్రదముగను సత్వరముగను ముగించుటవలన చక్రవర్తి అతనిని బీహరురాజ్యమును జయించుటకు నియమించెను. అంతవఱకును పోరాడుచున్న మన్సూరు ఖాను ధైర్యము గల యోధుఁడైనను శాంతస్వభావుఁ డగుటవలన, దండయాత్రను నిష్కర్షముగ నడపలేకపోయెను. సేనలలో కట్టుబాటులు లేక సైన్య మాతని వశము తప్పి ప్రవర్తింప సాగెను. సైనికులును వారి నాయకులును యథేచ్ఛావిహారులై కేళిక్రీడాసక్తులై కాలము గడపుచుండిరి. ఇట్టి యసందర్భసమయమున కఠినమార్గముల నవలంబించి కార్యానుకూల్యము గావించుటకు రాజా తోడరుమల్లే యర్హుఁ డని అక్బరు నమ్మియుండెను. అతఁడు రణరంగము చేరినతోడనే పూర్వపు ఫక్కి యంతయు మాఱిపోయి కట్టుదిట్ట మారంభ మాయెను. మొగలాయీలును చుగ్ఁగాలును నొకరి యాజ్ఞలకు బద్ధులయి యుండుట నెఱుఁగనివా రగుటచేత, తోడరుమల్లుని శాసన నిరోధములవలన వారు కోపపూరితులయిరి. తోడరుమల్లుని ధైర్యదక్షతలవలన ప్రతిపక్షులు వంచితులైరి. జేబరు హుమాయూను చక్రవర్తులనాటి యోధులు విఱ్ఱవీఁగక మొఱకుతనము వహించిన కార్యము లే దని గ్రహించి తుదకా హిందూలేఖకుని యాజ్ఞల చొప్పున నమ్రతతో నడవసాగిరి. తోడరుమల్లు తన శక్తిసామర్థ్యములను పాటింపక మన్సూరు ఖానునికుండే సర్వసేనాధిపత్యము నుంచి తా నొక సేనాభాగమునకు మాత్రమే నాయకుఁడుగ నుండ నంగీకరించెను. సైన్య మంతయు వశీకరణ మైన వెనుక కడు నేర్పుతో పాట్నాను ముట్టడించి అప్పు డొక యోధుఁ డైనను కోలుపోకుండ దానిని వశపఱచుకొనెను. అక్బరు దీనికి సంతసించి తోడరుమల్లునకు సొంత పతాకమును ఢంకాను కొనిపోవుటకు స్వాతంత్ర్య మొసఁగి అతనిని ముఖ్యసేనానిగ నియమించి బంగాళా రాజ్యము పైకిఁ గూడ దండెత్త నాజ్ఞాపించెను. దండయాత్ర కేఁగుచున్న సైన్యమున కతఁడు ప్రియతముఁ డైనను ముఖ్యసేనాధిపత్యము మాత్రము తన కక్కఱలే దని వదలుకొనెను. బంగాళా సైన్యమునకు సేనాధిపతి యైన మునిం-ఖానుఁడు గోటాసునుండి యుద్ధము చేయుటకు వచ్చిన దావూదు నెదుర్కొనుటకు భయపడెను. అక్బరు చక్రవర్తియొద్దనుండి యుత్తరువులు వచ్చువఱకును తోడరుమల్లునకు తాను తోడ్పడక ఖాన్ ఖనాను మొదట మూర్ఖతతో నూరకుండి, పిమ్మట నర్ధాంగీకారముగ ముఖ్యసైన్యములను నడపించుచు వచ్చి నడుమ శిబిర మేర్పఱుప, సుడిగాలివలె దావూదు వానిపైఁ బడి రణరంగమున వానిని సడియించెను. ఖాన్ ఖనానుని మరణవార్త వినినతోడనే తోడరుమల్లు క్రింద నున్న సేనలు కూడ నిరుత్సాహము నొందినను, అతఁడు నిశ్చలహృదయుఁడై యుద్ధభూమియం దంతటను స్వారి చేయుచు ప్రతివానిని హెచ్చరించుచు తన ధైర్యోత్సాహములవలన వారి కావేశమును పురికొల్ప నారంభించెను. ఆ సైన్యము లుద్రేకముతో శత్రువుల నెదుర్కొని పోరాడ మొదలుపెట్టి, ఉదయభానుని ముందు హిమమువలె వారి నదృశ్యులఁ గావించెను. దావూదు వెంటనే సంధి కోరెను. ఈ దండయాత్రవలన కలుగుచున్న శ్రమలను కష్టములను సహింపనొల్లని కొందఱు నాయకులు సంధి కంగీకరించినను, తలఁచిన కార్యమును సంపూర్ణముగ కొనసాగించుటయే ప్రధానముగ నెంచిన తోడరుమల్లు అట్టి సంధికి సమ్మతింపక దానిని నిరాకరించి దావూదు విశ్వాసముగ నిలిచియుండువాఁడు కాఁ డనియు శీఘ్రకాలముననే మరల తొందరలు కలిగించు ననియు స్వల్పప్రయత్నముచే ఆ దవాగ్నిని నిశ్శేషముగ చల్లార్పవచ్చు ననియు వాదించెను. అతని యాక్షేపణములను వారు చెవిని పెట్టి సంధి గావించి సంతోషముతో నుత్సవములు గావించిరి. తోడరుమల్లు మెల్లగ నాగ్రాకు మరలి చక్రవర్తికి భద్రజాతిగజముల నేఁబది నాల్గింటిని సమర్పించి దండయాత్ర చరిత్రమును సాకల్యముగ 'విన్నవించెను. చక్రవర్తి యతని సాహసమునకు మెచ్చి తన యాదరణ సూచకముగ అతనిని కోశాధ్యక్షునిగ నియమించెను. తన నిసర్గపాటవముతో

తోడరుమల్లు కోశపరిపాలనమును సంస్కరింపఁబూని ప్రతి స్వల్ప విషయమునందును తన బుద్ధిని చొఁబినిచ్చెను. అతఁడూహించిన రీతిని దావూద్ఖాను వెంటనే తన చేసిన సంధిని లక్ష్యపెట్టక చక్రవర్తిపై తిరుగఁబడెను. ఖాన్ ఖనానుయొక్క మరణమువలన ఆఫ్ఘనులందఱును తిరుగఁబడిరి. ఆ కలహము నణఁగఁద్రొక్కుటకు చక్రవర్తి ఖాన్‌జహానును ముఖ్యసేనాధిపతిగ నియమించి తోడరుమల్లు నతనికి సహాయముగ నంపెను. బంగాళాదేశమందలి రాష్ట్రీయ సైన్యములు వెనుకటి దండయాత్రలో దొరకిన దోపిడి ధనము మూలమున సుఖభోగులై దౌర్బల్యము చెందియుండుటవలన, జాగరూకుఁడై పనిగొను తోడరుమల్లువంటి సేనాధిపతి క్రింద నుండుటకు వారు సమ్మతింపరైరి. కొంద ఱుద్యోగులు వ్యాధిగ్రస్తులుగ నుంటి మనిరి. ఇతరులు క్విజిల్బషీ (ఖాన్‌జహానున కిది పరిహాసనామము) నాయకత్వము నంగీకరింప మనిరి. సేన లన్నియు తోడరుమల్లుని యాజ్ఞకు బద్ధములై యుండెను. సైన్యమున కంతకును రాష్ట్రకోశమునుండి క్రమముగ వేతనముల నిప్పించెడు పద్ధతి నేర్పఱిచిన ధారాళవ్యాపారమునకు వార లతనిని ప్రేమింప నారంభించిరి. ఇంతియ కాక, తమకు సహాయము చేయ నుద్యుక్తుఁడై యున్న దయార్ద్రహృదయుఁడగు సేనాధిపతి దొరకుటకు వారు సంతసిల్లిరి. కుటుంబగౌరవమును ఆస్థానాదరణమును పాటింపక, అసమర్థులగు నుద్యోగీయులను తొలఁగించి అనుకూలురైనవారి నందఱను గుమికూర్చుటవలన జైత్రయాత్రకు సమర్థమైన సైన్యము నతఁడు సిద్ధము చేయఁగల్గెను. షేర్షానాఁటి పురాతనయోధులు కూడ తోడ్పడినందున దావూదు గొప్ప ప్రయత్నములతో ధ్వజమెత్తి ప్రారంభించెను. దాని నణఁచుట కక్బరు స్వయముగ బంగాళమునకు పో నిశ్చయించెను. రాజధానినుండి చక్రవర్తి కొన్ని క్రోశముల దూరము ప్రయాణము సాగించునప్పటికి ఖాన్‌జహాను తోడరుమల్లులు పంపిన వార్తావహుఁ డొకఁ డెదురై దావూదు శిరమును చక్రవర్తి పాదసన్నిధి నుంచెను. యుద్ధము జరగెను, వారు గెల్చిరి. కాలాపహార్ అను వీరుఁడును జానీ దను ఆఫ్ఘను ఖడ్గయుద్ధనిపుణుఁడును గాయములు తగిలి పలాయితులైరి. దావూదును తోడరుమల్లు వెన్నంటి తఱుమ వాఁడు తప్పించుకొని పారిపోవ యత్నించెను. తుదకు దావూదుని గుఱ్ఱ మొక బురదప్రదేశమున చిక్కుకొనఁగ, తోడరుమల్లున కతఁడు వశుఁ డయ్యెను. ఖాన్‌జహాను నెదుట దావూదును నిలువఁబెట్టి నీ చేసిన సంధియు నీ ప్రమాణములు నే మయ్యె నని తోడరుమల్లడుగ, "నేను ఖాన్ ఖనానునితో సంధి చేసితి" నని దావూదు తిరస్కారభావముగ ప్రత్యుత్తర మిచ్చుచు, "నీవు గుఱ్ఱమును దిగుదువేని మన మిద్దఱ మిష్టాగోష్ఠిని కొంత సల్పి యింకొక సంధి గావింత"మని యెను. వాని కుత్సితద్రోహస్వభావముల నెఱిఁగిన ఖాన్‌జహాను వాని దేహమునకును రాజద్రోహపూరితమైన శిరమునకును సంబంధమును వదలింప నాజ్ఞాపించెను. దావూదు నురిదీసి వాని కళేబరమును వధ్యస్తంభమున వ్రేలాడఁ గట్టించిరి. జయశీలుఁడైన తోడరుమల్లు చక్రవర్తి యాస్థానమునకు వచ్చి పెక్కు సత్కారముల నందుకొనెను. ఆవశ్యక మగు కాఠిన్యమునకు నైపుణ్యమును సహన భావమును జతగూర్చి వ్యవహరింప నేర్చిన తోడరుమల్లు రాజధాని కేఁగినతోడనే, బంగాళారాజ్యపు సైన్యమునం దసంతుష్టి ప్రజ్వరిల్లి వా రందఱును మరల తిరుగఁబడిరి. తమ కుట్రకు కొంత యాధార ముండుటకు కాబూలునం దున్న అక్బరు సోదరుఁ డగు మహమ్మదు హాకీమునకు వా రాహ్వానము నంపిరి. తూర్పు దిశను బంగాళారాజ్యము నేలుచున్న చక్రవర్తియొక్క ప్రతినిధిపై తిరుగఁబడి ఆ సైన్యములను పాఱఁద్రోలిరి. పశ్చిమమున మహమ్మదు హాకీము కాబూలునుండి బయలుదేఱి సింధునదీతీరము చేరెను. ఇట్టి ప్రమాదస్థితియం దక్బరు సజాతీయులగు ముసల్మానులను నమ్మఁజాలక బంగాళమును నిర్జించుటకు తోడరుమల్లును తన సోదరుఁ డగు మీర్జా మహమ్మదు హాకీము నెదుర్కొనుటకు మానసింగును నియోగించెను. తన జాతివా రిట్లు ద్రోహులై తిరుగఁబడి తన్నెదుర్కొనిన ప్రమాదసమయమునం దీ యిరువురు హిందూ ద్విజులును చక్రవర్తియెడల రాజభక్తిపూరితులై విశ్వాసముతో నిలిచియుండిరి. ఎవ్వరి సాహస విశ్వాసములచేత అక్బరు గొప్ప యుద్ధములలో జయ మందెనో, అట్టి సజాతీయప్రభువులు చక్రవర్తిపై ధ్వజమెత్తి బంగాళా రాజ్యవ్యవహారముల నాందోళస్థితికి తెచ్చిరి. శత్రువులపై ప్రేల్చిన ప్రతి తుపాకీగుండు విలువయు రాష్ట్రీయకోశమునుండి నిష్కారణముగ వ్యయ మగుచున్నదని కోశాధ్యక్షుఁడగు తోడరుమల్లు చింతించి జాగరూకుఁడై సంచరించుచు తన వివేకమును వివేచనమును విక్రమమును విదితము గావించెను. స్వప్రయోజనపరులైన వారు చిరకాలము స్థిరబుద్ధితో నిల్చియుండ రని అతనికి తెలియుటవలన మాంఘీయరు కోటను పట్టుకొనుట కతఁడు ప్రయత్నించి దాని చుట్టును చతురశ్రముగా వ్యూహము నేర్పఱిచి యుక్తసమయము కొఱకు నిరీక్షించుచుండెను. కలహులతో రహస్యదౌత్యము నారంభించి వాండ్రకు నమ్మిక పుట్టించి కార్యము పొసఁగింప యత్నించినను దానివలన ప్రయోజనము లేదయ్యె. చక్రవర్తిపై తిరుగఁబడిన సైన్యములయం దనుమానభావమును ప్రజ్వరిల్లఁజేసి ఉత్సాహజనకములగు ప్రకటనలవలనను కఠినశిక్షావిధానములవలనను జనసమూహమును వశంవదులఁ గావించుకొని తిరుగఁబడిన సైన్యమునకు భోజనాది సామగ్రులందకుండ కట్టుదిట్టములు గావించెను. ఈ చొప్పున నాలుగు మాసములు గడచునప్పటికి పలువురు నాయకులను మృత్యువు గొని పోయెను. మిగిలినవారియందు ద్వేషబుద్ధి యంకురించి యంతఃకలహము లారంభమ లయ్యెను. నాయకుల మని విఱ్ఱవీఁగుచుండెడివా రంతట తోడరుమల్లు నెదుర్కొని పోరాడుటకు దుర్బలులైరి. అప్పుడు తోడరుమల్లు తన దుర్గమునుండి బయలువెడలి బంగాళాదేశమును మరల జయింప నారంభించి కొలఁది కాలముననే విస్తారప్రాణహానియు ధననష్టమును లేకుండ బలవత్తరమయిన కలహము నణఁగఁద్రొక్కి ప్రశాంతి నచట నిలుపఁ జాలెను. ఆ వంక వ్యవహారమును చక్కఁబఱచునప్పటికి మీర్జాకంరానుని కూఁతురును ఆమె కుమారుఁ డిబ్రాహీమును గుర్జరదేశమున కలహము నారంభించుటవలన చక్రవర్తి తోడరుమల్లు నచ్చటికి పంపెను. అతివేగముగ నూ

రత్తూ భగోచి చెంపనీయ పట్టణములను దాటి పటక్ చేరునప్పటికి మీర్జా అజీజు కోకా స్థానమున పాలకుఁడుగ వచ్చిన వజీరు ఖానుని కలహము లాడించి గను వార్త తెలియవచ్చెను. వీరా వేశముతో ముట్టడించుచున్న యా సైన్యమును తోడరుమల్లు సాహసముతో ఖండించి వాండ్రను భగోచివంక మరలునట్లు చేసి, అంతట విడువక వెంబడించి భగోచిపట్టణము వెలుపలకు పాఱఁద్రోలి, ఊపిరి యాడకుండ వాండ్రను తఱుమఁజొచ్చెను. తుదకు వాండ్రు నిరాశ చెంది పోరాటమునకు సిద్ధము కాఁగా, తోడరుమల్లు వారిని వడగండ్లవానవలె నిర్మూలము చేసి, వారి యశ్వ సైన్యభాగము నొకదానిని వశపఱచుకొనెను. వర్షపాతమువలె నారాచములు కురియించుచుండిన యా గుఱ్ఱపు రౌతులను పరీక్షింప, వారు పురుషవేషములతో నున్న స్త్రీలని తెలియనయ్యె. అంతట తోడరుమల్లు వారిని వెంటఁగొని రాజధానికి వచ్చి బంగాళారాజ్యమును జయించిన సంతోషముచే చక్రవర్తికి తన యింట గొప్ప విందు గావించెను. ఆ సమయమున తోడరుమల్లు మందిరద్వారము ముందా యాఁడు రౌతులు చక్రవర్తికి స్వాగత మొసఁగ, అశ్వరాశ్చర్యమగ్నుఁ డాయెను. బంగాళమున చేసిన మహాత్కార్యములకు మెచ్చి చక్రవర్తి యతనిని తన రాష్ట్రమున బడా వజీరుగ నియమించెను.

వీరబలుని మరణానంతరము పశ్చిమపు టెల్లలలోని కొండ జాతులవారి ధాటికి రాష్ట్రీయసైన్యములు చెదరి చీకాకునొంద, ఆ పర్వతములగుండ తోడరుమల్లు మెఱపువలె ప్రాఁకి ధూర్తు లగు వాఫ్ఘనులను పాదాక్రాంతులఁ గావించి వారు చక్రవర్తి క్షమాపణమును సంధిని వేఁడుకొనునట్లు చేసెను.

సేనాధిపత్యలక్షణములం దక్బరు సైన్యమున తోడరుమల్లద్వితీయుఁడై యుండినను, ప్రధానసేనానిగా నుండుట కాతఁ డెప్పుడును సమ్మతింపఁ డయ్యెను. మనుష్యసంహార మతనికి లేశమును కిట్టకున్నను, కార్యోపక్రమమునం దతఁడు జంకుట నెఱుంగఁడు. అతని స్వార్థపరిత్యాగము లోకోక్తి యయ్యెను. రక్తబిందువును చూచినతోడనే గుండె ఝల్లు మను వారికి కూడ యుద్ధావేశమువలన భయదాక్షిణ్యము లదృశ్యములై కోపోద్రేకమే ప్రధానమై జిగీషయే వారి మనోభూమి నాక్రమించి పాలించుచుండును. తాను గెలిచిన యుద్ధము లసమానము లని తోడరుమల్లు ఎన్నఁడును గర్వపడలేదు. ప్రశాంతిని పరిపాలనధర్మములను నిలుపుట పరిపాలకులకు విధి యని తలఁచి, అతఁడు యుద్ధమున కీయకొనెను. చిరకాలమునుండి యీ దేశమునం దపరూపమై యున్న వ్యవహారసమత్వమును నిలుపుటకు దృఢపరిపాలనము గావలయు నని యతఁడు నమ్మియుండెను. స్వలాభాపేక్షు లయి స్వల్పదృష్టిపీడితు లయిన సామాన్యప్రభువుల పరిపాలనవలన ప్రజాక్షేమమునకు వలయు భద్రతాసౌఖ్య మని గుర్తెఱిఁగి భిన్నజాతులవారి నొక్క రాజభృత్యులఁ గావించి వారిని రాష్ట్రక్షేమాపహారితులఁ జేయుట కతఁడు పాటుపడెను. ఘోర యుద్ధముల మధ్యమున తగులుకొని, నిలుకడ లేక సేనలతో నిత్యము దండయాత్రలు సలుపుచున్న సమయమందు సయితము మతఁడు రాష్ట్రముయొక్క శాసనార్థికపురస్కారము గురించి యోచన చేయుచుండెడివాఁడు. అతని స్థిరకీర్తి నవియే నిలుపఁగలిగెను.

అబుల్ ఫజుల్ వ్రాసినట్లు స్వలాభాపేక్షు యతని మనస్సునకు దూర మగుటచేత, రాష్ట్రవ్యవహారాభివృద్ధి కతఁ డెక్కువ కాలము వినియోగింపఁగలిగెను. అతనికి పూర్వము మహమ్మదీయులు, తాము జయించి యేలుచుండిన హిందూదేశప్ర భాగములందు పురాతనహిందూపరిపాలనావిధములను తృణీకరించి, తమ శాస్త్రధర్మముల చొప్పున పరిపాలించుచుండిరి. మహమ్మదీయ శాస్త్ర సిద్ధాంతము చొప్పున, ఇతరప్రజ లా మతము నైన నవలంబింపవలెను, లేక సంహరింపఁబడవలయును. వారిలో పండితు లగువారు దయాపూర్వకముగ వీని కొక ప్రతీకారము నేర్పఱచి దుర్భరమైన తలపన్నును విధించిరి. దానిని ప్రతివాఁడును నమ్రతతో సంతోషపూర్వకముగ చెల్లింపవలయును. దానిని వసూలు చేయుటకు వచ్చిన సుంకరి యా పన్ను చెల్లించువాని ముఖముపై నిష్కారణముగ నుమిసినను వాఁడు పెడమొగము పెట్టక కుపితుఁడు గాక విధేయతతో సంసిద్ధుఁడుగ నుండవలయును. మతద్రోహులను పరిమార్చుటవలన పుణ్యలోకప్రాప్తి యగు ననెడి నమ్మకము మహమ్మదీయులయందు ప్రబలియుండుటచేత వారు కొంతవఱకు దేశీయులను మృగయావినోదులు మృగములను పరిమార్చునట్లు వధించుచుండిరి. దండెత్తి వచ్చిన మహమ్మదీయులు జయించిన మండలములందు పరిపాలన మనునది లేకుండె ననియే చెప్పవచ్చును. తాము పాలించుటకు నియమింపఁబడిన రాజ్య భాగములకు పాలకులు క్రమక్రమముగ స్వతంత్రరాజులుగ నేర్పడి యథేచ్ఛముగ నేలుచుండిరి. న్యాయసమ్మత మైన పరిపాలనము దేశమునందు నెలకొల్పుటకు వారు లేశమైనను ప్రయత్నింపరయ్యె. రాజు భూమికి నామమాత్రప్రభు వై దాని యాదాయమున తనకు రావలసిన భాగముకన్న నెక్కువ పొందఁజాలకుండెను. దేశ మంతయు స్వల్పసేనాధిపసంస్థానములుగ విభజింపఁబడి వారిలో గర్వోన్నతు లగువారు తమ్ము తాము రాజుతో సమానులుగ నెన్నుకొనుచు యథేచ్ఛముగ నిర్లక్ష్యముతో వ్యవహరించుచుండిరి. ఢిల్లీని జయించిన వెనుక అక్బరు సయితము పూర్వపద్ధతులనే కొంత కాలమువఱకు అవలంబింపవలసినవాఁడై కడు ప్రయాసపడి యోరిమితో క్రమపద్ధతి నేర్పఱుపఁగలిగెను. మహమ్మదీయ దైత్రయాత్రలవలన దేశమునం దల్లకల్లోలము తప్ప స్వస్థత లేకుండెను. అక్బరు తన దిగ్విజయముతో సంతుష్టుఁడై యూరకుండ నొల్లక యుత్తమ రాజ్యధర్మములను నిర్వర్తింపఁబూని ప్రేమాసౌహార్దములచే భేదభావములను ప్రజలయం దంతరింపఁజేసి రాజు భగవదంశాసంభూతుఁ డని నిరూపింపఁ బ్రయత్నించుచుండ, అట్టి వానికి సమానసంకల్పు లైన తోడరుమల్లు సుమంత్రిగాను అబుల్ ఫజుల్ సఖుఁడుగను లభ్య మగు భాగ్య మబ్బెను. ఈశ్వరసంకల్పము చొప్పున నీ దేశమందు సమావేశు లైన హిందూ

మహమ్మదీయులకు నిజమైన సఖ్యమును పొసఁగించి సమానోద్దేశములతో పాటుపడి వారు వర్ధమానులగుటకు కలయు నుపాయముల నా యిర్వురును సర్వదా యోజించుచుండిరి. నూతనప్రజ్ఞలు వికసించుటకు సాధనము లేర్పడుటవలన సాంఘిక రాజకీయ పునర్నిర్మాణము కాఁగల దను సంతోషముతో హిందువు లుప్పొంగసాగిరి. తమ ప్రశస్తమతమును అక్బరు తిరస్కరించుచున్నాఁ డని మహమ్మదీయులు వగచుచు అతఁడు తలపెట్టిన సంస్కారముల కడ్డము వచ్చుచుండిరి. కలహముల నణఁగఁద్రొక్కి దేశమును స్వస్థమానము గావించిన తోడరుమల్లు రాజకీయవ్యవహారశాఖలలో ప్రతివిషయమునను కడు జాగరూకుఁడై ప్రవర్తించుచుండెను. అఱువది గజముల పొడవు గలిగి ఇనుప యుంగరములతో నతుకఁబడిన వెదురు కఱ్ఱల గొలుసులను పెట్టించి అతఁడు దేశ మంతయు సర్వే చేయించెను. తన్మూలమున ప్రతి భూస్వామియొక్క హక్కులను బాధ్యతలను నిర్ణయింపఁగల లిఖితాధారములును, ప్రజల యాచారములును అభిప్రాయములును తెలియఁగల సాధనములును ఏర్పడెను. కోశము సైన్యము సత్రము బాటలు కాల్వలు వర్తకము వృత్తులు — వే యేల? ప్రజాక్షేమమునకు వలయు ప్రతి వ్యవహారశాఖను గూర్చియు అతఁ డుత్తరువులను జారీచేయించెను. అతఁ డేర్పఱచిన రివిన్యూపద్ధతి స్వల్పపు మార్పులతో నిప్పటికిని నిలిచియున్నది. మహమ్మదీయులు ఫలసాయమున పదవ వంతు పన్నుగ చెల్లించుచుండిరి. అధికారుల యభిప్రాయమును పట్టి శిస్తును నిర్ణయించి కొన్ని సంవత్సరములవఱకు చెప్పిన మార్పు లేకుండ చెల్లించు పద్ధతిని తోడరుమ ల్లేర్పఱచెను. భూమిని మూఁడు విధములుగ విభజించి యొక్కొక్క తరగతి కొక్కొక్క నిర్ణీత మగు మొత్తమును గైకొనుచుండిరి. రాజభాగము మూఁడవ వంతు మొదలిరువదవ వంతువఱకు మాఱుచు నగుటున నాఱవ పాలుగ నుండి భీగాకు పది సేర్లకు మించకుండెను. శిస్తు నిర్ణయింపక పూర్వము విత్తనములకును కూలిపనులకును రయితునకు ధారాళముగ ముజరా ఇచ్చుచుండిరి. అక్బరుకాలమునఁ గూడ మండలాధికారి రయితులకు నైసర్గిక స్నేహభావమును చూపుట కుత్తరువు లుండెను. వఱదలు అతివృష్టి అనావృష్టి—ఈ మొదలైనవానివలన పంటలకు నష్టము సంభవించిన యెడల బాకీ సిస్తును మానుట కతని కధికార మీయఁబడెను. అతఁడు రయితులకు సర్వవిధముల సహాయ మొనర్చి విత్తనములకు గింజల నిచ్చి ధనసాహాయ్యము గూడ చేయుచుండెను. దేశ మంతయు పంద్రెండు భాగములుగను, ప్రతిభాగము కొన్ని సర్కారులుగను, ప్రతి సర్కారు కొన్ని పరగణాలుగను, ప్రతి పరగణా కొన్ని గ్రామములుగను విభజింపఁబడెను. ఒక "కరూరుదాము" (ఒకరూపాయకు నలుబది దాములు) రెవిన్యూ వసూలు కాఁగల ప్రతి పరగణాకు నొక "కరూరా" నియమింపఁబడి, అతనిపై తనిఖీ కొక అమీ లుండెడివాఁడు. ప్రతి పరగణాలో వేఱువేఱు పనులు చేయుటకు చిన్న యుద్యోగియు లుండిరి. ఇప్పటివలెనే ఆ కాలమునందును విశ్వాసము నమ్మకము న్యాయదృష్టి గల యుద్యోగియులు దొరకుట దుర్లభముగ నుండెను. సరియైన లెక్కలను వ్రాయించి కఠినముగ వానిని పరీక్షింపించుటవలన తోడరుమల్లు తన యేర్పాటులను సవ్యముగ నడుపఁగలిగెను. దీనితో పాటు తప్పు చేసినవారిని కఠినముగ శిక్షించుటవలన వ్యవహారము కట్టుదిట్టమై పొదుకొనెను. తాను శ్రమపడి యేర్పాటు చేసిన పద్ధతి లంచగొండులైన యధికారుల కుట్రలవలన భగ్న మగుట కతఁడు సహింపఁజాలఁడయ్యె. తాను సమముగ నేర్పఱచిన పన్నుల వసూలుకొఱకు దృఢనిశ్చయుఁడై పాటుపడి చరితార్థుఁ డయ్యెను. తగు మాత్రపు సిస్తు నేర్పఱచి, అది కొన్ని యేండ్లవఱకు మార్పఁబడ దను నమ్మకము ప్రజలయందు కుదురుటవలన వారు శ్రమ కోర్చి భూమి నెక్కుడు ఫలవంతముఁ గావింపఁదొడఁగిరి. అన్యాయము జరగు నను భయము ప్రజలకు లేకపోవుటవలనను సంపాదించుకొనిన ద్రవ్యమును సొత్తును తా ననుభవింపఁగల మను నమ్మకము ప్రబలుటవలనను తోడరుమల్లు తలపెట్టిన ప్రతి కార్యమును నిర్విఘ్నమై అతని శ్రమ కనుకూలఫలము గానఁబడుచుండెను. భూమి పన్నువలని రాబడి కొలఁది కాలముననే యినుమడించెను. జాతిని మతమును జన్మమును భాషను పాటింపక ప్రజ లందఱకు నేకశాసనములనే వర్తింపఁజేయుటవలన వారి నడవడులు తలంపులు కాలవఱకు నేకీభవించి, వా రన్యోన్యానురాగముతో నివసింపఁగలిగిరి. ఈ పద్ధతుల నాచరణమునకు తెచ్చుటకై పాళియగాండ్రను తొలఁగించి, దేశప్రజలలోనుండి యేర్పఱుపఁబడిన రాష్ట్రీయసైన్య మావశ్యకమయ్యెను. ఇది సులభసాధ్యము కాదు. ఆస్థానోద్యోగియులు దీనికి విముఖులుగ నుండిరి. అక్బరు మాత్రము చలింపక తోడరుమల్లునకు సహాయుఁడై అతని సంకల్పము కొనసాగుటకు తోడ్పడెను. అశ్వసైన్యమునందలి ప్రతి గుఱ్ఱమునకు ముద్రను వేయించి పూర్వమువలె నొక్క గుఱ్ఱమునే రెండు మూఁడు పర్యాయములు లెక్కకుఁ గొని వచ్చుట నసాధ్యముఁ గావించెను. సైన్యమున కంతకును జీతములు రాష్ట్రీయకోశమునుండి చెల్లించుటవలన పాళియగాండ్రకు జాగీరుల నిచ్చుటయు వారు సేనాపరీక్షాసమయమునకు నిష్ప్రయోజకు లగు కొందఱిని సైనికులుగ శృంగారించి సిద్ధముచేయు పద్ధతియు నడుగంటెను. టంకసాలను స్థాపించి రాష్ట్రమున కంతకు నొక్క నాణెము నేర్పఱచెను. అక్బరు సమత్వబుద్ధివలన దేశమున బానిసవృత్తి తొలఁగింపఁబడెను. అట్లు విముక్తులు గానొల్లని బానిసలను నెల జీతగాండ్రుగ నియమించి వారిని తన శిష్యు లని పిలుచుచుండెను.

వ్యావహారికపు పత్రము లన్నియు పార్శీభాషలో వ్రాయవలెనని తోడరుమల్లు శాసించుటవలన హిందువులు పార్శీభాష నేర్వవలసినవా రైరి. దాని మూలమున వారి కున్నతోద్యోగములు సుకరము లయ్యెను. హిందీపార్శీభాషల సమ్మేళనమువలన "ఉర్దూ" అను నూత్నభాషాభాగ మేర్పడి అది యిపుడు సర్వత్ర వ్యాపించి యందఱకు సమానభాష కాఁదగిన స్థితికి వచ్చుచున్నది.

తోడరుమల్లు కాశ్మీర రాజ్యమునుండి తిరిగి వచ్చుచుండ, మతావేశము గల యొక తురుష్కుఁ డతనిని కత్తితో బొమ్మపై పొడిచినందున కృశించియున్న యతఁడు వెంటనే దేహము చాలించెను. అప్పు డతనికడకు దేవత లొక దివ్యవిమానమును పంపి అతని

పవిత్రాత్మను స్వర్గమునకుఁ గొనిపోయి రని హిందువులు నమ్ముచున్నారు. అతని విచారకరచరణమునకు చక్రవర్తి మిక్కిలి పరితపించెను. తోడరుమల్లు స్వమతాభిమానము గలవాఁడు స్వమతవిషయమును గుఱించి యతఁ డెప్పుడును పెదవి విప్పి మాటాడలేదు అతనికి స్వమతపక్షపాతము మెండని యితరులు పరిహసించినను దానికి మాఱు చెప్పి యెఱుఁగఁడు ఒకసారి చక్రవర్తితో కలసి అజిమీరు నుండి పంజాబునకు పోవునపుడు ప్రయాణపు తొందరలో అతఁడు తన దేవతార్చనను మఱచిపోయెను. ఒక వేళ దాని నెవరైన తస్కరించి యుండవచ్చును నిత్యము దేవతార్చనము చేయకుండ లౌకిక వ్యాపారమును జరపనివాఁ డగుటచేత రెండు మూడు దినములతఁ డుపవాసములు చేసి అబుల్ ఫజుల్ వీరబలులు చేసిన యొగతాళిని పాటింపఁడయ్యెను. కుట్రలు స్వలాభాధికారకాంక్ష ప్రబలియున్న లోకమధ్యమున స్వార్థనాశమే ప్రధానలక్ష్యముగ నెంచి ఈశ్వరప్రేరితము లైన కార్యముల నెల్ల విధిగ నిర్వహించుచు పురాతన ఋషివర్గములోనివానివలె తోడరుమల్లు జీవయాత్రను ముగించెను. అట్టి మహనీయునకు జన్మస్థాన మైన భరతఖండము పవిత్రభూమి కాకుండునా?

# వంగదేశాధీశు పుత్త్రి

అధికారుల సూర్యనారాయణరావు గారు, బి. ఏ.

తేజ మాననసీమ రాజిల
రాజపుత్త్రుఁడు పల్కె ని ట్లని
"జాగుసేయకు పడవ నడపుము
జాలరీ వేగ!" 1

* * * *

"ఎవరు మీ? రిపు డేమి కారణ
మిట్లు త్వరపడుచున్న వారలు?
కరము చీఁకట్లమరు, నీరము
వెఱపుఁ గొలుపదొకో?" 2

గాలు లుద్రేకముగ వీఁచెడు,
కలుగుచుండెను భయము నెమ్మది;
శీఘ్రగమనం బివ్విధంబున
చేయఁ గత మేమీ?" 3

* * *

"అంగదేశపు మంగళాంగుఁడ,
వంగదేశాధీశు సుత యీ
యంగనామణి, పడినవారల
మంగభవు బారిన్! 4

తొలఁగఁజేసెడు తలఁపు కలుగఁగ,
చెలియఁ దోడ్కొని యరుగుదెంచితి,
తఱిమియుండిరి మూఁడు దినములు
తండ్రి పంపు భటుల్. 5

మక్కువంతయు నీమెపై నిడి
చిక్కకుంటిని రాజభటులకు,
చిక్కితిన, ననుఁ గోయకుందురె
ముక్కముక్కలుగా? 6

వాయువేగముతోడ రౌతులు
వారువమ్ముల వచ్చుచుండిరి,
చేటు తొడరును మాకు వారి
చ్చోటు చేరినచో 7

పదము జాడల గుర్తుపట్టిన,
ప్రాణములపై నాస లే దిఁక,
ప్రాణనాథుని నన్నుఁ జంపిన,
పడఁతి గతి యేమీ?" 8

జాలరియు భాషించు ని ట్లని.
"జాగుసేయను రాజపుత్త్రిక!

ధనము మానమునఁ గోరి కాదీ
తరుణి నెంచి సుమీ. 9

సుందరం బగు బాల యాపద
నొందఁగూడదు; భంగసంఘము
హోహొరు మని మి న్నంటినను నే
నోడఁ గడపెదను." 10

* * * *

ఘోరముగ గర్జించె మేఘము,
హోరు మని ఘోషించె వాహిని,
మేర మీఱిన యురవడిని నది
పాఱె తోరముగా! 11

చూచుచుండఁగ చీఁకటయ్యెను,
వీఁచుచుండెను వాయు వుగ్రత;
తోఁచుచుండె నిరాశ, నెమ్మది
నేఁచె విహ్వలత. 12

అల్లుకొనె గాఢాంధకారము,
అక్షు లున్న ఫలంబు వాసెను,
భీకరాయుధకవచధరు లై
వీరభటు లంత, 13

వారువంబుల స్వారి సేయుచు
చేరుచుండిరి తీర మల్లన;
పలుకు ని ట్లని పాటలాధరి
భయము గదురంగా: 14

"మంటఁ గలిసిన, సాహసంబున
మింటి రోషము నెదురుకొనియెద;
కంట మంటలు గ్రక్కు జనకుని
కంటఁ బడఁజాల! 15

త్వరితగమనము సాగని మ్మిఁక
మరణ మైనను వెక్కదీయక"
అనుచుఁ బల్కెను; ఓడ నడచెను
అలల మధ్యమునన్. 16

తీర మెంతయు భయము నొసఁగెను,
నీరు మరిమరి భీతిఁ గొల్పెను,
వారి నందుఁ దుపాను చుట్టెను
దారి లేకుండ! 17

మేర మీఱి చలించు నీరము
మీఱుచుండిరి పడవ గడపుచు,
తీరమునఁ గల తండ్రి రోషము
మాఱె దుఃఖముగా. 18

ఘోర మైన నిరాశ నొందుచు
హోరు మనెడి తుపాను సందున
క్రూరకర్ముఁడు కాంచఁగల్గెను
కూర్మి పుత్రికను. 19

ప్రాణనాయకు నొక్క కరమునఁ
బట్టి, వేఱొక కరముచే నిజ
రక్షణార్థము వేఁడు తరుణీ
రత్నమును గాంచెన్. 20

* * * *

"రమ్ము మరలి మదీయభాగ్యమ!
రమ్ము రమ్మా భీకరాపగ
గడచి క్షమియించెదను నీ విభు,
కరుణ నినుఁ జూతున్. 21

పుత్రికా! నా జీవరత్నమ!
పుత్రికా! నా భాగ్యరాశీ!
సత్వరమ ర"మ్మంచు జనకుఁడు
చాల పలవించెన్. 22

"ఇందు ప్రేముడి నిన్నుఁ జూచెద,
తిరిగి రమ్మా కూర్మి పట్టీ!"

* * * *

తిరిగి వచ్చుట, సాయ మిచ్చుట,
పరఁగె దుర్లభ మై. 23

తుంగభంగము లాహవోద్ధతిఁ
జెంగలించుచు రంగ మొనరిచె,
బెంగ బొరిగొనె నంతరంగము
ప్రియుల కయ్యెడలన్. 24

* * * *

ఓడ యిట్టటు లూఁగె, జలములు
కూడె వడివడి, నీరు మున్గుల
కూఁతు మ్రింగెను, చూచు జనకుని
గుండె లవియంగా! 25

# కర్మము

## శ్రీ విక్రమదేవవర్మ గారు

కర్మమును చేయ నక్కఱలే దని కొందఱును, కర్మము ఫలరహిత మగుటవలన నెట్టిదానినైన నాచరింపవచ్చు నని మఱికొందఱును, కర్మమును విడిచినం గాని ముక్తి చేకూర దని వే ఱొక కొందఱును తలంచు నీ కాలమున, దాని స్వరూపస్వభావావశ్యకముల నిట వ్రాయుట యనుచితము గాదు కదా.

కర్మ మనఁగా కరణము, కృత్యము, కార్యము లేక పని. అది యనాది యనియును తత్ఫలభోగముకొఱకే జీవుఁ డనేకజన్మము లెత్తుచు సుఖదుఃఖముల ననుభవించుచుండు ననియును కర్మఫలము నాశమయినం గాని మోక్షము లభింప దనియును కొందఱు మతాచార్యులు నుడివిరి. "కర్మణా బధ్యతే జంతు ర్విద్యయా చ విముచ్యతే." "జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్యచ." దేని మొదలు మనకుం దెలియదో, దాని ననాది యందుము.

కర్త యగు జీవుని ప్రప్రథమోత్పత్తిసమయమున కర్మ ముండుట యసంభవము. కనుక కర్మము జన్మపరంపరకును సుఖదుఃఖములకును కారణము గా దనియును జీవునకు జన్మపరంపర లే దనియును కొందఱు మతాచార్యుల మతము.

ఈ లోకంబున కొందఱు సర్వసుఖంబుల ననుభవించుచుండుటయును, కొంద ఱనేకదుఃఖములం గుందుచుండుటయును, కొందఱు దోషులదండితులుగా నుండుటయును, కొందఱు నిర్దోషులు దండితులగుచుండుటయును మన మెఱుంగుదుము. ఇందులకు కారణము సర్వేశ్వరుని యుద్దేశ మని కాని, జీవుని స్వప్రయోజకత్వ మని కాని, హఠాత్సంభవ మని కాని చెప్పుట సమంజసము గాదు. సర్వేశ్వరు నుద్దేశమే యనినచో, నిష్పక్షపాతియును సర్వసముఁడు నగు నాతఁ డొక జీవునకు సుఖములను మఱొక జీవునకు దుఃఖములను కలిగించునా? జీవుని స్వప్రయోజకత్వమే యనినచో, జీవుఁడు దుఃఖమునే యెఱుంగకుండ నుండవలయును. హఠాత్సంభవమే యనినచో, అది య ట్లేల కావలెను? మఱొక విధముగా నేల కారాదు? కాఁబట్టి యిట్టివానిని కారణము లనరాదు.

ప్రత్యేకజీవుఁ డీ లోకంబున కాయక్లేశ మొందుచుండుటయే సర్వేశ్వరోద్దేశ మయినట్లును, భాగ్యవంతులు సైతము దేహారోగ్యము కొఱకు వ్యాయామము సలుపవలసియుండుట యందులకు తార్కాణ మయినట్లును నొకానొకరు వ్రాసిరి. స్వీయకాయారోగ్యముకొఱకుఁ ప్రాతఃకాలముననో సాయంసమయముననో భాగ్యవంతులు స్వేచ్ఛగా చేయు వ్యాయామమును "నిన్న నొకమెతుకయినను కంటఁబడ లేదు కదా! నేఁ డయినం బడునో? పడదో?" అను చెంగలో సూర్యోదయప్రభృతి సూర్యాస్తమయపర్యంతమును కూలికై కష్టపడువారల పరిశ్రమముతోడ పోల్చి, సర్వసౌఖ్యసంధాతయు మంగళవిధాతయు నగు సర్వేశ్వరుని యుద్దేశము జీవులు కష్టముల ననుభవించుటయే యని సిద్ధాంతీకరింపఁ బూనుకొనుట యతిసాహసము గాదా?

జీవుఁడు కర్మకర్తృత్వాధికారమును కలిగి, తత్ఫలము నవశ్యం బనుభవించును. శ్రీకృష్ణభగవానులు పార్థునకు గీతాశాస్త్ర మంతయు నుపదేశించి, "దీనిని లెస్సగా నాలోచించుకొని, నీ యిచ్ఛకు వచ్చునట్లు చేయుము." ["విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు."] అని పలుకుటవలన జీవునకు కర్మకర్తృత్వాధికార ముండుట నిశ్చయము. కర్మఫలదాతృత్వాధికారము మాత్రము సర్వేశ్వరునిది. ప్రతి కర్మమునకును ఫల ముండుట స్వభావసిద్ధము.

జీవులు ప్రప్రథమమున నిష్కర్ములుగానే కలిగి, స్వేచ్ఛానుసారముగా పుణ్యపాపకర్మముల నాచరించుచు సంసారపంకిలాఖాతంబునం జిక్కుకొనిరి. పరోపకారకార్యము పుణ్యకర్మ మనుటయును పరాపకారకార్యము పాపకర్మ మనుటయును సమస్తాస్తికమతసమ్మతము. ["పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం."] అట్లయినను, వేదోక్తము లగు సత్యసంభాషణ సంధ్యావందనాదులు పుణ్యకర్మము లనియును మఱి యాచరణీయము లనియును ["సత్యం వద.", "అహరహ స్సంధ్యా ముపాసీతా."], వేదనిందితము లగు ననృతభాషణ మద్యపానాదులు పాపకర్మము లనియును మఱి త్యాజ్యము లనియును ["నానృతం వదేత్, నసురాం పిబేత్."], ఏతద్దేశాస్తికమతాచార్యు లందఱు నైకకంఠ్యముగా వక్కాణించి యున్నారు.

విధికృత్యము లొకప్పుడు దారుణము లయినను, అవి పాపకృత్యములు గానేరవు. శూరుఁడు ధర్మయుద్ధమున వైరిని చంపుట, కడుపునుండి స్వాభావికముగా వెలుపలకు వచ్చుటకు వలనుపడనంత స్థూలముగా పెరిగిన శిశువును వైద్యుఁడు శస్త్రముచేత చంపి వెలికిఁ దీయుట, నరహంతకునకు మరణదండనమును విధించుట మొదలగునవి దారుణకృత్యములే యయినను, విధికృత్యము లగుటంజేసి పాపకృత్యములు గావని తెలియందగును.

నరుం డెట్టి పని నొనర్పక సోమరియై కాలక్షేపము సేయుచుండునట్లు లార్ష మతము బోధించుచున్న దని యన్యమతావలంబు లలో కొంద ఱజ్ఞు లందురు. అట్లనుట సరి కాదు. పనులను తప్పకొనవచ్చు నీ లోకంబున నూఱేండ్లు మనవలె ననియును, తన పనుల యందు అపేక్ష గలవాఁడు సంసిద్ధి నొందు ననియు నార్షమతము సుస్పష్టముగా బోధించుచున్నది. [శ్రుతిః "కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః." శ్లో. "స్వే స్వే కర్మ ణ్యభి

రత స్సంసిద్ధిం లభతే నరః."] కనుక తెలియనివారల పలుకుల నటుండనిత్తము.

పుణ్యకర్మములు వర్ణములకును ఆశ్రమములకును తగునట్లు నిత్యములుగాను నైమిత్తికములుగాను విభజింపఁబడియున్నవి. నిత్యకర్మము లనఁగా ననుదినమును చేయఁదగినవి. నైమిత్తికకర్మము లనఁగా నిమిత్తము కలుగునపుడే యాచరింపఁదగినవి. విహితకర్మముల నాచరించుటయును నిందితకర్మముల నాచరింపకుండుటయును విధి. కావున, విహితము లయిన కర్మముల నాచరింపకున్నను, నిందితము లయినవాని నొనర్చినను జీవున కధోగతి కలుగును. ["అకుర్వ న్విహితంకర్మ నిందితంచ సమాచరన్, ప్రసజ్జం శ్చేంద్రియార్థేషు నరఃపతనమృచ్ఛతి."] ఇట్టి పుణ్యపాపకర్మముల ఫలము ప్రారబ్ధముగాను సంచితముగాను ఆగామిగాను నేర్పడును. ప్రారబ్ధ మనఁగా గతజన్మములయందు ఆచరించిన కర్మముల ఫలము. సంచిత మనఁగా నీ జన్మమున నిప్పటి కార్జించియున్న కర్మముల ఫలము. ఆగామి యనఁగా నీ జన్మమునను భావిజన్మములయందును ఆర్జింపఁ బోయెడి కర్మముల ఫలము. పుణ్యకర్మముల ఫలము స్వర్గాదిలోకంబులం బొందించి, తదంతంబునందు మరల నీ లోకంబున నుత్కృష్ట జన్మంబును సుఖంబులను కలిగించును. ["క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి."] పాపకర్మముల ఫలము రౌరవాదినరకంబులం బొందించి, తదంతంబునందు మరల నీ లోకంబున నికృష్టజన్మంబును దుఃఖంబులను కలిగించును. అట్లే పుణ్య పాప మిశ్ర కర్మముల ఫలము సామాన్యజన్మంబును సుఖ దుఃఖ మిశ్రత్వంబును కలిగించును. ఇట్లు కర్మముల ఫలము జన్మపరంపరనే కలిగించుచుండుటవలన జీవులకు జన్మరాహిత్యమును నిత్యసుఖమును దొరకుట దుర్లభంబు. మఱి కర్మఫలబంధమోక్ష మెట్లు కలుగును? పాదంబున గ్రుచ్చుకొన్న కంటకంబును వేఱొక కంటకంబుచేతనే తీయునట్లు చిరకాలంబునుండి యవిచ్ఛిన్నముగా నున్న కర్మ ఫల బంధమును కర్మాచరణముచేతనే యూడఁదీయవలె నని మన పుస్తకము లుద్ఘోషించుచున్నవి. అయినను, కర్మాచరణమువలన కర్మఫలాభివృద్ధి యగుచునే యుండుటం బట్టి యకర్మముచేత అనఁగా కర్మత్యాగముచేత కర్మఫలము కలుగకుండు నని కొందఱు అనుచున్నారు. కాని, అది సాధ్యమా? ఎన్నఁటికిని గాదు. మనము మన మనస్సుచేతనో వాక్కుచేతనో యింద్రియములచేతనో ప్రతిక్షణమును నేదయిన నొక పనిని తప్పక చేయుచుండుటయును, పనులను చేయకుండుమేని మనకు శరీరయాత్ర సైతము సిద్ధింపకుండుటయును, జగమంతయు పనులతోడనే ప్రవర్తిల్లుచుండుటయును మనకు బాగుగా తెలియును. ["నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్.", "నియతం కురుకర్మత్వం కర్మ జ్యాయో హ్యకర్మణః, శరీరయాత్రాఽపిచ తేనప్రసిద్ధ్యే దకర్మణః." "ప్రవృత్తి లక్షణంకర్మ."] కాఁబట్టి బంధమోక్షముకొఱకు ఫలమును మాత్ర మపేక్షింపక కర్మములను సలుపుచునే యుండవలెను. అట్లు చేయుచున్నచో కర్మబంధవిముక్తి యెట్లగు ననిన, అందులకు ప్రత్యుత్తర ముదాహరణపూర్వకముగా నిట వ్రాయఁబడును: ఒకనికి పైతృకసంపత్తి వేయి రూపాయలు గలవు. అతఁ డింతవఱకు నార్జించి నిలువగా నుంచుకొన్నవి మఱొక వేయి రూపాయలు. మఱియు నాతనికి సాంవత్సరికాయ మొక వేయి. ఇట్లుండ, అతండు తనకు ధనములేకుండఁ జేసికొనవలె నన్నచో, ఏమి చేయవలెను? తన రాఁబడిని వదలుకొని, ఇంతదనుక తనయొద్ద నిలువగా నున్న విత్తమును వెచ్చింపవలసి యుండును గదా. పాఠకులారా! పైతృకమును ప్రారబ్ధముతోడను, ఇందాఁక నిలువగా నున్న ధనమును సంచితముతోడను, రాబడి నాగామితోడను పోల్పందగు. పుణ్యపాపఫలరహితకర్మములనే చేయుచుండుటవలన నాగామి కలుగదు. అనుభవించుచుండుటవలన ప్రారబ్ధమును సంచితమును తఱుఁగును. ["నాభుక్తం క్షీయతే కర్మ."] ఇట్లు కొంతకాలమునకు కర్మశూన్యమయి, బంధవిముక్తి సంభవించును. కోరికలతోడనే పనులను చేయఁబూనినచో కోరికలకును కామ్యకర్మాచరణమునకును మితి యుండదు. అందువలన బంధవిముక్తి గాదు. కావున కామ్యకర్మాచరణ మనుచితము. ["అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే."] ఫలము నపేక్షింపక మన మాచరించు విధికృత్యముల ఫలములు మనకు చెందవు. మన మనస్సునకట్టి స్వాతంత్ర్యము గలదు. ["మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః."] తెస్సగా నాలోచింపఁగా, అకర్మ మనునపుడు కర్మత్యాగ మనుటకంటె త్యక్తఫలకర్మ మనుటయే యుక్తియుక్తము.

ఏదేని యొక పనియందు మనస్సును లగ్నము సేయకుండుమేని, అది సాధారణముగా దుష్కార్యాచరణమునందే ప్రవర్తించుచుండును. కనుక బుద్ధిమంతులు సర్వదా పుణ్యకర్మసాధనచింతనముచే చేయుచు తత్ఫలమమాత్రమును కోరకుందురు. ["యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీం.", "అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మకరోతియః, ససన్న్యాసీచ యోగీచ ననిరగ్ని ర్నచాక్రియః."]

ప్రకృతివలన సత్త్వరజస్తమోగుణములు కలిగెను. ["సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః."] అందు జ్ఞానకారణం బయిన సత్త్వగుణమాహాత్మ్యంబుచేత నిష్కామ్యకర్మములను, లోభకారణం బయిన రజోగుణమహిమంబుచేత కామ్యకర్మములను, ప్రమాదమోహాదికారణం బయిన తమోగుణప్రభావంబుచేత దుష్కర్మములను నరుండు సేయుచుండును. ["సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ, ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవచ."] కాఁబట్టి ప్రప్రథమమునందు సత్త్వగుణము నలవరించుకొన సర్వథా ప్రయత్నించుట యావశ్యకము.

నిష్కామ్యకర్మాచరణముచేత చిత్తశుద్ధి కలుగు ననియును ["కర్మణాచిత్తశుద్ధిః."], చిత్తశుద్ధి కలుగుటవలన జ్ఞానము లభించు ననియును, జ్ఞానముం బట్టి మోక్ష మనియును ధీమంతు లందురు. ["శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సం యతేంద్రియః, జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాఽధిగచ్ఛతి."] ఇరదు జడరూపకకర్మమును సలుపుచుండుటవలన చిద్రూపకజ్ఞాన మెట్లు సిద్ధించు నను సందేహము

కొండచికి తోఁపవచ్చును. విజ్ఞులారా! ప్రారబ్ధసంచితకర్మదోషము వలన కలిగిన యజ్ఞానము జ్ఞానము నావరించియుండును. ["అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః."] అనుభవముచేత తద్దోషము క్షయించుటవలనను నిష్కామ్యకర్మాచరణముచేత ఇఁక నట్టి దోషము జనింపకుండుటవలనను క్రమక్రమముగా జ్ఞాన మభివృద్ధిం జెందు నని తెలియవలయు.

"అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాఽశుభం." అనఁగా నొనర్పంబడిన సుకర్మదుష్కర్మముల ఫలము ననుభవించియే తీర వలెను. "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా." అనఁగా జ్ఞానాగ్ని యన్ని కర్మములను నశింపంజేయును. ఈ పరిలిఖిత వాక్యద్వయమునకు వైరభావ మున్నట్లు తోఁచుచున్నను, నిజముగా నట్టిది లేదు. ఏల యనఁగా, అనుభవమువలన ప్రారబ్ధసంచితకర్మ ఫలము క్షీణించుచు నాగామికర్మఫలోత్పత్తి కాకుండునప్పుడే జ్ఞానోదయ మగును. జ్ఞానాగ్ని యనుటవలన అభివృద్ధి నొందిన జ్ఞాన మనుట స్పష్టము. కనుక సంపూర్ణజ్ఞానము గలవానికి కర్మబంధ ముండ దని యెట్టి విప్రతిపత్తియు నుండదు.

ఆర్యులారా! పైని వ్రాయఁబడిన వ్యాసమువలన మనము ఫలాపేక్షను విడిచి సంతతమును సత్కర్మములనే చేయుచుండవలె నని యెఱ్ఱుఁడెను గదా. మన క్షేమముకొఱకును దేశక్షేమముకొఱకును మన మటువంటి కర్మములనే నిరంతరము నాచరించుచుండుటకు మనకు మనస్థైర్యమును దేహదార్ఢ్యమును భగవంతుఁడు ప్రసాదించును గాక!

# అస్తమయము

## కోపల్లె శివకామేశ్వరరాయకవి గారు

పగటి నడకల బడలిన మొగ మొకింత
చెన్ను దఱుఁగంగ గృహమును జేరవచ్చు
మగని కెదు రేఁగుఁ జెంగావి మడుఁగు గట్టి
వారుణీదిక్సతీమణి ప్రమద మలర. ౧

తే. అర్ఘ్యపాద్యంబు లొసఁగిన నవి గ్రహించి
కడుగ దుమ్ము గ్రమ్మిన పాదకమలములను,
తజ్జలము రాగమునఁ బొల్చెఁ దక్షణంబ;
రాగసంకలితంబు సర్వంబు నచట! ౨

తే. ప్రియుఁడు ప్రియురాలి ప్రణయంపుఁ జెయిదములకు
నలరు నత్తఱిఁ, గించిదుష్ణానలమ్ము
పొంతఁ గల మంచుగడ్డయవోలె కరిగి
తను విడిచి ప్రణయపయోనిధాన మయ్యె. ౩

తే. దుర్నిరీక్ష్యంపు తైక్ష్ణ్యంబుఁ ద్రోచికొనఁగ
వాడిపోయిన తల లెత్తె వ్రతతు లెల్ల;
మలయపవనుండు మెల మెల్ల మసలుచుండె,
పసులకాపరి యింపుగఁ బాడుచుండె. ౪

తే. అల లొకటితో నొకటి ముచ్చటాడికొనుచు
మరులు గొలుపు శ్రవణపేయమాణకలని
నాదపీయూషరసనిధానంబు లయ్యె,
మొగ్గ లెల్లను విచ్చి ప్రమోద మొసఁగె. ౫

తే. ఆఁకటిని బట్టఁగాలేక యచటి కచటి
కరిగెఁ బవ లెల్ల క్షుధఁ బ్రణయంపుఁ దీఁగ
వాడ, నిపుడు బలు పొంది ప్రబలు తీవ
గూర్పఁగ శకుంతదంపతుల్ గూండ్లఁ జేరె. ౬

తే. గాయకులు కవు ల్వాహినీతోయములకుఁ
బజ్జఁ బులినతలంబులఁ బవ్వళించి
ప్రకృతిరామణీయకముచే భావ మలర,
పాడిరి కవన మల్లిరి పరవశు లయి ౭

తే. కావి వలిపెము ల్గట్టి మైఁ దావి ప్రబ్బు
చందన మలంది, వేణిఁ బువ్వములు దుఱిమి
పగటి బడలిక నడతెంచు భర్త నేఁడు
దీర్ప సెదు రేఁగు పూఁబోండ్ల తియ్యఁదనము. ౮

తే. కమితవిమయులై బ్రాహ్మణు లస్వస్పష్టి
చిత్రములును బ్రహ్మానందచిద్విలాస
ములను దెలుపఁ దత్కర్త సమ్ముఖముకొఱకు
ధ్యాననియతిఁ జూపించు నేత్రద్వయంబు. ౯

తే. జగము లెఁక జూచి ప్రణయమజ్జనము సేయ
తగవు గాంచి పడంతి హస్తమును బూని
చిఱునగవు సెమ్మొగమ్మునఁ జింమలాడ
తగవుమైఁ జేరె నినుఁడు సంధ్యాగృహమ్ము. ౧౦

# విశ్వనాథనాయకుఁడు — రాజభక్తి

వెన్నెలకంటి అప్పారావు గారు

ఆంధ్ర సోదరులారా! మన రాజధాని యందలి మధుర మండలమునకు ముఖ్య పట్టణ మగు మధురాపురి నొక్కమాఱు సందర్శింపుఁడు. ప్రస్తుత మా పట్టణము మన రాజధానియందు రెండవ పట్టణమై సకల సౌభాగ్యశోభితంబై ద్రవిడదేశమధ్యంబున నలరారుచున్నది. ఆ పురియందు మండలన్యాయాధిపతి యెచ్చో న్యాయవిచారణ చేయుచున్నవాఁడో గమనింపుఁడు. మండలాధికారి మొదలగు నుద్యోగస్థు లెందు కచ్చేరీలు చేయుచున్నవారో తిలకింపుఁడు. ప్రభుత్వోద్యోగులు సభలు చేయుటచేతనే కాక పట్టణంబున కెల్ల శోభ నిచ్చు సౌధరాజంబు లెవ్వియో విలోకింపుఁడు. అయ్యవి జగద్విఖ్యాతంబు లగు తిరుమల నాయకుని సౌధరాజంబు లని తమలో కొందఱకు తెలియవచ్చును. ఒక్క సౌధనిర్మాణముచేతనే కాక, అనేక విశేష గుణంబులచే తమిళరాష్ట్రమునందు వన్నెయు వాసియు ఖ్యాతియు భూతియు గడించి నేఁటివఱకును దాక్షిణాత్యుల స్తోత్రములకు పాత్రుఁడైన తిరుమలనాయకుఁడు ఆంధ్రుఁడు. ఇతఁడు మధురరాజ్యమును అసదృశముగ పరిపాలనం బొనర్చి కీర్తిశేషుం డయ్యె. ఈతని కుమారులగు చొక్కనాథుఁడును ముద్దళగిరియు కామేశ్వరకవిని తమ యాస్థానమునం దుంచుకొని సత్యభామాసాంత్వనము గ్రంథమునకు కృతిపతులై ఆంధ్రభాషోద్ధారకులైరి. 'రామేశ్వరమునకు సమీపమున నుండు మధుర యేడ? ఆ రాజ్యమును ఆంధ్రరాజులు పరిపాలించు టేడ?' అని పాఠకులు సందేహింపవచ్చును. అది యెట్లో తెలుపుటకే యీ చిన్ని వ్యాసమును వ్రాయుచున్నాఁడ.

శూరులను చూచిన నా డెంద ముప్పొంగును. వారి చెయిదములు తిలకించిన గగుర్పాటు కలుగును. వారి గుణస్తోత్రంబులు వినుచుండిన పరవశత్వము కల్గును. ఇంత యేల? వీరారాధనమే సకలదురితవిమోచనమునకును ధర్మసాధనంబునకును మార్గం బని పలుమాఱు తలఁచెద. అసాధారణప్రజ్ఞ కలవాఁడే ధీరుఁడు. వాని చేష్టలు వింతకొల్పునవిగా నుండును. అందుచేత వానికి లోపములు గూడ నుండవచ్చును. ఉన్న నేమి? సర్వేశ్వరుఁడు తన యంశలలో నొక్కదానిని గాని పెక్కింటిని గాని అత్యున్నతస్థితియందు వీనిలో మూర్తీభవించునట్లు చేయుటచే వీఁ డారాధన కర్హుఁ డగుచున్నాఁడు. ఎట్టి యసాధారణగుణగణముచే నొప్పారువాఁ డైనను ఒక దేశపు శూరాగ్రేసరుఁడు మఱియొక దేశస్థునకు ఆరాధనార్హుఁడు కాకపోవచ్చును. నెపోలియన్ చక్రవర్తి గాని బిస్మార్కు రాజధురంధరుఁడు కాని ఆంగ్లులకు పూజార్హుఁడు కాఁజాలఁడు. ఆంగ్లు లారాధింపఁదగిన వారు షేక్స్పియరు నెల్సన్ విల్లింగ్టన్ మొదలగువారు. ఈ కారణముచే నాంధ్రవీరుల గుణగానము నాకు మహోత్సాహజనకముగ నుండును. ఇయ్యదియే ఆంధ్రమాతృస్తవ మని కూడ నేను భావించువాఁడ. తన పుత్త్రుని మాహాత్మ్యమును పొగడుట కనుటకంటె జననికి సంతస మెద్దానిచే నధికముగ కల్గును? నాగమ్మనాయకుఁ డను నొక గాజుల బలిజకులస్థుఁడు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర మూరురాయరగండ శ్రీ కృష్ణరాయలకు కుడిభుజంబై అతని దిగ్విజయయాత్రలందు కడు సహాయభూతుఁడై అతని మన్ననలకు పాత్రుఁడై అతని ముఖ్యసేనానులలో నొక్కండుగ నుండి అతని కాలముననే కాక సదాశివరామరాయల కాలమునఁ గూడ సామర్థ్యము కల సేనాని యని పేరు వహించెను. ఇతఁడో యీతని పూర్వులో మధ్యాంధ్రదేశమునుండి దక్షిణదేశమునకు వలసపోయి యచ్చట తమ యపారప్రజ్ఞచే శూరాగ్రేసరులై మహాసేనానులై, రాజనీతి ధురంధరులై విజయనగర సామ్రాజ్యమును కంటికి రెప్పవలె కాపాడి ఆంధ్ర నామమునకు మఱింత విఖ్యాతి కలిగించిరి. దురదృష్టవశముచే మన నాగమ్మనాయకుని వంశస్థు లిప్పుడు మధురరాజ్యము నేలు భాగ్యము లేకపోయినను ఇతని కుమారుఁడగు విశ్వనాథనాయకునిచే వసతు లేర్పఱుపఁబడిన కమ్మవారు మొదలగువా రనేకులు ఇప్పటికిని సుస్థిరముగ నివాసము లేర్పఱచుకొని తమిళుల మధ్యమున నివసించుచున్నవారు. వారిలో కొంద ఱిప్పటికిని జమీందారులై యున్నారు. ప్రస్తుతపు మైసూరు రాజ్యమునకన్న మిన్నగ

నుండవలసిన మధురరాజ్యమును దాని నేలు వంశమును నశించినను, మధురరాజ్యసంస్థాపనాచార్యుని చారిత్రము మాత్రము నశించినది కాదు. అది చెన్నపురియందలి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారముయొక్క సొరగులలో దాఁగియున్నది. ఆ చారిత్రమును చదువునప్పు డెట్టి యాంధ్రున కైనను ఇట్టి మహావీరులా ఆంధ్రనామమునకు కీర్తితెచ్చినది యని తోఁపకపోదు.

నాగమ్మనాయకునకు చాల కాలమువఱకు సంతానము లేమింజేసి చివరకు కాశీవిశ్వనాథుని సేవించుటచే నైన తనకు మనోరథసిద్ధి యగు నని తలఁచి కాశి చేరి అందు ధర్మపత్నీసహితంబుగ కొంత కాల ముండెను. ఆ మహానుభావుఁడు సాక్షాత్కరించెనో యనునట్లు తన యర్ధాంగికి గర్భిణీసూచనలు గన్పట్టెను. ఆ మహానుభావుని మహిమచే కలిగినవాఁడు గనుక తమ కుమారునకు విశ్వనాథుఁ డని నామకరణము చేసిరి. ఇతని జనన మెప్పుడో మనకు స్పష్టముగ తెలియదు. కాని, ఇతఁడు పదునాఱు పదునెనిమిది వత్సరము లగునప్పటికి కృష్ణరాయల యల్లుఁ డగు అళియ రామరాజు (1541—1565) నిరంకుశముగను దేదీప్యమానముగను పరిపాలించుచుండుటవలనను, విశ్వనాథనాయకుఁడు క్రీ. శ. 1559-వ సంవత్సరమున మధురమండలమునకు పరిపాలకుఁడుగ నియమింపఁబడినట్లు చరిత్రకారులు నిర్ధారణ చేయుటవలనను, ఇతఁడు 1530-1540 సంవత్సరముల మధ్యమున జనించియుండవచ్చు నని మనము నిర్ధారణ చేయవచ్చును. ఎట్లైయినను, ఇతఁడు చిన్న ప్రాయముననే మధురమండలమునకు పరిపాలకుఁడుగ నియమింపఁబడె ననుట నిశ్చయము. ఇతఁడు బాల్యమునుండిన రామరాయల యాస్థానమునందు చనువు మెయి ప్రవర్తించుచుండుటచేత, ఇతని ధైర్యస్థైర్యాది గుణము లన్నియు విద్యానగరమునందే కాక పలుచోట్ల ప్రశంసాపాత్రము లయ్యెను. ఇట్లుండ, విజయనగరమునందు మహానవమి విజయదశమి దివసములలో ప్రతివత్సరమును మహోత్సవములు పెక్కులు జరగుచుండుటవలన కర్ణాటసామ్రాజ్యవైభవ మంతయు ఆ దినములందే చూడఁదగినదిగా నుండెను. విజయనగరసామ్రాజ్యమునందలి యాచారము ననుసరించియే నేఁటికిని మైసూరునందు దసరా యుత్సవములు మహావైభవముతో జరుగుచున్నవి. ఈ యుత్సవములలో నాకాలమున నొక మహిషమును వధింపుట గొప్ప వేడుకగా భావింపఁబడుచుండెను. విజయదశమికి ముందు దినములలో రాయలవారు బంధుసమేతముగా విజయనగర పరిసరారణ్యములం దాఖేటము సల్పి ఒక గొప్ప మహిషమును సజీవముగా పట్టుచుండెడివారు. అదియే విజయదశమినాఁడు వధింపఁబడు జంతువు. ఆ మృగము ఒకే దెబ్బచే వధింపఁబడవలె ననియు, అట్లు దాని మెడ ఒక దెబ్బచే తెగకపోయెనేని అది సామ్రాజ్య వినాశమునకు కారణ మనియు సర్వజనుల నమ్మకము. ఈ వత్సరము వేఁటయందు చిక్కిన దున్నపోతు అతి బలాఢ్యమైనందున దాని మెడ నొక్క వ్రేటున నఱకువారు రాజ్యమునందు కలరా యని మంత్రు లాదిగ సర్వజనులును సందియ మందసాగిరి. ఈ సందియము నివారించుటకై రాయలవా రొక గొప్ప సభ చేయఁగా, విశ్వనాథుఁడు తప్ప ఆ పనికి మఱియొకఁ డర్హుఁడు కాఁ డని సభవారు నిర్ణయించిరి. ఈ సందర్భమునందే కాఁబోలు కాంచీపురనివాసుఁ డగు "ఆర్యనాయక ముదలి" యను నొక జ్యోతిషుఁడు ప్రాముఖ్యమునకు వచ్చి తరువాత విశ్వనాథునకు కుడిభుజం బై మహాసేనాధిపతిగ దక్షిణహిందూస్థానమం దంతటను మహావిఖ్యాతి గాంచినవాఁడు! అప్పుడు రామరాజు విశ్వనాథుని పిలిచి "నీవు బాలుఁడవుగ నున్నావే, నీ వీ కార్యమును నెఱవేర్పఁగలవా?" యని యడిగినప్పు డాతఁడు "నే నీ కార్యమును నెఱవేర్పఁజాలనేని దేవిని తృప్తిపఱచుటకై నన్నే బలిగా నిచ్చి మన పట్టణంబునకు రానుండు కీడును తొలఁగింపుఁడు" అని ప్రత్యుత్తర మిచ్చెను. రాయలవారి యాయుధాగారము తాను ప్రవేశించుటకును అందు తాను కోరెడు ఖడ్గమును తాను తీసికొనుటకును సెల వొసంగుఁ డని ప్రార్థించెను. అందులకు రామరా జియ్యకొనెను. ఆయుధాగారమునుండి రెండు మూరల పొడవును ఎనిమి దంగుళముల వెడల్పును గల ఖడ్గమును గైకొని పురజనులును మంత్రివర్గమును, రాజబృందమును హాహారవంబులు సేయుచుండ అర్ధరాత్రమువేళ మహిషకంఠము నొక్క వ్రేటున తెగనఱికి రాయల యనుగ్రహమునకును పురజనుల స్తోత్రములకును మఱింత పాత్రుఁ డయ్యెను. ఇట్లీతఁడు దినదినప్రవర్ధమానముగ కీర్తిప్రదీపకుఁ డగుచుండ, ఇతని జనకుఁ డగు నాగమ్మ

నాయకుఁడు మఱియొక విధముగ మధురయందు ప్రఖ్యాతుఁ డగుచుండెను. తంజావూరు రాజగు 'వీరసేగరసోళన్' అను నతఁ డక్రమముగ మధురరాజగు 'చంద్రసేగరపాండ్యన్' అను రాజును తఱిమివేసి అతని రాజ్య మాక్రమించుకొనుటచే, మధురరాజు రాజరాజగు విజయనగరరాయలవారికి తనయెడ జరగిన యన్యాయమును గుఱించి మొఱ్ఱ లిడుకొనఁగా, తంజావూరు రాజును శిక్షించుటకును మధురరాజ్యమును మధురరాజున కిప్పించుటకును రాయలవారు మొదట నాగమ్మ నాయకుని మధురకు సేనాపతిగా పంపిరి. నాగమ్మ రామరాజు నుత్తరువును శిరసా వహించి కృతకృత్యుఁడై మధురరాజ్యమును చంద్రశేఖరపాండ్యున కిప్పించి తాను విచారణకర్తగను దక్షిణమున విజయనగరసామ్రాజ్యప్రతినిధిగను నుండెను. చంద్రశేఖరపాండ్యన్ నాగమ్మ తృష్ణాగ్నికి ఇంధనమై కృశించుచుండ, అది కార్చిచ్చయి మండసాగెను. విద్యానగరసామ్రాజ్యవైభవము కూడ నాగమ్మ నేత్రములకు తాళినది కాదు. స్వశక్తియందును స్వబలమునందును అతనికి విశ్వాసము గాఢ మయ్యెను. తన యేకపుత్త్రుఁడు రాజధానియం దున్నవాఁ డనియు అందుచే నతనికి కీడు వాటిల్లవచ్చు ననియు కూడ అతనికి తోఁపదయ్యె. "వినాశకాలే విపరీతబుద్ధి" యనున దితని కిప్పుడు పూర్ణముగ వర్తించెను. 20,000 కాల్బలమును 20,000 అశ్వభటులను 6,000 ఏనుంగులను ఆయత్తపఱచుకొని రాయల సైన్యమునే మార్కొనుటకు సంసిద్ధుఁ డాయెను. నాగమ్మనాయకుని ద్రోహాలోచన లెట్లో రామరాయలకు తెలియఁగనే, అతఁడు క్రోధనిర్దళితమనస్కుండై క్రోధారుణనేత్రుండై ముఖ్యమంత్రులయొక్కయు ముఖ్యసేనానులయొక్కయు సభ యొక్కటి కావించి "సేనానులారా! కృతఘ్నుఁడును రాజద్రోహియు నగు నాగమ్మనాయకుని తల తెచ్చువారు మీలో నొక్కరైన లేరా?" యని ప్రశ్నింప, సభవారందఱు నొకరి మొగము నొకరు చూచుకొనసాగిరి. ఏల యన, నాగమ్మనాయకుఁ డసాధారణప్రజ్ఞ కలవాఁడు; వానిని జయించుట కసాధారణప్రజ్ఞ కలవాఁడే కావలెను. అప్పుడు సభ నలంకరించియుండు విశ్వనాథనాయకుఁడు లేచి "స్వామీ! తాము నాకు సెలవిచ్చినచో నేను దానిని తెచ్చి తమ పాదములకడ నునిచెద" నని ప్రత్యుత్తర మిచ్చెను. అప్పుడు రామరాజు "నీవు పోయి మీ తండ్రితో చేరెదవా?" యని ప్రశ్నించెను. దానికి విశ్వనాథుఁడు నిర్భయముగ "ఏలినవారి యుప్పు తినుచున్న నాకు తమ సేవకన్న నెక్కుడెద్దియు లేదు. నా జనకుని శిక్షించుట నాకు కడు ఘోర మైన కార్యము కావచ్చును కాని, నా జనకుని మీఁది ప్రేమకన్న తమ సేవయే యధిక మని నేను భావించువాఁడ. కనుక తమ యాజ్ఞ మేరకు ప్రవర్తించువాఁడ" నని జవా బిచ్చెను. విశ్వనాథుని యీ పలుకులు విని సభవా రందఱు నివ్వెఱపాటు చెందిరి. విశ్వనాథుఁడు తనకు వలసిన సేన లన్నియు కూర్చుకొని తండ్రి మీఁదికి దండు వెడలెను. తన సుతుఁడు తనపైకి దండెత్తి వచ్చుచున్నాఁ డను వార్త వినిన దాదిగ నాగమ్మనాయకుఁడు తన కోటను మఱింత బలపఱచుకొని కుమారు నెదుర్కొనుట కాయత్తుఁ డయ్యెను. మధురలో జనకసుతుల కిద్దఱకును ఘోరసంగరం బయ్యె. చివరకు జనకుఁడు సుతుని చేతిలో సజీవముగ చిక్కువడియె. జనకుని విజయనగరమునకు కొనివచ్చి రాయల పాదముల మీఁద పడవైవ, రామరాజు విశ్వనాథుఁడు చూపిన యీ రాజభక్తికి తృప్తినొందక, అతని నింకను పరీక్షించి చూడవలె నని తలఁచి కాఁబోలు తన ప్రతిజ్ఞానుసారముగ నాగమ్మ తల త్రెంపఁబడవలె ననియు ఆ కార్యము విశ్వనాథుఁడే చేయవలె ననియు నాజ్ఞాపించెను. ఈ వార్త వినిన తరువాత విశ్వనాథుని మన సెంత తత్తఱపాటు నొందెనో విశ్వనాథుని జనని హృదయ మెంత యాకులత చెందెనో పురజనులు రామరాజు నెంత కఠినముగ దూఱిరో, పాఠకులారా, మీ రిప్పు డూహింపఁగలరా? ఇంతటి కఠినపరీక్ష యూరపు ఖండమునందలి పూర్వకాలపు రోమనులందును స్పార్టనులందును గానవచ్చు నేమో కాని మఱియొక జాతియందు కానరా దని తోఁచెడిని. ఈ కఠినపరీక్షకును విశ్వనాథుఁడు వెనుదీసినవాఁడు కాఁడు. ఏలినవారి చిత్తానుసారము ప్రవర్తించుటకు సంసిద్ధుఁడై పురజను లందఱు విలోకించుచుండ నొక నియమితదివసమున తండ్రి తలఁ ద్రెంచుటకు వధ్యస్థానమున కేతెంచెను. విశ్వనాథుఁడు ఖడ్గ మెత్తి నఱుకఁబోవునప్పుడు రామరాజు విశ్వనాథుని వారించి అతని రాజభక్తికి మెచ్చుకొని అతనిని మధురరాజ్యపాలకుఁడుగ నియమిం

8

# ఛత్రముల రాజు

## అసలు "లేడి గుఱుతు"




అందమునకు, చౌకకు, చాల కాలము మన్నుటకు "లేడి గుఱుతు" గల గొడుగులనే వాడుడి. "లేడి గుఱుతు" గొడుగులే చాల మంచివని ప్రతివారును చెప్పుదురు. జాతీయ వస్తుప్రదర్శన సభయందును పేరు వహించిన దిదియే.

బనియన్లు, ఫెల్టుటోపిలును చాల తక్కువ రేట్లకు దొరకగలవు. వలయువారు ఈక్రింది విలాసమునకు వ్రాయుడు.



హెడ్డు ఆఫీసు బొంబాయి.
బ్రాంచి కాలికట్.

**ఇబ్రాహింభాయి అంపు సన్సు, అంబెర్లా మర్చెంట్సు**

నెం. 251/53. ఎస్ప్లనేడు రోడ్డు, మద్రాసు.

85
61

# M. N. HUSSEN & Co.,

**Hardware Merchants Contractors & Commission Agts**
**No 90 ARMENIAN STREET MADRAS**

రైసుమిల్లులకు కావలసిన అన్ని సామానులును పప్పీలు, షాఫ్టింగులు, బేరింగులు, ఫన్నెల్లు బ్లాకులు, బెల్టింగులు వివిధ రకముల మెరుగుమేకులు, క్రాస్స్క్రూ మేకులు, ఆస్బెస్టాసు, రబ్బరు సామానులు, మనిలాఉక్కు తీగదారములు, మిల్లులకు కావలసిన అన్ని సామానులు,




పంపుల ఇనుపరేకులు, సాదా రేకులు, ఎం. ఎస్. రేకులు, ఉక్కురేకులు, ఇనుపదువ్వలు, కోణాలు, టీలు.



సిమెంటు సున్నము, బొగ్గుతారు, బొగ్గుపిచ్ ఆస్ఫాల్టు, స్టాక్హోంతారు, పారలు, పకీస్సులు, సమ్మెటలు, గొలుసులు, కంసాలిపట్టెడలు పిగ్ లెడ్. తగరపురేకులు, తీగమేకులు, బొక్కెనలు, ముండ్లతీగలు, సాగాతీగలు, తీగవలలు. వ్యవసాయపు పనిముట్లు, గనుల ప్యాక్టొరీలకు రైల్వేలకు కావలసిన అన్ని రకముల సామానులు చౌకరట్లకు దొరకును. విశేషము లింకను తెలియగోరిన మాకు వ్రాయుడు.

విలాసము:—**ఎం. ఎస్. హుస్సేన్ అండు కో.,**

ఇనుపసామానుల అంగడి, నెం. 90 ఆర్మేనియను వీధి, మద్రాసు.

చెను. ఇది క్రీస్తుశకము 1559-వ సంవత్సరమున జరిగి యుండవచ్చును. ఇది మొదలు ఇతని వంశజులు మధుర రాజ్యమును దాదాపు 200 సంవత్సరములు నిరుపమానముగ పరిపాలించి ప్రజారంజకులైరి. ఈ వంశములో విశ్వనాథుని తరువాత మిక్కిలి ప్రఖ్యాతుఁడైన తిరుమలనాయకుఁడు (1623-1659) మధురను పరిపాలించునప్పటికి దాని విస్తీర్ణము 37,037 చదరపు మైళ్ళయి యుండెను. ఇంతటి రాజ్యమును స్థాపించినవాఁడే కాక విశ్వనాథుఁడు పెక్కు కారణములచే కడు ప్రఖ్యాతుఁడుగ నుండెను. ఇతని దేహబల మత్యద్భుత మనునందులకు పైని వివరింపఁబడిన మహిషవధయే చాలినను, ఇంకను పెక్కు లున్నట్లు తోఁచెడిని. పంచపాండ్యులను రాజులను ముష్టియుద్ధములో నొక్కమాటుగ నోడించినట్లు వ్రాయఁబడియుండుటను చూడ, ఇతఁడసాధారణ శరీరబలము కలవాఁడని రూఢిగ చెప్పవచ్చును. ఇతని శరీరబలమునకు తోడు బుద్ధిబల మధికముగ నుంటచే, ఇతనిని శూరశిఖామణి యనియే కాక రాజకార్యధురంధరుఁడని కూడ చెప్పవలసియున్నది. ఇతఁడు తన తండ్రిని పట్టుకొనుట కితరులను పోనీయక తానే బయలువెడలి జనకుని ప్రాణములను కాపాడుట ఉత్తమ రాజనీతి యని చరిత్రకారు లుద్ఘోషించుచున్నారు. దక్షిణహిందూస్థానమున పాళెగార్ల యేర్పాటు మొదట నితఁడే చేసినట్లు చరిత్రకారులు వ్రాసియున్నారు. ఇది సామాన్య మైన పని కాదు. తాను తమిళుల మధ్యమున నివసింపవలసియుండుటచే తాను స్వజనమునే నమ్మి వారినే పాళెగారులుగా నేర్పాటుచేసి, వారు తనకు రాజ్యభారము వహించుటయందు సహాయులుగ నుండునట్లు చేసెను. ఇట్లనుటచేఁ తమిళులలో పాళెగార్లు లేరని కాదు. వారిలో కూడ రాజభక్తి చూపిన వారు పాళెగారులైరనుటకు సందియము లేదు. కాని, మొత్తముమీఁద విశ్వనాథుని కాలముననే చాలమంది యాంధ్రులు దక్షిణమున కేఁగి తమిళుల మధ్యమున వసతు లేర్పఱచుకొని రనుటకు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమం దుండెడు వ్రాఁత పత్రములే సాక్ష్యమిచ్చుచున్నవి. కనుక విశ్వనాథుని కాల మాంధ్రులకు పవిత్ర మైనది. ఇది వారి వలస కాలము. స్వస్థానముతోడను స్వజీవనముతోడను అసంతృప్తి జనించి, [illegible]ము భూతియు సంపాదింపవలె నను కుతూహ[illegible]ిన, గాని, ఏ జాతియు స్వస్థానములను వదలదు; వలసపోదు. స్వస్థానములను వదలుట యిప్పటికిని మన యాంధ్రదేశమున మిక్కిలి యగౌరవముగ భావింపఁబడుచున్నది. ఉత్తరమునుండి చెన్నపురి కేఁగుటయే కష్టముగ భావింతురు. కాని, విశ్వనాథుని కాలమున మాత్ర మాంధ్రుల కధికచలనము కలిగినట్లు చరిత్ర యుద్ఘోషించుచున్నది. ఇట్టి కాలమునే శూరుల కాలమని కూడ చెప్ప నొప్పును. ఈ మన కాలమున కాఱు వత్సరములకే కర్ణాటరాజ్యము పికాపిక లాయె కదా. దీనికి కారణము లెయ్యవి? ఒక జాతియొక్క శౌర్యాది గుణములు నశించినఁ గాని వారి రాజ్యము నశింపదని కదా పాశ్చాత్యుల సిద్ధాంతము. నాపై వర్ణనకును విజయనగరసామ్రాజ్యవినాశమునకును పరస్పరవిరోధములు కాన్పించుచున్నవి. చరిత్రపరిశోధకులు దీనికి సమాధానమిత్తురుగాక. పాళెగారుల పద్ధతి యేర్పాటు చేయుటయే కాక, విశ్వనాథుఁడు మఱియు పెక్కు ఘనకార్యములు చేసెను. ఇతఁడే శ్రీరంగదేవాలయమును గట్టించెను. "విశంగ" దేశములోని దొంగల నణఁచెను. మధురరాజ్యములోని యడవుల నఱికించి భూములను సాగునకు యోగ్యపఱచి స్వజనమున కిప్పించెను. వ్యవసాయము వృద్ధిపఱచెను. రాజ్యమును చక్కఁగ పరిపాలించెను. ఇట్లీతఁ డనన్యసామాన్యపరాక్రముఁడైన రాజకార్యధురంధరుఁడై రాజభక్తుఁడై 13సంవత్సరముల 26 దివసములు మధురరాజ్య మేలి కీర్తిశేషుఁడయ్యెను. ఇతఁడు సామాన్యజనులు చేయఁజాలని కార్యములు పెక్కులు చేసెను. ఇట్లసాధారణకార్యములు చేయుట కితనిని పురికొల్పిన దెద్ది? అయ్యది రాజభక్తి గాని సామ్రాజ్యభక్తి గాని యని చెప్పనొప్పును. ఇవి రెండును కానిచో వీరదేవతయే వీని నిట్టి కార్యములు చేయఁ బురికొల్పె ననియందమా? అట్లనుటకు వీలుపడదు. ఏల యన, ఇతని వంశస్థుఁడగు తిరుమలనాయకుఁడు విద్యానగరసామ్రాజ్యము వినాశ మైన నూరు వత్సరముల తరువాత కూడ తాను రాయల భృత్యుఁడ ననియే చెప్పుకొనుచుండె నట! ఈ కాలమున విశ్వనాథుని పోలినవాఁ డుండెనేని, వాఁడు మహాదేశభక్తుఁడై వర్ధిల్లు ననుటకు సందియ మేమి? ఈ కాలమున దేశభక్తి యెట్లు యువకులను స్వార్థత్యాగులుఁగ చేయుచున్నదో ఆ కాలమున రాజభక్తియు నట్లే యువకులచే సాహస కార్యములను చేయించియుండనోపును.

# కొండవీడు

చామర్తి రాజశేఖరరావు గారు

"పుట్టునె దేశమం దొక యపూజ్యుఁడు నా దిది జన్మభూమి, నేఁ<br>
బుట్టిన దేశ మిద్దియని పొంగక ప్రాణము గల్గు పీనుఁగై?"

సీ. "పరరాజ్యపరదుర్గపరవైభవశ్రీలఁ<br>
గొనకొని విడనాడు కొండవీడు;<br>
పరపంథిరాజన్యబలముల బంధించు<br>
కొమరు మించిన జోడు కొండవీడు;<br>
ముగురు రాజులకును మోహంబు పుట్టించు<br>
గుఱుతైన యుర్వీశ్వరాడు కొండవీడు;<br>
చటులవిక్రమకళాసాహసం బొనరించు<br>
కుటిలాత్ములకుఁ గాడు కొండవీడు;<br>
జవనఘోటకసామంతసరసవీర<br>
భటనటానేకహాటకప్రకటగంధ<br>
సింధురారావమోహనశ్రీలఁ దనరు<br>
కూర్మి నమరావతికి జోడు కొండవీడు."—శ్రీనాథుఁడు

కాలపురుషుని చేష్టాచమత్కారము లవాఙ్మానసగోచరములు. అత్యాశ్చర్య గర్భితములు. అనంత పరిణామకారణములు. క్షణక్షణసంచలితములు. కావుననే చిరకాలానుగతము లైన యుత్తమవస్తువు లుత్తర క్షణమున నాశనము లగుచున్నవి. అనేకసంవత్సరముల నుండి మహోన్నతదశ ననుభవించిన సుందరమందిరములును నుత్కృష్టసామ్రాజ్యములును నిరంతరైశ్వర్యములును కొలఁది కాలములో శిథిలములై నామమాత్రావశిష్టములై యున్నవి. శత్రుదుర్గమము లైన బలిష్ఠ దుర్గములు నాశనదేవత పాలఁబడినవి. అయినను, సుప్రసిద్ధము లైన యా సామ్రాజ్యములును ఆ యున్నత దుర్గములును చరిత్రలందు సజీవములై ప్రతిదేశభక్తుని హృదయమునందును సుస్థిరములై పరదేశ యాత్రికులకు నేత్రానందకరములై సర్వజనులకును దర్శనీయములై మాతృదేశమునకు కళాభరణములై దక్షిణహిందూస్థానములోని యాంధ్రుల సామ్రాజ్యవిస్తారమును ఆంధ్రుల యుద్ధశాస్త్రనైపుణ్యమును ఆంధ్రుల రాజవిద్యావిశేషమును ఆంధ్రుల శిల్పకళాదక్షత్వమును ప్రపంచమునకు వేనోళ్లఁ జాటుచు ప్రస్తుతకాలమున తమ యున్నతిని గోలుపోయిన యాంధ్రులు సైత మొకానొకప్పు డత్యంతనాగరికత గలవా రనియు మహైశ్వర్య సంపన్నులనియు నుద్ఘోషించుచున్నవి. మరియు సుప్రసిద్ధచరిత్రాత్మకము లైన యట్టి పవిత్రప్రదేశములు క్షాత్రతేజఃపూరితు లైన మన పూర్వుల పరాక్రమ పౌరుషముల కాలవాలము లనియు స్వరాజ్యరక్షణమునం దప్రమత్తు లైన యనేకవీరయోధు లిట్టి స్థలములను రణరంగములుగా చేసికొని శత్రుసైన్యమధ్యమునందు వీరవిహార మొనర్చి వీరస్వర్గము చూఱగొని రనియు తెలియుటతోడనే ఏ యాంధ్రుఁడు పులకాంకితగాత్రుఁడు కాఁడు? స్వమతస్వరాజ్యరక్షణార్థమై ప్రాణము లర్పించిన యా శూరశిఖామణులచే పరమపావనము లైన యా మహాదుర్గముల నే యాంధ్రుఁఁడు దర్శింపకుండును? ఆహా! ఎన్ని శతాబ్దములు గడచినను కాలక్రమమున శిథిలము లయ్యును తొల్లింటి యౌన్నత్యమును గోలుపోయినను చూపఱుల హృదయముల నాకర్షించుకొనుచు వారి నానందపరవశులుగా నొనర్చు నా యున్నతదుర్గప్రాకారము లెంత శక్తిమంతములై యుండునో మన మూహింపఁజాలము. ప్రపంచములోని యట్టి సుప్రసిద్ధప్రదేశములు శిథిలము లయ్యె నని తలంపరాదు. అవి నామమాత్రము శిథిలములు. వానియం దెన్నఁడును నశింపని యొక యద్భుతశక్తి యున్నది. ఆ యద్భుత శక్తికి చలనము లేదు. సర్వకాల సర్వావస్థలయందు నది సుస్థిరమై యుండును. అదియే ప్రాణము. ఆ ప్రాణ మజరామరము. అట్లని చెప్పుటకు కొండవీటి దుర్గమే ప్రబలనిదర్శనము.

కొండవీటి దుర్గము ప్రస్తుతపు గుంటూరు మండలములో నున్నది. ఈ దుర్గము దక్షిణహిందూదేశమందలి యున్నతపర్వతదుర్గములలో నొకటి; మహాబలాఢ్యమై మిక్కిలి విఖ్యాతి చెందియున్నది. ఆ దుర్గమున్నతస్థితిలో నున్నపుడు సప్తప్రాకారములఁ అనేకవిధము లగు పిట్టగోడలచేతను పరివృత

ఖ్యాకు లగు సైనికులచే పరిరక్షింపఁబడుచు శాత్రవ
భయంకరమై గుండెదిగులు పుట్టించుచుండెడిది. కోట
చుట్టును నగాధ మగు కందకము పరవీరులకు భీతి గొలు
పుచుండును. పర్వతోన్నతప్రదేశములయందు బురు
జులు నిర్మింపఁబడి, అందుండి బందూకులను గాల్చుట
కును శత్రుసైన్యములతో పోరాడుటకును తగిన యేర్పా
టులు చేయఁబడియున్నవి. యుద్ధసమయములందును
సురక్షితము కాని సమయములందును కోటలోనివారు
బురుజులపై నిలువఁబడి శత్రువుల రాకను పరీక్షించు
చుందురు. ఈ దుర్గ మొక పర్వతముపై నిర్మింపఁబడు
టచే మఱింత బలిష్ఠమై యభేద్యతరమై యున్నది.

పదునాలుగవ శతాబ్ద మారంభమున జగ
ద్విఖ్యాత మగు నోరుగల్లు సామ్రాజ్య మస్తమించిన
తరువాత కొండవీటి పాలకుఁ డగు పోలయ వేమారెడ్డి
యను సరదారుఁడు స్వతంత్రుఁడై ఈ దుర్గమును నిర్మించి
చుట్టుపట్టుల నున్న యనేక సామంతరాజ్యములను
జయించి యొక ప్రత్యేకరాజ్యమును స్థాపించెను. ఈ
దుర్గమూలముననే యతని సంతతివారు తమ రాజ్యపు
సరిహద్దుల నింకను వృద్ధిచేసి పాకనాటిసీమ నంతటిని
నూరు సంవత్సరములవఱకవిచ్ఛిన్నముగా పరిపాలించిరి.
వారు పాలించు కాలమున వారి ఖడ్గదాటి కడ్డు లేక
పోయెను. ఆ దుర్గము యొక్క బలమును చూచియే
వారు రాజ్యవిస్తారము గావించుకొనిరి. పరరాజులు
వారి దినదినాభివృద్ధిని గాంచి యసూయపడినను కొండ
వీటి దుర్గనిర్మాణముయొక్క సామర్థ్యమును దుర్గము
లోని బురుజులను బందూకులను గాంచి తమతమ యాస
లను విడువవలసినవారైరి. ఇట్లు దాదాపుగా నొక
శతాబ్దము గడచిన తరువాత, పదు నాలుగు వందల
యేఁబది నాలుగవ సంవత్సరమున నుత్కలదేశాధీశ్వరు
లగు కటకరాజులా దుర్గరహస్యములను గూఢచారుల
వలన నెఱింగి యా దుర్గమును స్వాధీనపఱచుకొనిరి.
అప్పటినుండి పదునేనువందల పదునేనువఱకును వారి
స్వాధీనములోనే యుండెను. పిమ్మట విజయనగరా
ధీశ్వరుఁ డగు కృష్ణరాయలా దుర్గముయొక్క విఖ్యాత
చరిత్రమును విని దాని నెట్లయిన జయింపవలయునని
సేనాసమేతుఁడై కొండవీటిని ముట్టడించెను. ఆ
దుర్గాధిపతి యగు వీరభద్రగజపతి చూపిం
ప మద్వితీయము. కృష్ణదేవరాయలు తమ
త్తి వచ్చుచున్నాఁడని వినినతోడనే గజ
పతియు అతని ముఖ్యసేనాపతులును రాయలను మార్గ
ములోనే యరికట్టినను, పాఱఁ ద్రోలఁజాలక ఈ దుర్గము
నే శరణ్యము చేసికొని యతిఘోరముగా పోరిరి. నిరం
తరవిజయాంకుఁ డగు కృష్ణదేవరాయలు సైత మశేష
సేనాపరివృతుఁడైనను కొండవీటి దుర్గమును రెండు
నెలలు తీవ్రముగా ముట్టడింప వలసివచ్చెను. ఆ ముట్టడి
యందు విజయనగరసైన్యమునకు చాల నష్టము కలి
గెను. ఆ యుద్ధమునందు కొండవీటిలోని శూరశిఖా
మణు లనేకులు స్వరాజ్యరక్షణార్థమై వీరశయనము
నొందిరి.

అట్లు కృష్ణరాయలు దిగ్విజయ మొనర్చి విజయ
నగరాభిముఖుఁడై వెడలిపోవుచు కొండవీటి దుర్గమున
కొక పాలకుని నియమించెను. ఎట్లయినను కొంత
కాలము కడచిన తరువాత నా దుర్గము మరల రెడ్ల
పరిపాలనలోనికి వచ్చెను. వారు మునుపటివలె స్వతం
త్రులు గారు. కొంతకాలము విజయనగరరాజులకు లోఁ
బడి కప్పము గట్టుచుండిరనియు ఆపైన నామమాత్రము
పారతంత్ర్యమున నున్నను క్రమక్రమముగ కేవల స్వతం
త్రప్రభువులవలె వర్తించిరనియు చరిత్రవలన తెలియు
చున్నది. మరికొంత కాలమునకు కొండవీటి సీమ
తొల్లింటి యున్నతస్థితిని వహించి చుట్టుపట్టుల నున్న
రాజులకు హృదయశల్యమై భయము కలిగించుటచే
వారందఱు నేకమై శత్రువు లగు రెడ్డి ప్రభువులను
సాధింపవలయునని యెత్తివచ్చి యా దుర్గమును నాశ
నము చేసిరి. అంతటితో సకలసౌభాగ్యసంపన్నమై
ఆంధ్రవీరుల నిర్వక్రపరాక్రమమునకు తావలమై కోటల
తోడను పేటలతోడను విస్తరిల్లి విఖ్యాతమై యాంధ్ర
విజయధ్వజమునకు నిలయమై 'సకలశ్రీయుత కొండ
వీటినగరీసామ్రాజ్య' మని వాసికెక్కిన యా మహాపట్టణ
ఖ్యాతి యానాటితో నస్తమించి శిథిలమై శిలావశి
ష్టమై ప్రస్తుతము ప్రశాంతభావము వహించియున్నది.

శిథిలీభూత మైన యీ దుర్గమునందలి విశేష
మేదియో కాని దానిని చూచుటకనేకజనులు వచ్చుచు
పోవుచుందురు. ఇప్పు డచ్చట రమణీయ మంది
రములు గాని, సుందరమందిరారామములు గాని, స్నిగ్ధ
ములైన చలువరాళ్ల సోపానములు గాని, అద్దాల
మేడలు గాని, పూర్వము రాజకుమారులు సాయం
సమయములఁ బోవుచుండు విహారభూములు గాని లేవు.
ఫిరంగు లమర్పఁబడు నున్నతము లైన బురుజులును,

సప్తప్రాకారములును, పర్వతశిఖరములను గలుపు పిట్టగోడలును నవశిష్టములై యుండి భీతి గొలుపుచుండునే కాని వెనుకటివలె దర్శనీయములై యుండలేదు. దుర్గము చుట్టు నావరించుకొని నిరంతరజలపూర్ణ మైన కందకమును, కందకము నెల్లపుడు జలపూర్ణము చేయు నొక పెద్ద తటాకమును, తటాకమున కనతిదూరమున నున్న రాజభటుల గృహములును, ఆ గృహసమీపస్థము లైన యశ్వశాలలును, అచ్చటనే నిర్మింపఁబడిన గజశాలలును, గజశాలల కొక కొంత దూరమున కట్టఁబడిన యాయుధాగారములును, ఆయుధాగారములకడ నున్న కారాగృహములును కాన్పింపవు. గృహరాజు మేడ నాశన మయ్యెను. దుర్గముమీఁద నచ్చటచ్చట కట్టఁబడిన దేవాలయములు శిథిలము లగుచున్నవి. రాతితో దిట్టముగాఁ కట్టఁబడిన నేతికొట్టును ధాన్యపు కొట్టును ధనాగారమును మాత్రము చూడవచ్చును గాని జీర్ణదశయం దున్నవి. దుర్గాధీశుఁడును మంత్రులును గూర్చుండు కొలువుకూటము నాశన మైనది. ఆ కొలువుకూట మున్నతశిఖరమున నుండుటచేత నచటికి సులభముగా బోఁగలుగుటకై నిర్మింపఁబడియున్న శిలాసోపానము లొకానొక కాలమున కోట ముట్టడింపఁబడినపుడు చెక్కివేయఁబడుటచేత నా గుఱుతులు మాత్రము కాన్పింపఁగలవు. దుర్గప్రదేశ మంతయు కఠినకంటక శిలామయమై నికుంజపుంజములచే కప్పఁబడి దట్టమైన లతాదులచే నల్లిబిల్లిగా నల్లుకొనఁబడిన వివిధవృక్షజాతుల మూలమున చొఱవీలు లేనిదై, ఒక మహారణ్యమువలె భీతావహమై యుండును. దుర్గమునకు చుట్టు నున్న సింహద్వారములును చిన్నచిన్న దేవాలయములును సగము కూలి పడియున్న గృహములును గుడ్లగూబలు రాపులుఁగులు మొదలగు పక్షులకు నావాసములై గబ్బిలముల పెంటలచేతను మేఁతకొఱకై తిరుగుచుండు పశ్వాదుల పేడచేతను నావరింపఁబడి దుర్గంధము గొట్టుచుండును. ఇట్లసహ్యాకరమై ముండ్లపొదలతోడను గచ్చపొదలతోడను పరివృతమై దుర్గంధమయమై క్రూరజంతువులకు నివాసయోగ్యమైన యీ పురాతనదుర్గమునకు ప్రేక్షకులు వేనవేలు వచ్చుట కేదో యొక మహాకారణ ముండవలయును. అందు నేత్రానందకరము లైన మనోహరవస్తుసముదాయము లైన నుండవలయును. ఏమియు లేకున్న యెడల ఆ దుర్గమధ్యమున నాకర్షకయంత్ర ముండితీరవలయును.

ఒకానొక సమయమున సకలైశ్వర్యములకు నిలయములై సర్వవిధముల నగ్రగణ్యములై పరమపవిత్రవంతము లైన పురాతనప్రదేశములను జూచి తన పూర్వుల నాగరికతయు వారి యౌన్నత్యమును గ్రహింపవలయు నని సామాన్యమానవులకు నైత మభిలాష కలుగుచుండును. అట్లు కలుగకుండిన పక్షమున నది మానవభావము కానేరదు. తాము ప్రస్తుత మనుభవించు నైశ్వర్యము గాని నాగరికత గాని, వే యేల, సర్వస్వమును ప్రాచీను లుదారహృదయులై యిచ్చినది యే కాని వేఱొండు గాదు. కావున, ప్రాచీనులు దేశరక్షణార్థమై చేసిన మహాకార్యములను కీర్తింపకుండుటయు వా రొనర్చిన సంస్థాపనలను దర్శింపకుండుటయు నెంతయు దోషకారణము. మనదేశముయొక్క పురోభివృద్ధి మన గతదినముల ఫలముమీఁదనే యాధారపడి యుండును. మనము నిక్కమైన దేశభక్తులము గావలె నన్న పక్షమునను మన యాశయములు సఫలీకృతములు కావలె నన్నను మన పూర్వుల రాజ్యవిస్తారమును గూర్చియు వారి యుద్యమములను గూర్చియు బాగుగా చదివి వారికి కృతజ్ఞులమై యుండవలయును. కావుననే మహాభారతమునందు 'ఎఱుక గలవారి చరితలు గఱచు'చుండవలయు నని యొక విధిసూత్ర మున్నది. సుప్రసిద్ధచరిత్రాత్మకము లైన పురాతన ప్రదేశములు దర్శించుటవలన మన లోకజ్ఞాన మభివృద్ధి చెందును. అప్పుడే మనదేశమునకు మేలు చేయఁగలవారమగుదుము. అట్లని పురాతన మైన ప్రతి యల్పప్రదేశమును దర్శించుచుండుటవలన విసుపు పుట్టకపోదు. కాని, కొండవీటి దుర్గ మటువంటిది గాదు. అది చరిత్రప్రసిద్ధ మైనది; ఆర్యమత ఆర్యరాజ్య ఆర్యధర్మ రక్షణార్థమై కంకణము గట్టుకొని యారోర్ధ్వధారణమున నద్వితీయదీక్ష వహించి నిర్వహించినది. విదేశయాత్రికులు సైత మా ప్రదేశమును పలుమాఱు సందర్శించి తమ తమ భాషలయందు విచ్చలవిడిగా మెచ్చుకొని యున్నారు. 'అది యెట్టి నగరము? అది పాకనాటిసీమ కంతకును రాజధానియై 'పరరాజ్యపరదుర్గపరవైభవశ్రీల'ను జయించిన యొక విఖ్యాతనగరము. అది యెట్టి స్థలము?

పరాక్రమవంతులైన వీరయోధులు స్వరాజ్యరక్ష-
మై ప్రాణము లర్పించుచు తమ వీరరక్తము-
రించిన స్థలము అది యెట్టి ప్రదేశము?
వీరభద్రగజపతి లక్ష్మీపతిరాజు మొదలగ

వీరవిహారను గావించిన పవిత్రప్రదేశము' అని తమలో తామే ప్రశ్నించుకొని చరిత్రజ్ఞానమువలన సంగతిసందర్భముల నెఱింగి విజాతీయులు సైతము పులకాంకితగాత్రు లగుచుండ, మాతృదేశాభిమాను లెంత యుప్పొంగుదురో యూహింపఁ దరము గాదు. వా రా పర్వతముపై విహరించు సమయమున ప్రత్యున్నతశిఖరమును ప్రతివృక్షమును వారికి ప్రత్యుత్తర మిచ్చుచుండును. 'ఈ కుండిన నగరమునందే భగవదంశసంభూతుఁ డైన కృష్ణుఁడు రుక్మిణీదేవిని శిశుపాలుని బారినుండి తప్పించెను; ఈ దుర్గమునిూఁద నే కృష్ణదేవరాయలు విజయనగరసామ్రాజ్యమునకు పునాది వేయుచు విజయస్తంభము స్థాపించినాఁడు; ఇచ్చటనే మహావీరయోధు లనేకులకు వీరస్వర్గద్వారములు తెఱువఁబడినవి' యని యుప్పొంగు పౌరుషవంతుఁడును, ఇచ్చటనే యనేక రాజనీతిపారంగతులు జనసమ్మతముగా పరిపాలించి ఖ్యాతివడసి రని రాజ్యతంత్రజ్ఞుఁడును, 'పూర్వకాలమున నీ దుర్గములోని రమ్యహర్మ్యములందే మహాకవు లైన యెఱ్ఱాప్రెగడ శ్రీనాథుఁడు తమ కవితామృతరసమును ప్రవహింపఁజేసి' రని కవీశ్వరుఁడును, అచ్చటి దేవాలయముల చెక్కడఁపుఁ బనులనుఁ జూచి యాశ్చర్యపడి 'ప్రాచీనకాలమునందు సైతము శిల్పకళాపారీణులు గల' రని యానంద మొందు శిల్పియును, ఆ కొండమిూఁది నీటిదొనలను పచ్చపచ్చని పచ్చిక బయళ్ళను వృక్షలతాదులను గాంచి సంతోషపారవశ్యమున నెడలెఱుంగని ప్రకృతితత్త్వజ్ఞుఁడును, 'ఈ పర్వతముపై ననేకవిధము లైన వనమూలికలు లభింపఁగల' వని సంతసించు భిషగ్వరుఁడును, ఆ యున్నతగిరి మిూఁద నుండు శాసనములును అచ్చటచ్చట నేల త్రవ్వినపుడు దొరకిన బంగారు నాణెములును దుర్గనిర్మాణమును గాంచి 'చరిత్రసాధనమున కివి యాధారభూతము' లని యానందించు చరిత్రకారుఁడును, వే యేల? ప్రతి మానవుఁడును, కొండవీటి దుర్గమును చూడవలయు నని యభిలషించుచుండును. అచ్చటి మనోహరవస్తువుల నెన్ని మాఱులు చూ[illegible]కు తనివి తీరదు. అచ్చటి కొండ [illegible] నిర్మింపఁబడిన

ప్రస్తుత మిూ కొండవీటి దుర్గమును చూడఁబోవు వారికి, ఉత్తరముననుండి దక్షిణమునకు వ్యాపించి యున్న మహోన్నతపర్వతశిఖరముల నొండొంటిని గలుపుచు అతి బలిష్ఠముగ కట్టఁబడి శిథిలము లైన దుర్గప్రాకారము లగపడును. పర్వత మెక్కుటకు సులభముగా నుండునట్లు మెట్లును, కొంత దూరము పోయిన తరువాత విశాలసమప్రదేశములును అందచ్చటచ్చట కాలిబాటలును గాన్పించును. మె ట్లెక్కుచున్నప్పు డిరువంకల పెరిగి పెనవేసికొన్న నానావిధ వృక్షజాలము లున్నవి. వానిలో కొన్ని కురువిందలు శిరీషములు; సామాన్యముగా మనుష్యులు కని విని యెఱుఁగని యనేక విధము లైన మహీరుహములు, పెక్కులు గలవు. అతిమృదులము లైన శిరీషకుసుమము లెండ కెండి నేల రాలి పాదములకు మెత్తఁగా తగులును. వాడిన పండుటాకులును వసివాడిన కుసుమములును అప్పుడప్పుడే వికసించి పరిమళములు వెదఁజల్లు నితరజాతిపుష్పములును పండియు పండని సీతాఫలములును నేరేండ్లు మొదలగు పండ్లజాతులును బాటకిరువంకల నుండి బాటసారుల యాయాసము దీర్చి సంతసము కలుగఁజేయును. అట్లు పోవుచున్న కొలఁదిని శిల్పకళానైపుణ్యమును చూపు దుర్గసింహద్వార మగపడును. ఇట్లు కొంత దూరము పోయిన పిమ్మట విశాలమైన యొక సమప్రదేశము పచ్చికతో నిండి కనుపండువు చేయును. ఆ ప్రదేశమునందు రాజకుమారు లాడుకొని రని యొక ప్రతీతి కలదు. కొండమిూఁదికి పోయి చూచినచో నీశాన్యభాగమున కొండ క్రింద నొక పల్లపు ప్రదేశమును, దానికి చుట్టు నుండు రెండు గుట్టలను గలుపు మట్టికోటయు కాన్పించును. ఆ ప్రదేశమున పూర్వము పుట్టకోట యను నొక పట్టణము కల దనియు అందే రుక్మిణీదేవి జనించె ననియు అచ్చటి జను లనుకొనుచుందురు. ఇంకను చూచుచు పోవుచున్న యెడల అచ్చటచ్చట చిన్నచిన్న దేవాలయములు [illegible]
పూర్వము ఒక్కొక్క రాజవీథి [illegible]
ముండెడిదట! ఆ సమీపప్రదే[illegible]
[illegible]ని యొక సమా[illegible]

